తెలుగు అకాడమి ప్రచురణ: ఇంటర్ - 32

### ఇంటర్మీడియట్

# పౌరశాస్త్రము

## ద్వితీయ భాగము

రచయితలు

**శ్రీ శిష్టా వెంకటరమణమూర్తి,** ఎమ్. ఏ.,
లెక్చరర్, రాజనీతిశాస్త్రము
ఎన్. బి. కె. ఆర్. సైన్స్ అండ్ ఆర్ట్స్ కళాశాల, విద్యానగర్

**శ్రీ వి. కృష్ణారావు,** ఎమ్. ఏ.,
రాజనీతిశాస్త్ర శాఖాధిపతి
శ్రీ వెంకటేశ్వర కళాశాల, సూర్యాపేట

సంపాదకుడు

**శ్రీ పోలవరపు జగదీశ్వరరావు,** ఎమ్. ఏ., ఎల్‌ఎల్.బి.,
ప్రిన్సిపాల్, వి. ఆర్. ఎస్. అండ్ వై. ఆర్. కళాశాల, చీరాల.




తెలుగు అకాడమి
హైదరాబాదు
1981

Intermediate : poura Saastramu-II (Civics Part-II); *Authors :* Sri S. V. Ramana Murthy and Sri V. Krishna Rao; *Editor :* Sri P. Jagadeeswara Rao; Second (Revised) Edition, 1981, pp. viii + 168.



*First Published 1980*
*Second (Revised) Edition 1981*
*Copies : 40,000*

Published by TELUGU AKADEMI, Hyderabad-500 029 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme for Production of Books and Literature in Regional Languages at the University level, of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



Price : Rs. 6-70

Printed in India
Text at Nagarjuna Printing Works, Hyderabad-500020
Cover at Venkatarama Paper Products (P) Ltd., Hyderabad-500029
Andhra Pradesh

# భూమిక

1968 లో తెలుగు అకాడమి స్థాపన జరిగింది. అప్పటినుంచీ ఉన్నత స్థాయిలో బోధనా భాషగా తెలుగు నిలబడటంతో తెలుగు అకాడమి నిర్వహిస్తున్న పాత్ర అందరికీ విశదమైనదే. ఎన్నోరకాల ఇబ్బందులను ఎదుర్కొంటూ, అత్యల్ప వ్యవధానంలో విరివిగా పాఠ్యపఠనీయ గ్రంథాలు, అనువాదాలు, మోనోగ్రాఫ్‌లు, జనరంజక గ్రంథాలు, రీడింగ్స్, శాస్త్ర నిఘంటువులు, వృత్తి విద్యలకు సంబంధించిన పుస్తకాలు ప్రచురించి, విద్యారంగానికి అకాడమి సముచితమైన సేవలు అందించింది. అకాడమి గ్రంథాలు ఎన్నో పునర్ముద్రణలు కూడా పొందినాయి. పునరభ్యసన గోష్ఠుల ద్వారాను, విద్యార్థులు, విద్యాధికులు, అధ్యాపకులు ఇచ్చే సూచనల ద్వారాను ఈ గ్రంథాలను మెరుగుపరచడంలో తాజాగా కృషి జరుగుతూ వచ్చింది.

1979-80 విద్యా సంవత్సరం నుంచి ఇంటర్మీడియట్ పాఠ్య ప్రణాళికలలో భిన్న శాస్త్రాలలో గణనీయమైన మార్పులు వచ్చినాయి. అంతేకాకుండా గత పది సంవత్సరాలలో అనేక శాస్త్రాంశాలలో దేశకాల పాత్రోచితమైన మార్పులు సంభవించడం జరిగింది. వీటన్నిటి దృష్ట్యా ఇంటర్మీడియట్ గ్రంథాలను తిరిగి కొత్తగా వ్రాయించడం సముచితంగా ఉంటుందని అకాడమి భావించి, కొత్తగా రచయితలను, సంపాదకులను నియమించి పాఠ్య ప్రణాళికల ప్రకారం ఈ గ్రంథాలను రూపొందించడమైంది. పాత ఇంటర్మీడియట్ పుస్తకాలు అదనపు పాఠ్య గ్రంథాలుగా, పరామర్శ పుస్తకాలుగా ఉపయోగపడతాయి. మాకు అందుబాటులో ఉన్న కాలం పరిమితమైనా, సకాలంలో పుస్తకాలను తీసుకురావడానికి అన్ని ప్రయత్నాలూ చేసినాము.

ప్రకృత గ్రంథ రచనా విధానాన్ని అందులోని విశిష్టతను 'ప్రవేశిక'లో రచయితలు సంపాదకులు వివరించినారు.

ఈ గ్రంథ ప్రచురణకు సహాయ సహకారాలు అందజేసిన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు, విశ్వవిద్యాలయాలకు, అకాడమి పాలకవర్గానికి, ఇంటర్మీడియట్ బోర్డ్ వారికి, రచయితలకు, సంపాదకులకు, ముద్రాపకులకు, చిత్రకారులకు, బ్లాక్ మేకర్లకు మేము కృతజ్ఞులము.

మా పూర్వ ప్రచురణ లన్నింటివలెనే ఈ గ్రంథం కూడా అందరి ఆదరాభిమానాలు సంపాదించగలదని విశ్వసిస్తున్నాము.

# ప్రవేశిక

ఇంటర్మీడియట్ బోర్డ్ వారు నూతనంగా రూపొందించిన పాఠ్య ప్రణాళికను అనుసరించి ఈ గ్రంథం వ్రాయడం జరిగింది. భారత ప్రభుత్వము, పరిపాలన, రాజకీయాలను క్లుప్తంగా అన్ని విషయాలను విపులీకరించడానికి చేసిన ప్రయత్నమిది. ఇటీవల కాలంలో జరిగిన సవరణ చట్టాలను, తదితర మార్పులను ఈ గ్రంథంలో చర్చించినాము. విద్యార్థులకు, అధ్యాపకులకు ఈ గ్రంథం ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాము

# విషయ సూచిక

# 1

# ప్రభుత్వాల వర్గీకరణ

## (Classification of Governments)

*అరిస్టాటిల్ వర్గీకరణ* : "రాజ్యము మానవుని మనుగడకోసం అవతరించినది. అతనికి మంచి జీవితాన్ని ప్రసాదించడానికి అది కొనసాగుతున్నది" అనే గ్రీక్ తత్త్వవేత్త అరిస్టాటిల్ వాక్యాలలో ఎంతైనా నిజముంది. రాజ్యాలన్నీ ప్రజా సంక్షేమానికే పాటుపడతాయి. రాజ్య లక్ష్యాలు నెరవేరడానికి ప్రభుత్వం ఒక సాధనంగా ఉపయోగిస్తుంది. అన్ని రాజ్యాలలో ప్రభుత్వం ఒకే విధంగా ఉండదు. అది అనేక రకాలుగా ఉంటుంది. ప్రాచీన కాలంలో అరిస్టాటిల్ ప్రభుత్వాలను (1) వాటి లక్ష్యాలనుబట్టి (2) ప్రభుత్వంలో అధికారం నిర్వహించే వారి సంఖ్యనుబట్టి అనేక రకాలుగా వర్గీకరించినాడు. అతని వర్గీకరణను ఈ కింది పట్టిక వివరిస్తుంది :

| రాజ్యాధికారం నిర్వహించే వారి సంఖ్య | | రాజ్యలక్ష్యం-ప్రజా క్షేమం (సహజరూపం - Normal form) | | రాజ్యలక్ష్యం-పాలకుల సంక్షేమం (వికృతరూపం- Perverted form) | |
|---|---|---|---|---|---|
| (1) ఒక వ్యక్తి పరిపాలన | → | రాజత్వము (Monarchy) | → | క్రూర ప్రభుత్వము (Tyranny) | → |
| (2) కొద్దిమంది పాలన | → | కులీన పాలన (Aristocracy) | → | అల్పజన దుష్టపాలన (Oligarchy) | → |
| (3) అనేకమంది పాలన | → | పాలిటీ-ప్రజారాజ్యము (Polity) | → | ప్రజాస్వామ్యము (Democracy) | → |

ఒక వ్యక్తి ప్రజాక్షేమం కోసం పరిపాలన సాగిస్తే ఆ విధానాన్ని రాజత్వము అంటారు. రాజు ప్రజాక్షేమాన్ని విస్మరించి వారిని పీడించడం మొదలుపెడితే అది క్రూర ప్రభుత్వం అవుతుంది. అటువంటప్పుడు ప్రజలు తిరుగుబాటు చేసి, రాజును తుదముట్టించి అధికారం సమర్థులైన కొద్దిమందికి అప్పగిస్తారు. ఈ మేధావుల పరిపాలనను కులీనపాలన అంటారు. అయితే వారు కూడా చివరకు స్వార్థపరులుగా మారితే ప్రజలు పూర్తి అధికారం తామే చేపట్టారు. ఆ విధంగా ప్రజా రాజ్యాలు ఏర్పడతాయి. అధికారం అనేకమంది చేతు

లలో ఉంచినా అందరూ మూక ఉమ్మడిగా అధికార దుర్వినియోగానికి పాలుపడితే ఏర్ప ప్రభుత్వమే ప్రజాస్వామ్యము అని అరిస్టాటిల్ భావించినాడు. ఇక్కడ 'చరిత్ర పునరావృత అవుతుంది' అని తిరిగి రాజరికాలు తలెత్తుతాయని అతడు అభిప్రాయ పడినాడు.

*ఇతర వర్గీకరణలు :* ఈ మధ్యకాలం దాకా అరిస్టాటిల్ సూచించిన ప్రభుత్వాల వ కరణ ప్రాథమికమైనదిగా భావించబడింది. కాని ప్రభుత్వ పరిణామంలో నూతన ప్రక్రియల తలెత్తడంతో ఆధునిక రచయితలు తదనుగుణంగా ప్రభుత్వాల వర్గీకరణకు కొత్త మార్గాల అన్వేషించినారు. వారిలో డా. లియకాక్ (Dr. Leacock), డా. సి. ఎఫ్. స్ట్రాంగ్ (C F Strong) మొదలైనవారు ముఖ్యులు. వారు సూచించిన వర్గీకరణను ఈ కింది పట్టికల వివరిస్తాయి.

డా. లియకాక్ వర్గీకరణ ఆధునిక ప్రభుత్వాలకు ఈ కింది విధంగా వర్తిస్తుంది :

I. *నియంతృత్వాలు :* నియంతృత్వ ప్రభుత్వాలు నిరపేక్షమైనవి. వీటిలో నియంత స్వప్రయోజనాలకు మినహా ప్రజా శ్రేయస్సుకు ప్రాధాన్యమివ్వడు. అతడు ప్రజ లకు బాధ్యత వహించడు. ఇటువంటి ప్రభుత్వాలు 20 వ శతాబ్ది ప్రారంభంలో రష్యా, టర్కీ, ఇరాన్, ఆఫ్ఘనిస్థాన్‌లలో ఉండేవి. నేటికి నేపాల్, మొరాకో సౌదీ అరేబియాలలో రాజులు చాలా శక్తిమంతులు. ఇరాన్ రాజు షా పరిపాలన ఉగాండా సైనిక నియంత అమీన్ పరిపాలన ఈ మధ్యనే అంతమైనాయి.

II. *పరిమిత రాజరిక, ఏకకేంద్ర, పార్లమెంటరీ విధానము :* దీనిలో రాజుకు పరిమి తాధికారాలు ఉంటాయి. అతడు నామమాత్రపు కార్యనిర్వాహకుడు. నిజమైన అధికారాలు కాబినెట్‌కు ఉంటాయి. దీనిలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలమధ్య అధికా రాల పంపిణీ ఉండదు. కేంద్రము బలమైనది. ప్రాంతీయ ప్రభుత్వాలు దానికి లోబడి పనిచేస్తాయి. ఇటువంటి విధానము బ్రిటన్, డెన్మార్క్, జపాన్, నార్వే, స్వీడన్‌లలో ఉంది.

III. *పరిమిత రాజరిక, ఏకకేంద్ర, అధ్యక్ష పాలనా విధానము :* దీనిలో అధ్యక్షుడు నిజమైన అధికారాలు అనుభవిస్తాడు. ఇటువంటి ప్రభుత్వాలు 1914 కు ముందు ప్రష్యా (Prussia) లోను 1919 కి ముందు సెర్బియా (Serbia) లోను ఉండేవి.

IV. *పరిమిత రాజరిక, సమాఖ్యా, పార్లమెంటరీ విధానము :* దీనిలో అధికారాలు కాబి నెట్ చేతిలో ఉంటాయి. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య అధికారాల పంపిణీ జరిగి ఉంటుంది. ఈ పద్ధతి ఆస్ట్రేలియా, కెనడాలలో ఉంది. ఎందుచేతనంటే ఆ రాజ్యాలు నేటికీ బ్రిటిష్ రాణికి విధేయత చూపుతాయి.

V. *పరిమిత రాజరిక, సమాఖ్యా అధ్యక్షపాలనా విధానము :* ఈ విధానము 1914కు ముందు జర్మనీ, ఆస్ట్రియా, హంగరీలలో ఉండేది.

VI. *గణతంత్ర, ఏకకేంద్ర, పార్లమెంటరీ విధానము :* దీనిలో రాజ్యాధినేత ప్రజా ప్రతినిధి అతడు నామమాత్రపు అధికారి. నిజమైన అధికారాలు కాబినెట్ అనుభ విస్తుంది. పరిపాలన అంతా ఒకే కేంద్రం నుంచి నిర్వహించబడుతుంది. ఇటువంటి ప్రభుత్వం ఫ్రాన్స్‌లో ఉంది.

VII. *గణతంత్ర, ఏకకేంద్ర, అధ్యక్ష పాలనా విధానము* : ఈ పద్ధతి బొలీవియా, చిలీ, క్యూబా, కోస్టారికా (Costa Rica), పనామా రాజ్యాలలో ఉంది.

VIII. *గణతంత్ర, సమాఖ్య, పార్లమెంటరీ విధానము* : ఇండియాలోను, పశ్చిమజర్మనీలోను ఉన్న పద్ధతి ఇటువంటిదే. కాని ఇండియాలో ప్రభుత్వానికి సమాఖ్య లక్షణాలతోపాటు ఏక కేంద్ర లక్షణాలు కూడా ఉన్నాయి.

IX. *గణతంత్ర, సమాఖ్య, అధ్యక్ష పాలనావిధానము* : అమెరికా సంయుక్తరాష్ట్రాలు, బ్రెజిల్, మెక్సికో, స్విట్జర్లండ్‌లలో ఇటువంటి పాలనావిధానం ఉంది.

పై వర్గీకరణలో ఆధునిక ప్రభుత్వాలకు సంబంధించిన అన్ని లక్షణాలు లేవు. ఆధునిక రాజ్యాలను వాటి వేరు వేరు లక్షణాలను బట్టి డా. సి. ఎఫ్ స్ట్రాంగ్ ఈ కింది విధంగా వర్గీకరించినాడు.

| | విభజనకు ఆధారము | ఎ | బి |
|---|---|---|---|
| 1. | ప్రభుత్వ అధికార పరిధిని బట్టి రాజ్య విభజన | వ్యక్తి స్వేచ్ఛను ప్రోత్సహించే రాజ్యాలు-ప్రజా రాజ్యాలు | వ్యక్తి స్వేచ్ఛను త్రుంచి ప్రభుత్వాధికారాన్ని నిరాటంకంగా పెంచే నియంతృత్వాలు-కమ్యూనిస్ట్, ఫాసిస్ట్ రాజ్యాలు |
| 2. | రాజ్యాంగ నిర్మాణాన్ని బట్టి విభజన | | |
| (i) | రాజ్య స్వభావాన్ని బట్టి | ఏకకేంద్ర రాజ్యము | సమాఖ్య రాజ్యము |
| (ii) | రాజ్యాంగ స్వభావాన్ని బట్టి | అదృఢ రాజ్యాంగమున్న రాజ్యము | దృఢరాజ్యాంగమున్న రాజ్యము |
| (iii) | నియోజక వర్గాన్ని బట్టి | ఎ. వయోజన ఓటింగ్ ఉన్నది | పరిమిత ఓటింగ్ ఉన్నది |
| | | బి. ఏకసభ్య నియోజక వర్గం ఉన్న రాజ్యము | బహుసభ్య నియోజక వర్గాలు ఉన్న రాజ్యము |
| (iv) | ఎ. శాసనసభ స్వభావాన్ని బట్టి | ద్వంద్వ శాసనసభ ఉన్నది | ఏకశాసన సభ ఉన్నది |
| | బి. శాసనసభ నిర్మాణాన్ని బట్టి | కొంతవరకుగాని, లేదా పూర్తిగాకాని ఎన్నుకొన్న సభ్యులున్న ఎగువ సభ ఉన్న రాజ్యాలు | ఎన్నుకొన్న సభ్యులులేని ఎగువసభ ఉన్న రాజ్యాలు |
| (v) | కార్యనిర్వాహక వర్గ స్వభావాన్ని బట్టి | పార్లమెంటరీ విధానము లేదాబాధ్యతాయుత పాలన | అధ్యక్షపాలనా విధానము |
| (vi) | న్యాయశాఖ స్వభావాన్ని బట్టి | ఏకన్యాయ విధానమున్న రాజ్యాలు | పరిపాలనా న్యాయమున్న రాజ్యాలు |

పై పట్టికలో ఏ రాజ్యమూ పూర్తిగా 'ఎ' వర్గానికిగాని లేదా 'బి' వర్గానికిగాని చెంది ఉండదు అనే విషయం స్పష్టమవుతున్నది. పైన సూచించిన పట్టికలన్నీ అసంపూర్ణమైనవే. వాటిలో ఒక దానిలో ఉన్న విషయాలు మరొక దానిలో లేవు. నిజానికి ఆధునిక రాజ్యాల లక్షణాలన్నింటిని సవివరంగా సూచిస్తూ, సమగ్రంగా ఉండే ప్రభుత్వాల వర్గీకరణ పటం రూపొందించడం కష్టమే !

మన మింతవరకు ప్రభుత్వాల వర్గీకరణ పద్ధతులను గురించి తెలుసుకొన్నాము. వాటిలో ముఖ్యమైన కొన్ని ప్రభుత్వ పద్ధతులను గురించి మరికొంత వివరంగా ఇప్పుడు చర్చిద్దాము.

## రాజత్వము లేదా రాజరికము

రాజరిక విధానము చాలా పురాతనమైనది. ప్రజాస్వామ్యాల అవతరణతో ఇవి మరుగున పడినాయి. అయినా నేటికీ బ్రిటన్, నేపాల్, భూటాన్, జోర్డాన్, స్వీడన్ మొదలయిన రాజ్యాలలో ఇది అమలులో ఉంది. దీనిని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు : 1. నిరపేక్ష రాజరికము (Absolute monarchy) 2. పరిమిత లేదా రాజ్యాంగ బద్ధ రాజరికము (Limited or constitutional monarchy). వీటిలో మొదటి పద్ధతిలో రాజు ఎటువంటి పరిమితులులేక సర్వాధికారాలు అనుభవిస్తాడు. రెండవ విధానంలో రాజులు రాజ్యాంగంలో చెప్పినట్లు నడుచుకొంటారు· వారికి పరిమితంగా మాత్రమే అధికారాలు ఉంటాయి

రాజు సమర్థుడైతే దేశాన్ని ప్రజారంజకంగా పాలిస్తాడు. సుసంఘటితమైన ప్రభుత్వానికి, నిర్దిష్టమైన పాలనా విధానానికి రాజరికం అవకాశమిస్తుంది. పార్టీ కుతంత్రాలకు ఇది అతీతమైనది. అధికారం దీనిలో ఒక వ్యక్తి చేతులలో ఉంటుంది కాబట్టి నిర్ణయాలు త్వరితగతిని తీసుకొని అమలుపరచవచ్చు. స్థిరమైన ప్రభుత్వం కావడంవల్ల దేశీయ, విదేశాంగ వ్యవహారాలు చక్కగా నిర్వహించవచ్చు. అనాగరిక మానవుని (Barbarian) అదుపులో పెట్టడానికి రాజరికమే తగిన పద్ధతి అని జె. ఎస్. మిల్ చెప్పినాడు.

అయితే రాజరికంలో లోపాలు లేకపోలేదు. చరిత్రలో సమర్థులైన రాజులను వేళ్ళమీద లెక్కించవచ్చు. రాజు దుష్టుడయితే రాజరికం నియంతృత్వంగా మారుతుంది. అటువంటివారి పరిపాలనలో ప్రజలు బానిసలుగా బతకవలసి వస్తుంది. ఈ పద్ధతిలో వారసత్వం రీత్యాపదవి లభిస్తుంది. కాబట్టి అనర్హులు ప్రభువులయ్యే అవకాశముంది. ఒక్కొక్కప్పుడు రాజుల రాజ్యకాంక్ష దేశానికి శాంతి భద్రతలు కరువయ్యేటట్లు చేస్తుంది. అటువంటప్పుడు అరాజకం చెలరేగి, నియంతలను గద్దెదించి, కొద్దిమంది ప్రజలే అధికారం చేపట్టడం ద్వారా కులీన పాలన ఏర్పడటం కాని లేదా కొత్తవారికి పట్టం కట్టడం కాని జరుగుతుంది. ఈ మధ్య ఇరాన్‌లో ఇటువంటి విప్లవమే తలెత్తగా ఇరాన్ షా దేశంవదలి పారిపోయినాడు. ప్రజానాయకుడు అయతుల్లా ఖొమేనీ అధికారం చేపట్టినాడు. ఉగాండా సైనిక నియంత ఇడ్డీ అమీన్‌కు కూడా ఇదే గతి పట్టింది అందుకే నేడు నిరంకుశ రాజరికాలు (నియంతృత్వాలు) అరుదు. ప్రజాస్వామ్యానికే ప్రాముఖ్యముంది.

## కులీన పాలన

రాజరికాలలో అధికారం ఒకరి చేతిలో ఉండటం వల్ల అధికార దుర్వినియోగానికి, నియం

తృత్వంలో అస్కారం ఎక్కువ. కులీన పాలనలో అధికారం కొద్దిమంది యోధులు, ఉన్నత వంశస్థులు, మేధావులు, ధనిక వర్గాల వారి చేతులలో ఉంటుంది. వీరి పరిపాలన అన్ని విధాల మానవాభ్యుదయానికి, దేశ ప్రగతికి అనువుగా ఉంటుంది. కులీన పాలనను ఆంగ్లభాషలో "అరిస్టాక్రసీ" (Aristocracy) అంటారు. ఆ పదం "అరిస్టో" (Aristo), "క్రషియా" (Cratia) అనే రెండు గ్రీక్ పదాలనుంచి పుట్టింది. దానికి అర్థం ఉన్నతమైన వ్యక్తుల పరిపాలన అని చెప్పవచ్చు.

ఇటువంటి వారి పరిపాలనలో రాజ్యము అన్ని రంగాలలోను అభివృద్ధిచెందుతుంది. పాలకులు ఉన్నత వంశాలవారు, మేధావులు, సజ్జనులు, అర్హులు, యోధులు అయిన కారణంగా వారు నిస్వార్థంగాను, నిజాయతీగాను పరిపాలన చేస్తారు. అంతేకాక వారి పరిపాలన అన్ని రంగాలలో సమగ్రవంతంగా ఉంటుంది.

కులీన పాలనలో కొన్ని ప్రయోజనాలున్నా, ఈ పద్ధతి ప్రజాస్వామ్య విరుద్ధము. ప్రజల మీద అధికారం కొన్ని ప్రత్యేక వర్గాలకు ఉండటం మంచిది కాదు. ఉన్నత వంశంలో జన్మించినంత మాత్రాన, సంపద ఉన్నంత మాత్రాన వ్యక్తులను యోగ్యులు, మేధావులు అని అనలేము.

నిజానికి కులీనపాలన కొంత కాలానికి అల్పజన దుష్టవర్గ పాలన (Oligarchy) గా మారుతుంది. కులీన పాలనలో పాలకులు ప్రజలలో రాజకీయ చైతన్యం కలగనీయక తమ ప్రత్యేకతను ఎల్లకాలం కాపాడుకోవడానికి ప్రయత్నిస్తారు. అయితే చివరకు వీరి దుష్టపాలనను ప్రజా విప్లవాలు అంతం చేస్తాయి. ఈ పాలనా పద్ధతులలోని లోపాల నన్నిటిని ఆధునికకాలంలో శాస్త్రీయమైన ప్రజాస్వామ్యాలు తొలగించగలుగుతున్నాయి. ప్రజాస్వామ్యంలో అధికారం ఏ ఒక్కరి చేతిలోగాని లేదా కొన్ని వర్గాల చేతులలోగాని ఉండక ప్రజలందరికీ చెంది ఉండటమే దానిలోని విశేషము.

## రాజ్యాంగము
## (Constitution)

ఆధునిక ప్రభుత్వాలన్నీ ఏదో ఒక విధమైన రాజ్యాంగానికి అనుగుణంగా పనిచేస్తున్నాయి. ప్రభుత్వ లక్ష్యాలను, దాని నిర్మాణాన్ని, అది పనిచేయవలసిన విధానాన్ని రాజ్యాంగం విశదీకరిస్తుంది. కాబట్టి ఆధునిక ప్రభుత్వాలను గురించి తెలుసుకొనే ముందు రాజ్యాంగాలను గురించి క్లుప్తంగానైనా తెలుసుకోవడం మంచిది.

"రాజ్యాంగము అంటే కొన్ని సూత్రాల సముదాయము. వాటి ప్రకారం ప్రభుత్వం అధికారాలు, పాలితుల హక్కులు, విధులు, ఆ రెండిటి మధ్యగల సంబంధము నిర్వచించబడతాయి." అని వూల్సే (Woolsey) అంటాడు. గిల్ క్రైస్ట్ (Gilchrist) ఉద్దేశంలో "రాజ్యాంగ మంటే లిఖితంగా కాని అలిఖితంగా కాని ఉండే నియమాలు లేదా చట్టాలు. అవి ప్రభుత్వ వ్యవస్థీకరణాన్ని, వివిధ ప్రభుత్వాంగాల మధ్య పంపిణీ చేయబడిన అధికారాలను, ఆ అధికారాలను అవి వినియోగించడానికి సంబంధించిన సాధారణ సూత్రాలను నిర్దేశిస్తాయి." ప్రభుత్వాన్ని నిర్మించి పనిచేయించడానికి, పరిపాలన క్రమబద్ధంగా సాగించడం ద్వారా రాజ్య లక్ష్యాలు నెరవేరేటట్లు చేయడానికి రాజ్యాంగమే మూల మనడంలో తప్పు లేదు.

మంచి రాజ్యాంగం స్పష్టంగా, సులభ గ్రాహ్యంగా, పొందికగా, క్లుప్తంగా, సమగ్రంగా, మరీ ధృఢంకాని అదృఢంకాని కాకుండా మధ్యస్తంగా ఉండవలె. అది న్యాయ వ్యవస్థ స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడేదిగా ఉండవలె. పౌరుల హక్కులను, బాధ్యతలను. ప్రభుత్వ కర్తవ్యాలను దాని వ్యవస్థీకరణను ఆ రెండిటి మధ్యగల సంబంధాన్ని వివరించేదిగా ఉండవలె.

రాజ్యాంగాలు వాటి పుట్టుక, స్వభావాలను బట్టి అనేక రకాలుగా వర్గీకరించినారు. బ్రిటిష్ రాజ్యాంగము పరిణామ రాజ్యాంగము (Evolved constitution). దానిని ఎవరూ బుద్ధిపూర్వకంగా రాజ్యాంగ సభ ద్వారా నిర్మించలేదు. కాలానుగుణంగా పార్లమెంట్ చేసిన శాసనాలన్నీ ఆ దేశ రాజ్యాంగంలో భాగమవుతాయి. అమెరికా రాజ్యాంగము, భారత రాజ్యాంగము నిర్దిష్టమైన సమయంలో రాజ్యాంగ సభల ద్వారా నిర్మించినవి (Enacted constitutions).

రాజ్యాంగాలను, లిఖిత రాజ్యాంగము (Written constitution), అలిఖిత రాజ్యాంగము (Unwritten constitution) అని రెండు రకాలుగా విభజించినారు. బ్రిటిష్ రాజ్యాంగము ప్రపంచంలో ఏకైక అలిఖిత రాజ్యాంగము. అది అధికభాగం ఆచారాలు, సంప్రదాయాలు, శాసనసభ అప్పుడప్పుడు ప్రతిపాదించిన చట్టాల రూపంలో ఉంది. అలిఖిత రాజ్యాంగాలను సవరించడం సులభము. కాల పరిస్థితుల కనుగుణంగా దానిని మార్చుకోవచ్చు. అది విప్లవాలకు తావివ్వక రాజ్య పురోగతికి తోడ్పడుతుంది. ఆవేశపరులుకాని నిదానస్థులైన పౌరులు గల దేశానికి ఇది మంచిది.

లిఖిత రాజ్యాంగాలు స్థిరమైనవి. స్పష్టంగా ప్రతి విషయం లిఖిత పూర్వకంగా ఉంటుంది కాబట్టి ప్రజల హక్కులకు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు రక్షణ కల్పిస్తాయి. లిఖిత రాజ్యాంగాలు ప్రజలచేత, ప్రభుత్వంచేత పవిత్రమైనవిగా ఎంచబడతాయి. నిజానికి ప్రపంచంలో ఏ రాజ్యాంగమూ పూర్తిగా లిఖితంగాని పూర్తిగా అలిఖితంగాని అయి ఉండదు.

రాజ్యాంగాలను దృఢ అదృఢ రాజ్యాంగాలు (Rigid and flexible constitutions) అని మరో రెండు విధాలుగా వర్గీకరించవచ్చు. లార్డ్ బ్రైస్ (Lord Bryce) ఉద్దేశంలో రాజ్యాంగ శాసనాలకు, సాధారణ శాసనాలకు మధ్య తేడాలేక, పార్లమెంట్ వాటిని రెండిటిని ఒకే పద్ధతిలో రూపొందించి అవసరమైనప్పుడు సవరిస్తూ ఉంటే అటువంటి రాజ్యాంగాన్ని అదృఢ రాజ్యాంగము అంటారు. అట్లా కాక రాజ్యాంగ శాసనాల తయారీకి, సవరణకు ఒక విధమైన పద్ధతి, సాధారణ శాసనాల తయారీకి, సవరణలకు వేరే పద్ధతి అవలంబిస్తే అటువంటి రాజ్యాంగాన్ని దృఢ రాజ్యాంగము అంటారు. దృఢ రాజ్యాంగాలను రాజ్యాంగ సభలు రూపొందిస్తాయి. వాటిని సవరించడానికి ప్రత్యేకమైన సవరణ విధానము ఉంటుంది.

బ్రిటిష్ రాజ్యాంగము ఏకైక అదృఢ రాజ్యాంగము. అక్కడ పార్లమెంట్ అత్యున్నతమైనది. అమెరికా రాజ్యాంగము ప్రపంచ రాజ్యాంగాలన్నింటిలోకి దృఢమైనది. భారత రాజ్యాంగము బ్రిటిష్ రాజ్యాంగం కంటె దృఢమైనది. అమెరికా రాజ్యాంగం కంటె అదృఢమైనది. దీనిని దృఢ-అదృఢ రాజ్యాంగము అంటారు.

అదృఢ రాజ్యాంగం మార్చడం సులభము కాబట్టి దేశ ప్రయోజనాల కనుగుణంగా

దానిని సవరించవచ్చు. అయితే ఇటువంటి రాజ్యాంగాలు రాజకీయ నాయకుల చేతులలోను న్యాయస్థానాల చేతులలోను కీలుబొమ్మ లవుతాయి. ప్రజలలో రాజకీయ చైతన్యం తక్కువగా ఉండే దేశాలకు ఇది మంచిది కాదు.

దృఢ రాజ్యాంగాలు ప్రభుత్వాధికారాన్ని అదుపులో ఉంచి ప్రజాస్వామ్యాన్ని సంరక్షిస్తాయి. ఇవి ప్రభుత్వాధికారాలను స్పష్టంగా నిర్వచిస్తాయి తదనుగుణంగా అవి పనిచేసి ప్రభుత్వ లక్ష్యాలు నెరవేర్చగలవు. అధికారపక్షం తన స్వప్రయోజనాలకు అనుగుణంగా వాటిని సవరించలేదు. ప్రజల హక్కులకు దృఢ రాజ్యాంగం రక్షణ కల్పిస్తుంది. సమాఖ్య రాజ్యాలలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల అధికారాలను దృఢ రాజ్యాంగంలో పొందుపరిస్తే కేంద్ర ప్రభుత్వాలు రాష్ట్ర ప్రభుత్వాల స్వేచ్ఛ హరించకుండా ఉంటాయి. కాని రాజ్యాంగ సవరణ క్లిష్టమైతే "రాజ్యాలు ముందుకు పోతున్నా రాజ్యాంగాలు వెనకబడతాయి" కాబట్టి అవి అభివృద్ధి నిరోధకమని కొందరు అంటారు. సమాఖ్య రాజ్యాలలో దృఢ రాజ్యాంగాలు న్యాయమూర్తుల చేతులలో విశేషంగా అధికారాలుంచుతాయి. కొన్ని లోపాలున్నా నిజానికి అదృఢ రాజ్యాంగాల కంటె దృఢ రాజ్యాంగాలే ప్రయోజనకరము. అందుచేతనే అనేక దేశాలకు దృఢ రాజ్యాంగాలే ఉన్నాయి.

## ఏకకేంద్ర, సమాఖ్య, సమ్మేళన రాజ్యాలు

## (Unitary, Federal and Confederate States)

ఇంతవరకు మనం రాజరికము, కులీన పాలన మొదలైన ప్రాచీన ప్రభుత్వ పద్ధతులను గురించి తెలుసుకొన్నాము. ఇప్పుడు ఆధునిక ప్రభుత్వ పద్ధతులైన ఏకకేంద్ర ప్రభుత్వము (Unitary government), సమాఖ్య ప్రభుత్వము (Federal government), సమ్మేళన రాజ్యము (Confederation) లను గురించి తెలుసుకొందాము

### ఏకకేంద్ర ప్రభుత్వము

ఏకకేంద్ర రాజ్యంలో ఒకే ఒక బలమైన కేంద్ర ప్రభుత్వముంటుంది. ప్రాంతీయ ప్రభుత్వాలు (Regional governments) ఉండవచ్చు, లేకపోవచ్చు. ఒకవేళ ఉంటే అవి తమ మనుగడకు, అధికారాలకు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు పూర్తిగా కేంద్ర ప్రభుత్వంపై ఆధారపడి ఉంటాయి. ఏ రాజ్యంలో అయితే అత్యున్నత శాసనాధికారాన్ని ఒకే ఒక కేంద్రీయ అధికార వ్యవస్థ వాడుకగా వినియోగిస్తుందో దానిని ఏకకేంద్ర ప్రభుత్వ విధానమంటారని డైసీ (Dicey) చెప్పినాడు..

ఏకకేంద్ర రాజ్యంలో స్థానిక ప్రభుత్వాలు (Provincial or regional governments) కేంద్రానికి ప్రతినిధులేగాని స్వతంత్ర ప్రతిపత్తిగల రాష్ట్రాలు కావు. వాటి అధికారాలు రాజ్యాంగపరమైనవి కావు. వాటి అధికారాలను కేంద్ర ప్రభుత్వం నిర్దేశిస్తుంది. కేంద్రము తన ఇష్టప్రకారం వాటి అధికారాలను పెంచవచ్చు లేదా తగ్గించవచ్చు. ఇక్కడ కేంద్ర ప్రభుత్వాన్ని ప్రజలు ఎన్నుకొంటారు. రాష్ట్ర ప్రభుత్వాలను ప్రజలు ఎన్నుకోవచ్చు లేదా కేంద్రమే నియమించవచ్చు. ఏక కేంద్ర రాజ్యంలో దేశానికంతటికీ కలిపి ఒకే ఒక రాజ్యాంగం ఉంటుంది. అది లిఖితం కావచ్చు అలిఖిత రాజ్యాంగమైనా ప్రమాదంలేదు.

ఓ ట ర్లు —




స్థానిక ప్రభుత్వాలు ←

ఏకకేంద్ర ప్రభుత్వ నిర్మాణము

ఏకపౌరత్వము ఏకన్యాయశాఖ లేదా సంఘటిత న్యాయశాఖ (Integrated judiciary) దీని లక్షణాలలో ఒకటి. పైపటము ఏకకేంద్ర ప్రభుత్వ నిర్మాణాన్ని విశదీకరిస్తుంది. ఈ విధానము బ్రిటన్, ఫ్రాన్స్, బెల్జియమ్, హాలెండ్, డెన్మార్క్, స్వీడన్, జపాన్, నార్వే, ఇటలీ మొదలైన రాజ్యాలలో అమలులో ఉంది.

## ఏకకేంద్ర ప్రభుత్వ విధానంలోని ప్రయోజనాలు

ఏక కేంద్ర ప్రభుత్వ విధానాన్ని అవలంబించడం వల్ల ఈ కింది ప్రయోజనాలు ఉన్నాయి :

1 *బలమైన ప్రభుత్వము :* ఈ విధానంలో సర్వాధికారాలు కేంద్ర ప్రభుత్వం చేతిలో ఉండటంవల్ల అది సుసంఘటితంగాను, సుస్థిరంగాను, బలంగాను పనిచేస్తుంది. ఆంతరంగికంగాను, బాహ్యంగాను దేశ శాంతిభద్రతలను కాపాడటానికి ఇటువంటి ప్రభుత్వం ఉండటం మంచిది. ఏక కేంద్ర రాజ్యంలో దేశాన్నంతటినీ ఒక్కతాటిపై నడిపించవచ్చు.

2 *వ్యయం తక్కువ :* ఏకకేంద్ర రాజ్యంలో కేంద్రంలో మాత్రమే శాసనసభ, కార్యనిర్వాహక వర్గము ఉంటాయి. ప్రాంతీయ ప్రభుత్వాలకు ఇక్కడ అవసరం లేదు. కాబట్టి ఒకే శాసనసభ, కార్యనిర్వాహక వర్గంతో దేశ పరిపాలన నిర్వహించవచ్చు. సమాఖ్య రాజ్యాలలో పరిస్థితి దీనికి భిన్నంగా ఉంటుంది. ప్రాంతీయ మంత్రివర్గాలకు, శాసన సభ్యులకు

అయ్యే వ్యయం ఆదా చేయవచ్చు. ఏకకేంద్ర ప్రభుత్వ నిర్మాణము సమాఖ్యతో పోలిస్తే చాలా సులభమైనది.

3. *పరిపాలనలో ఏకరూపత* : ఏకకేంద్ర రాజ్యంలో ఒకే ప్రభుత్వం మొత్తం రాజ్యాన్ని పరిపాలిస్తుంది. కాబట్టి అన్ని ప్రాంతాలలోనూ ఒకే పరిపాలనా విధానాలను అమలు పరుస్తుంది. దీనివల్ల పరిపాలన అన్నిచోట్ల ఒకే విధంగా ఉండి అన్ని ప్రాంతాలూ ఒకే విధంగా అభివృద్ధిచెందడానికి వీలవుతుంది. అదే సమాఖ్య రాజ్యాలలో అయితే పరిపాలన లోను, శాసనాలలోను ప్రాంతీయంగా ఉండే వ్యత్యాసాలు విభిన్న ప్రాంతాలలో నివసించే ప్రజానీకాన్ని గందరగోళంలో ముంచెత్తుతాయి.

4. *త్వరితగతిని నిర్ణయాలు తీసుకోవచ్చు* : సమాఖ్య రాజ్యాలలో కేంద్ర ప్రభుత్వాలు, రాష్ట్రాలతో సంప్రదించకుండా కొన్ని నిర్ణయాలు తీసుకోలేవు. దీనివల్ల కొన్ని ముఖ్యవిధుల నిర్వహణలో అనవసరంగా తాత్సారం జరుగుతుంది. అదే ఏకకేంద్ర రాజ్యం అయితే ఇటువంటి సమస్య తలెత్తదు. కేంద్రం క్లిష్ట పరిస్థితులలో శీఘ్ర నిర్ణయాలు తీసుకొని సమస్యలను ఎదుర్కొంటుంది.

5. *సమర్థవంతమైన పరిపాలన* : ఈ విధానంలో కేంద్ర రాష్ట్రప్రభుత్వాల మధ్య తగవులు ఉండవు. స్థానిక ప్రభుత్వాలు కేంద్రం చెప్పుచేతలలో ఉంటాయి. వాటికి కావలసినంత వరకు పరిపాలనా సౌలభ్యాన్ని దృష్టిలో పెట్టుకొని కేంద్రమే అధికారాలను పంచుతుంది. ఆ యా ప్రాంతాల అవసరాలనుబట్టి కేంద్రమే అధికారులను నియమించి వారికి కావలసిన అధికారాలు ఇస్తుంది. కాబట్టి ఏకకేంద్ర రాజ్యంలో పరిపాలన ఒడుదుడుకులులేక సాఫీగా, సమర్థవంతంగా సాగుతుంది.

6. *ఏకపౌరత్వము* (Single citizenship) : ఏకకేంద్ర రాజ్యంలో ఉండే ఏక పౌరత్వము ప్రజలలో జాతీయభావాన్ని పెంపొందిస్తుంది. సామాన్యంగా సమాఖ్య రాజ్యాలలో ద్వంద్వ పౌరత్వము (Double citizenship) ఉంటుంది. అంటే అక్కడ పౌరునికి రాజ్యపౌరత్వంతో పాటు రాష్ట్ర పౌరత్వం కూడా ఉంటుంది. దీనివల్ల ఒక రాష్ట్ర పౌరుడు మరొక రాష్ట్రానికి పోవలెనంటే ఆస్తిపాస్తులు, ఉద్యోగాల విషయంలో చిక్కులు ఎదుర్కొనవలె. తన దేశంలోనే పొరుగు రాష్ట్రంలో అతడు పరదేశీయుడై పోతాడు. ఇది జాతీయ సమైక్యతకు హానికరము. ప్రాంతీయ వైషమ్యాలకు అవకాశమిస్తుంది. ఏక కేంద్ర రాజ్యంలో ఇటువంటి సమస్య ఉండదు.

7. *చిన్నదేశాలకు అనువైనది* : తక్కువ జనాభా, పరిమితమైన వైశాల్యము, ఆర్థిక వనరులుగల చిన్న దేశాలకు ఏకకేంద్ర రాజ్య విధానము లాభదాయకము. ఇటువంటి దేశాలలో ప్రజలంతా ఒకేవర్గంవారయితే దీనివల్ల సమైక్యతాభావం కూడా వస్తుంది. దేశీయ, విదేశాంగ విధానంలో చురుకుగా వ్యవహరించవచ్చు. అదృఢ రాజ్యాంగంతో ఎప్పటికప్పుడు ప్రజాభిప్రాయం తెలుసుకొని దాని కనుగుణంగా అవసరమైన మార్పులు చేసుకొంటూ పరిపాలన నిర్వహించవచ్చు.

**లోపాలు**

1. *నియంతృత్వము* : ఏక కేంద్ర రాజ్యంలో సర్వాధికారాలు కేంద్ర ప్రభుత్వం

ఆధీనంలో ఉంటాయి. దానివల్ల కేంద్ర ప్రభుత్వము నియంతృత్వ పంథాలో నడిచే ప్రమాద ముంది. ఇంగ్లండ్‌లో కేబినెట్ నియంతృత్వం ఏర్పడటానికి, ఫ్రాన్స్‌లో జనరల్ డిగాల్ కాలంలో సర్వాధికారాలు కేంద్రం చేతులలోకివచ్చి నియంతృత్వ పంథాలో పరిపాలన సాగ డానికి కారణం ఆ దేశాలలో ఏకకేంద్ర రాజ్యవిధానం ఉండటమేనని రామ్సేమ్యూర్ అనే రచయిత అంటాడు.

2. *కేంద్ర ప్రభుత్వానికి పని ఒత్తిడి పెరుగుతుంది* : ఏకకేంద్ర రాజ్యంలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య విధుల పంపిణీ ఉండదు. స్థానిక ప్రభుత్వాలు ప్రతి విషయంలో కేంద్రం అనుమతిపొంది పనిచేయవలె. దీనివల్ల విధి నిర్వహణలో "ఎర్రటేప్" (Red tape-అలస్యము) పెరగడమేగాక అన్ని విధులు కేంద్రమే నిర్వహించవలసి రావడంవల్ల దానికి పనిభారం పెరుగుతుంది. అటువంటి పరిస్థితులలో కేంద్రం కొన్ని ముఖ్యవిషయాలు అశ్రద్ధ చేయడంగాని, పనిఒత్తిడివల్ల విస్మరించే అవకాశంగాని ఉంది.

3. *స్థానిక ప్రభుత్వాలకు స్వేచ్ఛ ఉండదు* : ఈ విధానంలో స్థానిక ప్రభుత్వాలకు స్వతంత్ర ప్రతిపత్తి ఉండదు. స్థానికంగా ప్రజలకు అవసరమైన విధుల నిర్వహణకు కూడా కేంద్రం అనుమతి కావలె. ఎక్కడో దూరంగా ఉండే కేంద్ర ప్రభుత్వానికి స్థానిక అవస రాలు అవగాహనకావు. పరిపాలన అంతా కేంద్రంచే నియమించబడిన అధికారులే నిర్వహిస్తారు దీనివల్ల స్థానిక ప్రజానీకానికి తమ ప్రాంత పరిపాలనలో పాలు పంచుకోవడానికి వీలుకాదు స్థానిక పరిపాలనలో చురుకుగా పాల్గొనగలిగినప్పుడే వారిలో రాజకీయ చైతన్యం అభివృద్ధి చెందుతుంది. అటువంటి స్వేచ్ఛ, అవకాశము వారికి లేకపోతే వారిలో పరిపాలన అంటే ఉదా సీనత ఏర్పడుతుంది.

4. *పెద్ద రాజ్యాలకు ఇది మంచిదికాదు* : భిన్న భాషలు, భిన్న మతాలు, సంస్కృతులు, జాతులకు చెందిన ప్రజలుగల ఇండియా, అమెరికా, సోవియట్ రష్యావంటి రాజ్యాలలో అందరి ప్రయోజనాలను పరిరక్షించి భిన్నత్వంలో ఏకత్వం తేవడానికి ఏకకేంద్ర రాజ్యం కంటె సమాఖ్య విధానమే మంచిది.

డా. గార్నర్ (Dr. Garner) ఏకకేంద్ర ప్రభుత్వాలలో గల లోపాలను ఈ కింది విధంగా సమీక్షించినాడు :

"ఏకకేంద్ర ప్రభుత్వము స్థానిక ప్రజానీకంలో ఉండే చొరవను అణిచివేస్తుంది. వారికి ప్రభుత్వ వ్యవహారాలపై కుతూహలాన్ని పెంచడానికి బదులు తగ్గిస్తుంది. ప్రభుత్వాన్ని నిర్వీర్యంచేసి, కేంద్రీకృతమైన ఉద్యోగి స్వామ్యాన్ని (Bureaucracy) ప్రోత్సహిస్తుంది."

ఏకకేంద్ర ప్రభుత్వాలలో కొన్ని లోపాలున్నా చిన్న రాజ్యాలకు ఆ విధానమే మంచిది. బ్రిటన్, ఫ్రాన్స్‌లలో అవి చక్కగా పనిచేస్తున్నాయి.

## సమాఖ్య ప్రభుత్వము

సమాఖ్యను ఆంగ్లభాషలో "ఫెడరేషన్" (Federation) అని పిలుస్తారు. ఈ పదము "ఫోడస్" (Foedus) అనే లాటిన్ పదం నుంచి పుట్టింది. "ఫోడస్" అంటే ఒప్పందము (Treaty or agreement) అని అర్థము. ఆర్థికంగాను, సైనికంగాను బల హీనంగా ఉన్న కొన్ని ఇరుగుపొరుగు చిన్న రాజ్యాలు తమ సార్వభౌమాధికారాన్ని శాశ్వ

తంగా వదులుకొని ఒకే రాజ్యంగా ఏకం కావడానికి అంగీకరించడం ద్వారాగానీ లేదా ఒక పెద్ద ఏకకేంద్ర రాజ్యంలో భిన్నత్వంలో ఏకత్వం సాధించడానికి రాజ్యాన్ని కొన్ని రాష్ట్రాలుగా విభజించి అధికారాలను కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య రాజ్యాంగపరంగా పంపిణీ చేయడంద్వారా కాని సమాఖ్యరాజ్యం ఏర్పడుతుంది. అమెరికా సంయుక్త రాష్ట్రాలు వీటిలో మొదటి తరహాకు చెందిన సమాఖ్య. ఇండియా, కెనడా, సోవియట్ యూనియన్ రెండవ తరహాకు చెందిన సమాఖ్యలు.




సమాఖ్య ప్రభుత్వ నిర్మాణము

సమాఖ్య రాజ్య లక్షణాలనుగూర్చి చర్చిస్తూ ఏ. వి. డైసీ (A. V. Dicey) వాటికి మూడు ప్రధాన లక్షణాలు ఉంటాయని చెప్పినాడు. అవి :

(1) లిఖిత, దృఢ, ఉన్నత రాజ్యాంగము (Written, rigid and supreme constitution)

(2) కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య స్పష్టమైన, నిర్దిష్టమైన అధికారాల పంపిణీ (Clear and precise distribution of powers between the centre and the states)

(3) స్వతంత్ర ప్రతిపత్తిగల ఉన్నత న్యాయ వ్యవస్థ (Independent, supreme judiciary)

సమాఖ్య రాజ్యంలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు తమ తమ పరిధులలో స్వతంత్రంగా ఉంటాయి. కాబట్టి వాటి అధికారాలను ఒక లిఖిత రాజ్యాంగం ద్వారా స్పష్టంగా సూచించవలె. ఆ యా ప్రభుత్వాలు వాటిని తరచు మార్చడానికి వీలులేకుండా రాజ్యాంగాన్ని దృఢంగా నిర్మించవలె. అప్పుడే రాజ్యాంగము అనుల్లంఘనీయంగాను, పవిత్రంగాను ఉంటుంది. నిజమైన సమాఖ్యలో రాష్ట్రాలకు విడిగా రాజ్యాంగాలు ఉంటాయి. అధికారాల పంపిణీలో కేంద్రానికిజాతీయ ప్రాముఖ్యమున్న విధులు అప్పగిస్తారు. రాష్ట్ర జాబితాలో ప్రాంతీయ ప్రాముఖ్యమున్న విధులు చేరుస్తారు. ఏ జాబితాలో చేరని మిగులు అధికారాలు (Residuary powers) రాష్ట్రాలకే ఇస్తారు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య అధికారాల విషయంలో తగాదాలు తల ఎత్తకుండా ఎన్ని జాగ్రత్తలు తీసుకొన్నా అవి తప్పవు. అటువంటి వివాదాలు తలెత్తినప్పుడు వాటిని వెంటనే పరిష్కరించి సమాఖ్యను ఒడుదుడుకులు లేకుండా నడిపించడానికి, రాజ్యాంగాన్ని వ్యాఖ్యానించి, అర్థవివరణ చెప్పడానికి, కాపాడటానికి సమాఖ్యలో స్వతంత్ర ప్రతిపత్తిగల న్యాయవ్యవస్థ (సుప్రీంకోర్ట్) ఉండవలె. రాష్ట్రాలకు విడిగా ఉన్నత న్యాయస్థానాలు(హైకోర్టులు) ఉంటాయి. వాటి అధికారాలు రాష్ట్ర జాబితాకే పరిమితము. సమాఖ్య రాజ్యంలో కేంద్రానికి, రాష్ట్రాలకు విడివిడిగా రాజ్యాంగాలే కాక, విడివిడిగా పౌరత్వము ఉండటం (ద్వంద్వ పౌరత్వము)' కేంద్రంకంటె రాష్ట్రాలకే ఎక్కువ అధికారాలు, హోదా లభించడం ఒక విశేషము. దీనికి కారణం సమాఖ్యలో రాష్ట్రాలు ఐక్యతను ఎంతగా కోరుకొంటాయో స్వాతంత్ర్యాన్ని కూడా అంత బలంగానూ కోరడమే !

## ప్రయోజనాలు

*1. నిరంకుశత్వాన్ని నివారిస్తుంది :* సమాఖ్య రాజ్యంలో ప్రభుత్వాధికారాలు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలమధ్య పంపిణీ చేయబడతాయి. ఆ రెండు ప్రభుత్వాలు ఒకరి అధికారపరిధిలో మరొకరు జొరపడకుండా సర్వస్వతంత్రంగా పనిచేస్తాయి. ఈ అధికార వికేంద్రీకరణ, రాష్ట్రాలపై కేంద్రం అజమాయిషీని, జులుంను తగ్గించడమేగాక ఏకకేంద్ర రాజ్యంలో వలె అది నియంతృత్వ పంథాలో పోవడానికి వీలులేకుండా తగిన అవరోధాలు ఏర్పరుస్తుంది.

*2. భిన్నత్వంలో ఏకత్వసాధన :* ఇండియా, అమెరికా, చైనా, రష్యావంటి పెద్ద దేశాలలో వేరువేరు భాషలు, సంస్కృతులు, మతాలు, జాతులవారు ఉండటంవల్ల వారు తమ ప్రత్యేకత కాపాడుకొంటూనే భిన్నత్వంలో ఏకత్వం సాధించడానికి, ఏ వర్గానికావర్గము

సాంస్కృతిక వికాసాన్ని సాధించడానికి సమాఖ్య రాజ్యంలో ఉన్నన్ని అవకాశాలు ఏకకేంద్ర రాజ్యంలో ఉండవు. ఇండియాలో భాషా రాష్ట్రాల నిర్మాణంద్వారా విభిన్న భాషా వర్గాలవారు తమ సంస్కృతిని, భాషను అభివృద్ధిచేసుకోవడానికి చక్కటి అవకాశం లభించిన విషయం మనకు తెలిసినదే.

*3. ఆర్థిక, రక్షణ ప్రయోజనాల పరిరక్షణ :* ఆర్థికంగాను, సైనికంగాను బలహీనంగా ఉండే ఇరుగుపొరుగు చిన్న రాజ్యాలు కలిసి సమాఖ్యగా రూపొందడంద్వారా ఒక శక్తిమంతమైన రాజ్యంగా అవి మలచబడతాయి. కలిసిఉంటే గడ్డిపోచలు సైతం మదగజాన్ని బంధించగలిగినట్లు, చిన్న చిన్న రాజ్యాలన్నీ కలిసి తమ సమష్టి శక్తితో బలమైన శత్రువుకు కూడా ఘనంగా బుద్ధి చెప్పగలవు. అమెరికా సంయుక్త రాష్ట్రాల నిర్మాణం ఇటువంటిదే. సమాఖ్య విధానంలో సభ్యత్వ భాగాలు తమ ఆర్థిక వనరులు పరస్పరం పంచుకోవడం ద్వారా ఒక రాష్ట్రం అవసరాలను మరొక రాష్ట్రం తీర్చడానికి వాటి మధ్య వర్తక వాణిజ్యాలు అభివృద్ధి చెందడానికి వీలవుతుంది.

*4. స్థానిక పరిపాలనలో ప్రజల తోడ్పాటు :* సమాఖ్య విధానము ప్రభుత్వాన్ని ప్రజలకు చేరువగా తెస్తుంది. వారిని తమ ప్రాంత పరిపాలనలో భాగస్వాములుగా చేస్తుంది. తమ రాష్ట్ర రాజకీయాంలో వారు పాల్గొని తమకు నచ్చినవిధంగా తమ ప్రాంతాలను అభివృద్ధిచేసుకొంటారు. స్థానిక ప్రభుత్వంలో వారికి లభించిన భాగస్వామ్యం "ఈ ప్రభుత్వం మాది, మా పనులు మేముకాక ఎవరు చూస్తారు" అనే భావాన్ని పుట్టిస్తుంది. రాజకీయంగా ప్రజలు ఆ విధంగా చైతన్యవంతులైననాడు ప్రజాస్వామ్య వ్యవస్థ పటిష్టమవుతుంది. సమాఖ్య విధానంలో ప్రాంతీయ పరిపాలనలో ప్రజలకు లభించిన అవకాశము మున్ముందు జాతీయ నాయకత్వానికి శిక్షణగా తోడ్పడుతుంది.

*5. కేంద్రం బరువుబాధ్యతలు తగ్గుతాయి :* సమాఖ్య విధానంలో దేశరక్షణ, విదేశీ వ్యవహారాలు, రవాణా సౌకర్యాలు మొదలైన ముఖ్యమైన, జాతీయ ప్రాముఖ్యమున్న శాఖలను మాత్రమే కేంద్ర ప్రభుత్వం నిర్వహిస్తుంది. విద్య, ఆరోగ్యము, పోలీసు, వైద్యసహాయము వంటి ప్రాంతీయ ప్రాముఖ్యమున్న శాఖలను రాష్ట్ర ప్రభుత్వాలు నిర్వహిస్తాయి. సామాన్యంగా ఈ శాఖలను ఆ యా ప్రాంతాలలోఉన్న పరిస్థితులనుబట్టి, అవసరాలనుబట్టి నిర్వహించవలె. కాబట్టి ఈ విధులు ప్రాంతీయ ప్రభుత్వాలకు అప్పగించడంవల్ల కేంద్రము ప్రధానమైన విషయాలపై మాత్రమే తన దృష్టి కేంద్రీకరించి తన బరువు బాధ్యతలు తగ్గించుకోవడానికి, రాష్ట్ర ప్రభుత్వాలు శ్రద్ధగా ఈ ప్రాంతీయ విధులు తమకు ప్రయోజనకరంగా ఉండేటట్లు సమర్థవంతంగా నిర్వహించుకోవడానికి వీలవుతుంది. ఏకకేంద్ర రాజ్యంలో ఇటువంటి అవకాశము లేని కారణంగా అక్కడ కేంద్ర ప్రభుత్వానికి మోయలేని భారముంటుంది. సమాఖ్యలలో ఉండే ఈ అధికార వికేంద్రీకరణం వల్ల పరిపాలనా సామర్థ్యం కూడా పెరుగుతుంది.

*6. ప్రపంచశాంతికి, వసుధైక రాజ్యవ్యవస్థ నిర్మాణానికి నాంది :* ప్రపంచంలో చిన్నచిన్న రాజ్యాలు అనేకం ఉంటే వాటిమధ్య తరచు తగాదాలు, యుద్ధాలు చెలరేగే అవకాశముంది. దీనివల్ల ప్రపంచశాంతికి ముప్పు వాటిల్లుతుంది. అవి నిరంతరం ఒకదానితో మరొకటి కలహించుకొంటూ మానవాళికి సుఖసంతోషాలు లేకుండా చేస్తాయి. అంతకంటె అవన్నీ ఏకమై ఒకటి రెండు సమాఖ్యలుగా ఏర్పడితే ఈ బెడద తీరుతుంది. సమాఖ్య రాజ్య నిర్మా

ఐమ భవిష్యత్తులో వసుధైక రాజ్య వ్యవస్థ నిర్మాణానికి నాంది అవుతుందని, అదొక్కటే ప్రపంచశాంతికి శాశ్వత పరిష్కారం కాగలదని ప్రఖ్యాత రాజనీతి శాస్త్రవేత్తలు అభిప్రాయ పడుతున్నారు. వసుధైక రాజ్యం అంటూ ఏర్పడితే అది సమాఖ్య రూపంలోనే ఉంటుందికాని ఏకకేంద్రము మాత్రం కాదు.

**లోపాలు**

1. *సమాఖ్య రాజ్యాంగము అభివృద్ధి నిరోధకము*: సమాఖ్య ప్రభుత్వానికి లిఖిత, దృఢ రాజ్యాంగం ఉండక తప్పదు. దీనివల్ల కొన్ని ప్రయోజనాలతోపాటు నష్టాలు కూడా ఉన్నాయి. సమాఖ్య రాజ్యాంగంలో ప్రతి రాజ్యాంగ సవరణకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ఆమోదం కావలె. అనేక సందర్భాలలో కేంద్రము ప్రవేశపెట్టిన రాజ్యాంగ సవరణలు రాష్ట్రాల ఆమోదం లభించక నిలిచిపోతాయి. అమెరికాలో బాల కార్మికుల నిషేధానికి ఉద్దేశించిన బిల్లుకు అనేక సంవత్సరాలు రాష్ట్రాల ఆమోదం లభించక నిలిచిపోయింది. ఇండియాలో కొత్త ఆలిండియా సర్వీస్‌ల నిర్మాణానికి ఎంతో కాలంగా రాష్ట్రాల అనుమతి లభించడంలేదు. అదే ఏక కేంద్ర రాజ్యంలో అయితే రాష్ట్రాలనుంచి ఎటువంటి ప్రతిఘటనాలేక కేంద్రం ఏ బిల్లు అయినా రూపొందించి అమలుపరచగలదు. కాబట్టి సమాఖ్య రాజ్యాంగాలు అభివృద్ధి నిరోధకాలని కొందరు అంటారు.

2. *కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలమధ్య వివాదాలు జాతీయ సమైక్యతకు హానికరము* : సమాఖ్యలు కొన్ని రాజ్యాల కలయికద్వారాగాని లేదా విభిన్నధోరణులుగల కొన్ని ప్రాంతీయ విభాగాల కలయికద్వారాగాని ఏర్పడతాయి. అవి కలిసి ఉందామని ఎంత అనుకొన్నా వాటిమధ్య స్వభావసిద్ధంగాను, చారిత్రకంగాను ఉండే వ్యత్యాసాలు వాటిని మనఃస్ఫూర్తిగా కలవనివ్వవు. దీనివల్ల వాటిమధ్య ఏదో విషయంలో తరచు తగవులు, అభిప్రాయ భేదాలు తలెత్తుతూ ఉంటాయి. అమెరికాలో బానిసత్వం రూపుమాపవలెనని కేంద్రం తీసుకొన్న నిర్ణయంతో కొన్ని దక్షిణాది రాష్ట్రాలు ఏకీభవించక చివరకు అంతర్యుద్ధం చెలరేగింది. ఆ యుద్ధంలో ఆనాడు కేంద్రం విజయంపొంది ఉండకపోతే ఆమెరికా చరిత్ర ఎట్లా ఉండేదో అనూహ్యము.

కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు ఒక్క తాటిమీద నడవడానికి సమాఖ్యలో అవకాశాలు తక్కువ. రెండుచోట్ల ఒకేపార్టీ అధికారంలో ఉంటే ఈ సమస్యలు కొంతవరకు సమసిపోతాయేమోగాని వేరు వేరు పార్టీలుంటే రెండిటి మధ్య సెగరగులు కొంటూనే ఉంటుంది. అంటే సమాఖ్య సమైక్యత తేవడానికిబదులు, విచ్ఛిన్నకర శక్తులను ప్రోత్సహిస్తుందని రుజువవుతున్నది. మన రాజ్యాంగము హిందీని దేశభాషగా చేయవలెనని చెప్పినా హిందీఏతర రాష్ట్రాలైన దక్షిణాది రాష్ట్రాలపై దానిని బలవంతంగా రుద్దితే ప్రత్యేకంగా తమిళనాడు చూస్తూ ఊరుకోలేదని దక్షిణాది రాష్ట్రాలు కేంద్రంతో తెగతెంపులు చేసుకోవడానికి వెనుకాడవని డి. ఎమ్. కె. ప్రభుత్వం ఒకప్పుడు హెచ్చరించింది. కాబట్టి సమాఖ్య విధానము జాతీయ సమైక్యతకు ఎంతమాత్రం దోహదం చేయదని కొందరంటారు.

3. *కేంద్ర పై పెద్దరాష్ట్రాల ప్రభావము* : రాష్ట్రాల నిర్మాణము శాస్త్రీయమైన సూత్రాల కనుగుణంగా జరిగితేనేతప్ప సమాఖ్యలో అన్ని రాష్ట్రాలు పరిమాణము, వనరులు,

జనాభా మొదలైన విషయాలలో ఒకేవిధంగా ఉండవు. అటువంటప్పుడు పెద్దరాష్ట్రాలు కేంద్రంపై ఒత్తిడితెచ్చి తమ పలుకుబడి, బలంతో తమ పనులు నెరవేర్చుకొంటాయి. దీనివల్ల చిన్న రాష్ట్రాలకు హాని జరుగుతుంది. నేటికీ మనదేశంలో దక్షిణ భారతీయులు ఒక్కరూ ప్రధాని కాలేకపోయినారనే వెలితి కనిపిస్తూనే ఉంది. కేంద్ర రాజకీయాలలో పెద్ద రాష్ట్రాలైన ఉత్తర ప్రదేశ్, బీహార్‌ల ప్రభావం స్పష్టంగా కనిపిస్తున్నది. దేశాన్ని ఏలిన ప్రధానులలో అధికభాగం ఉత్తరప్రదేశ్ రాష్ట్రానికి చెందినవారే.

4. *సమాఖ్య ప్రభుత్వ నిర్మాణము వ్యయప్రయాసలతో కూడినది* : సమాఖ్య రాజ్య నిర్మాణము ఏకకేంద్ర రాజ్య నిర్మాణంకంటె, కష్టము. దీనికి తప్పనిసరిగా లిఖిత రాజ్యాంగం ఉండవలె. కేంద్ర రాష్ట్రప్రభుత్వాల మధ్య అధికారాలను పంపిణీచేసి కేంద్రము రాష్ట్రాలకు సంబంధించిన విషయాలలో నిష్కారణంగా జోక్యంచేసుకొని వాటి స్వేచ్ఛను హరించ కుండా తగిన ఏర్పాట్లు చేయవలె. అంతేగాక ప్రతిరాష్ట్రానికి ప్రభుత్వాంగాల నిర్మాణము, ప్రత్యే కంగా రాజ్యాంగాలు ఒకటేమిటి కేంద్రంలో ఎంత హంగామా ఉంటుందో అంతా ప్రతి రాష్ట్రానికి తప్పదు. ఇంత కష్టపడి సమాఖ్య రాజ్యాన్ని నిర్మించడం ఒక ఎత్తు, అందలి భాగస్వామ్య విభాగాలు, సామరస్యంతో సమైక్యంగా వ్యవహరించి సమాఖ్య మనుగడకు ముప్పురాకుండా చేయడం మరొక ఎత్తు అని చెప్పవచ్చు. దీనినిబట్టి సమాఖ్య ప్రభుత్వ నిర్మాణం చాలా వ్యయప్రయాసలతో కూడినదని చెప్పవచ్చు. ఇటువంటి సమస్యలు ఏకకేంద్ర రాజ్యానికి ఉండవు.

5. *పరిపాలనలో సమరూపత ఉండదు* సమాఖ్య రాజ్యంలో రాష్ట్రాలకు స్వతంత్ర ప్రతిపత్తి ఉంటుంది. వాటికి ప్రత్యేక రాజ్యాంగాలు ఉంటాయి. దీనివల్ల ఒక్కొక్క రాష్ట్రంలో పరిపాలన ఒక్కొక్క విధంగా ఉంటుంది. స్థానిక చట్టాలు, ప్రజా హక్కులలో రాష్ట్రానికి రాష్ట్రానికి మధ్య తేడాలు ఉండటంవల్ల దేశం మొత్తంమీద పరిపాలనా విధానంలో ఏకీకరణ లోపిస్తుంది. ఈ పరిస్థితి దేశంలో శాంతి భద్రతలకు భంగం కలిగిస్తుంది. ఉదాహర ణకు రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు ఇచ్చే వేతనాల విషయంలో రాష్ట్రానికి రాష్ట్రానికి మధ్య తేడా ఉంటే తక్కువ వేతనాలు లభించే రాష్ట్రంలో ఉద్యోగులు తమను పొరుగురాష్ట్రాల వారితో పోల్చుకొని అధిక వేతనాలకు ఆందోళన చేస్తారు. అయితే ఆర్థికంగా వెనుకబడిన రాష్ట్రాలు సంపన్న రాష్ట్రాలతో సమానంగా పోటీ పడలేవు. అదే ఏకకేంద్ర రాజ్యంలో అయితే ప్రతి విషయంలో ఒక జాతీయ విధానం ఉంటుంది. దాని కనుగుణంగా అన్ని ప్రాంతాలలో పరి పాలన ఒకే విధంగా జరుగుతుంది.

6. *బలహీనమైన కేంద్రప్రభుత్వము* : పరిపాలనాధికారాలన్నిటినీ ఒకే ప్రభుత్వం అనుభవించడానికి బదులు సమాఖ్యలో వాటిని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు పంచుకొంటాయి. ఎక్కువ అధికారాలు రాష్ట్రాలకే లభిస్తాయి. అందుచేత కేంద్రం, రాష్ట్రాలకంటె బలహీనం అవుతుంది. పరిపాలన పటిష్టంగా ఉండవలెనంటే కేంద్రప్రభుత్వం బలంగా ఉండవలె. లేకపోతే అది క్లిష్టపరిస్థితులను ఎదుర్కొని జాతీయ సమగ్రతను కాపాడలేదు. ప్రత్యేకంగా జాతీయ రక్షణ, విదేశీ వ్యవహారాలు అంతరంగిక వ్యవహారాలు, ఆర్థిక విషయాలలో కేంద్రం చిక్కు లను ఎదుర్కోవలసి వస్తుంది. అత్యవసర పరిస్థితులలో సైతం రాష్ట్రాలు తమ హక్కులు

కాపాడుకోవటానికే ప్రయత్నిస్తాయిగాని కేంద్రం అధికారాలు పెంచి, దానికి బలాన్ని చేకూర్చ డానికి ఇష్టపడవు.

మొత్తంమీద కొన్ని లోపాలున్నా ఎక్కువ జనాభా, వైశాల్యము, భిన్న వర్గాల ప్రజలు ఉండే పెద్ద రాజ్యాలకు సమాఖ్య విధానమే మంచిది.

## సమాఖ్య రాజ్య లక్షణాలుగల ఏకకేంద్ర రాజ్యము

ఏకకేంద్ర, సమాఖ్య రాజ్యాలలో ఉన్న మంచి చెడ్డలన్నీ ఆలోచించే, భారత రాజ్యాంగ నిర్మాతలు భారతదేశాన్ని సమాఖ్య రాజ్య లక్షణాలుగల ఏకకేంద్ర రాజ్యంగా నిర్మించినారు. భారత రాజ్యాంగంలో సమాఖ్య అనే పదం ఎక్కడా వాడలేదు. దీనిని "భారత యూనియన్" (Indian union) అని మాత్రమే వర్ణించినారు. అయితే దీనికి కొన్ని ఏకకేంద్ర లక్షణాలు మరికొన్ని సమాఖ్య లక్షణాలు - రెండూ ఉన్నాయి. దేశం అత్యయిక పరిస్థితిని ఎదు ర్కొంటూంటే ఏకకేంద్ర రాజ్యంవలె, సాధారణ పరిస్థితులలో సమాఖ్య రాజ్యంవలె భారత ప్రభుత్వం పనిచేస్తుంది. దీనినిగురించి ముందు అధ్యాయంలో విపులంగా చర్చిద్దాము.

## సమ్మేళన రాజ్యము (Confederation)

ప్రొఫెసర్ హాల్ (Prof. Hall) సమ్మేళన రాజ్యాన్ని నిర్వచిస్తూ, "సార్వభౌమాధి కారము అనుభవించే కొన్ని స్వతంత్ర రాజ్యాలు తమ సమష్టి రక్షణ నిమిత్తంగాని లేదా వాటన్నిటికి సంబంధించిన ఉమ్మడి సమస్యల పరిష్కారం నిమిత్తంగాని ఏకమయి ఉమ్మడిగా, పరిమితమైన అధికారాలుగల ఒక శాసనసభను, కార్యనిర్వాహకవర్గాన్ని ఏర్పాటుచేసుకొంటే తద్వారా ఏర్పడే వ్యవస్థనే సమ్మేళనము అంటారు" అని చెప్పినాడు.

సమాఖ్య, సమ్మేళన రాజ్యాల మధ్య ఈ కింది విషయాలలో పోలికలు ఉన్నాయి.

1. సమాఖ్య, సమ్మేళన రాజ్యాలు రెండూ కొన్ని స్వతంత్ర రాజ్యాల కలయికద్వారా ఏర్పడతాయి.

2. వీటి కలయికతోపాటు ఒక కేంద్ర ప్రభుత్వం ఏర్పడుతుంది. వీటిలో ఉండే భాగస్వామ్య రాజ్యాలు తమ అధికారాలలో కొన్నిటిని కేంద్రానికి దత్తం చేస్తాయి.

3. స్వతంత్ర రాజ్యాలు ఒక సమాఖ్యగాకాని, సమ్మేళనగాకాని ఏర్పడటానికి వాటికి సమష్టిగా ఉండే ఆర్థిక, రాజకీయ, రక్షణపరమైన సమస్యలే మూలము.

పై విషయాలలో రెండిటి మధ్య పోలికలు ఉన్నప్పటికీ వాటిమధ్య ఈ కింది వ్యత్యా సాలు కూడా ఉంటాయి.

1. సమ్మేళన రాజ్యాలలో చేరిన భాగస్వామ్య రాజ్యాలు తమ సార్వభౌమాధికారాన్ని కోల్పోవు. సమాఖ్యలో భాగస్వామ్య విభాగాలకు సార్వభౌమాధికారం ఉండదు. సమాఖ్యగా ఏర్పడటంతో అవి తమ సార్వభౌమాధికారాన్ని కోల్పోతాయి.

2. సమ్మేళన రాజ్యంవల్ల కొత్త రాజ్యం ఏర్పడదు. అప్పటికే ఉన్న రాజ్యాల మధ్య స్నేహసంబంధాలు, సహకారము మాత్రమే పెంపొందుతుంది. కాబట్టి సమ్మేళన రాజ్యము ఒక అంతర్జాతీయ ఒప్పందంవంటిది అని చెప్పవచ్చు. సమాఖ్య రాజ్యావతరణంలో అనేక రాజ్యాల స్థానంలో ఒకే ఒక రాజ్యం ఏర్పడుతుంది. ఇది రాజ్యాంగపరమైనది.

3. సమ్మేళన రాజ్యంలో కేంద్ర శాసనసభలోని వివిధ సభ్యత్వ రాజ్యాల ప్రతినిధులను "డెలిగేట్స్" (Delegates) అని పిలుస్తారు. వారికి స్వయం నిర్ణయాధికారం ఉండదు. వారు తమ తమ ప్రభుత్వాల ఆజ్ఞలను శిరసావహిస్తారు. సమాఖ్యలో చేరిన రాజ్యాలను రాష్ట్రాలు (States or Provinces) అంటారు. అవి కేంద్ర శాసనసభకు సభ్యులను ఎన్నుకొంటాయి. వారిని "ప్రతినిధులు" (Representatives) అంటారు. వారు ఆ యా రాష్ట్రాల ప్రజలచే ఎన్నుకోబడతారు. వారికి స్వయం నిర్ణయాధికారముంటుంది.

4. సమ్మేళనలో కలవబోయే రాజ్యాలు ఇరుగుపొరుగు రాజ్యాలు కానవసరంలేదు సమాఖ్యలో చేరే రాజ్యాలు ఇరుగుపొరుగు రాజ్యాలు కాకపోతే ఆ సమాఖ్య తొందరలో విచ్ఛిన్నమవుతుంది. పాకిస్థాన్ నుంచి బంగ్లాదేశ్ విడిపోవడం ఇటువంటిదే.

5. సమాఖ్యలో కేంద్ర ప్రభుత్వము రాజ్యాంగబద్ధము. దానిని రాజ్యాంగమే మార్చవలె. రాజ్యాంగాన్ని మార్చే అధికారం కేంద్రానికి రాష్ట్రాలకు సమంగా ఉంటుంది. సమ్మేళన రాజ్యంలో కేంద్ర ప్రభుత్వాన్ని స్వతంత్ర్య రాజ్యాలు ఏర్పరుస్తాయి. కావలెనను కొన్నప్పుడు ఎప్పుడైనా దానిని రద్దు చేయవచ్చు.

6. సమ్మేళనలో భాగస్వామ్య రాజ్యాల కలయిక అశాశ్వతము. అవి ఏ ప్రయోజనంతో కలిసినాయో ఆ ప్రయోజనం నెరవేరితే అవి విడిపోతాయి ; లేదా తమ కిష్టం లేకపోయినా తెగతెంపులు చేసుకోవచ్చు. కాని సమాఖ్యలో ఈ కలయిక శాశ్వతము. ఒకసారి కలిస్తే విడిపోయే అవకాశమున్నా అవి విడిపోవు.

7. సమాఖ్యలో ప్రజలు ఏ రాష్ట్రంలో ఉన్నా వారంతా ఒకే దేశస్తులు. వారికి ఆ దేశ పౌరత్వం ఉంటుంది. సమ్మేళనలోని పౌరులకు భిన్న పౌరత్వముంటుంది. వారు భిన్న రాజ్యాల పౌరులుగా గుర్తించబడతారు.

8. సమాఖ్యను "రాజ్యాల ఐక్యత" (Bundes staat = Union of states) అని సమ్మేళనను "నానారాజ్య సమితి" (Staaten bund = League of states) అని పిలవవచ్చు.

చరిత్రలో సమ్మేళన రాజ్యాలకు అనేక ఉదాహరణలు ఉన్నాయి. అవి ఏర్పడిన లక్ష్యం నెరవేరడంతో విచ్ఛిన్నం అవుతాయి లేదా సమాఖ్యగా స్థిరపడతాయి. స్విట్జర్లండ్ 1791 నుంచి 1798 వరకు, తిరిగి 1803 నుంచి 1848 వరకు, అమెరికా 1781 నుంచి 1787 వరకు, నెదర్లండ్స్ 1576 నుంచి 1789 వరకు సమ్మేళనలుగా ఉన్నాయి. 1907 లో గ్వాటిమాలా (Gautemala), కోష్టరికా (Costarica), హాండూరస్ (Hondurus) నికరాగువ (Nicarague), సాల్వెడార్ (Salvador) రాజ్యాలు ఐదు కలిసి సమాఖ్య ఏర్పడింది. అరబ్ రాజ్యాలు తమ ఉమ్మడి శత్రువు ఇజ్రాయిల్‌ను ఎదుర్కోవడానికి, అరబ్ సమాఖ్య (United Arab Republic)గా ఏర్పడినవి. తమ ఆయిల్ నిధుల వినియోగము, అమ్మకానికి అవి "ఒపెక్" అనే సంస్థగా ఏర్పడినాయి.

## ప్రశ్నలు

### వ్యాస ప్రశ్నావళి

1. ఏకకేంద్ర రాజ్యవిధానంలోని గుణదోషాలు వివరించండి.
2. సమాఖ్య రాజ్య లక్షణాలు తెలిపి దానిలోని గుణదోషాలు విపులీకరించండి.
3. ఏకకేంద్ర, సమాఖ్య రాజ్యలక్షణాల వ్యత్యాసాలను తెలపండి.

### సంక్షిప్త సమాధాన ప్రశ్నావళి

1. రాజరిక విధానంలోని ప్రయోజనాలు, లోపాలను విశదీకరించండి.
2. కులీన పాలన అంటే ఏమిటి ? అందులోని ప్రయోజనాలు, లోపాలు వివరించండి.
3. సమాఖ్య - సమ్మేళన రాజ్యాల మధ్యగల వ్యత్యాసాలను తెలపండి.
4. దృఢ-అదృఢ రాజ్యాంగాలంటే ఏమిటి ? అందులో తరతమ భేదాలను వివరించండి.
5. రాజ్యాంగమంటే ఏమిటి ? లిఖిత - అలిఖిత రాజ్యాంగాలలోని తరతమ భేదాలను తెలపండి.

# 2

# ప్రభుత్వాంగాలు

(Organs of the Government)

రాజ్య లక్షణాలలో ప్రభుత్వము అత్యంత ప్రధానమైనది. రాజ్య లక్ష్యాలు ప్రభుత్వం ద్వారా నెరవేరుతున్నాయి. ప్రభుత్వానికి మూడు అంగాలున్నాయి. అది వాటి సహాయంతో పని చేస్తుంది. వాటిని ప్రభుత్వాంగాలు అంటారు. అవి : (1) శాసన నిర్మాణశాఖ (Legislative branch) (2) కార్య నిర్వహణశాఖ (Executive branch) (3) న్యాయశాఖ (Judicial branch). సంఘావసరాలకు కావలసిన శాసనాలను శాసన నిర్మాణశాఖ రూపొందిస్తుంది. చట్టాలు లేకపోతే సంఘంలో సరైన కట్టుబాటు ఉండదు. ఈ శాసనాల కనుగుణంగా ప్రజలు నడుచుకొనేటట్లు చేయడం, పరిపాలన నిర్వహించడం, న్యాయస్థానాల తీర్పులు అమలుపరచడం కార్యనిర్వహణ శాఖ విధి. వ్యక్తుల మధ్యగాని, వ్యక్తికి ప్రభుత్వానికి మధ్యగాని లేదా ప్రభుత్వ శాఖల మధ్యగాని ఉత్పన్నమయ్యే తగాదాలను పరిష్కరించడం, రాజ్యాంగాన్ని వ్యాఖ్యానించడం, పరిపాలన రాజ్యాంగ సూత్రాల కనుగుణంగా జరిగేటట్లు చూడటం ద్వారా ప్రజల హక్కులకు హాని జరుగకుండా చూడటం న్యాయశాఖ విధి.

## అధికార పృథక్కరణ సిద్ధాంతము

(The theory of separation of powers)

పైన చెప్పిన మూడు ప్రభుత్వాంగాల మధ్య ఎటువంటి సంబంధం ఉండవలె అనే విషయాన్ని వివరించే సిద్ధాంతాన్ని అధికార పృథక్కరణ లేదా అధికార విభజన సిద్ధాంతం అంటారు. మాంటెస్క్యూ (Montesquieau) అనే ఫ్రెంచ్ రచయిత (1748) తాను వ్రాసిన "Spirit of the laws" అనే గ్రంథంలో దీనిని గురించి మొదట ప్రస్తావించినాడు.

శాసన నిర్మాణ, కార్యనిర్వహణ, న్యాయాధికారాలు మూడూ ఒకేచోట కేంద్రీకృతమైతే నియంతృత్వ మేర్పడుతుంది. కాబట్టి వాటిని విడివిడిగా ఉంచవలె. వీటి విషయంలో "నిరోధ సమతౌల్యం" (Checks and balances) ఉండవలె. అంటే ప్రభుత్వాంగాలు మూడూ ఒకదానిని మరొకటి అదుపులో ఉంచుతూ సమన్వయంతో పనిచేయవలె అన్నమాట. అప్పుడే పౌరుల హక్కులకు సరైన రక్షణ ఉంటుంది. మాంటెస్క్యూ అధికార పృథక్కరణ సిద్ధాంతానికి అమెరికా, ఫ్రాన్స్‌లలో విశేషమైన ఆదరణ లభించింది. ఈ సిద్ధాంతాన్ని మాంటెస్క్యూ ప్రకటించడానికి ముందే దాదాపు ఇదే విధమైన అభిప్రాయాలను అరిస్టాటిల్, మార్సిగ్లియో (Marsiglio), జీన్‌బోడిన్ (Jean Bodin) మొదలైనవారు చెప్పినారు. తరువాత దీనిని బ్లాక్‌స్టోన్ (Blackstone) అనే ఆంగ్ల రచయిత, మేడిసన్ (Madison), హేమిల్‌టన్ (Hamilton) అనే అమెరికనులు బలపరిచినారు. అయితే మాంటెస్క్యూ ఆశించినట్లు సంపూర్ణమైన అధికార విభజన అసాధ్యము, అవాంఛనీయము,

*ప్రభుత్వాంగాల మధ్య సంబంధము:* నిజానికి ప్రభుత్వాంగాలు మూడిటి మధ్య సన్నిహిత సంబంధం ఉండవలె. అవి వేటికవి విడివిడిగా పోతే అరాజక పరిస్థితి ఏర్పడుతుంది. అవి కలిసిమెలిసి పనిచేయవలె. శాసన సభ కార్యనిర్వాహక వర్గాన్ని అదుపులో ఉంచుతుంది. ఎందుచేతనంటే అది శాసనసభ విశ్వాసమున్నంతవరకే పదవిలో ఉంటుంది. కార్యనిర్వాహకవర్గము పరిపాలన సక్రమంగా సాగించడానికి అధికారాలను, ఆర్థిక వనరులను శాసనసభ శాసనాలు, బడ్జెట్ల రూపంలో ప్రకటిస్తుంది. అయితే శాసనసభ రూపొందించిన ఈ శాసనాలను కార్యనిర్వాహకవర్గమే అమలుపరచవలె. అది అమలు పరచనిదే ఆ శాసనాలకు ఎటువంటి విలువా ఉండదు. అంతేకాక కావలెనంటే కార్యనిర్వాహకవర్గము శాసన సభను రద్దు చేయగలదు. ఇదే విధంగా న్యాయశాఖ శాసన నిర్మాణ, కార్యనిర్వహణ శాఖలను అవి రాజ్యాంగాన్ని అతిక్రమించకుండా అదుపులో ఉంచుతుంది. అట్లాగే న్యాయశాఖ తీర్పులను అమలుపరచడం, న్యాయమూర్తులను నియమించడం కార్యనిర్వాహకవర్గం విధి కాబట్టి అది న్యాయశాఖను అదుపులో పెడుతుంది. న్యాయమూర్తులు తమ విధులు సరిగా నిర్వహించక పోతే వారిని తొలిగించే అధికారం శాసనసభ కివ్వడం ద్వారా ఆ శాఖ న్యాయశాఖను అదుపులో ఉంచగలదు. కాబట్టి ప్రభుత్వాంగాలు మూడు ఒకదానిని మరొకటి ఆ విధంగా అదుపులో పెడుతూ, పరస్పరం సహకరించుకొంటూ పనిచేయడం పైననే ప్రభుత్వ విజయం ఆధారపడి ఉంటుంది.

## శాసనసభ
## (Legislature)

ప్రభుత్వాంగాలలో శాసనసభ మొదటిది. ప్రజాస్వామ్యాలలో దీనికి ప్రత్యేక స్థానముంది. ప్రజాభిప్రాయాన్ని శాసనసభ శాసనాల రూపంలో వ్యక్తం చేస్తుంది. దీనిని ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క పేరుతో పిలుస్తారు. ఇండియా, బ్రిటన్, ఫ్రాన్స్‌లలో దీనిని పార్లమెంట్ అంటారు. అమెరికాలో కాంగ్రెస్ అని, సోవియట్ యూనియన్‌లో సుప్రీం సోవియట్ అని, స్విట్జర్లండ్‌లో ఫెడరల్ అసెంబ్లీ అని పిలుస్తారు.

### శాసనసభ విధులు, అధికారాలు

శాసనసభ ప్రధాన విధి దేశ పరిపాలనకు కావలసిన శాసనాలను తయారుచేయడమే అయినా అది ఆ విధితోపాటు అనేక ఇతర విధులను కూడా నిర్వహిస్తుంది. ఆధునిక శాసనసభలు ప్రధానంగా ఈ కింది విధులను నిర్వహిస్తున్నాయి :

1. ***శాసన నిర్మాణము*** : మారుతున్న సమాజ పరిస్థితుల కనుగుణంగా ప్రజల అవసరాలు తీర్చడానికి, పరిపాలన నిర్వహించడానికి కావలసిన శాసనాలను శాసనసభ రూపొందించవలె. అవసరమైతే అమలులోఉన్న చట్టాలను సవరించడం, అనుబంధ చట్టాలు తయారు చేయడం ఇది చేయవలసిన మొదటి విధి. శాసన నిర్మాణంలో శాసనసభ చాలాజాగరూకతతో వ్యవహరించవలె. అది తయారుచేసే చట్టాలు స్పష్టంగాను, రాజ్యాంగ బద్ధంగాను ఉండవలె. లేకపోతే వాటిని అమలుపరిచేటప్పుడు న్యాయపరమైన చిక్కులు ఎదురవుతాయి. కాబట్టి ఆధునిక శాసనసభలు వాటిని స్వయంగా రూపొందించక న్యాయశాస్త్ర నిపుణులు, సమర్థులు,

శాసన నిర్మాణంలో అనుభవజ్ఞులైన వ్యక్తులతో ఏర్పాటైన కమిటీలకు ఆ పని అప్పగించి వాటి రచనలను చర్చించి ఆమోదిస్తున్నాయి.

2. *బడ్జెట్ ఆమోదము:* ప్రజాస్వామ్యాలలో ప్రభుత్వ ఆదాయ వ్యయాలను నిర్దేశించే అధికారం ప్రజా ప్రతినిధిసభ అయిన శాసనసభకు మాత్రమే ఉంది. పన్నులు విధించడం, తగ్గించడం, హెచ్చించడం, రద్దుచేయడం దీనిపని. శాసనసభ ప్రతి సంవత్సరం ప్రభుత్వ ఆదాయ వ్యయాలను బడ్జెట్ రూపంలో ఆమోదిస్తుంది. పరిపాలనకు కావలసిన ధనాన్ని సమకూర్చడం, ఏ కార్యక్రమానికి ఎంతెంత ఖర్చు పెట్టవలెనో నిర్ణయించడం, తాను నిర్ణయించినట్లు ఆదాయ వ్యయాలు జరిగినాయా లేదా అనేది సమీక్షించడం దీని విధి. ఒక్క మాటలో చెప్పవలెనంటే శాసనసభ అనుమతిలేనిదే ప్రభుత్వం ఒక్క పైస కూడా ఖర్చుపెట్టలేదు. ప్రజలనుంచి పన్నులరూపంలో వసూలుచేయలేదు. పార్లమెంటరీ విధానంలో అధికారపక్షం శాసనసభలో బడ్జెట్‌ను ఆమోదింపజేయడంలో విఫలమైనా, బడ్జెట్‌లో కోత తీర్మానాలు (Cut motions) ఆమోదించబడినా మంత్రివర్గం తన పదవిని కోల్పోతుంది. అధ్యక్ష విధానంలో కార్యనిర్వాహక వర్గం కోరినన్ని నిధులు ఇవ్వకుండాగాని లేదా పూర్తిగా నిరాకరించడం ద్వారాకాని శాసనసభ దానిపై ఒత్తిడితెచ్చి దానిని అదుపులో ఉంచగలుగుతుంది.

3. *పాలక వర్గంమీద అజమాయిషీ:* దేశ పరిపాలనలో ఏరోజు కారోజు ఉత్పన్నమయ్యే సమస్యలను గురించి, వాటి పరిష్కారానికి ప్రభుత్వం తీసుకొంటున్న చర్యలనుగురించి శాసన సభ్యులు కార్యనిర్వాహకవర్గం నుంచి సమాచారం రాబట్టవచ్చు. ప్రశ్నోత్తరాల సమయం (Question hour) లోను, బిల్లులపై చర్చలు జరిగేటప్పుడు, మంత్రుల విధి నిర్వహణలోగల లోపాలను విమర్శించడానికి శాసన సభ్యులకు అవకాశముంటుంది. సభ్యుల విమర్శలకు భయపడి మంత్రులు తమ విధులు శ్రద్ధగా నిర్వహిస్తారు. వాయిదా తీర్మానాల ద్వారా (Adjournment motions) సభ్యులు సభా కార్యక్రమాలకు అంతరాయం కలిగించి దేశం ఎదుర్కొంటున్న ముఖ్యమైన సమస్యలను ప్రభుత్వం దృష్టికి తెచ్చి వాటిపై అది సత్వరం చర్య తీసుకొనేటట్లు ఒత్తిడి తేవచ్చు. అవసరమైతే ప్రభుత్వ వైఫల్యానికి సంజాయిషీ కోరవచ్చు. పార్లమెంటరీ విధానం అమలులో ఉన్న ఇండియా, బ్రిటన్‌వంటి దేశాలలో మంత్రివర్గాలు తీవ్రమైన లోపాలు చేస్తే అవిశ్వాస తీర్మానాన్ని (No confidence motion) ఆమోదించడం ద్వారా ప్రభుత్వాన్ని కూలదోయవచ్చు. అధికార పక్షానికి శాసనసభలో తగినంత మెజారిటీ ఉండటం వల్ల ప్రభుత్వం పడిపోయే ప్రమాదం నిజానికి లేకపోయినా కార్యనిర్వహణలో అశ్రద్ధ, అసమర్థత చూపే ఏ మంత్రీ ఎక్కువకాలం పదవిలో కొనసాగలేడు. సభ్యుల విమర్శలను వార్తాపత్రికలు, తదితర ప్రచార సాధనాలు బాహాటంగా ప్రకటిస్తాయి. అవి మంత్రివర్గాలపై అంకుశంమాదిరి పనిచేస్తాయి. అధ్యక్షపాలన అమలులో ఉన్న అమెరికాలో "సెనేట్" (Senate) కు కొన్ని అసాధారణమైన అధికారాలు ఉన్నాయి. ఆ దేశంలో సెనేట్ ఆమోదం లేనిదే కార్యనిర్వాహకవర్గం యుద్ధాన్ని ప్రకటించకూడదు. విదేశాలతో సంధి ఒప్పందాలు చేసుకోకూడదు. ఋణాలు మంజూరు చేయకూడదు. చివరకు కొన్ని ముఖ్యమైన పదవులలో అధ్యక్షుడుచేసే నియామకాలకు కూడా సెనేట్ ధృవీకరణ కావలె.

4. **న్యాయాధికారాలు:** అనేక దేశాలలో శాసనసభలు న్యాయపరమైన విధులను

కూడా నిర్వహిస్తున్నాయి. ఇంగ్లండ్‌లో ప్రభువుల సభ (House of lords) శాసనాలు చేయడమేకాక న్యాయపరిపాలన కూడా చేస్తున్నది. 'లార్డ్ ఛాన్సలర్' (Lord Chancellor) అధ్యక్షతన పనిచేసే తొమ్మిదిమంది న్యాయ ప్రభువులు (Law lords) బ్రిటన్‌కు అత్యున్నత న్యాయస్థానంగా పనిచేస్తారు. ఇండియా, అమెరికాలలో అధ్యక్షునిపైన, ఉపాధ్యక్షునిపైన వచ్చిన "మహాభియోగ తీర్మానాలను" (Impeachment motion) కేంద్ర శాసనసభ విచారణచేసి ఆమోదిస్తే వారు పదవీచ్యుతులవుతారు. ఇండియాలో ఉన్నత న్యాయస్థానాలలో పనిచేసే న్యాయమూర్తులపై వచ్చిన "అభిశంసన తీర్మానాలపై" (Censure motion) పార్లమెంటు విచారణ జరుపుతుంది. సుప్రీంకోర్టు, హైకోర్టులలో న్యాయమూర్తుల సంఖ్యను పెంచే అధికారం పార్లమెంట్‌కు మాత్రమే ఉంది. రష్యాలో న్యాయమూర్తులను ఐదు సంవత్సరాల కొకసారి సుప్రీం సోవియట్ ఎన్నుకొంటుంది. అంతేకాక ఆ దేశంలో న్యాయపరిపాలనను చక్కదిద్దే "ప్రొక్యురేటర్ జనరల్" (Procurator general)ను కూడా సుప్రీం సోవియట్ ఏడు సంవత్సరాల కొకసారి ఎన్నుకొంటుంది. తన చర్యలకు అతడు బాధ్యత వహించవలె. అమెరికాలో సెనేట్ సంఘాలకు విశేషమైన విచారణాధికార ముంది.

5. *ప్రజాభిప్రాయ వేదిక* : ఆధునిక ప్రజాస్వామ్యాలలో శాసనసభలలో జాతీయ అంతర్జాతీయ సమస్యలపై జరిగే రసవత్తరమైన చర్చలు, వాదోపవాదాలు దేశ ప్రజానీకంలో రాజకీయ చైతన్యాన్ని రేకెత్తిస్తాయి. తమ ప్రతినిధులు శాసన సభా ముఖంగా ప్రదర్శించే నైపుణ్యము, వాక్పటిమలను బట్టి ప్రజలు వారి శక్తి సామర్థ్యాలను అంచనా వేస్తారు. ప్రభుత్వ సామర్థ్యాన్ని తెలుసుకోవడానికి శాసనసభ గీటురాయి వంటిది. దేశం నలుమూలలనుంచి విచ్చేసిన ప్రతినిధులు తమ తమ ప్రాంతాలలో కార్యనిర్వాహకవర్గం ఏ యే సందర్భాలలో అధికార దుర్వినియోగానికి పాలుపడిందో బట్టబయలుచేసి దానిపై ప్రభుత్వం వెంటనే తగినచర్య తీసుకొనేటట్లు చేయగలరు (Call attention motion). ప్రభుత్వం చేపట్టిన విధానాల ప్రభావము ప్రజలపై ఏ విధంగా ఉన్నదీ గ్రహించడానికి కూడా శాసనసభలో జరిగే వాదోపవాదాలు ఉపయోగపడతాయి.

6. *రాజ్యాంగ సవరణ* : ప్రజాస్వామ్యాలన్నిటిలోను రాజ్యాంగాలను సవరించే అధికారం శాసనసభకు మాత్రమే ఉంటుంది. అదృఢ రాజ్యాంగం ఉన్న బ్రిటన్‌లో రాజ్యాంగ సవరణ, సాధారణ శాసనాల నిర్మాణము ఒకే విధంగా ఉంటాయి. ఇండియా, అమెరికా వంటి రాజ్యాలలో రాజ్యాంగ సవరణకు ప్రత్యేక విధానము ఉంది. కాలానుగుణంగా సమాజంలో వచ్చే మార్పులనుబట్టి ప్రజా ప్రతినిధి సభలైన శాసనసభలు తగిన రీతిలో రాజ్యాంగాన్ని సవరించి దేశపురోభివృద్ధికి తోడ్పడవలె. అయితే రాజ్యాంగాన్ని చీటికి మాటికి సవరిస్తే దాని పవిత్రత భగ్నం అవుతుంది. రాజ్యాంగంపై ప్రజలకు విశ్వాసం నశిస్తుంది.

7. *ఎన్నికల విధులు* : ఇండియాలో రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి ఎన్నికలలో శాసన సభ ఎన్నికల గణంగా (Electoral college) పనిచేస్తుంది. రష్యాలో పాలకవర్గంగా పనిచేసే అధ్యక్షమండలిని (Presidium) సుప్రీం సోవియట్ ఎన్నుకొంటుంది. దీనినిబట్టి కొన్ని దేశాలలో శాసనసభలకు ఎన్నికల విధులు ఉంటాయని తెలుస్తున్నది.

8. *సభా మర్యాదలు కాపాడటం* : ప్రజాస్వామ్యాలలో సార్వభౌమాధికారం ప్రజల

చేతులలో ఉంటుంది. అది శాసనసభ ద్వారా వ్యక్తం అవుతుంది కాబట్టి శాసనసభ ప్రభుత్వాంగాలలో అత్యున్నతమైనదని కొందరు భావిస్తారు. అటువంటి సభయొక్క గౌరవ ప్రతిపత్తులకు హాని కలిగించేటట్లు ఎవరూ వ్రాయకూడదు, మాట్లాడకూడదు. శాసనసభ్యుల హక్కులను, మర్యాదలను అది కాపాడుతుంది. వారు తమ చట్టపరమైన విధులు నిర్వహించడానికి ఎటువంటి అవరోధాలూ ఉండవు. ఒకవేళ ఎవరైనా ఆ విధంగా అవరోధం కల్పిస్తే అది సభా హక్కులను, మర్యాదను ఉల్లంఘించినట్లు అవుతుంది. అటువంటి వారిపై సభా హక్కుల ఉల్లంఘన తీర్మానం ప్రవేశపెట్టి నేరం రుజువైతే చర్య తీసుకోవచ్చు. వారు శాసన సభ్యులయితే వారి సభ్యత్వం రద్దు చేయవచ్చు.

ఈ అధికారాలన్నిటిని శాసన సభలు సద్వినియోగంచేసి, తన బాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తే ఈనాటి పరోక్ష ప్రజాస్వామ్యాలలో బాధ్యతాయుతమైన, సమర్థవంతమైన స్వపరిపాలన సాధ్యమవుతుంది. ప్రజాభీష్టాని కనుగుణంగా పరిపాలన తీర్చి దిద్దవచ్చు.

## శాసనసభ నిర్మాణము

### ఏక శాసనసభ-ద్వివిధ లేదా ద్వంద్వ శాసనసభ (Unicameral and Bicameral Legislature)

శాసన సభలను వాటి నిర్మాణ స్వభావాన్నిబట్టి రెండు రకాలుగా వర్గీకరించవచ్చు: 1. ఏక శాసనసభ (Unicameral Legislature) 2. ద్వివిధ (లేదా రెండు సభలున్న శాసనసభ (Bicameral legislature). ఆధునిక రాజ్యాలలో సాధారణంగా ద్వివిధ శాసనసభలే ఎక్కువ. బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా, సోవియెట్ యూనియన్, స్విట్జర్లండ్, ఇండియాలలో ద్వివిధ శాసనసభలు ఉన్నాయి. బంగ్లాదేశ్, చైనా, పోర్చుగల్, టర్కీ మొదలైన దేశాలలోను ఇండియాలో పంజాబ్, హర్యానా, రాజస్థాన్, గుజరాత్, అస్సామ్ మొదలైన రాష్ట్రాలలోను ఏకశాసనసభలు ఉన్నాయి. జాతీయ స్థాయిలో ఏకశాసన సభలు ఈ కాలంలో చాలా అరుదు.

### ద్వంద్వ శాసనసభ నిర్మాణము

ద్వంద్వ శాసనసభలో మొదటి సభను (First chamber) దిగువ సభ (Lower House) అని, రెండవ సభను (Second chamber) ఎగువ సభ (Upper House) అని పిలుస్తారు. ఏక శాసనసభా విధానం అమలులో ఉండేచోట మొదటిసభ మాత్రమే ఉంటుంది. రెండవసభ ఉండదు. ఈ సభలను ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క పేరుతో పిలుస్తారు. ఇండియాలో ఎగువ సభను రాజ్యసభ అని, దిగువ సభను లోక్‌సభ అని అంటారు. అమెరికాలో వీటిని సెనేట్, ప్రతినిధుల సభ అని, బ్రిటన్‌లో లార్డ్స్ సభ (ప్రభువుల సభ), కామన్స్ సభ (సామాన్యుల సభ) అని పిలుస్తారు.

ద్వివిధ శాసనసభలో సామాన్యంగా దిగువసభ ప్రజాప్రతినిధి సభగాను ఎగువసభ మేధావులు, భూస్వాములు, పెట్టుబడిదారుల సభగాను ఉంటుంది. అదే సమాఖ్యలో అయితే ఈ సభ రాష్ట్రాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది. శాసనసభలో సభ్యుల సంఖ్య ఎంత ఉండవలె అనే విషయంలో ఏకాభిప్రాయంలేదు. కొందరు తక్కువ సభ్యులుగల చిన్న శాసనసభలు

చక్కగా సామర్థ్యంతో పనిచేస్తాయని అంటే, మరికొందరు అధిక సంఖ్యలో సభ్యులుండే పెద్ద శాసనసభ లుంటే సమాజంలో అన్ని వర్గాలవారికీ వాటిలో సభ్యత్వ మివ్వవచ్చునని అంటారు. ఏమైనాగాని సభ్యత్వం మరీ ఎక్కువగాని మరీ తక్కువగాని ఉండకూడదు.

ద్వివిధ శాసన సభలో దిగువసభ సభ్యులను వయోజన ఓటింగ్ పద్ధతిలో ప్రజలు ప్రత్యక్షంగా ఎన్నుకొంటారు. కాబట్టి అది దేశ ప్రజానీకానికి ప్రాతినిధ్యం వహిస్తుంది, ఎగువ సభలోని స్థానాలను ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క విధంగా భర్తీ చేస్తారు. బ్రిటన్‌లో లార్డ్స్ సభలో సభ్యత్వం వారసత్వరీత్యా తండ్రినుంచి పెద్దకుమారునికి ఆస్థివలె సంక్రమిస్తుంది. ఈ సభలో దాదాపు 90% సభ్యులు ఇటువంటివారే. దీనిలో జమీందారులకు, మతాధిపతులకు, కులీనులకు జీవితకాల సభ్యత్వం (Life membership) ఉంటుంది. ఇది ప్రజాస్వామ్య విరుద్ధం కాబట్టిన క్రమేణా ఈ పద్ధతికి స్వస్తి చెబుతున్నారు.

కొన్ని చోట్ల ఎగువసభ సభ్యులను రాజ్యాధినేత నియమిస్తాడు. ఇండియాలో రాజ్య సభ సభ్యులలో 12 మందిని రాష్ట్రపతి సాహిత్యము, కళలు, సంఘసేవ, విజ్ఞాన రంగాలలో వారికిగల ప్రావీణ్యాన్ని ఆధారంగా తీసుకొని నియమిస్తాడు. రాష్ట్ర శాసన సభలలోని ఎగువ సభలో 1/6 వంతు సభ్యులు ఈ కోవకు చెందినవారే. వారిని గవర్నర్ నియమిస్తాడు.

ఇండియాలో రాజ్యసభలో ఉండే మిగిలిన సభ్యులను రాష్ట్ర విధానసభలు రాష్ట్రాల వారీగా తమకు కేటాయించిన కోటా ప్రకారం ఎన్నుకొంటాయి. అంటే వీరి ఎంపిక పరోక్ష ఎన్నిక ద్వారా జరిగినట్లు చెప్పవచ్చు.

అమెరికాలో సెనేట్ సభ్యులను ఆయా రాష్ట్రాల ప్రజలు ప్రత్యక్షంగా ఎన్నుకొంటారు. ప్రతి రాష్ట్రం ఇద్దరు సభ్యులవంతున వారిని ఎన్నుకొంటుంది.

నార్వేలో ఎగువసభ సభ్యులను దిగువసభ ఎన్నుకొనే విధానం అమలులో ఉంది. మనదేశంలో రాష్ట్రాలలో 1/3 వంతు ఎమ్. ఎల్. సి. లను ఆ రాష్ట్ర విధానసభలోని ఎమ్. ఎల్. ఏ. లు ఎన్నుకొంటారు.

## ద్వివిధ శాసన సభా విధానానికి అనుకూల వాదాలు లేదా ఏక శాసన సభా విధానంలో లోపాలు

1. *ఎగువసభ దిగువసభ యొక్క నియంతృత్వ పోకడలను అరికడుతుంది* : ఒకే సభ ఉంటే అవిభాజ్యాధికారం వల్ల ఆ సభ మొండిపట్టుతో ప్రవర్తిస్తుంది. దానిలోని సభ్యులు ప్రజలచే ప్రత్యక్షంగా ఎన్నుకోబడినవారుకావడం వల్ల తమకు తిరుగులేని అధికారం ఉందనే అహంతో పనిచేయడంవల్ల వారిలో నిదానం, విచక్షణా జ్ఞానం కరువవుతాయి. వారి తొందరపాటును అదుపులో పెట్టడానికి, వారి పనులను పరిశీలించి విమర్శించడానికి ద్వంద శాసనసభ ఉండటం మంచిది. ద్వంద్వ శాసనసభ ఉంటే, శాసన నిర్మాణం నిదానంగా ఎటువంటి నియంతృత్వ ధోరణి లేకుండా జరుగుతుంది.

2. *తీవ్రవాద శాసనాల నివారణ* : ఏకశాసనసభ ఉంటే సామాన్యంగా దానిలోని సభ్యులు అతివాద, తీవ్రవాద ధోరణి కలవారై ఉంటారు. వారు ప్రజలచే ప్రత్యక్షంగా ఎన్నుకోబడినవారు. వారు ఎన్నికల సమయంలో ప్రజలను సంతృప్తి పరచడానికి ముందూవెనక చూడకుండా వాగ్దానాలు చేసేస్తారు. పదవిలోకి రాగానే వాటిని అమలుపరచ

వలెనని చూస్తారు. దూరదృష్టి లేకుండా తమ వాగ్దానాలు నెరవేర్చడానికి వారు ప్రవేశ పెట్టే శాసనాలు నిజంగా అమలుపరిస్తే అనేక చిక్కులు వస్తాయి. ఎగువసభ ఉంటే అటువంటి శాసనాలు అమలులోకి రాకుండా నివారించడానికి వీలవుతుంది. ఎగువసభ సభ్యులు ప్రత్యక్షంగా ఎన్నుకోబడినవారు కానప్పుడు వారికి నెరవేర్చవలసిన వాగ్దానాలేవీ ఉండవు. కాబట్టి వారు జాతీయ ప్రయోజనాలను దృష్టిలోపెట్టుకొని శాసన నిర్మాణానికి పూనుకొంటారు. దీనివల్ల ఏదో ఆవేశానికిలోనై శాసనాలు చేసే ప్రమాదంఉండదు.

3. *లోపరహితమైన శాసననిర్మాణానికి తోడ్పడుతుంది* : శాసనాలను ఒకే సభ రూపొందించే కంటే రెండు సభలూ కలిసి రూపొందించడం మంచిది. వాటిలో ఏవైనా లోపాలుంటే ఒక సభ లోపాలను మరొకసభ సరదిద్దవచ్చు. అంతేకాక శాసనాలలో ఉపయోగించవలసిన భాష, పదజాలము ప్రత్యేకమైనవి. వాటిని జాగ్రత్తగా రూపొందించవలె. లేకపోతే న్యాయస్థానాలు వాటికి అర్థవివరణ చెప్పేటప్పుడు విపరీతార్థాలు స్ఫురించే ప్రమాదముంది. కాబట్టి ఎటువంటి లోపాలు లేకుండా శాసన నిర్మాణం జరగవలెనంటే ద్వంద్వ శాసనసభ ఉండటమే మంచిది. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకొనే అనేక దేశాలు ఎగువసభ నిర్మాణంలో ప్రత్యేకమైన శ్రద్ధ చూపుతున్నాయి. దానిలో సభ్యత్వానికి దిగువసభ కంటె ఎక్కువ వయో పరిమితిని నిర్ణయిస్తున్నాయి. ఇండియాలో రాజ్యసభను శాశ్వత సభగా తీర్చి దిద్దినారు. లోక్‌సభ సభ్యులు ఐదు సంవత్సరాలు మాత్రమే ఉంటే రాజ్యసభ సభ్యులు ఆరు సంవత్సరాలు పదవిలో ఉంటారు. వారికి మధ్యంతర ఎన్నికల భయం కూడా ఉండదు. అమెరికాలో సెనేట్ పదవీకాలం ఆరు సంవత్సరాలు. ప్రతినిధుల సభకు రెండు సంవత్సరాలకొకసారి ఎన్నికలు జరుగుతాయి బ్రిటన్ లార్డ్స్ సభలో జీవితకాలానికి సభ్యత్వం లభిస్తుంది. భారతదేశంలో ఎగువసభను ఎల్లప్పుడూ కొత్తసభ్యులతోపాటు అనుభవజ్ఞులైన పాత సభ్యులు కూడా ఉండేందుకు వీలుగా నిర్మించినారు అందులో వుండే సభ్యులు పరోక్షంగా ఎన్నుకోబడతారు. వీటన్నిటివల్ల వారు దిగువసభ సభ్యులకంటె నిదానంగా జాగ్రత్తగా బిల్లును పరిశీలించగలరు. ఆ సభలో ఉండే పరిమితమైన సభ్యత్వం కూడా దీనికి అన్ని విధాల తోడ్పడుతుంది. అదే ఏక శాసనసభ ఉంటే ఈ ప్రయోజనాలు పొందేందుకు వీలుండదు.

4. *శాసనసభలో అన్ని వర్గాలవారికి ప్రాతినిధ్యం ఇవ్వవచ్చు* : ద్వంద్వ శాసనసభ ఉంటే అందులో ఒక సభలో జనసామాన్యానికి ప్రాతినిధ్యం ఇస్తే, రెండవ సభలో మైనారిటీ వర్గాలకు, కుటిల రాజకీయాలకు భయపడి ఎన్నికలకు దూరంగా ఉండే శాస్త్రజ్ఞులు, మేధావులు, విద్యావేత్తలు, కళాకారులు మొదలైనవారికి సభ్యత్వం ఇవ్వవచ్చు శాసన నిర్మాణంలో వారి తెలివితేటలను ఉపయోగించుకొనడానికి వీలవుతుంది. అటువంటి వారికి శాసనసభలో సభ్యత్వమివ్వడమంటే జాతి తనను తాను గౌరవించుకోవడమే. ద్వంద్వ శాసన సభ ఉన్నప్పుడే ఇది సాధ్యమవుతుంది. భారతదేశంలో ఇటువంటి మేధావులకు రాష్ట్రపతి నామినేషన్ ద్వారా సభ్యత్వం కల్పిస్తాడు. దేశానికి ఎనలేని సేవచేసిన అనేకమంది ప్రముఖులకు బ్రిటన్‌లో లార్డ్స్ సభలో గౌరవ సభ్యత్వం కల్పించబడింది. జాగ్రత్తగా పరిశీలిస్తే బ్రిటన్‌లో ఎగువసభ ధనికవర్గానికి, దిగువసభ జనసామాన్యానికి ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు కనిపిస్తుంది.

ద్వంద్వ శాసన సభలో ఒక సభ వయోజన ఓటింగ్ ప్రకారం భౌగోళిక ప్రాతిపదికపై నిర్మించి, రెండవ సభను వృత్తి ప్రాతినిధ్యం ప్రకారం నిర్మిస్తే శాసన సభలో సమాజంలో ఉండే అన్ని వర్గాలకు ప్రాతినిధ్యం ఇవ్వవచ్చు. మనదేశంలో రాష్ట్ర శాసన సభలోని విధాన పరిషత్తు (Legislative Council) నిర్మాణంలో ఈ సూత్రమే పాటించినారు. దీనిలో పట్టభద్రులకు, ఉపాధ్యాయులకు, వాణిజ్య ప్రముఖులకు సభ్యత్వం కల్పించినారు. ఆస్ట్రేలియాలోని విక్టోరియా రాష్ట్రంలో ఎగువసభ ధనికవర్గాలకు, దిగువసభ శ్రామికులకు ప్రాతినిధ్యం వహించేటట్లు నిర్మించినారు. శాసన సభలు అన్ని వర్గాలకు ప్రాతినిధ్యం వహించేటట్లు నిర్మిస్తేనే ప్రజాస్వామ్యం విజయవంతమవుతుంది.

5. *ప్రజాభిప్రాయంలో ఎప్పటికప్పుడు వచ్చే మార్పులు తెలుసుకోవచ్చు* : ఒకే సభ ఉంటే దానికి నిర్ణీతకాలంలో ఎన్నికలు జరుగుతాయి. ఏ కారణంగానైనా కొన్ని స్థానాలకు ఉప ఎన్నికలు వస్తే తప్ప మధ్యలో ప్రజాభిప్రాయంలో వచ్చే మార్పులు తెలుసుకొనేందుకు వీలుకాదు. ద్వంద్వ శాసనసభ ఉంటే రెండు సభలకు వేరువేరు కాలాలలో ఎన్నికలు జరిపించ వచ్చు. అంతేకాక ఎగువసభలో ఉండే అన్ని స్థానాలకు ఒకేమారు ఎన్నికలు నిర్వహించ కుండా కొన్ని స్థానాలకు ఒక పర్యాయం మరికొన్నిటికి మరొక పర్యాయం ఎన్నికలు జరిపిస్తే ఎప్పటికప్పుడు అధికారంలో ఉన్న ప్రభుత్వ విధానాలపై ప్రజాభిప్రాయం ఎట్లా ఉన్నదీ గ్రహించవచ్చు.

6. *శాసనాలపై ప్రజాభీష్టాన్ని గ్రహించవచ్చు* : ఒకే సభ ఉంటే శాసన నిర్మాణ వేగం పెరుగుతుంది. ప్రభుత్వం చేపట్టే ప్రతి శాసనం గురించి ప్రజలు ముందుగా తెలుసు కొనే అవకాశంఉండదు. సభలో బిల్లు ప్రవేశ పెట్టి దానిపై వివిధ దశలలో చర్చ ప్రారంభ మయినాక, వివిధ రాజకీయ పక్షాలు ఆ బిల్లుపై తెలిపే అభిప్రాయాలు ప్రజల దృష్టికి వస్తాయి. అప్పుడుగాని ప్రజలు ఆ యా బిల్లులయొక్క లాభనష్టాలను గురించి ఆలోచించరు. ఒకే సభ ఉంటే బిల్లుకు తగిన ప్రచారం లభించి ప్రజలు దానిపై తమ అభిప్రాయం వెలిబుచ్చే లోగా, అది శాసనమయి పోతుంది. ఇక అప్పుడు దాని మార్పులు చేయడం కష్టము. అదే రెండు సభలుంటే బిల్లుపై ఒక సభ తన ఆమోదముద్ర వేసేటప్పటికి, బిల్లుకు అను కూలంగానో ప్రతికూలంగానో ప్రజాభిప్రాయం వ్యక్తమవుతుంది. ప్రజలు ఆ బిల్లుకు తమ తీవ్ర నిరసన తెలియజేస్తే దాని ప్రభావం రెండవ సభలో ఉంటుంది. రెండవసభ దానిని తిరస్కరించడం ద్వారా ప్రజాభీష్టాన్ని శాసనసభ మన్నించినట్లవుతుంది. కాబట్టి ద్వంద్వ శాసనసభా విధానం శాసన నిర్మాణవేగాన్ని తగ్గించడం ద్వారా పార్లమెంట్ చేపట్టే బిల్లులపై ప్రజాభీష్టం ఎట్లా ఉన్నదీ ప్రతినిధులు గ్రహించడానికి కావలసిన కాలవ్యవధినిస్తుంది.

7. *విధుల వంపిణీ* : నేడు ప్రభుత్వం నిర్వహించవలసిన విధుల సంఖ్య పెరుగు తుండటం వల్ల శాసనసభ రూపొందించవలసిన శాసనాల సంఖ్య కూడా నానాటికీ పెరుగు తున్నది. మొత్తం శాసన నిర్మాణ భారాన్నంతా ఒకే సభ మోయడం కష్టము. దానికి తగినంత సమయం కూడా ఉండదు. ద్వంద్వ శాసనసభ ఉంటే కొన్ని బిల్లులు ఒక సభలోను మరికొన్ని బిల్లులను మరొక సభలో ప్రవేశపెట్టి ఏకకాలంలో రెండింటిపైనా సమగ్రమైన చర్చ జరిపించవచ్చు. పైగా ఒక సభ ఒక బిల్లును సమగ్రంగా చర్చించి ఉంటే రెండవ సభ దానిని తొందరగా పరిశీలించి, తుదిమెరుగులు దిద్ది, చిన్న చిన్న లోపాలేమైనా ఉంటే

సరిదిద్ది, అవసరమైతే సవరించి ఆమోదించవచ్చు. ఆ విధంగా చేయడంవల్ల శాసన నిర్మాణ భారాన్ని రెండు సభలు పంచుకోవడానికి త్వరితగతిని పరిపాలనకు కావలసిన శాసనాలను రూపొందించడానికి వీలవుతుంది.

8. *సమాఖ్య రాజ్యానికి అవసరము* : సమాఖ్య రాజ్యంలో సమాఖ్య ప్రభుత్వం (Federal Government) రాష్ట్ర ప్రభుత్వాలయొక్క ప్రత్యేక ప్రతిపత్తిని కాపాడటానికి ద్వంద్వ శాసనసభా విధానం లాభిస్తుంది. ప్రత్యేకంగా సమాఖ్యలో రాష్ట్ర ప్రభుత్వాలు తమ ప్రత్యేకతను కాపాడుకోవలెనని చూస్తాయి. అటువంటప్పుడు సమాఖ్య శాసన సభలో రెండు సభలు ఉంటే ఎగువ సభలో రాష్ట్ర ప్రభుత్వాలకు దిగువ సభలో మొత్తం దేశ ప్రజానీకానికి ప్రాతినిధ్యం కల్పించవచ్చు. ఉదాహరణకు ఇండియాలో రాజ్య సభలో రాష్ట్రాలకు సభ్యత్వం కల్పించబడింది. అమెరికాలో 50 రాష్ట్రాలు ఉన్నాయి. ఒక్కొక్క రాష్ట్రం ఇద్దరు సభ్యులవంతున సెనెట్‌కు ఎన్నుకొంటుంది. ఆ ప్రకారం 50 రాష్ట్రాలకు 100 మంది సభ్యులు ఎగువ సభలో ఉంటారు.

9. *చారిత్రకానుభవం* : చారిత్రకంగా చూసినా ఏకశాసనసభా విధానంకంటే ద్వివిధ శాసనసభా విధానానికే ఎక్కువ ప్రాముఖ్యమున్నట్లు కనిపిస్తుంది. ఒకప్పుడు బ్రిటన్, అమెరికా, ఫ్రాన్స్, ఇటలీ మెక్సికో మొదలైన దేశాలలో ద్వంద్వ శాసన సభలకు బదులు ఏక శాసన సభలు నెలకొల్పవలెనని ప్రయత్నాలు జరిగాయి. అయితే అవి విజయవంతం కాలేదు. చివరకు ఏక శాసనసభకంటే ద్వంద్వ శాసనసభే మేలు అనే నిర్ణయానికి అవి రాక తప్ప లేదు. ఎన్నికలలో ఓడిపోయిన ముఖ్యమైన నాయకులకు శాసన సభలో ప్రవేశం కల్పించడానికి ఎగువ సభలను దొడ్డిదారిగా నేడు రాజకీయ పక్షాలు వినియోగించుకొంటున్నాయి. ఈ రాజకీయ స్వప్రయోజనం కూడా కొంతవరకు ఎగువ సభలను రద్దుచేయడానికి ప్రతిబంధకమవుతున్నది. కొన్ని చోట్ల రాష్ట్ర స్థాయిలో ఏక శాసన సభలు ఉన్నా కేంద్రంలో మాత్రం దాదాపు అన్ని రాజ్యాలలోను ద్వంద్వ శాసన సభలే ఉన్నాయి.

## ఏక శాసన సభకు అనుకూలవాదాలు లేదా ద్వివిధ శాసనసభ సభలో లోపాలు

ద్వంద్వ శాసనసభా విధానంలో కొన్ని ప్రయోజనాలున్నా లోపాలు కూడా లేకపోలేదు. ఏక శాసనసభా విధానాన్ని సమర్థించేవారు ఈ కింది కారణాలుగా ద్వంద్వ శాసనసభ కంటె ఏక శాసనసభే మేలంటారు.

1. *ప్రజాభిప్రాయంలోను బాధ్యతలోను చీలికలు* : అబిసైయస్ (Abbi Sieyes) అనే ఫ్రెంచ్ రచయిత చెప్పినట్లు "ప్రజాభీష్టమే చట్టము. ప్రజలకు ఒకే విషయంపై ఒకే సమయంలో రెండు రకాల అభిప్రాయాలు ఉండవు. కాబట్టి ప్రజాభీష్టాన్ని ప్రతిబింబించే శాసనసభ కూడా ఒకటిగానే ఉండవలె". ఒకే సభ ఉంటే శాసన నిర్మాణంలో ఏకత్వముంటుంది. రెండు మూడు సభలుంటే సార్వభౌమాధికారం రెండు మూడు భాగాలుగా చీలిపోవడమే కదా! అప్పుడు సార్వభౌమాధికారం అవిభాజ్యము (Sovereignty is indivisible) అనే దానికి అర్థంఉండదు. అయినా ప్రజాభీష్టాన్ని వ్యక్తం చేయడానికి ఒక్క సభ సరిపోతుంది. రెండు సభలుండి వాటిలో ఒకటి అవునని మరొకటి కాదని అంటే ప్రజాభీష్టంలో చీలికలు వచ్చినట్లే. ఒకే సభ ఉంటే శాసన నిర్మాణానికంతటికీ ఆ సభే బాధ్యత

వహిస్తుంది. రెండు సభ లుంటే బాధ్యతలు ఒకదాని మీదకు మరొకటి నెట్టివేస్తాయి. జరిగిన అనర్థానికి ఏ ఒక్క సభా సమాధానం చెప్పదు. అదీకాక ఒక రచయిత చెప్పినట్లు రెండు సభలు ఉండి దానిలో "దిగువసభ ఎగువసభతో ఏకీభవిస్తే ఆ సభ ఉనికి వృధా అవుతుంది. వ్యతిరేకిస్తే తుంటరితనమవుతుంది."

2. *శాసన నిర్మాణంలో అనవసరమైన కాలహరణము:* ద్వివిధ శాసనసభవల్ల శాసన నిర్మాణంలో ఆలస్యం పెరుగుతుంది. బిల్లు చట్టంగా మారడానికి ఒక్కొక్క సభలోను కనీసం మూడు పర్యాయాలైనా దానిని చదివి ఆమోదించవలె. అందునా ఒక సభ ఆమోదించిన దానిని రెండవ సభ తిరస్కరిస్తే సంయుక్త సమావేశాలలో దానిపై నిర్ణయం తీసుకోవలె. ఏక శాసనసభ అయితే త్వరితగతిని శాసన నిర్మాణం చేయడానికి వీలవుతుంది. కీలకమైన శాసనాల విషయంలో కాలహరణం మంచిది కాదు.

3. *శాసన నిర్మాణంలో అశ్రద్ధ:* ద్వంద్వ శాసనసభ ఉంటే శాసనాలు లోపరహితంగా ఉంటాయనే వాదంలో పసలేదని కొందరంటారు. రెండు సభలు ఉండటంవల్ల ఎగువ సభ చూసుకొంటుందని దిగువసభ, దిగువసభ చూసుకొంటుందని ఎగువసభ దేనికదే శాసన నిర్మాణంలో అలక్ష్యం చేస్తే ఇక ఆ శాసనాల స్వరూప స్వభావాలు ఎట్లా ఉంటాయో చెప్ప నక్కరలేదు. రెండు సభలలోను ఒకే పార్టీకి మెజారిటీ ఉంటే ఈ అజాగ్రత్త, అశ్రద్ధ మరింత పెరుగుతుంది. ద్వంద్వ శాసనసభవల్ల శాసనాలపై ప్రజాభీష్టం తెలుసుకోవడానికి సమయం దొరుకుతుందనే వాదంలో కూడా బలంలేదు. సామాన్యంగా బిల్లు ఒక సభ ఆమోదం పొందవలెనంటే ఆ బిల్లు ఆ సభలో అనేక దశలు దాటవలె. ఆ సమయంలో ఆ బిల్లుపై ప్రజాభీష్టం వ్యక్తం చేయవచ్చు. దీనికోసం రెండు సభ లుండనక్కరలేదు. అదీకాక శాసనసభ ఆమోదించినంత మాత్రాన బిల్లు చట్టం కాదు. దానికి అధ్యక్షుని ఆమోదముద్ర పడవలె. అతని దృష్టిలో ఆ బిల్లులో లోపాలుంటే దానిని అతడు పునఃపరిశీలనకు త్రిప్పి పంపవచ్చు లేదా వీటో. చేయవచ్చు కాబట్టి ద్వంద్వ శాసనసభవల్ల లోపరహితమైన శాసన నిర్మాణం జరిపించ వచ్చుననడం అర్థరహితము.

4. *ఏక శాసన సభ నియంతృత్వాన్ని ద్వంద్వ శాసనసభ ఆపలేదు:* అనేక దేశాలలో ఎగువసభకంటె దిగువసభకే ఎక్కువ అధికారాలున్నాయి. దిగువ సభలు ప్రజాప్రతినిధి సభలుకావడంవల్ల వాటికే ఎక్కువ అధికారాలుంటాయి. బ్రిటన్‌వంటి దేశాలలో ముఖ్యమైన బిల్లులపై చర్చజరిగే సందర్భాలలో కూడా లార్డ్స్ సభలో అరవై డెబ్బైమంది మించి సభ్యులు హాజరుకారు. ప్రస్తుతం ఉభయసభలు రాజకీయ పక్షాల అదుపులో ఉంటున్నాయి. ఓటింగ్, పార్టీ ప్రాతిపదికపై జరుగుతుంది. అటువంటప్పుడు ఒక సభను రెండవ సభ అదుపులో పెట్టడం అనే ప్రశ్న ఉదయించదు.

5. *ద్వివిధ శాసనసభ అభివృద్ధివిరోధకము-శాసన నిర్మాణంలో ప్రతిష్టంభన తెస్తుంది:* దిగువసభ ప్రజాభీష్టం ప్రకారం శాసనాలు చేస్తుంది. అది తన చర్యలకు ప్రజలకు బాధ్యత వహిస్తుంది. కొన్ని దేశాలలో ఎగువసభ సభ్యులను ప్రజలు ఎన్నుకోరు కాబట్టి వారికి ప్రజల బాధ్యత వహించవలసిన అవసరం లేదు. ఎగువసభ సభ్యులు దిగువ సభ సభ్యులకంటె వయసులో పెద్దవారు కాబట్టి వారిలో పాతకాలపు ఛాందసాలు విరివిగా ఉంటాయి. సాధారణంగా అనేక దేశాలలో ఎగువసభలు సాంప్రదాయిక పంథాలో పనిచేస్తు

న్నాయి. దిగువసభలో యువకులు ఉంటారు. వారిలో ప్రగతి భావాలు ఉంటాయి. వారు రూపొందించే ప్రగతిశీలక శాసనాలన్నిటినీ ఎగువసభ వ్యతిరేకించి అభివృద్ధినిరోధకంగా తయారవుతుంది. దీనివల్ల సమాజ ప్రగతి కుంటుపడటమేకాక శాసననిర్మాణంలో ప్రతిష్టంభన ఏర్పడుతుంది. ఉదాహరణకు ఇండియాలో రాజభరణాల రద్దు, బ్యాంక్‌ల జాతీయాకరణ వంటి బిల్లులు దిగువసభలో ఆమోదించబడినా ఎగువసభ ఆమోదం పొందడంలో చిక్కులు ఎదుర్కొన్నాయి.

6. *ద్వివిధ శాసనసభల వ్యయం అధికము* : ఏకశాసనసభా విధానంకంటె ద్వివిధ శాసనసభకు ఖర్చు అధికము. శాసనసభ్యుల సంఖ్య పెరిగినకొద్దీ వారికిచ్చే వేతనాలకు, ఇతర సౌకర్యాలకు ఎంతో ధనం వెచ్చించవలసి వస్తుంది. ఇది పన్ను చెల్లించే ప్రజలపై అదనపు భారాన్ని మోపుతుంది. ద్వివిధ శాసనసభ వల్ల కాలం, ధనం, శక్తి వృధా అవుతాయి కాబట్టి పేద దేశాలకు ఈ పద్ధతికంటె ఏకశాసన సభా విధానమే మేలు.

7. *ద్వంద్వ శాసనసభ నిర్మాణము కష్టము* : ఒకే సభ ఉంటే దానిలోని సభ్యులను ప్రజలు ప్రత్యక్షంగా వయోజన ఓటింగ్ ద్వారా ఎన్నుకొంటారు. రెండు సభలుంటే రెండో సభ నిర్మాణం ఏ ప్రాతిపదికపై జరగవలె అనేది నిర్ణయించడం కష్టము. ఎన్ని జాగ్రత్తలు తీసుకొన్నా సమాజంలో ఉండే అన్ని వర్గాలకు శాసన సభలో సభ్యత్వం కల్పించడం అసాధ్యము. సభ్యత్వం లభించని వర్గాలు అసంతృప్తి చెందుతాయి. ఇంగ్లండ్‌లో మాదిరి వారసత్వం ద్వారా ఎగువసభను నింపుదామంటే అది ప్రజాస్వామ్య విరుద్ధము అవుతుంది. అమెరికాలో వలె ఎగువసభ సభ్యులను కూడా ప్రజలనే ఎన్నుకోనిస్తే రెండు సభలకు వ్యత్యాసం లేకుండా పోతుంది. అప్పుడు ఎగువసభ నిజానికి అనవసరం అనిపిస్తుంది. కెనడాలో ఎగువసభ సభ్యులను గవర్నర్ జనరల్ నియమిస్తాడు. ఆ పద్ధతి అనుసరిస్తే అది పక్షపాతానికి తావిస్తుంది. ఎట్లా చూసినా ఎగువసభ నిర్మాణం క్లిష్టంగానే కనిపిస్తుంది.

భారత రాజ్యాంగ నిర్మాతలు వీటన్నిటిని దృష్టిలోపెట్టుకొని రాజ్యసభలో నియామకం ద్వారా వచ్చిన వారికి రాష్ట్ర శాసన సభ్యులు పరోక్ష ప్రాతిపదికపై ఎన్నుకొన్న వారికి రాజ్యసభలో సభ్యత్వం లభించే ఏర్పాట్లు చేసినారు. రాష్ట్ర స్థాయిలో ఏక శాసనసభ కావలెనా లేకపోతే ద్వంద్వ శాసనసభ కావలెనా అనే విషయాన్ని ఆయా రాష్ట్రాలు స్వయంగా నిర్ణయించుకోవచ్చు. ఏక శాసనసభ అయినా ద్వంద్వ శాసనసభ అయినా వాటి సమావేశాలు నిర్వహించడానికి రెండింటికి విడివిడిగా అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు ఉంటారు. ఆయా సభల సభ్యులే సాధారణంగా వారిని ఎన్నుకొంటారు. వారి విధులు ప్రతిష్ఠాకరమైనవి. వారు సమావేశాలు హుందాగా జరిపించవలె. వారు ఏ పార్టీకి చెందకుండా తటస్థంగా ఉండటం మంచి సంప్రదాయము. సమావేశాలు నిష్పక్షపాతంగా నిర్వహించడానికి అది అవసరము. ఎగువసభ అధ్యక్షుని చైర్మన్ అని దిగువసభ అధ్యక్షుని స్పీకర్ లేదా సభాపతి అని వ్యవహరిస్తారు.

## శాసన ప్రక్రియ (Process of Legislation)

శాసనసభ శాసనాలను ఏ విధంగా రూపొందిస్తుంది అనే విషయాన్ని ఇక్కడ ముచ్చటిద్దాము. ఒక బిల్లు శాసనంగా మారడానికి ముందు ఎన్నో దశలు ఉంటాయి. బిల్లులు కూడా పబ్లిక్ బిల్లులు (Public Bills), ప్రైవేట్ బిల్లులు (Private Bills) అని రెండు రకాలు.

ఉంటాయి. ప్రభుత్వం ప్రతిపాదించే బిల్లులను అధికారబిల్లు (Official Bill) లేదా పబ్లిక్ బిల్లు అంటారు ఇతర సభ్యులు ప్రవేశపెట్టే బిల్లులను అనధికార లేదా ప్రైవేట్ బిల్లు అంటారు. అది ఏటువంటి బిల్లయినా దానిని ప్రవేశపెట్టే వారే ఆ బిల్లుకు సారథ్యం వహించి వివిధ దశలలో దానిని సభలో నడిపించవలె. సాధారణంగా బిల్లు చట్టంగా మారేలోగా అది ఏడు దశలను దాటవలసి ఉంటుంది.

1. *బిల్లు ప్రవేశ పెట్టడం* : ఇది మొదటి దశ. బిల్లు ముసాయిదా (Draft) సిద్ధంచేసి మంత్రిగాని, ప్రైవేట్ సభ్యుడుగాని దానిని ప్రవేశపెట్టడానికి సభవారి అనుమతి కోరతాడు. అధిక సంఖ్యాకుల మద్దతు లభిస్తే బిల్లు ప్రవేశపెట్టినట్లవుతుంది.

2. *ప్రథమ పఠనము (First Reading)* : రెండో దశలో సభాధ్యక్షుని అనుమతితో బిల్లు శీర్షిక, ఉద్దేశము, బిల్లుకు సంబంధించిన వివరాలు స్థూలంగా చదివి సభ్యులకు వినిపిస్తారు. ఈ ఘట్టంలో సవరణలను ప్రతిపాదించకూడదు. వెంటనేగాని లేదా సభవారు నిర్ణయించిన మరొక రోజునగాని దానిపై చర్చ జరుపుతారు.

3. *ద్వితీయ పఠనం* : మొదటి పఠనం అవగానే బిల్లు అచ్చు కాపీలు సభ్యులందరికీ పంచుతారు. అప్పుడు బిల్లు ప్రతిపాదించిన సభ్యుడు లేచి "బిల్లుని రెండవసారి చదువుదాము" అని ప్రతిపాదిస్తాడు. ఆయన బిల్లులోని ముఖ్యాంశాలను వివరిస్తాడు. ఈ దశలోనే బిల్లుపై క్లాజులవారీగా చర్చ జరుపుతారు. సవరణలు ప్రతిపాదిస్తారు. వాటిపై ఓటింగ్ జరిపి మెజారిటీ నిర్ణయం ప్రకారం బిల్లులో చేర్చడంగాని, తొలగించడంగాని చేస్తారు.

4. *కమిటీదశ* : రెండవ పఠనం తరవాత బిల్లును గురించి మరింత విపులంగా చర్చించడానికి దానిని స్టాండింగ్ కమిటీ (Standing Committee- శాశ్వత కమిటీ)కి పంపుతారు. బిల్లు వివాద గ్రస్తమైనదయినా, లేదా ముఖ్యమైనదయినా మొత్తం సభ కమిటీగా ఏర్పడి (Commitiee of the whole House) గాని, సెలక్ట్ కమిటీ (Select Committee)గా ఏర్పడిగాని చర్చిస్తుంది. దానిలోని సభ్యులను శాసన సభ్యులంతా కలిసి ఎన్నుకొంటారు. అధ్యక్షుని సభాపతి నియమిస్తాడు.

5. *నివేదిక* : కమిటీ బిల్లును పరిశీలించి నివేదికను సభకు సమర్పిస్తుంది. దానిలో బిల్లు తుదిరూపం కనిపిస్తుంది. అవసరమైతే ఈ దశలో కూడా బిల్లుపై సంక్షిప్తంగా చర్చ జరపవచ్చు.

6. *తృతీయ పఠనము* : నివేదికా ఘట్టం తరవాత బిల్లు తృతీయ పఠన దశకు చేరుకొంటుంది. ఈ దశలో బిల్లును మొత్తం మీద చర్చించి ఆమోదించడమో తిరస్కరించడమో ఓటింగ్ ద్వారా నిశ్చయిస్తారు. అప్పుడు బిల్లు రెండవసభకు వెడుతుంది. అక్కడ కూడా బిల్లు ఈ ఘట్టాలన్నీ అధిగమించినట్లయితే బిల్లుకు శాసనసభ ఆమోదం లభించినట్లవుతుంది.

7. *రాజ్యాధిపతి ఆమోదము* : శాసనసభ ఆమోదం పొందిన బిల్లును రాజ్యాధిపతి ఆమోదానికి పంపుతారు. అతని ఆమోదముద్ర పడగానే బిల్లు శాసనంగా మారుతుంది. దానిని అమలుపరచడం కార్యనిర్వాహకవర్గం విధి.

బిల్లును ఒక సభ ఆమోదించి మరొక సభ తిరస్కరిస్తే అనుసరించవలసిన పద్ధతులు ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క విధంగా ఉన్నాయి. ఇది ఆర్థిక బిల్లులకు (Money Bills) ఒక రకంగాను సాధారణ బిల్లులకు (Ordinary Bills) మరొక రకంగాను ఉండటం సహ

జము. బ్రిటన్‌లో ముసాయిదా రూపంలో ఉండే బిల్లును 'శ్వేతపత్రము' (White paper) అని పిలవడం సంప్రదాయము.

## కమిటీ పద్ధతి (Committee System)

నేడు శాసన సభలు తమ విధులను ఎక్కువ భాగం కమిటీలద్వారా నిర్వహిస్తున్నాయి. ఈ కమిటీ పద్ధతి మొదట 1882 లో బ్రిటన్‌లో ప్రారంభమయింది. శాసనసభ విధులు పెరగడం, సభ్యుల సంఖ్య ఎక్కువ కావడం, శాసనాలు సాంకేతిక పరం కావడంవలన ప్రతి బిల్లును సభ్యులంతా కలిసి చర్చించడానికి వీలుకాదు. కాబట్టి కొద్దిమంది నిపుణులైన సభ్యులు ఒక కమిటీగా ఏర్పడి బిల్లును చర్చించి నివేదిక రూపొందిస్తే శాసనసభ దానిని యథాతథంగా ఆమోదించవచ్చు. దీనివల్ల కాలం వృథాకాకుండా, సమర్థవంతంగా శాసననిర్మాణం చేయవచ్చు.

కమిటీలు కొన్ని శాశ్వతమైనవి (Standing Committees). వీటిని స్థాయీ సంఘాలని అంటారు. కొన్ని కమిటీలు తాత్కాలికమైనవి (Adhoc Committees). వాటిని ఒక ప్రత్యేకమైన పనికోసం ఏర్పాటుచేస్తారు. పని పూర్తి కాగానే వాటిని రద్దుచేస్తారు. కమిటీ సభ్యులను సభవారు ఎన్నుకొంటారు. సభలోని అన్ని రాజకీయ పక్షాలకు వాటి బలాబలాల నిష్పత్తిలో సభ్యత్వమిస్తారు. అమెరికాలో కమిటీలకు విశేషమైన అధికారాలున్నాయి. మన దేశంలో కూడా కేంద్ర, రాష్ట్ర శాసన సభలు కమిటీ పద్ధతి అనుసరిస్తున్నాయి. ఈ పద్ధతి వల్ల శాసన సభలు తమ బాధ్యతలు విస్మరించే ప్రమాదముందనీ, శాసన నిర్మాణం కొద్దిమంది కమిటీ సభ్యులకే పరిమితం అవుతుందనీ విమర్శ ఉన్నా దీనివల్ల నేడు అనేక ప్రయోజనాలు ఉన్నాయి.

## ప్రశ్నలు

### వ్యాస ప్రశ్నావళి

1. ఆధునిక ప్రజాస్వామ్యాలలో శాసనసభ నిర్వహించే విధులను, దాని అధికారాలను వివరించండి.
2. ఏక శాసనసభా విధానంలోగల ప్రయోజనాలు, లోపాలు ఏవి ?
3. ద్విశివిధ శాసనసభ ఏక శాసనసభ కంటె ఎందుకు సమర్థనీయమో చర్చించండి.

### సంక్షిప్త సమాధాన ప్రశ్నావళి

1. అధికార పృథక్కరణ సిద్ధాంతాన్ని క్లుప్తంగా వివరించండి.
2. శాసన సభలో ఎగువసభ నిర్మాణంలో అనుసరించే పద్ధతులు వివరించండి.
3. శాసన నిర్మాణ క్రమాన్ని వివరించండి.
4. కమిటీపద్ధతి అంటే ఏమిటి ? నేడు దాని ప్రాధాన్యం ఎందుకు పెరిగింది ? సోదాహరణంగా వివరించండి.

# 3

# నియోజకులు-ప్రాతినిధ్యము

**( Electorate and Representation )**

## ఓటుహక్కు సిద్ధాంతాలు (Theories of franchise)

గడిచిన అధ్యాయంలో శాసన సభను గురించి తెలుసుకొన్నాము. పరోక్షప్రజాస్వామ్యాలలో శాసనసభలో ప్రజా ప్రతినిధులు సభ్యులుగా ఉంటారు. వారిని శాసనసభ్యులంటారు. శాసన సభ్యులను ఓటు హక్కుగల ప్రజలు ఎన్నుకొంటారు. ప్రజాస్వామ్యంలో ప్రజలందరికీ ఓటు హక్కు ఉండవలెనని "సార్వజనిక ఓటింగ్ పద్ధతి" (Universal franchise system) సూచిస్తుంది. కాని పుట్టిన ప్రతిబిడ్డకు ఓటు హక్కు ఇవ్వలేము కాబట్టి నేటి ప్రజాస్వామ్యాలు ఈ పద్ధతినే "వయోజన ఓటింగ్" (Adult franchise) గా అనుసరిస్తున్నాయి. కనీస వయోపరిమితి కలవారులందరికీ ఈ పద్ధతిలో ఓటుహక్కు లభిస్తుంది. ఓటర్ల వయోపరిమితిని దేశ ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులను బట్టి నిర్ణయిస్తారు. ఇండియాలో 21 సంవత్సరాలు నిండిన స్త్రీ పురుషులను వయోజనులంటారు. ఈ వయోపరిమితిని 18 సం॥ తగ్గించవలెననే ప్రతి పాదన ఉంది.

పసిపిల్లలకు, పరదేశీయులకు, పిచ్చివారికి, నేరస్తులకు, ఋణగ్రస్తులకు ఏ దేశమూ ఓటు హక్కు ఇవ్వదు. విద్యావంతులుకాని వారికి, ధన హీనులకు, ఓటు హక్కు ఇస్తే వారు తమ ఓటును అమ్మడమో లేదా కుల, మత, భాషా, ప్రాంతీయ దురభిమానాలకు లోనై అసమర్థులు, స్వార్థపరులు అయిన వారిని ప్రతినిధులుగా ఎన్నుకోవడమో చేస్తారు. కాబట్టి ఓటు హక్కు కొందరికి మాత్రమే పరిమితం చేయవలె (Limited suffrage) అని కొందరు అంటారు. కాని యోగ్యులైనవారిని, తమకు మేలు చేసేవారిని ఎంచుకోడానికి ఓటర్లు విద్యావంతులు కానక్కరలేదు. ధనికులు ప్రభుత్వానికి పన్ను చెల్లిస్తారు కాబట్టి పన్ను చెల్లించేవారికే ప్రాతినిధ్యపు హక్కు, ఓటు హక్కు ఉండవలెనని మరొక వాదన ఉంది. అయితే పన్నులు ధనికులు మాత్రమే చెల్లించరు. పరోక్ష పన్నులు అంతా చెల్లిస్తారు. ధనికులైతే మాత్రం వారు తమ ఓటు దుర్వినియోగం చేయరనే భరోసా లేదు.

కొందరు రాజకీయనీతిజ్ఞులు ఉద్దేశంతో స్త్రీలకు కూడా ఓటు హక్కు ఉండ కూడదు. స్త్రీలు సామాన్యంగా భర్త, తల్లితండ్రులు లేదా పిల్లలపై ఆధారపడి ఉంటారు. కాబట్టి వారు తమ ఓటు వారి ఇష్టప్రకారం వినియోగిస్తారు. గృహిణి రాజకీయ జీవితంలో అడుగు పెడితే గృహవాతావరణం కలుషితం అవుతుంది. గృహిణిగా ఆమె తన బాధ్యతలు నెరవేర్చ లేదు. స్త్రీలు ప్రకృతి సిద్ధంగా బలహీనులు, వారు రాజకీయ పరమైన బరువు బాధ్యతలు మోయలేరు. కాబట్టి వారికి ఓటు హక్కుగాని, ఎన్నికలలో పోటీ చేసే హక్కు కాని ఉండకూడదని కొందరంటారు.

నేటి ప్రజాస్వామ్యాలు స్త్రీ పురుషులకు సమాన హక్కులు ఇస్తున్నాయి, స్త్రీలు అన్ని రంగాలలో నేడు ముందంజవేస్తున్నారు. వారు పురుషులకంటె ఏ విషయంలోనూ తీసిపోరు, కాబట్టి వారికి ఓటు హక్కు లేకుండా చేయడం అన్యాయము. భావిపౌరులను తీర్చిదిద్దే మాతృమూర్తిగా స్త్రీకి రాజకీయ పరిజ్ఞానం ఎంతో అవసరము. కాబట్టి స్త్రీలకు ఓటు హక్కు, రాజకీయ ప్రవేశము కల్పించడం అన్ని విధాలా సమంజసము.

ఓటర్ల విషయంలో ఎట్లా ఉన్నా అభ్యర్థులుగా పోటీ చేసేవారికి కొన్ని అర్హతలు సూచించడం మంచిది. విద్యావిహీనులు, రాజకీయ పరిజ్ఞానము, పరిపాలనలో శిక్షణ లేని వారు పాలకులైతే వారు సరిగా పరిపాలన చేయలేరు. కాబట్టి వారికి అర్హతలు సూచించడం హర్షణీయము. ఓటింగ్ నిష్పక్షపాతంగా ఉండవలెనన్నా, బలవంతులు, ధనికుల ఒత్తిడికి ఓటరు గురికాకుండా ఉండవలెనన్నా "రహస్య ఓటింగ్ పద్ధతి" (Secret ballot system) ఉండటం మంచిది, బహిరంగ ఓటింగ్ పద్ధతి (Open ballot system) మంచి పద్ధతి కాదు.

## నియోజక వర్గాల నిర్మాణము

నిర్ణీత హద్దుల మధ్య నివసిస్తున్న కొంత మంది ఓటర్లను కలిపి ఒక నియోజక వర్గమని పిలుస్తారు. శాసనసభలో ఉండేస్థానాల సంఖ్యకు సమానంగా దేశాన్ని నియోజక వర్గాలుగా విభజిస్తారు. ఒక నియోజక వర్గంలో ఎంత మంది ఓటర్లు ఉండవలె అనే విషయంపై కచ్చితమైన అభిప్రాయం ఏదీ లేదు. నియోజక వర్గంలో ఓటర్ల సంఖ్య తక్కువగా ఉంటే ఓటరుకు ప్రతినిధికి మధ్య సన్నిహిత సంబాధం ఉంటుంది. అభ్యర్థుల యోగ్యతలు ప్రజలందరికీ తెలుస్తాయి. వారు సమర్థుడైన వ్యక్తిని ఎన్నుకోగలరు. శాసనసభ ప్రజాభిప్రాయానికి ప్రతిరూపంగా ఉంటుంది. నియోజక వర్గంలో ఓటర్ల సంఖ్య తక్కువ ఉండటం వల్ల నష్టం ఏమిటంటే శాసనసభ్యుల సంఖ్య పెరిగి శాసనసభల నిర్వహణ తలకు మించిన భారమవుతుంది. ఎక్కువ జనాభా ఉంటే దేశాలలో నియోజకవర్గంలో ఎక్కువ ఓటర్లను ఉంచక తప్పదు.

నియోజక వర్గాలు రెండు రకాలుగా ఉంటాయి. అవి 1. ఏక సభ్య నియోజక వర్గాలు (Single member constituencies) 2. బహు సభ్య నియోజక వర్గాలు (Multi-member constituencies). ఏకసభ్య నియోజక వర్గాలలో పోటీచేసిన అభ్యర్థులలో అందరికంటె ఎక్కువ ఓట్లు వచ్చిన అభ్యర్థి గెలుపొందినట్లు పరిగణిస్తారు. అంటే వీటిలో ఒక నియోజక వర్గం నుంచి ఒక సభ్యుని మాత్రమే ఎన్నుకొంటారు. బహు సభ్య నియోజక వర్గాలలో ఓటర్లు ఒకరికంటె ఎక్కువ మంది ప్రతినిధులను ఎన్నుకొంటారు. అటువంటి నియోజకవర్గాలలో ఓటరుకు ఒకటికంటె ఎక్కువ ఓట్లు ఉంటాయి. దీనిని బహుళ ఓటింగ్ (Plural voting) అంటారు; లేదా ఒకే ఓటును బదలీ చేయడంద్వారా ఒకే ఓటుతో ఓటరు అనేక మందిని ఎన్నుకోవచ్చు (Transferable vote). సాధారణంగా బహుసభ్యనియోజక వర్గాలు, అల్పసంఖ్యాక వర్గాలకు ప్రాతినిధ్యం ఇవ్వడానికి ఉపయోగిస్తాయి. వాటిలో అల్పసంఖ్యాకులకు ఒక స్థానం రిజర్వ్‌చేయగా రెండవస్థానం జనరల్ స్థానంగా ఉంటుంది.

బహుసభ్య నియోజకవర్గాలలో ప్రతినిధులను ఎన్నుకోవడానికి అనేకపద్ధతులు అమలులో ఉన్నాయి. వీటిల్లో ఓటరు ఒకరికంటె ఎక్కువ మంది అభ్యర్థులకు ఓటు వేయవలె.

దీనికోసం వారికి అనేక ఓట్లుఇచ్చి తమకునచ్చిన నిష్పత్తిలో వాటిని నచ్చినవారికి వేయ మంటారు. లేదా ఒకేఓటు "ప్రిఫరెన్షియల్ ఓటు" (Preferential votes) వేయడం ద్వారా కావలసినంతమంది సభ్యులను ఒకేసారి ఎన్నుకొంటారు. ఒకే ఓటుతో అనేక మందిని ఎన్నుకొనే పద్ధతిని "నిష్పత్తిఓటింగ్ పద్ధతి" (Proportional voting) అంటారు.

ప్రస్తుతం రెండురకాలైన నిష్పత్తి ఓటింగ్ పద్ధతులు వాడుకలో ఉన్నాయి. అవి (1) హేర్‌పద్ధతి లేదా ఓట్లును బదిలీచేసే నిష్పత్తి ప్రాతినిధ్యము (Hare system or proportional representation by single transferable vote) (2) పార్టీ పట్టిక పద్ధతి (Party List system). వీటిలో హేర్ పద్ధతిలో ఓటరు పోటీదారులందరికీ వరస క్రమంలో ప్రిఫరెన్స్ ఓట్లు (Preference votes) వేస్తాడు. ఓట్లలెక్కింపులో ఎవరికైతే నిర్ణయించిన "కోటాఓట్లు" (Quota of votes) వస్తాయో వారు గెలుపొందు తారు. తరువాత లెక్కింపులలో అందరికంటె తక్కువ ఓట్లు వచ్చినవారి ప్రిఫరెన్స్ ఓట్లు ఇతరులకు బదిలీ చేస్తూ కావలసిన సంఖ్యలో అభ్యర్థులు గెలుపొందేవరకు లెక్కింపు కొన సాగిస్తారు. ఈ పద్ధతిని థామస్ హేర్ అనే ఆంగ్లేయుడు (1851) కనుక్కొన్నాడు. దీనిని మనదేశంలో రాజ్యసభ సభ్యుల ఎన్నికకు, రాష్ట్ర శాసనసభలలో కొంతమంది ఎం. ఎల్. సి. ల ఎన్నికకు, కొన్ని మార్పులతో రాష్ట్రపతి, ఉప రాష్ట్రపతి ఎన్నికకు ఉపయోగిస్తున్నారు.

పార్టీ పట్టిక పద్ధతిలో ఓటరు తన ఓటు నేరుగా అభ్యర్థికి వేయకుండా నచ్చిన పార్టీకి వేస్తాడు. పోటీలలోపాల్గొనే పార్టీలు తమ తమ పార్టీల తరఫున అభ్యర్థుల పేర్లను వరస క్రమంలో ఎన్నిస్థానాలైతే ఆ నియోజకవర్గంలో భర్తీచేయవలెనో అన్ని స్థానాలకు సరిసమాన మైన సంఖ్యలో ఒక పట్టికలో ప్రజలకు తెలుపుతారు. ఓటర్లు ఆ యా పార్టీలకు వేసిన ఓట్ల నిష్పత్తినిబట్టి ఆ నియోజకవర్గంలో ఆ యా పార్టీలకులభించే స్థానాలు నిర్ణయిస్తారు. ఈ పద్ధతి ప్రస్తుతం ఇజ్రాయిల్‌లో అమలులో ఉంది.

నిష్పత్తిప్రాతినిధ్యం వల్ల ఓట్లు వృథాకావు. ప్రస్తుత ఓటింగ్ విధానంలోని లోపాలు సరిదిద్దవచ్చు. ఎన్నికలలో ప్రచారము, రాజకీయ పక్షాల ప్రభావము పరిమితమవుతాయి. ఓటర్ల అభిమానాన్ని నిజంగా చూరగొన్న అభ్యర్థి గెలుపొందుతాడు. అయితే ఈ పద్ధతి క్లిష్ట మైనది. విద్యావంతులకు కూడా ఇది అవగాహన కావడం కష్టము. నిరక్షరాస్యత అధికంగా ఉన్న భారతదేశం వంటిదేశాలలో దీనికి పరిమితమైన ప్రయోజనం మాత్రమే ఉంది.

### అల్పసంఖ్యాక ప్రాతినిధ్యపద్ధతులు (Methods of minority representation)

కుల, మత, వృత్తి, రాజకీయ పరంగా అల్పసంఖ్యాకులుగా ఉండే ఓటర్లకు తగిన న్యాయం జరగడానికి వారికి శాసనసభలో సభ్యత్వం లభింపజేయడానికి, అల్పసంఖ్యాక ప్రాతినిధ్య పద్ధతులు తోడ్పతాయి. ఈ పద్ధతులను సాధారణంగా బహుసభ్య నియోజక వర్గా లలో ఉపయోగిస్తారు.

1. *పరిమిత ఓటింగ్ ప్రణాళిక (Limited Voting Plan)* : ఈ పద్ధతిలో బహు సభ్య నియోజకవర్గం నుంచి ఎన్నుకోవలసిన అభ్యర్థుల సంఖ్యతో ఎటువంటి నిమిత్తం లేకుండా ప్రతి ఓటరుకు ఒక ఓటు మాత్రమే ఇస్తారు; లేదా ఎన్నుకోవలసిన అభ్యర్థులసంఖ్య కంటె తక్కువ ఓట్లయినా ఇస్తారు. ఈ పద్ధతిలో ఓటరుకు పరిమితంగా ఓట్లు ఉండటం వల్ల బాగా

ఆలోచించి ఓటు వేయవలసి వస్తుంది. అటువంటప్పుడు అతడు తనకులం, లేదా వర్గం వానిని మాత్రమే ఎన్నుకొనే అవకాశముంది.

2. *సంచిత ఓటింగ్ పద్ధతి (Cumulative Voting System)* : ఈ విధానంలో ఓటరుకు ఎన్నుకోవలసిన సభ్యుల సంఖ్యతో సమంగా ఓట్లు లభిస్తాయి. అతడు వాటినన్నిటినీ ఒక అభ్యర్థికే వేయవచ్చు లేదా తనకు నచ్చిన నిష్పత్తిలో వేరు వేరు సభ్యులకు పంచవచ్చు. దీనిలో అల్పసంఖ్యాకులు ఐకమత్యంతో వ్యవహరించి, తమ ఓట్లన్నీ తమ అభ్యర్థికే వేస్తే కనీసం ఒకరైనా వారి వర్గానికి చెందిన వ్యక్తి గెలుపొందే అవకాశముంది.

3. *కుల, మత ప్రాతినిధ్యము (Communal representation)* : సమాజంలో ఉండే వివిధకులాలవారికి మతాలవారికి ప్రత్యేకనియోజకవర్గాలు ఏర్పాటుచేసి ఆ నియోజక వర్గం నుంచి ఆ మతం లేదా కులంవారు మాత్రమే పోటీచేయవలెనని తీర్మానిస్తే ఆ వర్గాలవారికి శాసనసభలో తప్పకుండా ప్రాతినిధ్యం లభిస్తుంది. అయితే ఇటువంటి నియోజకవర్గాలు కుల మత విద్వేషాలను రెచ్చగొడతాయి. జాతీయసమైక్యతకు హాని కలిగిస్తాయి. వీటికి బ్రిటిష్‌వారి కాలంలో మన దేశంలో ప్రోత్సాహం లభించింది. ప్రస్తుతం అల్పసంఖ్యాకుల ప్రయోజనాలు కాపాడటానికి జనరల్ నియోజకవర్గంలోనే కొన్నిటిని ఆ వర్గాలకు రిజర్వ్ చేస్తున్నారు. ఆ నియోజకవర్గాలనుంచి ఆ కులం లేదా వర్గంవారు మాత్రమే పోటీచేయవలె. నియోజకవర్గంలో ఓటర్లంతా కలసి వారిలో ఒక్కరిని ఎన్నుకొంటారు; దీనివల్ల గెలిచిన అభ్యర్థి తమ ప్రతినిధేనని అందరూ భావిస్తారు.

4. *వృత్తి ప్రాతినిధ్యము (Functional representation)* : ఓటర్లను వృత్తుల వారీగా విభజించి నియోజకవర్గాలు ఏర్పాటుచేసి, ఆ యా వృత్తుల వారు తమ తమ వృత్తికి చెందిన వారిని శాసనసభ్యులుగా ఎన్నుకొంటే దానిని వృత్తి ప్రాతినిధ్యం అంటారు మన దేశంలో అధ్యాపక వృత్తిలో ఉన్నవారికి రాష్ట్రవిధాన పరిషత్తులో సభ్యత్వముంది. రాష్ట్రంలోని అధ్యాపకులంతా కలిసి వారిని ఎన్నుకొంటారు. అనేక సోషలిస్టుదేశాలు ఈ పద్ధతిని సమర్థిస్తున్నాయి. సమాజంలో ఉండే అ వర్గాలవారి ప్రయోజనాలు కాపాడటానికి ఈ పద్ధతి ఉపయోగిస్తుంది. కాని వృత్తినిబ ఎన్నికైన సభ్యులు తమ వర్గం ప్రయోజనాలు మినహా ఇతరులను గురించి ఆలోచించరు. త్తిప్రాతినిధ్యం వర్గవైషమ్యాలను ప్రోత్సహిస్తుంది. ఒకేవ్యక్తి విభిన్న వృత్తులు నిర్వహించే ఈ రోజులలో వ్యక్తుల వృత్తులు నిర్ణయించడం కష్టము. అన్ని వృత్తులవారికి శాసనసభలో సభ్యత్వమివ్వవలెనన్నా కష్టమే కదా?

## ప్రశ్నలు

### సంక్షిప్త సమాధానప్రశ్నావళి

1. ఓటు హక్కు సిద్ధాంతాలను క్లుప్తీకరించి, సార్వజనిక ఓటింగ్ ఎందుకు సమర్థనీయమో వివరించండి.
2. నిష్పత్తి ప్రాతినిధ్య పద్ధతులను క్లుప్తంగా వివరించండి.
3. అల్పసంఖ్యాకులకు శాసనసభలో సభ్యత్వం లభింపజేయడంలో ఏ పద్ధతులు అనుసరణీయాలు?

# 4

# ప్రభుత్వాంగాలు-కార్యనిర్వాహక

**(Organs of Government - Executive)**

ప్రభుత్వాంగాలలో కార్యనిర్వాహకశాఖ రెండవది. దీనినే పాలకవర్గం అని కూడా పిలుస్తారు. పామరుల దృష్టిలో ప్రభుత్వమంటే కార్యనిర్వాహకవర్గం మాత్రమే. వారు శాసన నిర్మాణశాఖకు, న్యాయశాఖకు ప్రాధాన్యం ఇవ్వరు. లార్డ్ బ్రైస్ (Lord Bryce) చెప్పినట్లు విశాల దృక్పథంతో ఆలోచిస్తే శాసనసభ చేసిన శాసనాలను అమలుపరచడంతో ప్రత్యక్షంగా కాని, పరోక్షంగా కాని సంబంధమున్న పెద్ద చిన్న ఉద్యోగులందరినీ కలిపి సమష్టిగా కార్య నిర్వాహకవర్గం అనవలె. శాసనరూపంలో శాసనసభలద్వారా వ్యక్తమైన రాజ్యాభిప్రాయాన్ని అమలుపరచడంలో ఉపకరించే అన్ని సంస్థలు, వ్యక్తుల సమూహమే కార్యనిర్వాహకవర్గం అని గార్నర్ అంటాడు. ప్రస్తుతం సామాన్య పరిభాషలో కార్యనిర్వాహకవర్గం అంటే అధ్యక్షపాలన ఉండే దేశాలలో అధ్యక్షుడు, పార్లమెంటరీ విధానం ఉండేచోట రాజ్యాధిపతి అతని మంత్రిమండలి అని చెప్పవలసి ఉంటుంది. శాసనాలను వాస్తవానికి అమలుపరచే సివిల్ సర్వీసు ఉద్యోగులను పాలకవర్గంగా పరిగణిస్తున్నారు.

**కార్యనిర్వాహకవర్గం నియామకము (Appointment of the executive)**

ప్రధాన కార్యనిర్వాహకుల (Chief executive) నియామకం ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క విధంగా ఉంది. వారి ఎంపికకు ప్రధానంగా నాలుగు పద్ధతులు అనుసరిస్తున్నారు:

1. *వారసత్వము (Heredity) :* ప్రజాస్వామిక విధానం అమలులోకి రావడానికి ముందు రాజరిక విధానంలో ప్రధాన కార్యనిర్వాహకులు వారసత్వ పద్ధతిపై అధికారంలోకి వచ్చేవారు. రాజ్యాధినేత (Head of the State) మరణించినా లేదా అధికారం త్యజించినా అతని పెద్దకుమారుడు లేదా కుమార్తె అధికారంలోకి వచ్చేవారు. ఈ పద్ధతి నేటికీ బ్రిటన్, బెల్జియం, గ్రీస్, నేపాల్, స్వీడన్ మొదలైన దేశాలలో అమలులో ఉంది. అయితే ఈ రాజ్యాలన్నిటిలో ప్రస్తుతం రాజ్యాధినేతలకు నామమాత్రపు అధికారాలు మాత్రమే ఉన్నాయి. నేటి ప్రజా స్వామిక యుగంలో రాజరికాలకు తావులేదు. అవి చారిత్రక గత వైభవానికి చిహ్నాలుగా నిలిచి ఉన్నాయి. ఈ పద్ధతిగల రాజ్యాలను పరిమిత రాజరిక రాజ్యాలు అని పిలుస్తారు.

2. *ప్రత్యక్ష ఎన్నిక (Direct election) :* ప్రజాస్వామిక విధానం అమలులోకి రావడంతో వారసత్వ పద్ధతి స్థానాన్ని ప్రత్యక్ష ఎన్నికలు స్వీకరించినాయి. దీనిలో రాజ్యాధి నేతను ఓటు హక్కు గల పౌరులు నిర్ణీతకాలానికి స్వయంగా ఎన్నుకొంటారు. ఇటువంటి రాజ్యాలను గణతంత్రరాజ్యాలు (Republics) అని పిలుస్తారు. ఈ పద్ధతి మెక్సికో, పోర్చుగల్, బ్రెజిల్, బొలీవియా, చిలీ మొదలైన దేశాలలో ఉంది.

ఈ పద్ధతి అనుసరిస్తే ప్రజలు తమకు నచ్చిన వ్యక్తిని అధ్యక్షునిగా ఎన్నుకో

వచ్చు. ప్రజలచే ప్రత్యక్షంగా ఎన్నుకోబడిన రాజ్యాధినేతకు సర్వాధికారాలు ఉంటాయి. దీనివల్ల అతడు నియంతగా మారే అవకాశముంది. రాజ్యాధినేతవంటి ఉన్నతాధికారి ఎంపికను జనసామాన్యానికి వదలి వేయడం ఎంతవరకు సమంజసము అనేది చర్చించదగిన అంశము.

౩. *పరోక్ష ఎన్నిక (Indirect election)* : ముఖ్య కార్యనిర్వహణాధికారిని పరోక్షంగా ఎన్నుకొనే పద్ధతికి రోజురోజుకు ప్రాముఖ్యం పెరుగుతున్నది. అనేక గణతంత్ర రాజ్యాలలో ఈ పద్ధతి వాడుకలో ఉంది. ఎన్నికల కోలాహలము, రాజకీయపక్షాల తాకిడి తగ్గించి రాజ్యాధినేత పదవి కుటిల రాజకీయాలకు అతీతంగా ఉంచడానికి ఇది తోడ్పడు తుంది. పరోక్షంగా ఎన్నుకొన్న రాజ్యాధినేతకు ప్రజలలో పెద్ద పలుకుబడి ఉండదు. కాబట్టి అతని అధికారాలు కూడా పరిమితంగానే ఉంటాయి. పార్లమెంటరీ విధానంలో దేశానికి నామ మాత్రపు ప్రధాన కార్యనిర్వాహకుని ఎన్నుకోవడానికి సామాన్యంగా ఈ పద్ధతినే అనుస రిస్తారు. పరోక్ష ఎన్నికలో కార్యనిర్వహణాధికారిని 'ఎన్నికల గణము' (Electoral college) ఎన్నుకొంటుంది. ఎన్నికల గణంలోని సభ్యులను ప్రజలు ఎన్నుకొంటారు. భారతదేశ రాష్ట్రపతిని ఈ పద్ధతి కిందనే ఎన్నుకుంటారు.

దేశంలో అత్యున్నతమైన స్థానంలో ఉండే వ్యక్తిని రాజకీయ పరిజ్ఞానం ఏ మాత్రం లేని జనసామాన్యం ఎన్నుకోవడం కంటె రాజకీయానుభవమున్న కొద్దిమంది ప్రతినిధులు ఎన్నుకోవడం శ్రేయస్కరము. అమెరికాలో అధ్యక్షుని ఎన్నిక రాజ్యాంగరీత్యా పరోక్షమయి నప్పటికీ ఆచరణరీత్యా రాజకీయ పార్టీలు అధ్యక్ష అభ్యర్థుల పేర్లను ముందుగా ప్రకటించడం ద్వారా ఈపద్ధతిని ప్రత్యక్ష పద్ధతిగా రూపొందించినవి.

౪. *శాసనసభ ఎన్నుకోవడం (Election by the legislature)* : ఆస్ట్రేలియా ఫ్రాన్స్, పోలండ్, స్విట్జర్లండ్, ఇండియా మొదలైన దేశాలలో రాజ్యాధినేతను శాసన సభలు ఎన్నుకొంటాయి. ఇండియాలో రాష్ట్రపతిని పార్లమెంట్‌లోని ఉభయసభల సభ్యులు, రాష్ట్ర విధానసభలలోని సభ్యులతో ఏర్పాటైన ఎన్నికల గణం ఎన్నుకొంటుంది. పరోక్ష ఎన్నిక పద్ధతిలో ఉండే లాభాలన్నీ దీనికి కూడా వర్తిస్తాయి. శాసనసభకు, కార్యనిర్వాహక వర్గానికి మధ్య సామరస్యము, సమన్వయము తేవడానికి ఇది తోడ్పడుతుంది.

౫. *నామినేషన్ పద్ధతి (Nomination method)* : స్వాతంత్ర్యాన్ని పొందని రాజ్యాలలోను, అధినివేశ రాజ్యాలలోను (Dominion States) రాజ్యాధినేతను మరొక దేశానికి చెందిన రాజ్యాధినేత నామినేషన్ ద్వారా నియమిస్తాడు. స్వాతంత్ర్యానికి ముందు భారత గవర్నర్ జనరల్‌ను బ్రిటిష్ చక్రవర్తి నియమించేవాడు. బ్రిటిష్ వలస రాజ్యాలలో (British Colonies) నేటికీ ఈ పద్ధతి అమలులో ఉంది. కెనడా ఆస్ట్రేలియా, న్యూజిలండ్ అధినివేశ రాజ్యాలకు గవర్నర్ జనరల్‌ను బ్రిటిష్‌రాణి అధి నివేశ ప్రభుత్వం చేసిన సిఫార్సు ప్రకారం నియమిస్తుంది.

పైన సూచించిన ఐదు పద్ధతులలోను లాభనష్టాలు ఉన్నాయి. వాటిలో ముఖ్య కార్యనిర్వా హకుని శాసనసభ ఎన్నుకొనే పద్ధతి మంచి పద్ధతి. దానినే మనదేశంలో అనుసరిస్తున్నాము.

### కార్యనిర్వాహకుని పదవీకాలము (Tenure of office)

ముఖ్య కార్యనిర్వహణాధికారి పదవీకాలం ఎంత ఉండవలె అనే విషయంలో ఏకాభి

ప్రాయం లేదు. భారత రాష్ట్రపతిని ఐదు సంవత్సరాల కొకసారి ఎన్నుకొంటారు. అమెరికా అధ్యక్షుని ఎన్నిక నాలుగు సంవత్సరాల కొకసారి జరుగుతుంది. ఫ్రాన్స్ అధ్యక్షుని పదవీ కాలం ఏడు సంవత్సరాలు. వీరంతా తమ పదవికి తిరిగి పోటీచేయవచ్చు. కాని ఒక వ్యక్తి ఈ ఉన్నత పదవికి రెండు పర్యాయాలకు మించి పోటీ చేయడం సత్సంప్రదాయం కాదు. వీరి పదవీ కాలం మరీ ఎక్కువగాని మరీ తక్కువ గాని కాకుండా ఉంచడం మంచిది. ప్రధాన కార్యనిర్వాహకులు తమ విధులు సరిగా నిర్వహించకపోతే వారిని పదవి నుంచితొలిగించడానికి అన్ని రాజ్యాంగాలు మహాభియోగ తీర్మానానికి (Impeachment motion) వీలు కలిగిస్తాయి.

## కార్య నిర్వాహక వర్గంలో రకాలు
## (Types of executive)

### అసలు కార్య నిర్వాహణాధికారి

ప్రపంచ రాజ్యాంగాలను పరిశీలిస్తే కార్యనిర్వాహకులు పలు రకాలుగా ఉంటారనే విషయం విదిత మవుతుంది. అధ్యక్షపాలన అమలులో ఉన్న అమెరికాలో అధ్యక్షుడు నిజమైన కార్యనిర్వాహణాధికారి (Real executive). అతడు రాజ్యాంగము తన కిచ్చిన అధికారాలన్నిటిని స్వయంగా అనుభవిస్తాడు పూర్వం రాజరికంలో రాజులు కూడా ఇదే విధమైన అధికారాలు అనుభవించేవారు. నిజమైన కార్యనిర్వాహకులు రాజ్యాధినేత (Head of the State), ప్రభుత్వాధినేత (Head of the Government) రెండూ తామే అయి వ్యవహరిస్తారు. ప్రజలచే ప్రత్యక్షంగా ఎన్నుకోబడిన కార్యనిర్వాహకులు ఈ విధంగా ఉంటారు.

### నామ మాత్రపు కార్యనిర్వాహకుడు

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అములులో ఉండే ఇండియా వంటి దేశాలలో అధ్యక్షుడు నామమాత్రపు కార్యనిర్వాహకుడు (Titulor executive) గా వ్యవహరిస్తాడు. అతడు తన అధికారాలను మంత్రి మండలి సలహా ప్రకారం వినియోగించవలె. సామాన్యంగా ఇటువంటి కార్యనిర్వాహకులు పరోక్ష ఎన్నిక ద్వారా పదవిలోకి వస్తారు. పరిమిత లేదా రాజ్యాంగబద్ధ రాజరికము (Limited or constitutional) monarchy) అమలులో ఉండే బ్రిటన్ వంటి దేశాలలో కూడా రాజ్యాధినేతలు నామ మాత్రంగానే ఉంటారు. ఇటువంటి కార్య నిర్వాహకులు రాజ్యాధినేతలే గాని ప్రభుత్వాధినేతలు కారు. వారి పేరు మీద ప్రధానమంత్రి అధ్యక్షతన పనిచేసే మంత్రిమండలి వారి అధికారాలను చెలాయిస్తుంది.

### ఏకసభ్య - బహుసభ్య కార్యనిర్వాహక వర్గములు

కార్యనిర్వాహణాధికారం ఒకే వ్యక్తి అధీనంలో ఉంటే అటువంటి కార్యనిర్వాహక వర్గాన్ని ఏకసభ్య కార్యనిర్వాహకవర్గము (Single member executive) అని, కొద్దిమంది వ్యక్తుల చేతులలో ఉంటే బహుసభ్య కార్యనిర్వాహకవర్గము (Plural executive) అని పిలుస్తారు. అధ్యక్షపాలన, రాజ్యత్వము, ఏకసభ్య కార్యనిర్వాహకవర్గానికి ఉదాహరణలు. పార్లమెంటరీ విధానంలో అనేక మంది మంత్రులుండే కాబినెట్ నిజమైన కార్య నిరా హకవర్గంగా పనిచేస్తుంది. మంత్రిమండలి విధి నిర్వహణలో ఒక జట్టుగా వ్యవహరిస్తుంది. కాబ దానిలో అనేకమంది మంత్రులు ఉన్నప్పటికీ అది ఏకసభ్య కార్యనిర్వాహకవర్గంగానే పరి. ణించవలె అని కొందరి అభిప్రాయము.

అధ్యక్షపాలన ఉన్నప్పటికీ అది ఏకసభ్య కార్యనిర్వాహకవర్గంగా కాక బహుసభ్య కార్యనిర్వాహకవర్గంగా ఉండే అవకాశముంది. ఉదాహరణకు స్విట్జర్లండ్‌లో కార్య

[illegible] ఏడుగురు సభ్యులుండే అధ్యక్ష బృందంతో ఏర్పడిన "ఫెడరల్ కౌన్సిల్" (Federal council) చేతిలో ఉంటుంది. వీరిని ఫెడరల్ అసెంబ్లీ ఎన్నుకొంటుంది. వీరు ఏడుగురు ఒక్కొక్కరు ఒక్కొక్క ఏడాది చొప్పున ఈ సమాఖ్యకార్యనిర్వాహకవర్గానికి (Federal executive) ప్రధాన అధ్యక్షునిగా పని చేస్తారు. దీనిని "సమబాధ్య కార్యనిర్వాహకవర్గము" (Collegiate executive) అని పిలుస్తారు.

రష్యాలో బహుసభ్య కార్యనిర్వాహక వర్గముంది. దానిని "అధ్యక్షమండలి" (Presidium) అంటారు. అందులో ఒక ఛైర్మన్, పదహారుగురు వైస్ ఛైర్మన్‌లు, పదిహేనుమంది అడిషనల్ డిప్యూటీలతో కలుపుకొని మొత్తం 32 మంది సభ్యులు ఉంటారు. వీరిని నాలుగు సంవత్సరాల పదవీకాలానికి సోవియట్ యూనియన్ శాసనసభ అయిన సుప్రీం సోవియట్ ఎన్నుకొంటుంది.

ఇంతవరకు కార్యనిర్వాహకవర్గంలో రకాలను గురించి తెలుసుకున్నాము. ఇక ప్రధాన రకాలైన అధ్యక్ష, పార్లమెంటరీ కార్యనిర్వాహకవర్గాలను గురించి తెలుసుకొందాము.

## అధ్యక్షపాలన
### (Presidential form of Government)

అధ్యక్షపాలనలో అధ్యక్షుడు ప్రభుత్వాధినేత, రాజ్యాధినేత, అతడు నిజమైన కార్యనిర్వాహకుడు. ఇది ఏక సభ్య కార్యనిర్వాహకవర్గ విధానము. అధ్యక్షుని ప్రజలు గాని, ఎన్నికల గణాలు (Electoral collage) గాని ఎన్నుకొంటారు. మంత్రిమండలిని నియమించడానికి, తొలగించడానికి వారికి విధులు బాధ్యతలు అప్పగించి అదుపులో ఉంచడానికి అతనికి అధికారముంది. మంత్రులు, అతనికి విధేయులై పనిచేసే తాబేదారులే (Subordinates) గాని, అతని సహచరులు గాని లేదా అతనితో సమానమైన హోదా కలవారు గాని కారు. అధ్యక్షునికి, అతని మంత్రివర్గానికి శాసనసభతో ఎటువంటి సంబంధమూ ఉండదు. వారు శాసన సభ్యులు కారు. కనీసం వారి పార్టీకి శాసనసభలో మెజారిటీ అయినా ఉండనక్కరలేదు. వారు తమ చర్యలకు శాసనసభకు జవాబు చెప్పుకోనవసరం లేదు. అందుకే కొందరు అధ్యక్షపాలనను బాధ్యతారహితమైన ప్రభుత్వము (Nonresponsible Government) అని పిలుస్తారు. అయితే అధ్యక్షుడు తన విధులు సరిగా నిర్వర్తించలేకపోతే పార్లమెంట్ అతనిని మహాభియోగం ద్వారా పదవి నుంచి తొలగించవచ్చు.

అధ్యక్షపాలన - ప్రయోజనాలు

1. అధ్యక్షపాలనలో స్థిరత్వము ఒక సుగుణము. అధ్యక్షుడు నిర్ణీత కాలానికి ఎన్నుకోబడతాడు. కాబట్టి తాను చేపట్టిన పని నిర్భయంగా, నిశ్శంకోచంగా పూర్తిచేయవచ్చు. అతనిని తొలగించవలెనంటే మహాభియోగమే శరణ్యము. ఆ తీర్మానం విధిలేని పరిస్థితులలో మాత్రమే ప్రవేశ పెడతారు. ఇన్ని సంవత్సరాల అమెరికా రాజ్యాంగచరిత్రలో ఏ అధ్యక్షుడూ మహాభియోగం ద్వారా పదవి కోల్పోలేదు. నిక్సన్‌కు అటువంటి పరిస్థితి ఏర్పడితే అతడు తన పదవికి రాజీనామా ఇచ్చి దానిని తప్పించుకొన్నాడు. కాబట్టి అధ్యక్షుడు శాసనసభకు భయపడనక్కరలేకుండా స్థిరంగా, ధైర్యంగా పనిచేయవచ్చు.

2. అధ్యక్షపాలనలో అధ్యక్షునికి శాసనసభా పరమైన విధులేవీ ఉండవు. కాబట్టి అతడు తన శక్తి యుక్తులన్నిటిని కార్యనిర్వహణకే వెచ్చించవచ్చు. దీనివల్ల అతని సామర్థ్యం పెరుగుతుంది. పార్లమెంటరీ విధానంలో మంత్రివర్గాలు శాసనసభలో తమ మెజారిటీని కాపాడుకోవడంతోను, శాసనసభకు జవాబు చెప్పుకోవడంతోను సతమతమవుతూ ఉంటడంవల్ల పరిపాలన దెబ్బతింటుంది. ఈ మధ్య ఇండియాలో జనతాపార్టీలో ఏర్పడిన సంక్షోభంవల్ల పార్లమెంటరీ కార్యనిర్వాహకవర్గాలు ఎట్లా సతమతమైనదీ మనందరికీ తెలిసిన విషయమే.

3. ఈ విధానంలో పాలనాధికారమంతా ఒకేవ్యక్తి చేతిలో ఉండటంవల్ల పరిపాలన సుసంఘటితంగా ఉంటుంది. పటిష్ఠమైన పరిపాలన సాధించవచ్చు. విధాన నిర్ణయము, విధినిర్వహణలోను ఎటువంటి జాప్యమూ ఉండదు. అధ్యక్షుడు నిర్ణయాలు తీసుకోవడానికి ఎవరితోనూ సంప్రదించనక్కరలేదు. ఎవరి సలహా పాటించనవసరంలేదు. స్వేచ్ఛగా వ్యవహరించవచ్చు.

4. దేశము యుద్ధాన్ని గాని, సంక్షోభాన్ని కాని ఎదుర్కొంటున్నప్పుడు ఆ క్లిష్ట పరిస్థితులను ఎదుర్కోవడానికి పార్లమెంటరీ విధానం కంటె అధ్యక్షపాలనా విధానమే మంచిది. అధ్యక్షుడు అటువంటి పరిస్థితులలో దేశాన్ని ఒకేమాట, ఒకేబాట మీద నడిపించి సమస్యలు పరిష్కరించగలడు.

5. నిజానికి బాధ్యతాయుత పాలనలో కంటె బాధ్యతారహితపాలన అని పిలవబడే అధ్యక్షపాలనలోనే ఎక్కువ బాధ్యత ఇమిడి ఉంది. పరిపాలనలో ఏ చిన్న లోపమున్నా దానికి అధ్యక్షుడే బాధ్యుడు. అతడు దానిని ఇతరులపైగాని, తన మంత్రిమండలిపైగాని నెట్టలేడు. పార్లమెంటరీవిధానంలో ప్రభుత్వవైఫల్యాలకు మంత్రులు ఒకరినొకరు నిందించుకొంటారు. అధ్యక్షపరిపాలనలో ఎదురయ్యే సమస్యలను స్వయంగా ధైర్యంతో ఎదుర్కొని పరిష్కరించ గలిగినప్పుడే అతడు తిరిగి పదవిలోకి రాగలుగుతాడు, లేకపోతే లేదు.

6. అధ్యక్షపాలనలో మంత్రివర్గం అధ్యక్షునిచెప్పుచేతలలో ఉంటుంది. మంత్రులను సంతృప్తిపరచడానికి అధ్యక్షుడు ఎటువంటి ప్రయత్నం చేయనక్కరలేదు. వారు అతని కింద పనిచేసే ఉద్యోగులే కాబట్టి వారితో ఎటువంటి విభేదాలులేక తనకు నచ్చిన ప్రణాళికలను చేపట్టి అమలుపరచవచ్చు. మంత్రుల నియామకంలో అతనికి పూర్తి స్వేచ్ఛ ఉంటుంది. తన పార్టీవారిని, శాసనసభ్యులను మాత్రమే మంత్రులుగా నియమించవలెననే నియమం అతనికి ఉండదు. నిపుణులైన వ్యక్తులను మంత్రివర్గంలో చేర్చుకొని సమర్థవంతమైన పరిపాలనకు పునాదివేయవచ్చు. రిచర్డ్ నిక్సన్ అమెరికా అధ్యక్షుడుగా ఉన్నప్పుడు హెన్రీ కిసింజర్ వంటి మేధావిని విదేశాంగమంత్రిగా నియమించుకోవడంవల్ల అమెరికా విదేశాంగ విధానానికే కొత్తరూపు రేఖలు వచ్చినాయి.

7. అధ్యక్షపాలనలో అధికారపృథక్కరణ ఉంటుంది. ప్రధానంగా ఈ విధానంలో శాసనసభ, కార్యనిర్వాహకవర్గం విడి విడిగా ఉంటాయి. ఆ రెండు ప్రభుత్వాంగాలు ఒకదాని నొకటి నియంత్రిస్తూ ఉండటంవల్ల నియంతృత్వం తలెత్తే అవకాశముండదు.

8. విచ్ఛిన్నకరశక్తులు, కుల, మత, భాషా, ప్రాంతీయ దురభిమానాలు, ద్వేషాలు

ఎక్కువగా ఉండే దేశాలకు అధ్యక్షపాలన మంచిది. అధ్యక్షుడు అటువంటివాటిని ప్రోత్స హించక జాతీయసమైక్యతను సాధించగలడు.

9. అధ్యక్షపాలనలో రాజ్యాధినేత నిజమైనపాలకుడు కాబట్టి దేశంలో అతనికి సర్వోన్న తమైన గౌరవం, హోదా, పలుకుబడి లభిస్తాయి. అటువంటి గౌరవ ప్రతిపత్తులు పార్లమెంటరీ విధానంలో రాజ్యాధినేతకు ఉండవు. అతడు ప్రభుత్వాధినేత చేతిలోఒకరబ్బర్‌స్టాంప్ వంటి వాడు.

**లోపాలు**

1. అధ్యక్షపాలనలో ఎన్నిప్రయోజనాలున్నా లోపాలుకూడా లేకపోలేదు. పరిపాల నాధికారమంతా ఒకే వ్యక్తి చేతిలో ఉండటం ఎంతవరకు సమంజసము అనేది తీరని సమస్యే. ఎందుచేతనంటే దీనివల్ల ఒక వ్యక్తిచేసిన తప్పులకు దేశమంతా బాధపడవలె. ఇది మంచిపరి పాలన అందిస్తే సరేసరి; లేకపోతే తుగ్లక్ పరిపాలనకు దారితీస్తుంది. అంతే కాక అధికారం ఒకవ్యక్తిచేతిలో కేంద్రీకరించడం ప్రజాస్వామ్యసూత్రానికి వ్యతిరేకము. అందుకే ఏకవ్యక్తి పాలనకంటె అనేకమంది కలసి పాలించడం మంచిదనే అభిప్రాయం లేకపోలేదు. ఒకతల ఆలోచించేకంటె పదితలలు కలిసి ఆలోచించడం మేలుకదా!

2. పరిపాలనాధికారం ఒకవ్యక్తిచేతిలో ఉంచితే అది నియంతృత్వానికి, క్రూర పరిపాలనకు దారితీయవచ్చు. అయితే అధికార పృథక్కరణవల్ల ఈ లోపం కొంతవరకు సవరించగలిగినా ఏక సభ్యకార్యనిర్వాహకవర్గము నిస్సందేహంగా వీరపూజకు (Hero-worship) దారితీస్తుంది. అధికారాలన్నీ గుప్పిట్లోపెట్టుకుని దేశాన్నంతా తనచుట్టూతిప్పుకో వలెనని కార్యనిర్వాహకుడు ఆలోచించ వచ్చు.

3. అధ్యక్షపాలన ప్రభుత్వయంత్రాంగంలో అన్నివర్గాలవారికీ ప్రాతినిధ్యం కల్పించ లేదు. అటువంటి అవకాశం పార్లమెంటరీ విధానంలో మాత్రమే ఉంటుంది. అధ్యక్షపదవి ఏదో ఒకవర్గానికి చెందిన వ్యక్తికి మాత్రమే లభిస్తుంది. అదే మంత్రిమండలయితే అన్నివర్గాలవారికి దానిలో చోటు ఉంటుంది. దీనివల్ల కొన్ని వర్గాలవారికి అసంతృప్తి కలుగుతుంది. దీనివల్ల పరిపాలనలో అధ్యక్షునికి వారి సహకారం లభించదు. అందరి సహకారంలేనిదే మంచిపరిపాలన అందివ్వడం కష్టము.

4. అధ్యక్షపాలనలో అధ్యక్షుడు, అతని మంత్రిమండలి శాసనసభకు బాధ్యత వహించరు. వారు కనీసం. దానిలో భాగస్వాములైనాకారు. దీనివల్ల కార్యనిర్వాహణశాఖకు, శాసననిర్మాణశాఖకు మధ్య సమన్వయం లోపిస్తుంది. ప్రత్యేకంగా అధ్యక్షుడు ఒక పార్టీవ్యక్తి అయి, శాసనసభలో మెజారిటీ మరొక పార్టీకిలభిస్తే వీరిమధ్య వివాదం మరింత తీవ్రస్థాయికి చేరు కొని శాసననిర్మాణంలో ప్రతిష్టంభన ఏర్పడుతుంది. శాసనసభ అధ్యక్షుని అధికారాలు పెంచ డానికి ఇష్టపడదు. శాసనసభచేసిన శాసనాలను అధ్యక్షుడు 'వీటో' (Veto) చేస్తాడు. అధ్యక్షుడు పరిపాలనకు కావలసిన శాసనాలు నిర్మించుకోవలెనంటే దానికి శాసనసభ సహకారం లభించదు. ఈ రెండు ప్రభుత్వాంగాలు పరస్పరం అనుమానిస్తూ ఆటంకాలు కల్పించుకొంటూఉంటే జాతిప్రయోజనం దెబ్బతింటుంది.

5. అధ్యక్షపాలనలో శాసననిర్మాణశాఖకు ప్రాముఖ్యం ఉండదు. అక్కడ జరిగే

చర్చలు వాదోపవాదాలు పేలపంగాఉంటాయి. ప్రజలు తమకేకష్టంవచ్చినా అధ్యక్షుని వైపు చూస్తారేకాని శాసనసభ్యులపై వారిదృష్టి ఉండదు. కాబట్టి శాసనసభలు ప్రజాభిప్రాయాన్ని ఎంతమాత్రం ప్రభావితం చేయలేవు.

6. అధ్యక్షపాలనలో అధికార పృథక్కరణవల్ల నియంతృత్వం నివారించబడేమాట వాస్తవమే అయినా, అధికార పృథక్కరణవల్ల ఇతరత్రా అనేక అనర్థాలున్నాయి. ఈ పద్ధతిలో అధ్యక్షుని సామాన్యపరిస్థితిలో శాసనసభ తొలిగించలేదు. అదేవిధంగా శాసనసభను రద్దు చేసేశక్తి అధ్యక్షునికి ఉండదు. ఈ లోపం బాధ్యతాయుతపాలనలో సరిదిద్దబడింది.

7. అధ్యక్షపాలనలో అధ్యక్షునిపదవి సుస్థిరమైనది. అతడు తనంత తాను రాజీనామా చేయవలె లేదా అతనిపై మహాభియోగతీర్మానం ప్రవేశపెట్టి తొలిగించవలెనే తప్ప, మామూలు పరిస్థితులలో అతనిని నాలుగు సంవత్సరాలవరకు పదవినుంచి తొలిగించడానికి వీలు ఉండదు. దీనివల్ల యుద్ధం, అరాజకం వంటి క్లిష్టపరిస్థితులు ఏర్పడితే అసమర్థుడైన అధ్యక్షుని తొలిగించి సమర్థుడైన మరొకవ్యక్తిని ఆ స్థానంలో నిలబెట్టడానికి అవకాశం ఉండదు. రెండో ప్రపంచయుద్ధకాలంలో అమెరికాకు అదృష్టంకొద్దీ రూజ్‌వెల్ట్‌వంటి సమర్థుడైన అధ్యక్షుని నాయకత్వం లభించింది. ఆ స్థానంలో వేరే వ్యక్తి ఉంటే ప్రపంచరాజకీయాలెట్లా ఉండి ఉండేవోనని కొందరి అభిప్రాయము.

## పార్లమెంటరీ విధానము
### ( Parliamentary System )

కార్యనిర్వాహకవర్గాన్ని పార్లమెంట్‌నుంచి ఎంపిక చేసుకొని, పార్లమెంట్ విశ్వాస మున్నంతకాలం అది పదవిలో ఉంటే అటువంటి కార్యనిర్వాహకవర్గాన్ని "పార్లమెంటరీ కార్యనిర్వాహకవర్గము" అని అంటారు. ఈవిధానంలో రాజ్యాధిపతి, ప్రభుత్వాధిపతి వేరువేరుగా ఉంటారు. రాజ్యాధిపతిగా బ్రిటన్‌లో వలె రాజుగాని లేదా ఇండియాలో వలె పరోక్షంగా ఎన్నుకోబడిన అధ్యక్షుడుగాని ఉంటారు. వారికి నిజమైన అధికారాలు ఉండవు. వారి పేరుమీద సర్వాధికారాలు ప్రధానమంత్రి అధ్యక్షతన పనిచేసే మంత్రిమండలి అనుభవిస్తుంది. మంత్రివర్గము నిజమైన కార్యనిర్వాహకవర్గము. ఈ కారణంగా దీనినికొందరు "మంత్రివర్గపాలనా విధానము" (Cabinet form of Government) అని కూడా పిలుస్తారు. మరికొందరు ఈ పద్ధతిని "బాధ్యతాయుతపాలన" (Responsible Government) అని పిలుస్తారు. మంత్రిమండలి తన చర్యలకు వ్యక్తిగతంగాను, సమష్టిగాను శాసనసభకు బాధ్యత వహించవలె. మంత్రిమండలి ప్రవేశపెట్టిన ఆర్థికబిల్లులు, చిత్తుచట్టాలను శాసనసభ తోసిపుచ్చనంతకాలం అది పదవిలో ఉండవచ్చు. శాసనసభలోమెజారిటీ పార్టీనాయకుని రాజ్యాధిపతి ప్రధానిగా నియమిస్తాడు. అతని సలహాపై మంత్రిమండలిలోని ఇతర మంత్రులను నియమిస్తాడు. మంత్రులు విధిగా శాసనసభ్యులై ఉండవలె. మంత్రిమండలి తన విధినిర్వహణలో ఒక జట్టుగా పని చేయవలె. వారు ప్రభుత్వపాలనా సాగరాన్ని కలిసి మధించవలె. అందులో అమృతం పుట్టినా హాలాహలం పుట్టినా ఫలితం సమంగాపంచుకోవలె. ప్రధానికోరితే ఏ మంత్రి అయినా పదవినుంచి తొలిగిపోవలె; లేకపోతే అతనిని తొలిగించమని ప్రధాని అధ్యక్షునికి సలహా ఇవ్వవచ్చు. ఆ సలహాను రాజ్యాధిపతి తప్పక పాటించవలె.

పార్లమెంటరీ విధానము - ప్రయోజనాలు

1. పార్లమెంటరీ విధానంలో కార్యనిర్వాహకవర్గం శాసనసభలో అంతర్భాగంగా ఉంటుంది. కాబట్టి ఆ రెండు ప్రభుత్వాంగాల మధ్య చక్కని సమన్వయం ఉంటుంది. ఈ విధానంలో కార్యనిర్వాహకవర్గము శాసనసభలో ప్రతిపక్షాలుచేసే విమర్శలను బట్టి ప్రజాభిప్రాయాన్ని గ్రహించి, దాని కనుగుణంగా తన విధానాలను మార్చుకోవచ్చు. అంతేకాక శాసనాలను అమలు పరచడంలో కార్యనిర్వాహకవర్గానికి ఉండే అనుభవాన్ని శాసననిర్మాణంలో శాసనసభ వినియోగించుకోవడానికి దీనిలో అవకాశముంది. ఇటువంటి అవకాశం అధ్యక్ష పాలనలో ఉండదని చెబుతూ "అధ్యక్షపాలన అమలులో ఉండే అమెరికాలో కాంగ్రెస్ శూన్యంలో శాసనాలు చేస్తుంది" అని హెచ్.జె. లాస్కీ చమత్కరించినాడు.

2. కార్యనిర్వాహకవర్గ శాసనసభలో అంతర్భాగంగా ఉండటంవల్ల మరొక ప్రయోజనం కూడా ఉంది. అది పరిపాలనకు కావలసిన శాసనాలను శాసనసభ సహాయంతో సులభంగా రూపొందించుకోగలదు. శాసనసభలో కార్యనిర్వాహకవర్గానికి మెజారిటీ సభ్యుల మద్దతు ఉంటుంది. కాబట్టి అది తనకు కావలసిన గ్రాంట్లను కూడా సులభంగా సంపాదించ గలుగుతుంది.

3. అధ్యక్షవిధానంలో కార్యనిర్వహణ, శాసననిర్మాణ శాఖలు రెండిటికి ఒకదానిపై మరొకదానికి విశ్వాసముండదు. ప్రత్యేకంగా అధ్యక్షునికి వ్యతిరేకంగా ఉండే పార్టీకి శాసన సభలో మెజారిటీలభిస్తే, ఈ రెండు ప్రభుత్వాంగాలు పరస్పరం అనుమానించుకొంటూ ఉండటంవల్ల శాసన నిర్మాణంలోను, పరిపాలనలోను ప్రతిష్టంభన ఏర్పడుతుంది. ఇటువంటి సమస్యలు పార్లమెంటరీ విధానంలో ఉండవు. ఒకవేళ ప్రతిపక్షంచేసిన విమర్శలు సహేతుకంగా ఉన్నాయని అధికారపక్షం అనుకొంటే సహృదయంతో వాటిని స్వీకరించి తన విధానాలు సవరించుకొంటుంది. అధికార, ప్రతిపక్షాల మధ్య ఇటువంటి సర్దుబాటుకు అవకాశముంటే ప్రజలు కోరుకొనే పరిపాలనను ప్రభుత్వం అందివ్వగలదు.

4. బాధ్యతాయుతపాలనలో రెండు పార్టీలపద్ధతికి (Two party system) కూడా అవకాశముంటే పరిపాలన చక్కగా సాగుతుంది. వాటిమధ్య ఉండే స్పర్థలు, పోటీ ప్రజలకు మేలుచేస్తాయి. ప్రతిపక్షం అధికారపక్షం లోపాలను ఎత్తిచూపితే అధికారపక్షం తన విధానాలు ఏ విధంగా గొప్పవో ఋజువు చేసుకోవడానికి ప్రయత్నిస్తుంది. దీనివల్ల పాలనాదక్షత పెరుగుతుంది.

5. పార్లమెంటరీ విధానంలో ప్రతి విషయాన్నీ మంత్రివర్గసభ్యులంతా కలిసి చర్చించి తుదినిర్ణయం తీసుకొంటారు. కాబట్టి వారి నిర్ణయాలు వివేకవంతమైనవిగా ఉండే అవకాశముంది. అధ్యక్షపాలనలో అయితే నిర్ణయాధికారం ఒకేవ్యక్తి చేతిలో ఉంటుంది. అతడే అన్ని విషయాలలోను స్వయంగా నిర్ణయాలు తీసుకొంటాడు. ఏసమస్యనైనా ఒకేవ్యక్తి పరిష్కరించే కంటె నలుగురు కలసి ఆలోచించి పరిష్కరించడం మేలు. అటువంటిదానికి పార్లమెంటరీ విధానంలో ఎక్కువ అవకాశముంది.

6. పార్లమెంటరీ విధానంలో నియంతృత్వానికి తావు లేదు. కార్యనిర్వాహకవర్గం తప్పని సరిగా శాసనసభకు బాధ్యతవహించవలె. మంత్రిమండలి చర్చలు నచ్చకపోతే ప్రతిపక్షాలు

అవిశ్వాస తీర్మానం ద్వారా వారిని పదవినుంచి తొలగించవచ్చు. కనీసం పాలకుల లోపాలు ప్రజల దృష్టికైనా తేవచ్చు.

7. అధికారకేంద్రీకరణను ప్రోత్సహించే అధ్యక్షపాలనకంటే అధికార వికేంద్రీకరణకు అవకాశమిచ్చే పార్లమెంటరీవిధానం మెరుగైనది. అది ప్రజాస్వామ్య సూత్రాలకు అనుగుణమైనది. దీనిలో మంత్రులు ప్రభుత్వాధికారాలను పంచుకొంటారు. అధ్యక్షపాలనలో అన్ని బాధ్యతలు ఒకేవ్యక్తి నిర్వహించడం వల్ల అతనికి పని భారం ఎక్కువై కొన్ని పనులు సరిగా నిర్వహించలేక పోవచ్చు. పార్లమెంటరీ విధానంలో ఇటువంటి సమస్యలుండవు.

8. పార్లమెంటరీ మంత్రివర్గాలలో దేశంలో ఉండే అన్ని వర్గాలవారికి స్థానమివ్వడం ద్వారా సమాజంలో ఉండే అందరివ్యక్తుల ప్రయోజనాలు కాపాడవచ్చు. విభిన్న ప్రాంతాల వారిని దీనిలో సభ్యులుగా చేయడంద్వారా ఆ యా ప్రాంతాల అభివృద్ధికి వారు కృషిచేయడమే కాక జాతీయ సామరస్యం, అవగాహన పెరుగుతాయి.

9 క్లిష్టపరిస్థితులలో కార్యనిర్వాహకవర్గంలో మార్పులు చేసి దేశాన్ని ప్రమాదం నుంచి తప్పించవచ్చు. ఉన్నప్రధాని సమర్థుడుకాకపోతే అతనిని తొలగించి కొత్తవారిని ఎన్నుకోవచ్చు. దీనికి ఎన్నికల నిర్వహణ వంటి హంగామా అవసరంలేదు. క్లిష్టపరిస్థితులను ఎదుర్కోవడానికి శాసనసభ కార్యనిర్వాహకవర్గానికి నిర్భయంగా ఎటువంటి అధికారాలనైనా ఇచ్చి పనిపూర్తి అయినాక తిరిగి స్వాధీనం చేసుకోవచ్చు. ఇటువంటి అవకాశం అధ్యక్షపాలనలో ఉండదు. బంగ్లాదేష్ యుద్ధకాలంలో అప్పటి ప్రధాని ఇందిరాగాంధి ప్రభుత్వానికి యుద్ధప్రమాదం ఎదుర్కోవడానికి భారత పార్లమెంట్ సర్వాధికారాలు ఇచ్చింది. బ్రిటన్‌లో యుద్ధకాలంలో దేశాన్ని నడిపించడానికి లార్డ్‌చర్చిల్ వంటి యుద్ధనిపుణుని ప్రధానిగా ఎంచుకొన్నారు. యుద్ధంముగిసిన తరవాత శాంతికాముకుడైన లార్డ్‌అట్లీని గెలిపించినారు. దేశంలో క్లిష్టపరిస్థితి తొలగేవరకు ఈ విధానంలో ఎన్నికలు వాయిదా వేయవచ్చు. అమెరికాలో అది అసాధ్యము. రెండవ ప్రపంచయుద్ధం జరుగుతుండగా కూడా అక్కడ ఎన్నికలు జరిగినాయి.

10. అధ్యక్షపాలనలోకంటె, పార్లమెంటరీవిధానంలో ప్రజలు మంత్రులయొక్క తమ ప్రతినిధులయొక్క సామర్థ్యము, నైపుణ్యము ఎటువంటిదో తెలుసుకోవడానికి ఎక్కువ అవకాశముంటుంది. శాసనసభలో జరిగే చర్చలు, వాదోపవాదాలనుబట్టి వారు భావినాయకుల సామర్థ్యం అంచనా వేయగలరు. అందుకే ఈ విధానంలో శాసనసభలో జరిగే చర్చలు రసవత్తరంగాను, విజ్ఞానదాయకంగాను ఉండి పండిత పామరులను ఇద్దరినీ సమంగా ఆకర్షిస్తాయి. వారిలో రాజకీయచైతన్యం పుట్టిస్తాయి.

**లోపాలు**

1. పార్లమెంటరీకార్యనిర్వాహకవర్గము స్థిరంగా కొంతకాలంపాటు పదవిలో ఉండలేదు. రెండు పార్టీల పద్ధతి అమలులో ఉండే బ్రిటన్ వంటి దేశాలలో ఈ సమస్య ఉత్పన్నం కాక పోయినా ఫ్రాన్స్, ఇండియా వంటిదేశాలలో అనేక రాజకీయపక్షాలు ఉండటం వల్ల ఏ ఒక్క పార్టీకి శాసనసభలో ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి తగినంత మెజారిటీ లభించక పోవడం వల్ల తరచు ఏకాభిప్రాయం గల పార్టీలు కలసి "సంకీర్ణమంత్రివర్గాలు" (Coalition Cabinets) ఏర్పడతాయి. అయితే వారిమధ్య సిద్ధాంతపరంగా మౌలికవ్యత్యాసాలు ఉండటం

వల్ల, అధికార దాహంవల్ల వారిలో వారు కీచులాడుకొంటూ స్థిరమైన ప్రభుత్వాన్ని ఏర్పరచడంలో విఫలమవుతారు. నాయకులు పదవివ్యామోహంలోపడి తమపార్టీలోనే చీలికలు తేవచ్చు అవకాశవాదంతో కూడిన "పార్టీ ఫిరాయింపు" (Party defection) జాడ్యానికి దీనిలో అవకాశం మెండు. ఇటీవల భారతదేశంలో ఉటువంటి పరిస్థితే నెలకొని ఉండేది. దీనివల్ల పరిపాలన స్థిరంగా సాఫీగా కొంతకాలం పాటు ఎటువంటి ఒడుదుడుకులు లేకుండా నిర్వహించవలెనంటే కుదరదు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం విజయం కావలెనంటే ప్రజాప్రతినిధులు నిస్వార్థమైన, నిష్కళంకమైన నైతికజీవితాన్ని అలవరచుకొని జాతి ప్రయోజనాల పరిరక్షణకు తమ జీవితాన్ని అంకితం చేయడం అవసరము. అది లేనంతకాలం పార్లమెంటరీ ప్రజాస్వామ్యాల భవిష్యత్తు భయాందోళనలను కలిగిస్తుంది.

2. ఈ విధానంలో పరిపాలనాధికారం ఒకవ్యక్తిచేతిలో ఉండదు. అది మంత్రిమండలి చేతిలో ఉంటుంది. వారంతా ఒకే జట్టుగా పనిచేసినా, మంత్రిమండలి అనేక మంది వ్యక్తుల కలయిక. వారిమధ్య వ్యక్తిగతమైన సిద్ధాంతపరమైన అభిప్రాయ భేదాలు, ఈర్ష్యాద్వేషాలు ఉండటం సహజము. అవి వారిని కలసి పనిచేయనివ్వవు. అదీకాక మంత్రులు నిర్వహించే శాఖలలో కూడా తరుచు మార్పులు జరుగుతుంటాయి. కొంతమంది వ్యక్తులకు మంత్రిమండలినుంచి ఉద్వాసనచెప్పడంజరుగుతుంది. దీనివల్ల వారు విధినిర్వహణాపరమైన నైపుణ్యాన్ని సంపాదించడంలో విఫలు లవుతారు.

3. పరిపాలన సమర్థవంతంగా ఉండవలెనంటే బాధ్యతల విభజన మంచిదికాదు. అట్లా జరిగితే క్లిష్టపరిస్థితిలో ఎవరికి వారు బాధ్యత ఇతరులపైకి నెట్టి తాము తప్పుకోవడానికి ప్రయత్నిస్తారు. అటువంటప్పుడు బాధ్యతాయుతపాలన బాధ్యతారహితపాలన అవుతుంది.

4. విదేశాంగవిధానాన్ని మలుచుకోవడం, యుద్ధాలను, అత్యవసరపరిస్థితులను ఎదుర్కోవడం వంటి విషయాలలో పార్లమెంటరీ విధానంకంటె అధ్యక్షపాలనే మేలు. అటువంటి పరిస్థితులను దేశం ఎదుర్కొనేటప్పుడు పాలకులు శీఘ్రంగా నిర్ణయాలు తీసుకోవలసి ఉంటుంది. విధాననిర్ణయంలో అభిప్రాయభేదాలు ఉండకూడదు. పరిపాలనంతా ఒక్కమాటమీద జరగవలె. కాని పార్లమెంటరీ కార్యనిర్వాహకవర్గము ఒకకూటమి కాబట్టి విధాన నిర్ణయంలో అంత కచ్చితంగా వ్యవహరించలేదు.

5. పార్లమెంటరీ కార్యనిర్వాహకవర్గాలు తమకున్న సమయంలో అధికభాగం శాసన సభాకార్యక్రమాల నిర్వాహణపై వెచ్చించవలసి ఉంటుంది. అవి సభలో మెజారిటీ నిలుపుకోవడంతోను, ప్రతిపక్షాల విమర్శలకు సమాధానాలు వెతుక్కోవడంతోను సతమతమవుతూ ఉంటాయి. దీనివల్ల అవి తమప్రధానవిధి అయిన కార్యనిర్వాహణపై శ్రద్ధచూపలేదు.

6. ఈ విధానంలో మంత్రివర్గ నిర్మాణం చాలా కష్టము. ఎంత జాగ్రత్తగా మంత్రుల ఎంపిక చేసినా అన్ని వర్గాలవారిని, అన్ని ప్రాంతాలవారిని సంతృప్తిపరచలేరు. అందరినీ సంతృప్తిపరచవలెనంటే మంత్రివర్గాల పరిమాణాన్ని పెంచుతూపోవలె. దీనివల్ల పాలనా వ్యయం పెరుగుతుంది. సమన్వయం కష్టమవుతుంది. మంత్రులమధ్య సామరస్యం ఉండదు. వర్గప్రాంతీయ ప్రతిపాదికపైన, బలాబలాల వ్యక్తీకరణపైన ఆధారపడి నిర్మించిన మంత్రివర్గాలలో జాతీయదృక్పథం కరువవుతుంది. ఇది జాతీయ సమైక్యతకు దోహదం చేయడానికి బదులు విచ్ఛిన్నకరశక్తులను ప్రోత్సహిస్తుంది.

7. అధ్యక్షపాలన వ్యక్తి నియంతృత్వానికి అవకాశమిస్తే, పార్లమెంటరీవిధానం పార్టీ నియంతృత్వానికి తావిస్తుంది. శాసనసభలో మెజారిటీ ఉండే కార్యనిర్వాహక వర్గంసర్వాధికారాలు చెలాయిస్తుంది. పార్టీని గుప్పిట్లో పెట్టుకొని ఆడించగల వ్యక్తి పార్టీ నాయకునిపదవి, ప్రధాన మంత్రి పదవి చేపడితే తిరుగు లేని అధికారాలు చెలాయించగలడు. మంత్రులను కీలుబొమ్మలు చేసి ఆడించి నియంతకంటె ఎక్కువ కాగలడు.

8. పార్లమెంటరీ విధానంలో మంత్రులు రాజకీయ నిపుణులే కాని పరిపాలనలో నిపుణులు కారు. శాఖల నిర్వహణకు కావలసిన నైపుణ్యం వారికి ఉండ నక్కరలేదు. వారు పరిపాలనా నిర్వాహణకు పూర్తిగా ప్రభుత్వోద్యోగులపై ఆధారపడతారు. అది ఉద్యోగి స్వామ్యానికి అవకాశమిస్తుంది.

9. ఈ విధానంలో రాజ్యాధినేత నామమాత్రంగా ఉండగా అతనికంటె తక్కువ హోదాలో ఉంటూ, అతని పేరు మీదుగా అధికారం చెలాయించే ప్రధానమంత్రికి ఎక్కువ గౌరవమర్యాదలు, పలుకుబడి ఉంటుంది. ఇది అసాధారణమైన విషయము.

మనమింతవరకు అధ్యక్షపార్లమెంటరీ విధానాలను గురించి సమగ్రంగా చర్చించినాము. రెండు విధానాలలోను కొన్ని లాభాలు, లోపాలు ఉన్నాయి. ఈ రెండిటిలోని లోపాలను కొంతవరకు స్విట్జర్లండ్‌లోని కార్యనిర్వాహక వర్గం సరిదిద్దింది. ఆ దేశంలో మంత్రివర్గం అన్ని రాజకీయపక్షాల కలయిక ద్వారా ఏర్పడుతుంది. శాసనసభలో ఆ యా పార్టీల కుండే బలాబలాలను బట్టి మంత్రివర్గాలు ఏర్పడతాయి. మంత్రివర్గం నిర్ణయాలను శాసనసభ ఆమోదించక పోయినా అది రాజీనామా చేయనక్కరలేదు. మంత్రివర్గం తన నిర్ణయాలను శాసనసభ అభీష్టానికి అనుగుణంగా మార్చుకొంటుంది. మంత్రివర్గానికి, శాసనసభకు మధ్య వివాదం వస్తే ఆ వివాదాన్ని ప్రజానిర్ణయసేకరణ ద్వారా పరిష్కరిస్తారు. అయితే ఇండియా వంటి పెద్ద దేశాలలో ప్రజాభిప్రాయ సేకరణ నిర్వహించడం కష్టము. కాబట్టి పై విధానం అవలంబించడం కష్టము. అయితే అధ్యక్షపార్లమెంటరీ విధానంలో తమ దేశానికి ఏ పద్ధతి అనుకూలమైనది అనే ప్రశ్న తలెత్తితే ప్రజల స్వభావానికి, దేశ సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులకు ఏది యోగ్యమో పరిశీలించి ఆ యా దేశాల ప్రజలే తమకు తగిన దానిని ఎంపిక చేసుకోవడం మంచిది.

## కార్యనిర్వాహకవర్గం విధులు

కార్యనిర్వాహకవర్గం నిర్వహించే విధులు ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క విధంగా ఉంటాయి. పరిస్థితులను బట్టి వాటిలో మార్పులు కూడా వస్తుంటాయి, ఈ విధులు పార్లమెంటరీ కార్యనిర్వాహకవర్గం విషయంలో ఒక విధంగాను, అధ్యక్షపాలనలో మరొక విధంగాను ఉంటాయి. స్థూలంగా కార్యనిర్వాహకవర్గాలు ఈక్రింది విధులను నిర్వహిస్తాయి :

1. *కార్యనిర్వాహక విధులు (Executive functions)* : పరిపాలనా నిర్వహణకు కార్యనిర్వాహకవర్గం అనేక మంది ఉన్నతోద్యోగులను నియమించవలె. ఇండియాలో రాష్ట్రపతి మంత్రిమండలి సలహాపై గవర్నర్లు, న్యాయమూర్తులు, అటార్నీ జనరల్, ఆడిటర్ జనరల్, సేనాధిపతులు, ఎన్నికల ప్రధానాధికారి, రాయబారులు మొదలైన వారిని అనేక మందిని నియమిస్తాడు. ఇతర దేశాలలో రాయబారి కార్యాలయాలను ఏర్పాటుచేయడం, కొత్తగా

ఏర్పడిన ప్రభుత్వాలను గుర్తించడం కార్యనిర్వాహకవర్గం విధి. జాతీయాభివృద్ధికి ప్రణాళికలు రూపొందించి అమలు పరచవలె. దేశీయ, విదేశాంగ విధానాన్ని ముందుకు నడిపించవలె. బడ్జెట్‌ను పార్లమెంట్‌కు సమర్పించి దాని ఆమోదంతో దానిని అమలు పరచవలె. దేశానికి సర్వసైన్యాధ్యక్షుడుగా వ్యవహరిస్తూ యుద్ధాన్ని ప్రకటించడం, సంధి సంప్రదింపులు జరపడం దీనివిధి. అయితే అమెరికాలో ఈ విషయంలో అధ్యక్షుని నిర్ణయాన్ని కాంగ్రెస్ సమ్మతించవలె.

2. **శాసననిర్మాణ విధులు** (*Legislative functions*) : శాసననిర్మాణం నిజానికి కార్యనిర్వాహకవర్గం విధి కాదు కాని అనేక ప్రజాస్వామిక దేశాలలో కార్యనిర్వాహకవర్గం శాసననిర్మాణంలో పాలుపంచుకొంటున్నది. శాసనసభ సంవత్సరం పొడుగునా సమావేశంలో ఉండదు. అది సమావేశంలో లేనప్పుడు పరిపాలనకు కావలసిన శాసనాలను కార్యనిర్వాహక వర్గం "ఆర్డినెన్స్‌ల" (Ordinances) రూపంలో జారీ చేస్తుంది. అవి అన్ని విధాల శాసన సభ రూపొందించిన శాసనాలవలె చెలామణి అవుతాయి. కాని శాసనసభ తిరిగి సమావేశ మైనప్పుడు వాటిని ధృవపరచవలె; లేకపోతే అవి రద్దవుతాయి. అధ్యక్షుడు శాసనసభకు తన సూచనలను, ఆదేశాలను పంపవచ్చు. పాత శాసనాలను రద్దుచేయమని, కొత్తవాటిని ప్రవేశపెట్టమని కోరవచ్చు. సభలో మెజారిటీ ఉంటే తనకు నచ్చిన శాసనాలను దాని సహాయంతో రూపొందించు కోవచ్చు.

ముఖ్య కార్యనిర్వాహణాధికారి ఆమోదం లేనిదే ఏ బిల్లూ చట్టం కాదు. అతడు శాసన సభ ఆమోదం పొందిన బిల్లులకు తన ఆమోదం తెలపవచ్చు; లేదా "వీటో" (Veto) చేయవచ్చు; లేదా పునఃపరిశీలనకు శాసనసభకు తిప్పిపంపవచ్చు. భారత రాజ్యాంగంలో అధ్యక్షుడు తన ఆమోదాన్ని నిలుపు చేయవచ్చునని ఉంది. అది ఎంతకాలమో సూచించలేదు. అధ్యక్షుడు ఈ నిలుపుచేసే అధికారాన్ని 'వీటో' అధికారంగా ఉపయోగించే అవకాశమున్నది అని కొందరి అభిప్రాయము. అంటే భారతదేశంలో అధ్యక్షునికి 'వీటో' అధికారము ఉన్నదా, లేదా అనేది వివాదాస్పదము. అమెరికా అధ్యక్షునికి ఈ అధికారాలన్నీ ఉన్నాయి. అతడు కొన్ని బిల్లులపై వెంటనే తన ఆమోదముద్ర వేయక కాలయాపన చేయవచ్చు (Suspensive veto).

శాసనసభలో శాసనాలు చేసేటప్పుడు తగిన సమయం లేని కారణంగా కొన్ని శాసనాల విషయంలో వాటికి అవసరమైన రూపురేఖలు, పరిధులు నిర్ణయించి వాటికి పరిపూర్ణ శాసన రూపం యివ్వడానికి తగిన అధికారాన్ని శాసనసభ కార్యనిర్వాహకవర్గానికి దత్తం చేస్తుంది. దీనినే దత్తశాసన అధికారం (Delegated Legislation) అంటారు.

ఇండియా బ్రిటన్‌లలో శాసనసభను సమావేశ పరచడానికి (To summon), సమావేశాన్ని దీర్ఘకాలం వాయిదా వేయడానికి (To prorogue), అర్ధాంతరంగా నిలిపి వేయడానికి (Sine die), రద్దుచేయడానికి (Dissolve) కార్యనిర్వాహకవర్గానికి అధికారముంది. ఇండియాలో రాష్ట్రపతి, బ్రిటన్‌లో చక్రవర్తి శాసనసభనుద్దేశించి ప్రసంగించవచ్చు. పార్లమెంటరీ విధానంలో కార్యనిర్వాహకవర్గము కొత్త చట్టాలను రూపొందించి, శాసనసభ ఆమోదంతో వాటిని అమలుపరచవలె. అంతేకాక ఈ విధానంలో కార్యనిర్వాహకవర్గం శాసన సభా నాయకత్వాన్ని కూడా వహించవలె. శాసనసభకు ఎప్పటికప్పుడు దేశస్థితిగతులను

గురించి తెలియజేయవలె. వాటిపై శాసనసభ అభిప్రాయాన్ని గ్రహించి తగిన చర్యలు తీసుకోవడం కార్యనిర్వాహకవర్గం విధి.

3. ***పరిపాలనాధికారాలు*** (*Administrative functions*) : కార్యనిర్వాహకవర్గం దేశపరిపాలనకు మూలము. పరిపాలనంతా కార్యనిర్వాహకవర్గం పేరు మీద జరుగుతుంది. ఉన్నతోద్యోగులను నియమించడం, విధులు అప్పగించడం, విధి నిర్వహణకు కావలసిన శిక్షణ ఇప్పించడం, వారిని క్రమశిక్షణలో ఉంచడం కార్య నిర్వాహక వర్గం విధులు. అవసరాన్ని బట్టి క్రొత్తపాలనా శాఖలను, వ్యవస్థలను నిర్మించవలె. ఉన్నవాటిని పునర్నిర్మించడంగాని, అవసరం లేకపోతే రద్దు చేయడంగాని దీనిపని. దేశంలో శాంతి భద్రతలు కాపాడటం, జైళ్ళు, పోలీసు సర్వీసు నిర్వహణ, నేరస్తులను శిక్షించడం, సివిల్ సర్వీస్ సిబ్బంది నిర్వహణ కార్యనిర్వాహకవర్గం విధుల క్రిందికే వస్తాయి.

4. ***న్యాయవిధులు*** (*Judicial functions*) : అనేక దేశాలలో ముఖ్యకార్యనిర్వహణాధికారులకు న్యాయపరమైన విధులున్నాయి. వారు న్యాయస్థానాలిచ్చిన శిక్షలను తాత్కాలికంగా నిలిపి వేయవచ్చు (Reprieve), లేదా శిక్ష అమలు కాకుండా వాయిదా వేయవచ్చు (Commutation), లేదా పూర్తిగా రద్దు చేసి క్షమాభిక్ష పెట్టవచ్చు (Pardon), ఒక శిక్షను మరొక శిక్షగా మార్చవచ్చు. ఇటువంటి అధికారాలు కార్య నిర్వాహకులకు ఉండటంవల్ల క్రిమినల్ కేసుల విచారణలో ఏమాత్రం అధర్మం జరిగినా లేదా నేర పరిశోధనలో క్రొత్త సాక్ష్యాధారాలు దొరికి నిర్దోషి అని తేలినా లేదా పరిస్థితులలో మార్పు వచ్చినా ధర్మ సంరక్షణ చేయడానికి వీలవుతుంది.

అనేక ప్రజాస్వామిక దేశాలలో ప్రధాన కార్యనిర్వాహకుడు ఉన్నత న్యాయమూర్తులను నియమిస్తున్నాడు. ఈ మధ్యకాలంలో ప్రజారోగ్యము, పట్టణ ప్రణాళికలు (Town Planning), విద్య మొదలైన రంగాలలో ప్రభుత్వ కార్యక్రమాల సంఖ్య పెరుగుతున్న కారణంగా కార్యనిర్వాహకవర్గాలు "అర్థ న్యాయపరమైన విధులు" (Quasi judicial functions) కూడా నిర్వహిస్తున్నాయి. సాధారణ న్యాయస్థానాలపై కేసుల ఒత్తిడి తగ్గించడానికి ఇండియాలో భూపరిమితి చట్టం క్రింద వచ్చిన తగాదాలను కార్యనిర్వాహకులతో ఏర్పడిన భూపరిమితి న్యాయస్థానాలు (Land ceiling Tribunals) పరిష్కరించడం మనందరికీ తెలిసిన విషయమే. రోజువారీ పరిపాలనలో తలెత్తే సామాన్య వివాదాలను శీఘ్రంగా పరిష్కరించడానికి కార్యనిర్వాహకవర్గం "పరిపాలనా న్యాయాధికారాన్ని" (Power of Administrative Adjudication) కూడా పొందింది. కొన్ని సందర్భాలలో విచారణ నిమిత్తం కార్యనిర్వాహకవర్గం ప్రత్యేక న్యాయస్థానాలను, ట్రిబ్యునల్స్, (Tribunals) ను ఏర్పాటు చేయవచ్చు.

5. ***ఇతరవిధులు*** (*Other functions*) : ఇండియాలో యుద్ధము, అంతర్యుద్ధము, ఆర్థిక సంక్షోభము వంటి తీవ్ర పరిస్థితులను ఎదుర్కొనడానికి కార్యనిర్వాహకవర్గానికి కొన్ని అసాధారణాధికారాలు (Extraordinary powers) ఇచ్చినారు. ఇటువంటి అధికారాలను అనేక దేశాలలో కార్యనిర్వాహకులు అనుభవిస్తున్నారు. ఆధునిక శ్రేయోరాజ్యాలలో ఆర్థిక ప్రణాళికలను రూపొందించి దేశాన్ని ఆర్థికరంగంలో ముందుకు నడిపించి ప్రజల జీవన

పరిస్థితులను మెరుగు పరచవలసిన గురుతర బాధ్యత కార్యనిర్వాహకవర్గంపై ఉంది. ఇండియాలో ప్రధానమంత్రి ఈ బాధ్యతలో భాగంగానే ప్రణాళికా సంఘానికి అధ్యక్షత (Ex officio chairman) వహిస్తాడు.

## ఆధునిక రాజ్యాలలో కార్యనిర్వాహకవర్గం పాత్ర
## (Role of Executive in the Modern State)

ఆధునిక రాజ్యాలలో పరిపాలనలో కార్యనిర్వాహకవర్గం పాత్ర దిన దిన ప్రవర్ధమానమవుతున్నది. అది నిర్వహించవలసిన విధులు, బాధ్యతలు అనేక కారణాలుగా పెరుగుతున్నాయి. నేడు కార్యనిర్వాహకులు శాసనాలను అమలుపరచడంతో సంతృప్తి పడటంలేదు. దత్తశాసన నిర్మాణాధికారం కింద తామే స్వయంగా శాసనాలు రూపొందిస్తూ శాసనసభను అధిగమిస్తున్నారు. పరిపాలనా న్యాయం పేరుతో న్యాయశాఖ పరిధిలోకి చొచ్చుకొనిపోతున్నారు. పోలీసు రాజ్యాలు శ్రేయోరాజ్యాలుగా మారడంతో రాజ్యవిధులు విశేషంగా పెరిగాయి. కీలకమైన పరిశ్రమలు, ఉత్పత్తి, పంపిణీ సాధనాలు జాతీయాకరణ చేయవలసి వచ్చింది. దీనితో ఆర్థికరంగం పరిపాలకుని గుప్పిట్లోకి వచ్చింది. దేశ ప్రజల ఆశలకు ఆశయాలకు కార్యనిర్వాహకుడు విధాత అయినాడు. ప్రతి పౌరుని కనీసావసరాలు తీర్చడానికి, సమర్థవంతమైన పరిపాలన అందివ్వడానికి, దానికి కావలసిన పాలనా యంత్రాంగాన్ని తీర్చిదిద్దడానికి కార్యనిర్వాహకవర్గమే మూలము.

సామ్యవాద, సమష్టివాద సూత్రాలే కాక పెట్టుబడిదారీ విధానం కూడా పరిపాలనలో కార్యనిర్వాహకవర్గం పాత్రను పెంచుతున్నాయి. పారిశ్రామికీకరణ తెచ్చే నూతన సమస్యలు ఎదుర్కొని సామాజిక న్యాయాన్ని చేకూర్చడానికి నేటి కార్యనిర్వాహకవర్గాలు కంకణం కట్టుకొన్నాయి.

శాస్త్రీయ, సాంకేతిక ప్రగతి కొత్త సమస్యలను, చిత్ర విచిత్రమైన పరిస్థితులను సృష్టిస్తున్నది. పొరుగు దేశం ఒక మారణాయుధం రూపొందిస్తే దానికి తమ దేశం ఎట్లా జవాబు చెప్పవలెనని కార్యనిర్వాహకుడు యోచించవలసి ఉంది. జాతీయ రక్షణకు తగిన చర్యలు తీసుకోవడం, అంతర్జాతీయ రంగంలో కొత్తమిత్రులను ఏర్పరచుకోవడం, వర్తక వాణిజ్యరంగాలలో పొరుగుదేశాల సహాయ సహకారాలు సంపాదించడం, దేశఆర్థిక, విద్యా వైజ్ఞానిక శాస్త్రీయ ప్రగతికి గట్టి పునాది వేయడం కార్యనిర్వాహక వర్గం బాధ్యత కావడంతో అతని పరపతి, పలుకుబడి అవధులుదాటి పెరుగుతాయి.

ప్రజలలో వారు వ్యక్తిగతంగా సంపాదించిన పలుకుబడి, పేరు వారికి బలాన్ని చేకూర్చడంవల్ల పరిపాలనలో వారు కీలకమైన పాత్ర నిర్వహింప గలుగుతున్నారు. వీరపూజ (Hero worship) పార్టీ, పద్ధతి ప్రభావము ఆధునిక ప్రచారసాధనాల ప్రభావము కూడా కార్యనిర్వాహకుని స్థానాన్ని, ప్రాముఖ్యాన్ని పెంచుతున్నాయి. ప్రజలు తనపై ఉంచిన నమ్మకాన్ని వమ్ము కాకుండా కాపాడుకొని, వారికి తన పట్ల, తన పరిపాలన పట్ల విశ్వాసాన్ని పుట్టించడంలో కృతకృత్యుడైన కార్యనిర్వాహకుడు దేశానికి మకుటం లేని మహారాజువలె లుగొందుతాడు

### సివిల్ సర్వీసులు

కార్యనిర్వాహక వర్గాన్ని ఆధునిక కాలంలో రెండుభాగాలుగా వర్గీకరించవచ్చు. శాసనాలను అమలు పరచమని ఆదేశాలివ్చి, అవి ఏ విధంగా అమలు పరచబడుతున్నదీ పర్యవేక్షించే విభాగాన్ని **"రాజకీయ కార్యనిర్వాహక వర్గం" (Political executive)**

అని, దాని ఆదేశాల ప్రకారం నడుచుకొనే ఉద్యోగి సముదాయాన్ని "పాలకవర్గము" (Administrative executive) లేదా "సివిల్ సర్వీసులు" (Civil services) అని అంటారు. నేడు ప్రతి రాజ్యంలోను ప్రభుత్వయంత్రాంగాన్ని నడిపించేది వేలాది సంఖ్యలో ఉండే ఈ పెద్ద చిన్న ఉద్యోగుల సముదాయమే. రోజు రోజుకు జటిలము, సాంకేతిక పరము (Technical) అవుతున్న పాలనావ్యవహారాలను సివిల్ సర్వీసుకు చెందిన నిపుణులు నిర్వహిస్తారు. వీరు ఆయావిధుల నిర్వహణలో ప్రత్యేకంగా శిక్షణ పొందిన వ్యక్తులు. స్వతంత్ర ప్రతిపత్తిగల పబ్లిక్ సర్వీస్ కమీషన్లు నిష్పక్షపాతంగా నిర్వహించిన పోటీ పరీక్షలలో ఉత్తీర్ణులైన యువతీ యువకులను ప్రతిభ నాధారంగా తీసుకొని వీటిలో పని చేయడానికి ఎంపిక చేసు కొంటారు. వారు పదవీ విరమణ వయసు చేరుకొనేదాకా ఉద్యోగంలో ఉంటూ పరిపాలన నిరాటంకంగా, సాఫీగా, అధికారపక్షం కోరికల కనుగుణంగా నిర్వహిస్తారు. వీరు రాజకీయాలకు అతీతంగా ఉండవలె.

రాజకీయ కార్యనిర్వాహకవర్గంలో ఉండే వారు రాజకీయ నాయకులేగాని వృత్తికి సంబంధించినవారు కారు. వారికిపరిపాలనలో నైపుణ్యంగాని ప్రత్యేక అర్హతలుగాని అవసరం లేదు. వీరి పదవి శాశ్వతమైనది కాదు. ఎన్నికలు వచ్చినప్పుడల్లా వీరు మారుతూ ఉంటారు. వీరు రాజకీయ దురంధరులేగాని పరిపాలనా నిపుణులు కారు. ప్రజా ప్రతినిధులుగా వీరు ప్రజాభిప్రాయం గ్రహించి విధానాలను పాలకవర్గానికి అప్పగిస్తే వారు మంత్రుల అభిప్రాయా లకు రూప కల్పనచేసి వాటిని ఆచరణాత్మకమైన కార్యక్రమాలుగా తీర్చిదిద్ది అమలు పరుస్తారు.

పాలకవర్గం రాజకీయ కార్యనిర్వాహకవర్గానికి పరిపాలనలో అన్ని విధాలా సహాయ పడవలె, సలహాలను అందివ్వవలె. అది ప్రజాప్రతినిధి అయిన మంత్రులకు విధేయత ప్రకటిం చడం ప్రజాస్వామ్యంలో చాలా అవసరము. అయితే నిపుణులు మేధావులు, అనుభవజ్ఞులు అయిన ప్రభుత్వోద్యోగులను నొప్పించే మంత్రి అనేక చిక్కులను ఎదుర్కొన వలసి వస్తుంది. పాలకవర్గానికి, కార్యనిర్వాహకవర్గానికి మధ్య ఉండే సత్సంబంధాలపైననే ప్రజాస్వామ్య జయాపజయాలు ఆధారపడి ఉంటాయి.

## ప్రశ్నలు

వ్యాసప్రశ్నావళి

1. కార్యనిర్వాహకవర్గమంటే ఏమిటి? కార్యనిర్వాహకవర్గ నియామకంలో వివిధ దేశాలు అనుసరించే పద్ధతులను తెలిపి వాటిలో ఏది అనుసరణీయమో వివరించండి.
2. అధ్యక్షపాలనా విధానంలోని ప్రయోజనాలు, లోపాలు వివరించండి.
3. పార్లమెంటరీ కార్యనిర్వాహకవర్గ విధానంలోని గుణదోషాలు తెలపండి.
4. ఆధునిక ప్రజాస్వామ్యాలలో కార్యనిర్వాహకవర్గం నిర్వహించే విధులను వివరించండి.

సంక్షిప్త సమాధాన ప్రశ్నావళి

1. కార్యనిర్వాహకవర్గంలోని రకాలను క్లుప్తంగా తెలపండి.
2. ఆధునిక రాజ్యాలలో కార్యనిర్వాహకవర్గం ప్రాధాన్యం పెరగడానికి కారణాలు వివరించండి.

# 5
# ప్రభుత్వాంగాలు-న్యాయవ్యవస్థ
(Organs of Government-Judiciary)

ప్రభుత్వాంగాలలో న్యాయశాఖ మూడోది. త్వరితగతిని, ఎటువంటి పక్షపాతానికీ తావు లేకుండా ప్రజలకు న్యాయం చేకూర్చడంమీద దేశ శ్రేయస్సు, ప్రభుత్వ ఔన్నత్యము ఆధారపడి ఉంటాయని లార్డ్ బ్రైస్ (Lord Bryce) అంటాడు. సక్రమమైన న్యాయపాలన ప్రజలకు ప్రభుత్వంమీద విశ్వాసాన్ని పెంపొందిస్తుంది. వారిని ప్రభుత్వంయొక్క, తోటి పౌరులయొక్క దౌర్జన్యం నుంచి రక్షిస్తుంది. వారి హక్కులను కాపాడి క్రమబద్ధమైన పరిపాలనకు, ప్రజాస్వామ్య విజయానికి పునాది అవుతుంది. దుష్టశిక్షణ శిష్టరక్షణ న్యాయశాఖ మూలసూత్రము. వ్యక్తి భద్రత, స్వేచ్ఛ కాపాడవలెనంటే పక్షపాతరహితంగాను, ధర్మబద్ధంగాను, నిర్భయంగాను తీర్పులను ప్రకటించగలిగిన స్వతంత్ర ప్రతిపత్తిగల న్యాయవ్యవస్థ చాలా అవసరము.

## న్యాయశాఖ విధులు (Functions of the Judiciary)

న్యాయశాఖ ప్రధానవిధి న్యాయపరిపాలన. అది నేరాలను విచారణ జరిపి యదార్థాన్ని కనుక్కొని నేరస్థులకు తగిన శిక్షలు విధిస్తుంది. ఈ విషయంలో న్యాయస్థానాలు దేశంలో అమలులోఉన్న న్యాయ సూత్రాలను అనుసరించి తీర్పులు ప్రకటిస్తాయి. అమలులోఉన్న న్యాయసూత్రాలు తీర్పులివ్వడానికి అనువుగా లేకపోతే న్యాయమూర్తులు "సమతా ధర్మాన్ని" (Equity) బట్టి ధర్మసంరక్షణ చేస్తారు.

ప్రజాస్వామ్యాలలో రాజ్యాంగాన్ని కాపాడవలసిన బాధ్యత న్యాయవ్యవస్థపై ఉంది. ప్రభుత్వము, ప్రజలు రాజ్యాంగబద్ధంగా నడుచుకోవలె. ప్రత్యేకంగా శాసన నిర్మాణశాఖ, కార్యనిర్వాహకవర్గము తమ విధి నిర్వహణలో రాజ్యాంగ విరుద్ధంగా ప్రవర్తిస్తే న్యాయశాఖ దానిపై న్యాయసమీక్ష (Judicial review) జరిపి చట్టవిరుద్ధమైన వాటి (Ultra vires) చర్యలు చెల్లనేరవు (Null and void) అని తీర్పు ఇస్తుంది. న్యాయ శాసనాలను, రాజ్యాంగ చట్టాన్ని వ్యాఖ్యానించడంద్వారా వాటికి అర్థవివరణ చెప్పడమేకాక రాజ్యాంగ విరుద్ధమైన అంశాలను అమలుపరచవద్దని ఆజ్ఞలు జారీ చేస్తుంది. దీనినే "న్యాయసమీక్ష" (Judicial review) అంటారు.

పౌరుల ప్రాథమిక హక్కులను కాపాడటానికి ఉన్నత న్యాయస్థానాలు హెబియస్ కార్పస్, మాండమస్, సెర్షియొరారీ మొదలైన "రిట్" (Writ) లను రూపొందించి జారీ చేస్తుంది. అమెరికాలో ఉన్నత న్యాయస్థానాలు ప్రభుత్వ శాసనాలుగాని, ప్రైవేట్ పౌరుల చర్యలుగాని పౌరహక్కులకు హానికలిగించేటట్లు ఉంటే ముందుగానే "నిలుపుదల ఉత్తరువులు" (Stay orders) జారీచేయడంద్వారా వారికి రక్షణ కల్పిస్తాయి.

సమాఖ్య రాజ్య వ్యవస్థలో న్యాయ వ్యవస్థకు ప్రత్యేకమైన పాత్ర ఉంది. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలమధ్య అధికారాల విషయంలో పరస్పరం తలెత్తే వివాదాలను పరిష్కరించి సమాఖ్య చక్కగా పనిచేసేటట్లు చేయడానికి ఇది దోహదం చేస్తుంది. ఈ అధికారం గనక శాసనసభలకు అప్పగిస్తే అవి అధికారాలను తామే స్వాధీనం చేసుకొని సమాఖ్యను విచ్ఛిన్నం చేస్తాయి. అట్లాకాక ఈ అధికారం కేంద్ర ప్రభుత్వానికిస్తే అది రాష్ట్రాలనుంచి ఒక్కొక్క అధికారాన్నే గుంజుకొని చివరకు సమాఖ్యను ఏకకేంద్ర రాజ్యంగా మార్చివేసే ప్రమాదముంది.

శాసన నిర్మాణంలోగాని, రాజ్యాంగపరమైన విషయాలలోగాని, పరిపాలనలో గాని కార్యనిర్వాహకవర్గానికి న్యాయపరమైన అనుమానాలేమైనా ఉంటే అది న్యాయశాఖ సలహా స్వీకరిస్తుంది. ఉన్నత పదవులలో ఉండే కొందరు వ్యక్తులు అధికారాన్ని దుర్వినియోగం చేస్తే వారు చేసిన నేరాలపై శీఘ్రగతిని విచారణ జరిపించడానికి ప్రత్యేక న్యాయస్థానాలను నెలకొల్పే అధికారం ప్రభుత్వానికి ఎంతవరకు ఉన్నది తెలుసుకొనేందుకు భారత రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి సుప్రీంకోర్ట్ సలహా స్వీకరించినారు.

ఉన్నత న్యాయస్థానాలు, న్యాయవ్యవస్థ సక్రమంగా పనిచేయడానికి కావలసిన నియమ నిబంధలను స్వయంగా రూపొందించుకోవలె. న్యాయ యంత్రాంగంలో పనిచేసే ఉద్యోగులను క్రమశిక్షణలో ఉంచడం, దిగువ న్యాయస్థానాల పనులను సమీక్షించడం, అవి చేపట్టిన కేసులు, ఇచ్చిన తీర్పులు భవిష్యత్తులో వినియోగించుకోవడానికి వీలుగా రికార్డ్‌చేసి భద్ర పరచడం వంటి విధులను నిర్వహిస్తాయి. సోవియెట్ యూనియన్‌లో న్యాయశాఖ కమ్యూనిస్ట్ సమాజ నిర్మాణంలో ప్రత్యక్షంగా పాల్గొంటుంది.

## న్యాయవ్యవస్థకు ఉండవలసిన లక్షణాలు

న్యాయవ్యవస్థ ఔన్నత్యాన్ని కాపాడవలెనంటే ఆయాదేశాలలో అనుసరించే శాసనాలు ధర్మబద్ధంగాను, నీతి నియమానుసారంగాను ఉండవలె. న్యాయ సూత్రాలలో తరుచు మార్పులు రాకూడదు. అవి స్థిరంగా వర్తించేవిగా ఉండవలె. న్యాయ సూత్రాలలో తరుచు మార్పులు వస్తూ ఉంటే ప్రజలకు న్యాయవ్యవస్థపై విశ్వాసం సన్నగిల్లుతుంది. చట్టం దృష్టిలో నేరంగా పరిగణించబడిన నేరాలకు మాత్రమే న్యాయస్థానాలు శిక్షలు విధించవలె. ఒకే విధమైన నేరానికి ఒకే రకమైన శిక్ష విధించవలెగాని వ్యత్యాసాలుండకూడదు. ఒక వ్యక్తి తాను చేసిన నేరాలకు ఒక పర్యాయం మాత్రమే శిక్షను అనుభవించవలె, అనేకమారులు శిక్షించబడకూడదు. న్యాయ మూర్తులు అవినీతికి పాలుపడకూడదు. అటువంటిదానికి అవకాశంలేని విధంగా న్యాయ వ్యవస్థను నిర్మించవలె. న్యాయమూర్తులు నిర్భయంగా, నిష్పక్షపాతంగా ఎటువంటి ప్రలోభాలకు లోనుకాకుండా ఉండవలెనంటే న్యాయవ్యవస్థకు స్వతంత్ర ప్రతిపత్తిఉండవలె. న్యాయవ్యవస్థను రాజకీయాలకు అతీతంగా ఉంచవలె. విచారణలు బహిరంగంగా జరిపించి, తీర్పు బహిరంగంగా ప్రకటించి, శిక్ష బహిరంగంగా అమలుపరచవలె. దోషిగా నిర్ణయించబడిన వ్యక్తి, తనకు దిగువ న్యాయస్థానంలో న్యాయం సరిగా చేకూరలేదని భావిస్తే ఉన్నత న్యాయస్థానానికి అప్పీలు చేసుకొని తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవడానికి అవకాశంఉండవలె. చట్టం దృష్టిలో వ్యక్తు లందరినీ ఎటువంటి తారతమ్యాలు చూపక సమానంగా పరిగణించవలె అటువంటి "సమ

న్యాయపాలన" (Rule of law) న్యాయశాఖ ఔన్నత్యాన్ని ఇనుమడింపజేస్తుంది. అయితే ఫ్రాన్స్‌వంటి దేశాలలో పాలకులపైనా, ఉద్యోగులపైనా వచ్చిన కేసులను విచారణ చేయడానికి ప్రత్యేకంగా "పరిపాలనా న్యాయస్థానాలు, పరిపాలనా న్యాయము" (Administrative law) ఉన్నాయి.

## న్యాయశాఖ వ్యవ కరణము

న్యాయవ్యవ అనేక అంతస్తులలో నిర్మించబడి ఉంటుంది. దానిలో దిగువ సామాన్యమైన చిన్న కేసులను విచారించే న్యాయస్థానాలు ఉంటాయి. అన్నిటికంటె పై అంతస్తులో సుప్రీంకోర్ట్‌వంటి ఉన్నత న్యాయస్థానం ఉంటుంది. ఇండియా, బ్రిటన్, అమెరికాలలో ఉన్నత న్యాయస్థానాలలో మినహా దిగువ న్యాయస్థానాలలో ఒకే ఒక న్యాయమూర్తి ఉంటారు. సుప్రీంకోర్ట్, హైకోర్ట్‌లలో మాత్రం ప్రధాన న్యాయమూర్తి అధ్యక్షతన అనేక మంది న్యాయమూర్తులు "ధర్మాసనం" (Bench of judges) గా ఏర్పడి మెజారిటీ అభిప్రాయం ప్రకారం తీర్పు ఇస్తారు. కొన్ని దేశాలలో క్రిమినల్ కేసుల విచారణకు "జ్యూరీ పద్ధతి" (Jury system) అమలులో ఉంది.

ఏకకేంద్ర రాజ్యాలలో దిగువ న్యాయస్థానం నుంచి అత్యున్నత న్యాయస్థానం వరకు అన్ని న్యాయస్థానాలు ఒక తాటిమీద పనిచేస్తాయి. దీనిలో దిగువ న్యాయస్థానాల తీర్పులపై ఉన్నత న్యాయస్థానంలో అప్పీలు చేసుకొనే అవకాశముంటుంది. దిగువ న్యాయస్థానం తీర్పును ఉన్నత న్యాయస్థానం మార్చవచ్చు. వీటిలో రాష్ట్ర న్యాయవ్యవస్థ ప్రత్యేంగా ఉండదు. అటువంటి న్యాయవ్యవస్థను "సంఘటిత న్యాయవ్యవస్థ" (Integrated Judiciary) అంటారు. ఉదాహరణ-భారతదేశము.

సమాఖ్య రాజ్యాలలో రెండు న్యాయవ్యవస్థ లుంటాయి. ఫెడరల్ న్యాయవ్యవస్థ వేరుగా ఉంటుంది. రాష్ట్రాలకు విడిగా న్యాయవ్యవస్థ ఉంటుంది. రాష్ట్రాలకు హైకోర్ట్‌లు ఉన్నత న్యాయస్థానాలు. దేశానికి సుప్రీంకోర్ట్ ఉన్నత న్యాయస్థానము. అయితే దాని అధికార పరిధి ఫెడరల్ వ్యవస్థకే పరిమితము. ఇటువంటి న్యాయవ్యవస్థను విచ్ఛిన్న న్యాయవ్యవస్థ (Dis-integrated judiciary) అని అంటారు. ఉదాహరణ-అమెరికా.

న్యాయస్థానాలు అవి చేపట్టే కేసుల స్వభావాన్ని బట్టి సివిల్ కోర్ట్‌లు, క్రిమినల్ కోర్ట్‌లని రెండు రకాలుగా ఉంటాయి. స్వయంగా కేసులను గ్రహించి విచారణ జరిపే న్యాయస్థానాలను "ఒరిజినల్ అధికారాలుగల న్యాయస్థానాలు" (Courts with original jurisdiction) అని, దిగువ న్యాయస్థానాలనుంచి వచ్చిన అప్పీళ్ళను విచారణ చేసే న్యాయస్థానాలను "అప్పీళ్ళ న్యాయస్థానాలు" (Courts with appellate jurisdiction) అని పిలుస్తారు.

## న్యాయశాఖ స్వతంత్ర ప్రతిపత్తి

చట్టాలను ఎంత జాగ్రత్తగా రూపొందించినా వాటిని అమలుపరిచే న్యాయస్థానాలకు స్వతంత్ర ప్రతిపత్తి లేకపోతే నిష్ప్రయోజనము. న్యాయవ్యవస్థ శాసనసభ నుంచి, కార్యనిర్వాహకవర్గం నుంచి ఎటువంటి ఒత్తిడికి, ప్రలోభానికి గురి కాకుండా చూడటమే న్యాయ

వ్యవస్థకు స్వతంత్ర ప్రతిపత్తి ఉండవలెనని అనడంలో ప్రధానోద్దేశము. న్యాయవ్యవస్థ స్వతంత్ర ప్రతిపత్తి కాపాడటానికి సామాన్యంగా ఈ కింది చర్యలు తీసుకొంటారు.

1. *న్యాయమూర్తుల నియామకము (Appointment of judges)*: న్యాయపరిపాలన న్యాయమూర్తుల శక్తిసామర్థ్యాలపై ఆధారపడి ఉంటుంది. వారు న్యాయశాస్త్రంలో నిష్ణాతులై ఉండవలె. వారిలో నిదానము, నిర్భీతి, నిష్పక్షపాత బుద్ధి, నిస్వార్థము, ధర్మాధర్మ విచక్షణా జ్ఞానము, నీతి నిజాయతీ వంటి ఉత్తమ లక్షణాలు ఉండవలె. ఈ లక్షణాలు న్యాయమూర్తులలో ఉండవలెనంటే వారిని నియమించే పద్ధతులు, తొలగించే పద్ధతులు సక్రమంగా ఉండవలె.

అనేక దేశాలలో న్యాయమూర్తులను కార్యనిర్వాహకవర్గం నియమిస్తుంది. స్విట్జర్లండ్, సోవియట్ యూనియన్‌లలో న్యాయమూర్తులను శాసనసభలు ఎన్నుకొంటాయి. అమెరికాలో కొన్ని రాష్ట్రాల లోను, ఒకప్పుడు ఫ్రాన్స్‌లోను న్యాయమూర్తులను ప్రజలు ఎన్నుకొనేవారు. న్యాయమూర్తులను శాసనసభలు గాని ప్రజలు గాని ఎన్నుకోవడం మంచిది కాదు. తమ తీర్పులు వారికి అసంతృప్తి కలిగిస్తే తమ పదవి పోతుందని భయపడి పక్షపాతంతో తీర్పులు చెప్పవచ్చు. ఎన్నికల ద్వారా పదవిలోకి వచ్చే న్యాయమూర్తులు సమర్థులు కాకపోవచ్చు. కార్యనిర్వాహకవర్గం కూడా పక్షపాతంతో న్యాయమూర్తులను నియమించడానికి అవకాశం లేకపోదు. కాని న్యాయమూర్తులను తొలగించే అధికారం వారికి లేకుండా చేస్తే, ఆ పైన వారికి న్యాయమూర్తులపై ఎటువంటి అదుపూ ఉండదు. కార్యనిర్వాహకులైతే అనుభవజ్ఞులు, సమర్థులు, అర్హులైన వారిని న్యాయమూర్తులుగా ఎంపిక చేస్తారు. ఇండియాలో ఈ పద్ధతే అమలులో ఉంది.

2. *న్యాయమూర్తుల తొలగింపు (Removal of judges)*: న్యాయవ్యవస్థ స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడటంలో న్యాయమూర్తుల నియామకానికి ఎంత ప్రాధాన్యముందో వారిని తొలగించడానికి కూడా అంతే ప్రాధాన్యముంది. ఇంతకు ముందే చెప్పుకొన్నట్లు వారిని నియమించే అధికారం కార్యనిర్వాహకవర్గానికి ఉన్నా తొలగించే అధికారం దానికి ఉండకూడదు. కాని అసమర్థులు, అవినీతిపరులు, విధుల విషయంలో అశ్రద్ధ చూపే వారు దురదృష్టవశాత్తు పదవిలోకి వస్తే వారిని తొలగించడానికి తగిన ఏర్పాట్లు ఉండవలె. ఇండియాలో ఉన్నత న్యాయస్థానాలలో పనిచేసే న్యాయమూర్తులను పార్లమెంట్ అభిశంసిస్తే రాష్ట్రపతి తొలగిస్తాడు. అయితే వారిపై వచ్చిన ఆరోపణలను పార్లమెంట్‌లోని ఉభయ సభలు మొదట సాధారణ మెజారిటీతోను, తరువాత 2/3 వంతు మెజారిటీతోను ఆమోదించవలె. బ్రిటన్‌లో కూడా పార్లమెంట్ తీర్మానిస్తే చక్రవర్తి వారిని పదవినుంచి తొలగించవచ్చు. అమెరికాలో న్యాయమూర్తులపై వచ్చిన మహాభియోగ తీర్మానాన్ని సెనేట్ విచారణచేసి ఆమోదిస్తే అధ్యక్షుడు వారిని తొలగిస్తాడు. దీనిని బట్టి వారు తమ విధులు సరిగా నిర్వహించి నంతకాలం వారిని ఎవరూ పదవినుంచి తొలగించలేరు కాబట్టి వారు నిర్భయంగా పనిచేయ వచ్చునని తెలుస్తున్నది.

3. *పదవీకాలము (Tenure of office)*: న్యాయమూర్తులు తమ విధులు సంతృప్తికరంగా నిర్వహించినంతకాలం వారిని పదవినుంచి తొలగించకూడదు. పదవి పోతుందేమోననే భయం వారిని పీడిస్తూఉంటే వారు తమ న్యాయనిర్ణయాలు స్వేచ్ఛగా ప్రకటించలేరు. కాబట్టి అన్ని దేశాలలోను వారికి పదవీకాలం విషయంలో కొన్ని రక్షణలు కల్పించబడినాయి. అమెరికా

బ్రిటన్‌లలో న్యాయమూర్తులు తమ జీవితాంతం పదవిలో కొనసాగవచ్చు. ఇండియాలో 65 సంవత్సరాల వయసు వచ్చేవరకు పదవిలో కొనసాగుతారు.

**4. *వేతనాలు* (*Pay*):** న్యాయమూర్తులు లంచాలకు, అక్రమ ఆర్జనలకు పాల్పడకుండా ఉంటేనే న్యాయవ్యవస్థ స్వతంత్రంగా ఉంటుంది. వారి అవసరాలకు చాలినంత వేతనం వారికి ఇవ్వవలె. వారి హోదా, గౌరవం కాపాడే విధంగా వారికి జీతం లభిస్తే వారు అక్రమ సంపాదనకు పాలుపడవలసిన అవసరం ఉండదు. అంతేకాక వారి వేతనాలలో చీటికి మాటికి మార్పులు తేవడం, వేతనాలు తగ్గిస్తామని భయపెట్టడం వంటివి జరుగకూడదు. అటువంటి బెదరింపులు వారిని నైతికంగా దిగజారుస్తాయి. అందుకే వారి వేతనాల విషయంలో అనేక దేశాలు గట్టి కట్టుబాట్లు చేసినాయి. భారతదేశంలో న్యాయమూర్తుల వేతనాలు "సంఘటిత నిధి" (Consolidated Fund) నుంచి ఇస్తారు. పార్లమెంట్ వాటినిగురించి చర్చించదు. దీనిని బట్టి శాసన నిర్మాణశాఖకు, కార్యనిర్వాహక వర్గానికి దానిపై పెత్తనంలేదని తెలుస్తున్నది. బ్రిటన్‌లో 1931 లో ప్రవేశపెట్టిన "జాతీయ పొదుపు చట్టము" దేశంలో అందరి వేతనాలు తగ్గించింది కాని న్యాయమూర్తుల వేతనాలు తగ్గించలేదు. ఇండియాలో ఆర్థికాత్యయిక పరిస్థితి వచ్చినప్పుడు మాత్రమే న్యాయమూర్తుల వేతనాలు తగ్గించడానికి వీలవుతుంది.

**5. *సర్వీసు నిబంధనలు* (*Conditions of service*) :** న్యాయమూర్తులు స్వేచ్ఛగా వ్యవహరించవలెనంటే వారికి సక్రమంగా వేతనాలు ఇవ్వడం, ఉద్యోగ భద్రత కల్పించడమే కాక పదవిలో ఉండగాను, పదవిని విడిచిపెట్టిన తరువాత కూడా వారికి తగిన రక్షణ ఉండవలె. భవిష్యత్తును గురించి వారు ఆందోళన చెందకూడదు. కాబట్టి వారు పదవీ విరమణ చేసిన తరువాత పింఛను (Pension) సౌకర్యం ఉండవలె. వారు తమ పదవిని హుందాగా, గౌరవప్రదంగా నిర్వహించడానికి కావలసిన సకల సౌకర్యాలు కల్పించవలె.

కొన్ని దేశాలలో వారు పదవీ విరమణ తరవాత ఆదాయాన్నిచ్చే ఏ ఉద్యోగంలోను చేరకూడదనే నియమం ఉంది. పదవీ విరమణ తరవాత కూడా వారి జీవితాంతం వారి బాధ్యత ప్రభుత్వమే చేపడుతుంది. ప్రస్తుతం పదవి పోయినా మరొక పదవి తమకు సిద్ధంగా ఉంటుంది అని భరోసా వారికి లభిస్తే వారు అవినీతికి పాల్పడవచ్చు. ప్రలోభాలకు లొంగవచ్చు. అటువంటి అవకాశం లేనినాడు వారు ఎటువంటి ప్రలోభాలకు లోనుకాకుండా ఉంటారు.

న్యాయమూర్తులిచ్చిన తీర్పులను ఎవరూ విమర్శించకూడదు. వారు కేసులను విచారణ జరిపేటప్పుడు ఆ కేసులపై బాహాటంగా ఎవరూ ఎటువంటి అభిప్రాయాలూ వ్యక్తం చేయకూడదు. ప్రత్యేకంగా ఉన్నత పదవులలో ఉండేవారు తమ సొంత అభిప్రాయాలు నిందితులను గురించి వ్యక్తంచేస్తే వారి భావాలు న్యాయమూర్తులను ప్రభావితం చేసే అవకాశముంది. వాటికి భిన్నంగా తీర్పులిస్తే విమర్శకు గురి అవుతామేమోననే భయం వారిని పీడిస్తుంది. కాబట్టి బాహ్య ప్రభావానికి గురై వారు తమ తీర్పులు ప్రకటించకుండా చేయడానికి ఈ చర్య అవసరము. ఈ నియమాలు శ్రద్ధగా పాటించడం ద్వారా న్యాయవ్యవస్థయొక్క స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడవచ్చు.

## ప్రశ్నలు

### వ్యాసప్రశ్నావళి

1. న్యాయశాఖ స్వతంత్ర ప్రతిపత్తి ప్రాధాన్యాన్ని వివరించి, దానిని కాపాడటానికి తీసుకోవలసిన చర్యలను విశదీకరించండి.

### సంక్షిప్త సమాధాన ప్రశ్నావళి

1. న్యాయశాఖ నిర్వహించే విధులేవి ?
2. సమన్యాయ పాలన అంటేఏమిటి ? న్యాయపరిరక్షణలో దాని ప్రాధాన్యం తెలపండి.
3. న్యాయసమీక్ష అంటేఏమిటి ?
4. న్యాయవ్యవస్థ ఔన్నత్యం కాపాడటానికి అనుసరించవలసిన వివిధ పద్ధతులేవి ?

# 6

# భారత రాజ్యాంగము- ముఖ్య లక్షణాలు

(Salient Features of Indian Constitution)

## రాజ్యాంగ రచనకు సన్నాహము

ఆధునిక ప్రజాస్వామ్యాలన్నిటిలోను పరిపాలన ఏదోఒక విధమైన రాజ్యాంగాని కనుగుణంగా జరుగుతున్నది. మనదేశానికి స్వాతంత్ర్యం రాక పూర్వం మనదేశ పరిపాలనా నిర్వహణకు కావలసిన రాజ్యాంగ సూత్రాలను ఆంగ్లేయులే రూపొందించి అమలు పరిచేవారు. వాటి నిర్మాణంలో భారతీయుల ప్రమేయం ఉండేది కాదు. భారతీయులు తమ రాజ్యాంగాన్ని తామే స్వయంగా రూపొందించుకొనే అవకాశాన్ని మొదటిసారిగా 1927 లో పొందినారు. అప్పటి భారత మంత్రి లార్డ్‌బిర్కెన్‌హెడ్ భారతీయులు సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా చేస్తున్న ఆందోళన పురస్కరించుకొని, మేధావులైన భారతీయులు అన్ని రాజకీయ పక్షాలకు ఆమోద యోగ్యమైన రాజ్యాంగాన్ని రూపొందిస్తే దానిని బ్రిటిష్‌ప్రభుత్వం పరిశీలిస్తుందని B.B.C.[1]లో ఒక ప్రకటన ద్వారా తెలియజేసినాడు. ఈ సవాలు స్వీకరించి భారతీయుల సత్తా తెలియ జేయడానికి మే 19, 1928 న బొంబాయిలో డా. ఇబ్రహీం ఆలీ అన్సారీ నాయకత్వంలో అన్ని రాజకీయ పక్షాలు కలిసి ఒక అఖిల పక్ష సమావేశాన్ని ఏర్పాటు చేసినాయి. ఆ సమావేశం మోతీలాల్‌నెహ్రూ అధ్యక్షతన రాజ్యాంగ నిర్మాణానికై ఏడుగురు సభ్యులతో ఒక ముసాయిదా కమిటీ Draft committee) ని నియమించింది[2] అది ఆగస్టు 10, 1929 న తన నివేదికను కలకత్తాలో జరిగిన అఖిలపక్ష సమావేశానికి సమర్పించింది. అయితే ఆ రాజ్యాంగము భారతీయుల ప్రగాఢ ఆకాంక్షఅయిన సంపూర్ణ స్వరాజ్య ఆశయానికి చాలా దూరంగా ఉందని యువతరం దానిని తిరస్కరించింది. మతనియోజకవర్గాల విషయంలో అంగీకారం కుదరక దానిని ముస్లింలీగ్ కూడా తిరస్కరించడంతో ఆ ప్రయత్నం విఫలమయింది.

ఆ తరవాత బ్రిటిష్ ప్రభుత్వమే రౌండ్‌టేబుల్ సమావేశాలు జరిపి 1935 లో భారత ప్రభుత్వచట్టాన్ని ప్రకటించింది. 1939 లో ప్రారంభమైన రెండవ ప్రపంచయుద్ధంలో బ్రిటన్‌కు విజయావకాశాలు సన్నగిల్లడంతో ఆగస్టు 8, 1940 న లార్డ్‌లిన్‌లిత్‌గో, రాజ్యాంగాన్ని రూపొందించుకోవడానికి భారతీయులకుగల హక్కును బ్రిటిష్ ప్రభుత్వం గుర్తించిందని, యుద్ధకాలంలో భారతీయులు బ్రిటన్‌కు సహాయపడితే యుద్ధం పూర్తయిన వెంటనే "రాజ్యాంగ పరిషత్తు" (Constituent Assembly) నిర్మిస్తామని ప్రకటించినాడు. కాని ఈ ఆగస్టు

1. British Broadcasting Corporation (బ్రిటన్‌లో ప్రముఖ రేడియోవార్తా ప్రసార సంస్థ.)
2. ఈ కమిటీలో సర్వశ్రీ సుభాస్‌చంద్రబోస్, తేజ్‌బహదూర్ సప్రూ, సర్ ఆలీ ఇమామ్, ఎమ్. ఎస్. ఆనే, సర్దార్. మంగల్ సింగ్, కురేష్, జిఆర్. ప్రధాన్ సభ్యులు.

ప్రతిపాదనలు భారతీయులకు రుచించలేదు. ఈలోగా బ్రిటిష్‌సైన్యాలు యుద్ధంలో జర్మనీ, జపాన్‌ల చేతులలో ఘోర పరాజయాన్ని చవిచూసినాయి. దానితో భారతీయుల సహకారం అర్థించడానికి బ్రిటిష్ మంత్రివర్గ సభ్యుడైన సర్‌స్టాఫర్డ్‌క్రిప్స్ భారతదేశానికి వచ్చి రాజ్యాంగ పరిషత్తు నిర్మాణసూత్రాలను గురించి స్థూలంగా భారతనాయకులతో చర్చించినాడు. యుద్ధానంతరం రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నికలు జరుగుతాయని, అన్నిరాష్ట్రాలలోని దిగువ సభ సభ్యులంతా కలసి ఒక నియోజకగణంగా ఏర్పడి, తమ సంఖ్యలో 10 వంతుకు సరి పడే సభ్యులను నైష్పత్తిక ఓటింగ్ ద్వారా ఎన్నుకొంటారని సూచించినాడు. స్వదేశీసంస్థానా లకు వాటి జనాభాను బట్టి రాజ్యాంగపరిషత్తులో కొంతమంది ప్రతినిధులు ఉంటారు అని చెప్పినాడు. కాంగ్రెస్ క్రిప్స్ ప్రతిపాదనలు తోసిపుచ్చి చరిత్రాత్మకమైన 'క్విట్ ఇండియా' ఉద్యమానికి పిలుపు ఇవ్వడంతో క్రిప్స్ రాయబారం విఫలమయింది.

1945లో ప్రపంచ సంగ్రామం పూర్తి అయింది. బ్రిటన్‌లో జరిగిన సాధారణ ఎన్నికలలో లార్డ్ అట్లీ నాయకత్వంలో లేబర్ పార్టీ అధికారంలోకి వచ్చింది. భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటించి నూతన రాజ్యాంగ నిర్మాణానికి సన్నాహాలు చేయడానికి కావలసిన సంప్రదింపులు జరపడానికి ఆయన తన మంత్రివర్గ సభ్యులైన సర్ స్టాఫర్డ్ క్రిప్స్, లార్డ్ పెథిక్‌లారెన్స్, ఏ.వి. అలెగ్జాండర్ అనే మంత్రిత్రయాన్ని భారతదేశానికి పంపినాడు. దీనినే 'కాబినెట్ మిషన్' అనిగాని మంత్రిత్రయ రాయబారవర్గమనిగాని అంటారు. రాజ్యాంగ పరిషత్తుకు త్వరలో ఎన్నికలు జరుపుతామని, ప్రతి 10 లక్షల ఓటర్లకు ఒక ప్రతినిధి చొప్పున రాష్ట్రశాసన సభ్యులు రాజ్యాంగ పరిషత్తు సభ్యులను ఎన్నుకొంటారని, ముస్లిం, శిక్కు శాసనసభ్యులు వారి ప్రతినిధులను వారి జనాభాకు సరైన నిష్పత్తిలో ఎన్నుకొంటారని వారు సూచించినారు. రాజ్యాంగ సభకు ఎన్నికైన ప్రతినిధులు A B C అనే మూడు వర్గాలుగా (Sections) ఏర్పడి రాజ్యాంగాన్ని రూపొందిస్తారు. ఈ పథకాన్ని అన్ని రాజకీయ పక్షాలు స్థూలంగా ఆమోదించడంతో అమలు పరచడానికి కొత్తవైస్రాయ్ లార్డ్ మౌంట్‌బాటన్ భారత దేశానికి వచ్చినాడు. బ్రిటన్ భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడానికి అంగీకరించి 1946 లో రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నికలు జరిపించింది. 292 మందిసభ్యులను గవర్నర్ పాలితప్రాంతా లనుంచి, నలుగురు సభ్యులను కేంద్రపాలిత ప్రాంతాలనుంచి, 93 మంది సభ్యులను సంస్థానాల నుంచి రాజ్యాంగ పరిషత్తుకు సభ్యులుగా ఎన్నుకొన్నారు. అందులో జవహర్‌లాల్‌నెహ్రూ, మౌలానాఅజాద్, పటేల్, కృపలానీ, రాధాకృష్ణన్, డా. జయకర్ వంటి మేధావులెందరో సభ్యులుగా ఉన్నారు. అయితే తమ ప్రత్యేక పాకిస్తాన్ వాదానికి బలం చేకూర్చుకొనేందుకు ముస్లింలీగ్ రాజ్యాంగ పరిషత్తును బహిష్కరించి ప్రత్యక్షచర్యకు పూనుకొంది. విధి లేని పరిస్థితులలో దేశవిభజనకు నాయకులు అంగీకరించి పథకాన్ని రూపొందించినారు. ఇండియా, భారత్, పాకిస్తాన్ అనే రెండురాజ్యాలుగా విడిపోయింది. పాకిస్తాన్ తరవాత వేరేరాజ్యాంగ పరిషత్తును ఏర్పాటు చేసుకొంది. భారత్‌కు మాత్రం 1946లో ఏర్పడిన రాజ్యాంగ పరిషత్తే రాజ్యాంగ నిర్మాణానికి పూనుకొంది.

రాజ్యాంగ పరిషత్తుకు డా. బాబూరాజేంద్రప్రసాద్ అధ్యక్షుడుగా ఉన్నారు. రాజ్యాంగాన్ని తయారు చేయడానికి రాజ్యాంగ పరిషత్తు కొన్ని కమిటీలుగా ఏర్పడింది. వాటిలో ప్రధానమైనవి ప్రాథమిక హక్కులకమిటీ, రాష్ట్ర వ్యవహారాల కమిటీ, కేంద్ర ప్రభుత్వ

నిర్మాణము, అధికారాల నిర్ణయకమిటీ మొదలైనవి. అవి వాటి పరిధిలో రాజ్యాంగ రచనకు పూనుకొన్నాయి. 29.8.1947 న ఈ కమిటీల నివేదికను ముద్రించి రాజ్యాంగ ముసాయి దాను రూపొందించడానికి రాజ్యాంగ పరిషత్తు డా. అంబేద్కర్ అధ్యక్షతన ఏడుగురు సభ్యులతో ఒక ముసాయిదా కమిటీని నియమించింది. దానిలో శ్రీ. ఎన్. గోపాలస్వామి అయ్యంగార్, శ్రీ అల్లాడికృష్ణస్వామి అయ్యర్, శ్రీకె. ఎమ్ మున్షీ, శ్రీ సయ్యద్ మహమ్మద్ సాదుల్లా, శ్రీఎన్. మాధవరావ్, శ్రీడి.పి. ఖైతాన్, శ్రీబి.ఎల్. మిత్తర్ సభ్యులుగా ఉన్నారు. శ్రీమిత్తర్ రాజ్యాంగ పరిషత్తు సభ్యులు కాని కారణంగా మొదటి సమావేశం తరవాత కమిటీ సమావేశాలకు హాజరుకాలేదు.

ముసాయిదా కమిటీ తన నివేదికను 21.2.1948న రాజ్యాంగ పరిషత్తుకు సమర్పించింది. రాజ్యాంగ పరిషత్తు దానిపై 4.11.1948 నుంచి 15.8.1949 వరకు సుదీర్ఘమైన చర్చలు జరిపింది. మొత్తం 7635 సవరణలు ప్రతిపాదించబడినాయి. వాటిలో 2473 ప్రతిపాదనలు చర్చించి ఆమోదించినారు. దానికి రాజ్యాంగ పరిషత్ ఛైర్మన్ ఆమోదం లభించింది. 24.1.1950న నూతన రాజ్యాంగం ప్రకారం డా. రాజేంద్రప్రసాద్‌ను భారతదేశానికి తొలి రాష్ట్రపతిగా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. 26.1.1950 నుంచి కొత్తరాజ్యాంగం అమలులోకి వచ్చింది. జనవరి 26 ను మనం నేటికీ రిపబ్లిక్ దినోత్సవంగా జరుపుకొంటున్నాము. మొత్తం మీద భారత రాజ్యాంగ రచనకు 2 సంవత్సరాల 11 నెలల 18 రోజులు పట్టినాయి. సుమారు 64 లక్షలరూపాయలు దాని నిర్మాణానికి ఖర్చుఅయింది.

## భారతరాజ్యాంగానికి ఆధారాలు

భారత రాజ్యాంగాన్ని ఉద్దండులైన న్యాయవాదులు, రాజ్యాంగశాస్త్ర ప్రవీణులు కలిసి ఎంతోకాలం శ్రమించి, అనేక ప్రపంచరాజ్యాంగాలను పరిశీలించి రూపొందించినారు. భారత రాజ్యాంగంలోని 75 శాతం అంశాలను 1935 భారత ప్రభుత్వ చట్టం నుంచి గ్రహించినారు. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల మధ్య అధికారాలపంపిణీ, స్థానిక స్వపరిపాలన, ప్రత్యక్ష ఎన్నికలు, వయోజన ఓటింగ్ విధానం మొదలైన అంశాలు దీనినుంచే గ్రహించినారు. పార్లమెంటరీ విధానం, శాసనసభ్యుల విశేషాధికారాలు, ద్వంద్వశాసనసభా విధానము, స్పీకర్ పదవి మొదలైన అంశాలను బ్రిటిష్ రాజ్యాంగంనుంచి స్వీకరించినారు. ప్రాథమిక హక్కుల విషయంలోను, సుప్రీంకోర్ట్ నిర్మాణం విషయంలోను అమెరికా సంయుక్తరాష్ట్రాల రాజ్యాంగాన్ని అనుస రించినారు. శ్రేయోరాజ్యవిధానము ప్రధానంగా దానికి అనుబంధమైన నిర్దేశక నియమాలను ఐర్లండ్ రాజ్యాంగంనుంచి గ్రహించినారు. భారత సమాఖ్య అమెరికా సమాఖ్యవలె ఉండదు. ఇది ప్రత్యేకమైనది. ఈ పద్ధతిని కెనడా రాజ్యాంగంనుంచి అనుకరించినారు. కొన్ని రాజ్యాంగ సూత్రాలను ఆస్ట్రేలియా రాజ్యాంగంనుంచి కూడా స్వీకరించినారు. మొత్తంమీద అన్ని రాజ్యాంగాలలోని మంచిసూత్రాలను మేళవించి ఒక అపూర్వమైన రాజ్యాంగాన్ని భారత రాజ్యాంగ నిర్మాతలు మనకందించినారు.

## భారత రాజ్యాంగ ముఖ్యలక్షణాలు

1. లిఖిత రాజ్యాంగము (Written Constitution)

భారత రాజ్యాంగము లిఖిత రాజ్యాంగము. దీనిని మన రాజ్యాంగ నిర్మాతలు ఏ విధంగా

రూపొందించినదీ ఇంతకు ముందే చెప్పుకొని ఉన్నాము. భారతరాజ్యాంగము ప్రపంచ రాజ్యాంగాలన్నిటిలోకి అతి పెద్ద రాజ్యాంగము. ఆరంభంలో దీనిలో 395 నిబంధనలు (Articles), 8 షెడ్యూళ్ళు ఉండేవి. 1951 లో మొదటి రాజ్యాంగ సవరణద్వారా 9 వ షెడ్యూల్‌ను దీనిలో చేర్చినారు 1974లో సిక్కింను భారతదేశంలో విలీనం చేసే సందర్భంలో 10 వ షెడ్యూల్‌ను రాజ్యాంగంలో పొందుపరచినారు. భారతరాజ్యాంగాన్ని 22 భాగాలుగా విభజించినారు. రాజ్యాంగంలోని కొన్ని అంశాలను పార్లమెంట్ రూపొందిస్తుంది. ఉదాహరణకు అది రూపొందించిన ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టము (Preventive Detention Act) ప్రజా ప్రాతినిధ్య చట్టము (Representation of Peoples Act), భారత పౌరత్వ చట్టము, రాష్ట్ర పునర్నిర్మాణ చట్టము మొదలైనవి కూడా రాజ్యాంగంలో భాగాలే.

## భారత రాజ్యాంగములోని సంప్రదాయాలు

భారత రాజ్యాంగము లిఖిత రాజ్యాంగమే అయినా కాలక్రమేణాకొన్ని అలిఖితాంశాలు కూడా అందులో చోటు చేసుకున్నాయి. ఉదాహరణకు రాష్ట్రపతి పదవికి ఒకే వ్యక్తి రెండు పర్యాయాల కంటె ఎక్కువ సారులు పోటీ చేయకూడదు అనేది సంప్రదాయం మాత్రమే. లోక్‌సభలోని మెజారిటీ పార్టీనాయకుడిని రాష్ట్రపతి ప్రధానమంత్రిగా నియమించవలెననిగాని, రాష్ట్రవిధానసభలోని మెజారిటీపార్టీనాయకుడిని గవర్నర్ ముఖ్యమంత్రిగా నియమించవలెననిగాని రాజ్యాంగంలో ఎక్కడా వ్రాయలేదు. స్పీకర్ పదవిలో ఉండేవారు పార్టీరాజకీయాలకు అతీతంగా ఉండవలె అనేది కూడా సంప్రదాయమే.

భారత దేశంలో నెలకొని ఉన్న కొన్ని సాంఘిక, మత, భాషా సాంస్కృతిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని మన రాజ్యాంగ నిర్మాతలు పరిపాలనా పరమైన వివరాలను కూడా రాజ్యాంగంలో పొందుపరచడంవల్ల ఇది విస్తృతమైన గ్రంథంగా తయారయింది.

2. సర్వసత్తాక ప్రజాస్వామిక గణతంత్రరాజ్యము (Sovereign Democratic Republic)

భారత రాజ్యాంగము భారతదేశాన్ని సర్వసత్తాక ప్రజాస్వామిక గణతంత్ర రాజ్యంగా రూపొందించింది. రాజ్యాంగ ప్రస్తావన లేదా అవతారిక (Preamble of the Constitution)లో ఈ విషయాన్ని గురించి తెలపబడింది. "భారత ప్రజలమైన మనం, భారత దేశాన్ని ఒక సంపూర్ణ సార్వభౌమాధికారం ఉన్న ప్రజస్వామ్య, గణతంత్ర రాజ్యంగా తీర్చి దిద్దడానికి దృఢనిశ్చయులమై ఉన్నాము. పౌరులందరికీ సాంఘిక, ఆర్థిక, రాజకీయ విషయాలలో న్యాయాన్ని (Justice). భావాలలోను, భావప్రకటనలోను, మతవిశ్వాసము, ఆరాధనలలోను స్వాతంత్ర్యాన్ని (Liberty), వ్యక్తిగతహోదా, అవకాశాల విషయంలో సమానత్వాన్ని (Equality) చేకూర్చి ప్రజల మధ్య సౌభ్రాతృత్వాన్ని (Fraternity) పెంపొందిస్తామని తీర్మానిస్తూ, వ్యక్తిగౌరవానికి, జాతి సమగ్రతకు రక్షణకల్పిస్తామని హామీ ఇస్తూ 1949 నవంబర్ 26 తేదీన మన రాజ్యాంగ పరిషత్తులో ఈ రాజ్యాంగాన్ని చర్చించి ఆమోదించి మనకు మనం సమర్పించుకొంటున్నాము"* అని రాజ్యాంగప్రస్తావన విశదీకరిస్తున్నది ("We

*ఈ అవతారికలో 42 వ రాజ్యాంగ సవరణద్వారా "Secular (లేదా), Socialistic (సమాజవాది) అనే పదాలను soveriegn Democratic అనే పదాల మధ్య చేర్చినారు. దీనికి "Integrity" అనేపదాన్ని కూడా చేర్చినారు.

the people of India, having solemnly resolved to constitute India into a Sovereign, Democratic, Republic and secure to all its citizens Justice - Social, Economic and Political. Liberty of thought, expression, belief, faith and worship ; Equality of status and opportunity and to promote among them all fraternity assuring the dignity of the individual and the unity of the Nation, in our constituent assembly this twenty sixth day of November 1949, do hereby adopt, enact and to give ourselves this Constitution'')

భారతదేశము సార్వభౌమాధికారమున్న రాజ్యము. అది అంతరంగిక విషయాలలో సంపూర్ణాధికారం కలిగిఉంటుంది. విదేశవ్యవహారాలలో సర్వ స్వతంత్రమైనది. మనకు ఆగస్ట్ 15, 1947న స్వాతంత్ర్యం లభించినా జనవరి 26, 1950 వరకు దేశానికి సర్వాసత్తాధికారాలు లభింపలేదు. అప్పటివరకు అది అధినివేశప్రతిపత్తిగల రాజ్యంగా (Dominion state) ఉంది. భారత గవర్నర్‌జనరల్‌ను బ్రిటిష్ చక్రవర్తి నియమించేవాడు. భారతదేశానికి కామన్ వెల్త్‌లో ఉన్న సభ్యత్వంవల్ల దాని సార్వభౌమత్వానికి హానిజరుగుతున్నదనే విమర్శఉంది. కాని కామన్‌వెల్త్ కొన్ని మిత్రరాజ్యాల సంఘంమాత్రమే. కాబట్టి దానిలో సభ్యత్వం భారతసార్వభౌమాధికారానికి ప్రతిబంధకం కానేరదు.

భారతదేశం ప్రపంచంలోని అతిపెద్ద ప్రజాస్వామ్యము. దాదాపు 36 కోట్లకుపైగా ఓటర్లు ఎన్నికలలో పాల్గొని తమ ప్రతినిధులను ఎన్నుకొని వారిద్వారా దేశపరిపాలన నిర్వహించు కొంటారు. ఇది పరోక్షప్రజాస్వామ్యము. ప్రభుత్వానికి అధికారము ప్రజలకోసం ప్రజలనుంచి లభించింది. దానిని ప్రతినిధులు రాజ్యాంగబద్ధమైన ప్రభుత్వంద్వారా వినియోగిస్తారు.

భారతదేశంలో అత్యున్నతమైన రాష్ట్రపతి పదవిగాని మరి ఏ ఇతర పదవిగాని వంశ పారంపర్యంగా లభింపవు. ప్రభుత్వంలోని అన్ని పదవులూ ప్రజాప్రతినిధులే నిర్వహిస్తారు. వారిని సామాన్యంగా 5 సంవత్సరాలకొకసారి ప్రజలు ఎన్నుకొంటారు. సంస్థానాలన్నీ భారత దేశంలో విలీనమయినాయి కాబట్టి ఇక్కడ రాజరికవ్యవస్థ పూర్తిగా రద్దయింది. కాబట్టి భారత దేశం గణతంత్రరాజ్యము.

42వ రాజ్యాంగసవరణద్వారా రాజ్యాంగ ప్రస్తావనలో మార్పుచేసినారు. ప్రస్తుతం భారతదేశాన్ని 'సర్వసత్తాక, ప్రజాస్వామిక, లౌకిక, సామ్యవాద గణతంత్రరాజ్యము' (Sovereign Democratic, Secular, Socialist Republic) అని పిలవవలె. దీనికి ధర్మము, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనేవి నాలుగు మూల స్థంభాలు.

3. ప్రాథమిక హక్కులు (Fundamental Rights)

భారత పౌరుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కాపాడటానికి రాజ్యాంగంలోని 3వ భాగంలో 12వ నిబంధన (Article) నుంచి 35వ నిబంధన వరకుగల వివిధ నిబంధనలలో భారత పౌరునికి ఇచ్చిన ప్రాథమిక హక్కులను గురించి ప్రస్తావించినారు. స్వతంత్రప్రతిపత్తి గల ఉన్నతన్యాయస్థానాలు వీటికి రక్షణ ఇస్తాయి. ప్రాథమిక హక్కుల రక్షణకు సుప్రీంకోర్ట్

హైకోర్టులు హెబియస్ కార్పస్ (Habeas Corpus), మాండమస్ (Mandamus), ప్రొహిబిషన్ (Prohibition), కోవారంటో (Quowaranto), సెర్షియోరారీ (Certiorari) వంటి ప్రత్యేక రిట్‌లను (Writs) జారీ చేయవచ్చు.

హక్కులేని నాగరక జీవనం అసాధ్యము. ప్రాథమికహక్కులు పౌరులలోసమానత్వాన్ని, సౌభాతృత్వాన్ని పెంపొందించి, వారిలో సత్ప్రవర్తన అలవరుస్తాయి. వారి భౌతిక, నైతిక పరిపూర్ణత్వానికి తోడ్పడతాయి. ఇవి ప్రజాస్వామ్యాన్ని అర్థవంతంచేస్తాయి. అసమానతలు తొలగించి సాంఘికన్యాయాన్ని చేకూరుస్తాయి. సంఘంలో జాతి. కుల, మత, వర్గ, లింగ భేదాలను తొలగించి అల్పసంఖ్యాకులకు, బలహీనవర్గాలకు, వెనకబడినజాతులకు తగినరక్షణ కల్పిస్తాయి. పౌరుల ధనమాన ప్రాణాలను కాపాడతాయి. ఒక్కమాటలో చెప్పవలెనంటే మానవ జీవితానికే పరిపూర్ణతను చేకూరుస్తాయి. అటువంటి హక్కులనుగూర్చి భారత రాజ్యాంగంలో చర్చించబడింది. భారతరాజ్యాంగంలో పొందుపరిచిన హక్కులను ఎనిమిది భాగాలుగా విభజించవచ్చు. అవి : 1. సాధారణ (General) 2. సమానత్వపుహక్కు (Right to equality) 3. స్వాతంత్ర్యపుహక్కు (Right to freedom) 4. దౌర్జన్యాన్ని నిరోధించేహక్కు (Right against exploitation) 5. మత స్వాతంత్ర్యపుహక్కు (Right to freedom of religion) 6. సాంస్కృతిక విద్యావిషయకహక్కు (Cultural and educational right) 7. ఆస్తి హక్కు (Right to property) 8. రాజ్యాంగపరిహారహక్కు (Right to constitutional remedies). ఈ హక్కులన్నీ అత్యవసర పరిస్థితిలో రద్దు అవుతాయి. భారత రాజ్యాంగంలోని హక్కులను గురించి మరింత విపులంగా తెలుసుకొందాము

ప్రాథమిక హక్కులకు సంబంధించిన 12,13 నిబంధనలు ఈ హక్కులు ఎవరెవరికి వర్తించేది, ఏ యే అధికారసంస్థలపై అమలుపరిచేది వివరిస్తాయి. మిగిలినవాటిని ఈ కింది శీర్షికలు వివరిస్తాయి.

(ఏ) *సమానత్వపుహక్కు* (14వ నిబంధననుంచి 18వ నిబంధనవరకు) : 14వ నిబంధన ప్రకారం చట్టందృష్టిలో పౌరులంతా సమానము. ఈ నిబంధనలో చెప్పిన చట్ట సమత్వం బ్రిటన్‌లో ఉండే "సమన్యాయాన్ని" (Rule of law) పోలి ఉంది.

15వ నిబంధన రాజ్యము, పౌరులమధ్య జాతి, కుల, మత, వర్గ, లింగ, జన్మసంబంధమైన విచక్షణ చూపరాదని తెలుపుతుంది. హోటళ్ళు, షాపులు, వినోదస్థలాలు, బస్సులు, రైళ్ళు, చెరువులు, బావులు మొదలైన పబ్లిక్ స్థలాలను వినియోగించుకోవడంలో వ్యక్తులమధ్య ఎటువంటి వ్యత్యాసాలూ చూపరాదు.

16వ నిబంధన ప్రభుత్వోద్యోగాలలో పౌరులందరికీ సమానావకాశాలు కల్పిస్తుంది. అదే నిబంధన షెడ్యూల్‌కులాలు, తెగలవారికి, స్త్రీలకు ప్రత్యేకావకాశాలు కల్పించడం ప్రభుత్వ విధిగా పేర్కొంది. కొన్నిరకాల ఉద్యోగాలలో మతము, నివాసస్థలము ప్రాతిపదికగా గ్రహించడం తప్పుకాదు. ఉదాహరణకు, ధర్మాదాయశాఖలోని పదవులు, రాష్ట్ర ప్రభుత్వ పదవులు మొదలైనవి.

17వ నిబంధన అస్పృశ్యత పాటించడం నేరమని సూచిస్తుంది. దీనికి భిన్నంగా పోయేవారిని శిక్షించడానికి పార్లమెంట్ చట్టాలను రూపొందించవచ్చు.

18వ నిబంధన ప్రకారం సైనిక, విద్యావిషయకమైన బిరుదులు మినహా ఇతర బిరుదులను ఇవ్వడం, గ్రహించడం నిషేధించబడింది. ఏ పౌరుడూ రాష్ట్రపతి అనుమతి లేకుండా విదేశాలనుంచి బిరుదులు గ్రహించరాదు.

(బి) *స్వాతంత్ర్యపుహక్కు (Right to freedom–19 నుంచి 22 వ నిబంధన వరకు)*: స్వాతంత్ర్యపుహక్కులో 19వ నిబంధన ముఖ్యమైనది. అది పౌరులకు అత్యంత ప్రధానమైన ఏడు ప్రాథమిక స్వాతంత్ర్యాలను (Seven freedoms) అందిస్తున్నది. అవి: (అ) వాక్‌స్వాతంత్ర్యము (ఆ) నిరాయుధులుగా సభలు, సమావేశాలు జరువుకొనే స్వాతంత్ర్యము (ఇ) సంఘాలు ఏర్పాటు చేసుకొనే స్వాతంత్ర్యము (ఈ) సంచార స్వాతంత్ర్యము (ఉ) తమకు నచ్చిన ప్రదేశంలో నివాసం ఏర్పాటు చేసుకొనే స్వాతంత్ర్యము (ఊ) ఆస్తిని సంపాదించడానికి, అనుభవించడానికి, అన్యాక్రాంతం చేయడానికి స్వాతంత్ర్యము (ఋ) వృత్తి స్వాతంత్ర్యము. ఈ హక్కులు పౌరులకు ఇచ్చినా వీటిపై ప్రభుత్వం కొన్ని పరిమితులు విధించింది. వాటికి లోబడి మాత్రమే వ్యక్తి వాటిని అనుభవించగలడు.

20వ నిబంధన ప్రకారం చట్టాన్ని అతిక్రమించనిదే ఏ వ్యక్తీ శిక్షార్హుడు కాడు. చేసిన నేరానికి అప్పటికి అమలులో ఉన్న చట్టాలు నిర్ణయించిన శిక్షకంటె ఎక్కువ శిక్ష విధించకూడదు. ఒక వ్యక్తిని ఒకే నేరానికి ఒకసారి మాత్రమే శిక్షించవలె. ఏ నిందితునీ తనకు వ్యతిరేకంగా సాక్ష్యం ఇవ్వమని నిర్బంధించకూడదు.

21వ నిబంధన ప్రకారం ఒక వ్యక్తి యొక్క వ్యక్తిగత స్వేచ్ఛకు, మాన, ప్రాణాలకు చట్టం నిర్ణయించిన పద్ధతి ప్రకారం మినహా మరే ఇతర విధంగానూ హాని కలిగించరాదు.

22వ నిబంధన ప్రకారం నేరం రుజువుకానిదే ఎవరినీ 24 గం॥ మించి నిర్బంధంలో ఉంచరాదు. అరెస్ట్ అయిన వ్యక్తిని 24 గం॥ లోగా దగ్గరలోఉన్న మేజిస్ట్రేట్ ఎదట హాజరు పరచవలె.

(సి) *దౌర్జన్యాన్ని నిరోధించేహక్కు (Right against exploitation–23, 24 నిబంధనలు)*: 23వ నిబంధన ప్రకారం వెట్టిచాకిరి, పడుపువృత్తి ప్రోత్సహించడం, బానిసత్వము నేరము. నిర్బంధంగా బిచ్చమెత్తించడం, అవమానకరమైన పనులకు పౌరులను ప్రోత్సహించడం కూడానేరాలే. అయితే ప్రభుత్వం ప్రజాక్షేమంకోసం పౌరులచే నిర్బంధసేవ చేయించవచ్చు. కొన్ని దేశాలలో నిర్బంధ సైనిక సేవ కూడా అమలులోఉంది. అవి తప్పు కాదు

24వ నిబంధన 14 సంవత్సరాలలోపు పిల్లలను కర్మాగారాలు, గనులు, తదితర ప్రమాదకరమైన పరిశ్రమలలో కార్మికులుగాచేర్చి పనిచేయించ కూడదని చెబుతున్నది.

(డి) *మత స్వాతంత్ర్యపు హక్కు (Right to religious freedom–25 నుంచి 28 వ నిబంధనల వరకు)*: 25వ నిబంధన ప్రకారం ప్రతి వ్యక్తీ తన అంతరాత్మప్రబోధం ప్రకారం తనకు నచ్చిన మతాన్ని స్వీకరించవచ్చు.

26వ నిబంధన అన్ని మతాల వారు తమ మతాన్ని అభివృద్ధిచేసుకోవడానికి దానధర్మాలు చేయవచ్చునని, కావలిసిన ధర్మాదాయ సంస్థలను నెలకొల్పి వాటి నిధులను సముచిత రీతికో ఖర్చుపెట్టుకోవచ్చని తెలుపుతుంది. కాని ప్రజాభద్రతకు, ఆరోగ్యానికి వ్యతిరేకమైన సంస్థలను మాత్రం ఎవరూ నెలకొల్పరాదు.

27 ఏ నిబంధననుసరించి ప్రభుత్వోద్యోగాల విషయంలో మతప్రమేయం ఉండ కూడదు. దేశపరిపాలన ఏ మత సూత్రాలకు అనుగుణంగానూ జరుగకూడదు.

28 వ నిబంధన ప్రభుత్వసహాయంతో పనిచేసే విద్యాసంస్థలలో మతబోధ జరగరాదని మత సంస్థలచే నిర్వహించబడే విద్యాలయాలలో మతబోధ విషయంలో నిర్బంధము, ఒత్తిడి ఉండకూడదని సూచిస్తున్నది. మతవ్యాప్తికి వెచ్చించిన ధనంపై పన్ను చెల్లించనవసరం లేదు.

(ఇ) *విద్యా, సాంస్కృతిక హక్కు (Educational and cultural right 29, 30 నిబంధనలు)* : 29 వ నిబంధన పౌరులందరికీ తమ భాష, లిపి, సంస్కృతి కాపాడుకొనే అవకాశాన్ని కల్పించింది. ప్రభుత్వ సహాయంతో నడిచే విద్యా సంస్థలలో విద్యార్థులకు జాతి, మత, కుల, భాష, లింగ ప్రాతిపదికలపై ప్రవేశం నిరాకరించకూడదు.

30 వ నిబంధన ననుసరించి భాషాపరమైన అల్పసంఖ్యాకులు తమ భాష, సంస్కృతి, లిపి అభివృద్ధిచేసుకోవడానికి కావలసిన సంస్థలను ఏర్పాటు చేసుకోవచ్చు. అటువంటి సంస్థ లకు ప్రభుత్వం సహాయంచేస్తుంది. వాటికి సహాయం చేసేటప్పుడు ప్రభుత్వం ఎటువంటి వివక్షతా చూపకూడదు.

(ఎఫ్) *ఆస్తి హక్కు (Right to Property_ 31 వ నిబంధన)* : రాజ్యాంగాన్ని ప్రారంభించినప్పుడు ఆస్తి హక్కును గురించి 31 వ నిబంధనలో తెలిపినారు. స్వాతంత్ర్యపు హక్కులోని 19 (ఎఫ్) నిబంధన కూడా ఈ హక్కును గురించి వివరించింది. రాజ్యాంగంలో ఈ హక్కు అనేక చిక్కులను సృష్టించింది. అందువల్ల దీనిని అనేక పర్యాయాలు సవరించి నారు. 44 వ రాజ్యాంగ సవరణ దీనిని ప్రాథమిక హక్కుల నుంచి తొలగించి చట్టబద్ధమైన హక్కుగా మాత్రమే గుర్తించింది.

19 (ఎఫ్) నిబంధన పౌరునికి ఆస్తిని సంపాదించడానికి, అనుభవించడానికి లేదా అన్యాక్రాంతం చేయడానికి అవకాశ మిచ్చింది. 31 వ నిబంధన ప్రకారం చట్టాని కనుగుణంగా మినహా ప్రభుత్వం పౌరుల ఆస్తిని స్వాధీనం చేసుకోరాదు. సమిష్టి ప్రయోజనాలకు ఆస్తిని స్వాధీనం చేసుకొనేటప్పుడు నష్టపరిహారం చెల్లించవలె.

రాజ్యాంగం అమలులోకి వచ్చిన తరువాత బీహార్, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలు జమీందారీ పద్ధతి రద్దుచేస్తూ చట్టాలు చేసినాయి. అయితే ఆ చర్య రాజ్యాంగ విరుద్ధ మని సవాలు చేసినారు. పాట్నా హైకోర్ట్ (బీహార్) జమీందారీ రద్దు చట్టం రాజ్యాంగ విరుద్ధ మని తీర్పు ఇచ్చింది. నాగపూర్ (మధ్యప్రదేశ్), అలహాబాద్ (ఉత్తరప్రదేశ్) హైకోర్టులు ఆ చట్టం రాజ్యాంగ బద్ధమేనని తేల్చినాయి. దీనివల్ల వివాదం ఏర్పడింది. ఈ సంస్కరణలు కొనసాగించడానికి కేంద్ర ప్రభుత్వం 1951 లో మొదటి రాజ్యాంగ సవరణ ద్వారా ఆస్తి హక్కులో 31 (A), 31 (B) అనే క్లాజులు చేర్చింది. 31 (A) ప్రకారం జమీందారీ విధానం రద్దుచేసే చట్టాలు ప్రాథమిక హక్కులలోని ఆస్తి హక్కుకు విరుద్ధమని భావించ డానికి వీలులేదని తెలిపింది. 31 (B) క్లాజు అంతవరకు వివిధ రాష్ట్రప్రభుత్వాలు చేసిన భూసంస్కరణలు కొనసాగుతాయని అవి రద్దుకావని చెప్పింది.

అయితే 1955 లో బెంగాల్ రాష్ట్రానికి, బేలా బెనర్జీకి మధ్య జరిగిన కేసులో సుప్రీమ్ కోర్ట్ తీర్పు ఇస్తూ, ఆస్తిని స్వాధీనం చేసుకొనేటప్పుడు ఆ సమయానికి ఉండే మార్కెట్ విలువ ప్రకారం (Market value) నష్టపరిహారం చెల్లించవలెనన్ని, అసలు ఆస్తి హక్కు

సవరించే అధికారం కేంద్ర ప్రభుత్వానికి లేదని తీర్పు ఇచ్చింది. మార్కెట్ విలువ ప్రకారం నష్టపరిహారం చెల్లించడం చిక్కు సమస్య అని భావించి 24 వ రాజ్యాంగ సవరణ ద్వారా ఆస్తిహక్కులో 31 B (1) అనే మార్పు తెచ్చినారు. దీనిప్రకారం నష్టపరిహారం నిర్ణయించే అధికారం శాసనసభల పరం అయింది. న్యాయస్థానాలకు ఆ అధికారం పోయింది. బ్యాంకుల జాతీయాకరణ సందర్భంలో నష్టపరిహారం న్యాయసాధ్యము (Justicible) కాబట్టి మళ్ళీ పూర్వపు చిక్కు వచ్చింది. అయితే ప్రభుత్వం 25 వ రాజ్యాంగ సవరణ ద్వారా 31 (C) క్లాజును రాజ్యాంగంలో చేర్చింది. దీనినిబట్టి పార్లమెంట్ రాజ్యాంగంలోని నిర్దేశిత నియమాల అమలుకు సంబంధించిన 39 (B) (C) నిబంధనలు అమలు పరచడానికి ఆస్తి హక్కుతో పాటు ప్రాథమిక హక్కు లన్నిటిని మార్చే అధికారం పార్లమెంట్‌కు ఇచ్చింది. పార్లమెంట్ చేసే అటువంటి సవరణలను న్యాయస్థానాలు పరిశీలించరాదని చెప్పింది. దీనితో ప్రస్తుతం ఆస్తి హక్కుకు సంబంధించి అన్ని అధికారాలు పార్లమెంట్‌కు మాత్రమే ఉన్నాయి.

(జి) *రాజ్యాంగ పరిహార హక్కు* (*Right to Constitutional Remedies*) - *32 వ నిబంధన*) ; దీనిని గురించి 32 వ నిబంధనలో తెలిపినారు. ప్రాథమిక హక్కులలో ఇది అపురూపమైనది. ప్రాథమిక హక్కులను కాపాడటానికి ఉద్దేశించిన హక్కు ఇది. హక్కులకు హాని జరగకుండా కాపాడటానికి న్యాయస్థానాలు ప్రత్యేక రిట్‌లను జారీ చేయవచ్చునని ఇది సూచిస్తుంది. ప్రాథమిక హక్కులకు హాని జరిగితే పౌరులు నేరుగా ఉన్నత న్యాయస్థానాలలో ఫిర్యాదు చేయవచ్చు.

33, 34, 35 నిబంధనలు హక్కులకు సంబంధించిన కొన్ని సాధారణ నియమాలను వివరిస్తాయి. 33 వ నిబంధన ఈ హక్కులు సాయుధ దళాలకు ఎంతవరకు వర్తిస్తాయనే విషయం పార్లమెంట్ ఒక చట్టంద్వారా నిర్ణయిస్తుందని తెలుపుతున్నది. 34 వ నిబంధన ప్రకారం సైనిక శాసనం (Martial law) అమలులో ఉన్నచోట హక్కులు ఉండవు. ఆ ప్రాంతంలో శాంతి భద్రతల పరిరక్షణకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు తీసుకొన్న చర్యలవల్ల జరిగిన కష్ట నష్టాలకు తగిన పరిహారం ప్రభుత్వం చెల్లిస్తుంది. 35 వ నిబంధన ప్రకారం రక్షక దళాలకు, సైనిక శాసనాలకు, ప్రభుత్వోద్యోగులకు చట్టాలు చేసే అధికారం పార్లమెంట్‌కు మాత్రమే ఉంది. వీటి విషయంలో రాష్ట్రాలకు ఎటువంటి అధికారాలూ లేవు. వారి ప్రాథమిక హక్కులకు వ్యతిరేకంగా ప్రభుత్వం శాసనాలు చేయవచ్చు.

## 4. నిర్దేశక నియమాలు (Directive Principles of State Policy)

రాజ్యాంగంలోని 4 వ భాగంలో నిర్దేశక నియమాలు లేదా ఆదేశ సూత్రాలను గురించిన వివరాలు ఉన్నాయి. ఇవి కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలకు రాజ్యాంగం ఇచ్చిన ఆదేశాలు. దేశ ప్రజలకు సాంఘిక, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ప్రసాదించడానికి, దేశాన్ని శ్రేయో రాజ్యంగా తీర్చి దిద్దడానికి ఇవి తోడ్పడతాయి. నిర్దేశక నియమాలు ప్రజలపట్ల ప్రభుత్వ బాధ్యతలను విశదీకరిస్తాయి. వీటి ప్రకారం ప్రభుత్వం తన విధానాలను రూపొందించుకోవలె. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు తమకు గల ఆర్థిక వనరుల మేరకు వీటిని అమలు పరచవలె. సాంఘిక సంక్షేమాన్ని సాధించడంలో నిర్దేశక నియమాలకు ప్రాథమిక హక్కులకంటె విశిష్టమయిన పాత్ర ఉంది. ప్రాథమిక హక్కులు వ్యక్తి అభ్యుదయానికి తోడ్పడితే, నిర్దేశక నియమాలు

సమాజ సంక్షేమానికి తోడ్పడతాయి. ప్రాథమిక హక్కులు ప్రభుత్వాన్ని కొన్ని పనులు చేయవద్దని శాసిస్తాయి. నిర్దేశక నియమాలు ప్రభుత్వాన్ని కొన్ని కార్యక్రమాలు చేపట్టి అమలుపరచమని ఆదేశిస్తాయి. వీటిని ప్రాథమిక హక్కులవలె న్యాయస్థానాల ద్వారా తప్పక అమలు పరిచేటట్లు చేయలేము. కాని వీటి వెనుక ప్రజాభిప్రాయమనే బలమైనశక్తి వుంది. ఇవి ప్రజల ప్రయోజనాలకు, నైతిక, భౌతిక ఆర్థిక, సాంఘిక ప్రగతికి మూలము. కాబట్టి వీటిని అమలుపరచమని ప్రజలే ప్రభుత్వంపై ఒత్తిడి తెస్తారు. ప్రజాభిప్రాయన్ని నేడు ఏ ప్రభుత్వమూ పెడచెవిని పెట్టజాలదు. కాబట్టి విమర్శకులు ఇవి రాజ్యాంగంలో నిరర్థకంగా ఉన్నాయని అన్నా, అటువంటి విమర్శ సహేతుకమైన విమర్శ కాదు. 42 వ రాజ్యాంగ సవరణ ప్రాథమిక హక్కులకంటె నిర్దేశక నియమాలకే ఎక్కువ ప్రాధాన్య మిందని తేల్చింది. ఐర్లండ్, స్పెయిన్, బ్రెజిల్, ఫ్రాన్సు, బర్మా, జర్మనీ రాజ్యాంగాలలో కూడా నిర్దేశక నియమాలు వున్నాయి. సమ సమాజ స్థాపకునకు ఇవి మూలము. విమర్శనాత్మకంగా చూస్తే వీటిలో గాంధీజీ సర్వోదయ సిద్ధాంతాలు, కార్ల్ మార్క్స్ సోషలిష్ట్ ఆదర్శాలు రెండూ మిశితమై ఉన్నాయని గ్రహించవచ్చు.

భారత రాజ్యాంగంలోని నిర్దేశక నియమాలను గురించి క్లు ంగా తెలుసుకొందాము. వాటి స్వభావాన్ని బట్టి నిర్దేశక నియమాలను మూడు రకాలుగా వ కరించవచ్చు. : (ఏ) శ్రేయోరాజ్య నిర్మాణానికి తోడ్పడే నియమాలు (బి) గాంధేయ ద్ధాంతాను గుణ్యమైన నియమాలు (సి) అంతర్జాతీయ స్నేహ సహకారాలు ప్రోత్సహించే నియమాలు.

(ఏ) ***శ్రేయోరాజ్య నిర్మాణానికి తోడ్పడే నియమాలు.*** 1. ప్రజలందరికి సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్ని చేకూర్చవలె. స్త్రీ పురుష విచక్షత చూపక అందరికీ సమాన హక్కులు ఇవ్వవలె అని నిర్దేశక నియమాలు సూచిస్తున్నాయి. రాజకీయ హక్కులు స్త్రీ పురుష వివక్షతలేక అందరికీ సమానంగా ఇవ్వబడినాయి. అస్పృస్యత నేరంగా పరిగణించ బడుతున్నది. ప్రజలకు ఆర్థిక న్యాయం చేకూర్చడానికి ప్రభుత్వం కృషిచేస్తున్నది.

2. దేశ సహజ సంపద ప్రజలందరి అభ్యుదయానికి తోడ్పడేటట్లు పంపిణీ చేయవలె. ప్రణాళికా సంఘం ఈ కృషిలో నిమగ్నమై వుంది. ప్రభుత్వ పంపిణీ వ్యవస్థ దేశ సంపదను ప్రజలందరికీ అందుబాటులోకి తేవడానికి కృషి చేస్తున్నది. జాతీయ ప్రణాళికలు, సామాజి కాభివృద్ధి పథకాలు సమాజ ప్రగతికి తోడ్పడుతున్నాయి.

3. ఆర్థిక అసమానతలు తొలగించడానికి సంపన్నులపై అధికపన్నులు విధిస్తున్నారు. భూపరిమితి చట్టాల ద్వారా మిగులు భూములను స్వాధీనం చేసుకొని భూమిలేని వారికి పంపిణీ చేస్తున్నారు.

4. బాలబాలికలు నైతికంగా పతనం కాకుండా నివారించడానికి ప్రాథమిక హక్కులలో దౌర్జన్యాన్ని నిరోధించే హక్కు చేర్చబడింది. బాల కార్మికులను నియమించడం చట్ట విరుద్ధంగా పరిగణించబడింది.

5. ప్రజలందరికి పని కల్పించవలెనని అదేశ సూత్రాలు తెలుపుతున్నాయి. అయితే పని హక్కు కల్పించడం చాలా క్లిష్టమైన విషయము. సంపన్న దేశాలు కూడా ఈ విషయంలో విఫల మవుతున్నాయి. అయితే కొన్ని రాష్ట్రాలు కనీసం కొంత మందికి ఉద్యోగావకాశాలు కల్పించడం లేదా నిరుద్యోగ భృతి ఇవ్వడానికి చట్టాలు చేస్తున్నాయి. "ఎంప్లాయిమెంట్,

ఎక్స్చేంజ్" (Employment exchange) లను నెలకొల్పి నిరుద్యోగులకు ఉద్యోగావకాశాలను గురించి తెలియజేస్తున్నారు. బ్యాంకులు నిరుద్యోగులైన విద్యార్థులకు ఉపాధి సౌకర్యాలు, ఋణాలు ఇస్తున్నాయి. అయినా ఈ విషయంలో చేయవలసింది ఎంతో వుంది.

౬. శ్రామిక ఆరోగ్యాన్ని కాపాడటానికి అనేక కార్మిక చట్టాలు చేయబడినవి. పని గంటలు, విశ్రాంతి సమయము, కనీస వేతనాలు, పింఛనుపథకాలు, బోనస్, భీమా సౌకర్యాలు ప్రవేశపెట్టినారు. కార్మిక మంత్రిత్వ శాఖ వీరి ప్రయోజనాల రక్షణకు కృషి చేస్తున్నది. లేబర్ ఆఫీసర్లు, లేబర్ ట్రిబ్యునల్సు ఏర్పాటుచేసి కార్మికుల హక్కులకు రక్షణ యిస్తున్నారు కార్మిక సంక్షేమానికి అనేక చర్యలు తీసుకోవడం జరిగింది.

7. 14 సంవత్సరాల లోపు బాల బాలికలకు ఉచిత నిర్బంధ విద్యా సౌకర్యాలు. కల్పించడానికి ప్రతి గ్రామంలో పాఠశాలలు నెలకొల్పే ప్రయత్నం ముమ్మరంగా సాగుతున్నది. నిరక్షరాస్యత నిర్మూలించి ప్రజాస్వామ్యాన్ని విజయవంతం చేయడానికి ప్రభుత్వం చేస్తున్న కృషి ఇంకా సముద్రంలో నీటి బొట్టువలె ఉంది.

8. ప్రజలందరికి బలవర్ధకమైన పోషక ఆహారాన్ని అందివ్వవలె. వారి ఆరోగ్యాన్ని కాపాడి వారి జీవన ప్రమాణాన్ని పెంచవలె అని నిర్దేశక నియమాలు సూచిస్తున్నాయి. ఆహారోత్పత్తులు పెంచడానికి శాస్త్రీయ పరిశోధనలు జరుగుతున్నాయి. అధిక దిగుబడి పొందడానికి రసాయనిక ఎరువులు తయారు చేస్తున్నారు. సస్యరక్షణ చర్యలు తీసుకొంటున్నారు. ప్రతిగ్రామంలో ప్రభుత్వ ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటుచేసి ప్రజలకు ఉచిత వైద్య సహాయం అందిస్తున్నారు.

9. మాతా శిశు సంరక్షణకు స్త్రీ, శిశు సంక్షేమశాఖ ఏర్పడింది. అనేక మాతా శిశు సంరక్షణాలయాలు నెలకొల్పినారు. గర్భిణీ స్త్రీలకు, చంటి పిల్లలకు ఉచితంగా వైద్య సహాయము, పోషక ఆహారము అందజేస్తున్నారు. హెల్త్ విజిటర్లు, గ్రామ సేవికలు ఇంటింటికి వచ్చి ఆరోగ్యనియమాలు, జాగ్రత్తలు వివరిస్తున్నారు. అంటువ్యాధులు రాకుండా ముందు జాగ్రత్తగా వ్యాధి నిరోధక ఔషధాలు, టీకాలు వేయడం జరుగుతున్నది.

(బి) *గాంధేయ సిద్ధాంతానుగుణ్యమైన నియమాలు* : ఈ దిగువ పేర్కొన్న నిర్దేశక నియమాలు మహాత్మా గాంధి సూచించిన సర్వోదయ సిద్ధాంతాలకు అనుగుణంగా ఉన్నాయి.

1. పంచాయతీ రాజ్ స్థాపనద్వారా స్వపరిపాలన ప్రోత్సహించవలెనని ఒక నిర్దేశక నియమం సూచిస్తున్నది. 1958 నుంచి మనదేశంలో పంచాయతీరాజ్ వ్యవస్థ పనిచేస్తున్నది. ఈ పథకం కింద స్థానిక స్వపరిపాలనా సంస్థలకు విశేషమైన అధికారాలు, వనరులు లభించినాయి. గాంధీజీ కలలుగన్న "రామరాజ్యము" నెలకొల్పడానికి ఇవి కృషిచేస్తున్నాయి.

2. గృహ పరిశ్రమలు, చేతిపనులు, చిన్నతరహా పరిశ్రమలు, సహకార సంఘాలు ప్రోత్సహించడానికి ప్రభుత్వం అనేక చర్యలు తీసుకొంటున్నది. వాటి అభివృద్ధికి ఆర్థిక సహాయము, కావలసిన ముడిపదార్థాలు సరఫరా చేస్తున్నది. చేతిపనులు, ఖాదీ మొదలైనవి అభివృద్ధి చేయడానికి ప్రత్యేకంగా బోర్డులు ఏర్పాటు చేయడం జరిగింది.

3. వెనకబడిన వర్గాలు, జాతులు, బలహీనవర్గాల వారి ప్రయోజనాలు కాపాడటానికి రాజ్యాంగం స్వయంగా కొన్ని చర్యలు తీసుకొంది. శాసన సభలలోను, ఉద్యోగాలలోను

వారికి రిజర్వేషన్లు ఇచ్చినారు. సాంఘిక సంక్షేమశాఖను ఏర్పాటుచేసి ఎప్పటికప్పుడు వారి స్థితిగతులు తెలుసుకొని వారి పరిస్థితులు మెరుగుపరచడానికి ప్రభుత్వం కృషిచేస్తున్నది.

4. మత్తుపదార్థాల వాడకాన్ని నిషేధించి ప్రజల ఆరోగ్యాన్ని కాపాడవలె అని ఆదేశ సూత్రాలంటున్నాయి. నల్లమందు, గంజాయివంటి పదార్థాల వాడకం చట్ట విరుద్ధం చేసినారు. కొన్న రాష్ట్రాలు మద్యపాన నిషేధాన్ని అమలు పరచినాయి. కొన్ని రాష్ట్రాలు మద్యం విక్రయం ద్వారా వచ్చే ఆదాయాన్ని ఆశించి దాని వినియోగాన్ని రద్దుచేయలేదు. జాతీయ మద్యపాన నిషేధ కార్యక్రమం కింద మద్యపాన నిషేధాన్ని అమలుపరిచే రాష్ట్రాలకు వాటి బడ్జెట్‌లో లోటు భర్తీ చేసుకోవడానికి 50% సబ్సిడీ ఇవ్వటం ద్వారా ధనసహాయం చేస్తామని కేంద్రం ప్రకటించింది.

5. పశుగణాభివృద్ధికి కృషిచేయవలెనని గోవధను నిషేధించవలెనని ఆదేశ సూత్రాలు సూచిస్తున్నాయి. దీనికై ప్రభుత్వం ప్రతి గ్రామంలోను పశువైద్యశాలలు నెలకొల్పింది. పాడిపశువుల పెంపకానికి, మత్స్యపరిశ్రమను ఆహారోత్పత్తికి ఉపయోగించే ఇతర పశుపక్ష్యాదుల పెంపకాన్ని ప్రోత్సహించడానికి ప్రభుత్వం అనేక చర్యలు గైకొంది. గోవధ నిషేధానికి మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు 30-12-1976 న శాసనాలు చేసినాయి.

6. చారిత్రక ప్రాముఖ్యం గల ప్రదేశాలు, కట్టడాలు, శిల్పసంపద, కళాత్మకమైనవస్తు సముదాయాన్ని కాపాడి మన ప్రాచీన వైభవము, సంస్కృతి, చరిత్ర, నాగరకత అంతరించి పోకుండా కాపాడటానికి కొన్ని చట్టాలను ప్రభుత్వం రూపొందించింది. పురావస్తు శాఖ వీటిని కాపాడుతున్నది.

7. న్యాయశాఖను కార్యనిర్వాహక వర్గం నుంచి వేరుచేసి న్యాయశాఖ సర్వ స్వతంత్రంగా ఉండేటట్లు చేసినారు. న్యాయమూర్తులు కార్యనిర్వాహక వర్గము, శాసనసభల ఒత్తిడికి లోనై పక్షపాతంతో న్యాయనిర్ణయాలు చేయకుండా ధర్మరక్షణకు పూనుకోవడానికి తగిన చర్యలు రాజ్యాంగమే సూచించింది.

(సి) *అంతర్జాతీయ స్నేహ సహకారాలు ప్రోత్సహించే నియమాలు*: భారతదేశం అంతర్జాతీయ స్నేహసంబంధాలు మెరుగుపరుచుకొని ప్రపంచ శాంతికి కృషిచేయవలె. మన విదేశాంగవిధానానికి మూలమైన "పంచశీల" సూత్రాలు ఈ విషయాన్నే స్పష్టంచేస్తున్నాయి. ప్రపంచ అలీన రాజ్యాల వ్యవస్థలో భారతదేశం సభ్యత్వరాజ్యంగా ఉంది. ఐకరాజ్యసమితి. కామన్‌వెల్త్ వంటి అంతర్జాతీయ సంస్థలో దీనికి సభ్యత్వముంది. వివాదాలను శాంతి యుతంగా పరిష్కరించుకోవడం, అన్ని దేశాలతో స్నేహసంబంధాలు పెంచుకోవడం, దురాక్రమణకు దిగకుండా ఉండటం, పొరుగురాజ్యం అంతరంగిక విషయాలలో జోక్యం చేసుకోక పోవడం, అంతర్జాతీయ న్యాయ సూత్రాలు, ఒడంబడికలు గౌరవించడం మొదలైన విషయాలను మన విదేశాంగ విధానంలో ప్రధానంగా పాటిస్తున్నాము.

ఈ నిర్దేశక నియమాలు అమలు పరచడంలో ప్రభుత్వం కొంతవరకు మాత్రమే సఫలమైంది. ప్రత్యేకంగా ఆర్థికవిధానంలో ప్రభుత్వవైఫల్యాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. ప్రభుత్వము, నాయకులు, ప్రజలు మరింత చిత్తశుద్ధితో కృషిచేస్తేగాని ఇవి నెరవేరవు. 1-9-76 న 39 వ రాజ్యాంగసవరణద్వారా ఈ కింది నిర్దేశక నియమాలు రాజ్యాంగంలో చేర్చవలెనని నిర్ణయించినారు.

1. ప్రజలకు ఉచితన్యాయ సహాయం సమకూర్చడం.
2. పరిశ్రమల నిర్వహణలో కార్మికులకు భాగస్వామ్యం కల్పించడం.
3. పరిసరాలను కలుషితం కాకుండా చూడటం, వన్యమృగాలను ఆటవీ సంపదను కాపాడటం.
4. పిల్లలకు స్వేచ్ఛగాను హుందాగాను పెరిగే అవకాశాలు కల్పించడం.
5. పౌరులు అహ్లాదకరమైన వాతావరణంలో జీవించేటట్లు చేయడం.
6. భారతదేశాన్ని సర్వసత్తాక, ప్రజాస్వామిక, సామ్యవాద, లౌకిక, గణతంత్ర రాజ్యంగా తీర్చిదిద్దడం.

## 5. ప్రాథమిక విధులు (Fundamental duties)

మన రాజ్యాంగ నిర్మాతలు రాజ్యాంగంలో భారతపౌరుల హక్కులను వివరించినారేగాని వారి విధులను గురించి ప్రస్తావించలేదు. 42 వ రాజ్యంగ సవరణద్వారా భారత పౌరులు నెరవేర్చవలసిన 10 ప్రాథమిక విధులు రాజ్యాంగంలో చేర్చబడినవి. అవి :

(ఏ) రాజ్యాంగాన్ని జాతీయపతాకాన్ని, జాతీయ గీతాన్ని ప్రతి పౌరుడూ గౌరవించవలె.

(బి) స్వాతంత్ర్య పోరాటపు ఉత్తమ ఆదర్శాలను కాపాడవలె.

(సి) భారతదేశం యొక్క సార్వభౌమత్వము, సమగ్రత, సమైక్యత కాపాడవలె.

(డి) దేశరక్షణకు కృషిచేయవలె; అవసరమైతే జాతీయసేవలో పాల్గొనవలె.

(ఈ) భారత ప్రజలందరి మధ్య సోదరభావాన్ని పెంపొందించవలె.

(ఎఫ్) స్త్రీల గౌరవ ప్రతిపత్తులకు భంగం కలిగించే ఏ చర్యనైనా నిరసించవలె.

(జి) భారతదేశ సమష్టిసంస్కృతిని కాపాడవలె.

(హెచ్) సహజవాతావరణాన్ని, పరిసరాలను, పరిశుభ్రంగా ఉంచి వాటిని సంరక్షించవలె, భూతదయ చూపవలె.

(ఐ) శాస్త్రీయ విజ్ఞానాభివృద్ధికి తోడ్పడవలె. సంస్కరణల పట్ల ప్రోత్సాహవైఖరితో ఉండవలె.

(జె) ప్రజల యొక్క, ప్రభుత్వం యొక్క ఆస్తిపాస్తులు కాపాడవలె, దౌర్జన్యాన్ని విడనాడవలె.

(కె) వ్యక్తిగత, సామాజిక వికాసానికి కృషి చేయవలె.

ఈ విధులను ప్రతి పౌరుడు పాటించవలె. వీటిని రాజ్యాంగంలో చేర్చినప్పటికీ వీటిని న్యాయస్థానాల ద్వారా అమలు జరపడానికి వీలు కాదు.

## 6. బాధ్యతాయుత ప్రభుత్వము (Responsible Government)

బాధ్యతాయుత పాలనను పార్లమెంటరీ విధానము లేదా కాబినెట్ విధానము అని కూడా అంటారు. భారతరాజ్యాంగం బ్రిటన్‌లోవలె పార్లమెంటరీ వ్యవస్థను నెలకొల్పింది. మన రాజ్యాధినేత అయిన రాష్ట్రపతి బ్రిటిష్ రాజు లేదా రాణి వలె నామమాత్రపు కార్యనిర్వహణాధికారి. సాధారణ ఎన్నికల తరవాత లోక్‌సభలో మెజారిటీ పార్టీ నాయకుడిని రాష్ట్రపతి ప్రధానిగా నియమిస్తాడు. అతని సలహాపై మంత్రిమండలిలోని ఇతర మంత్రులను నియ

మిస్తాడు. ఆ మంత్రిమండలి రాష్ట్రపతి పేరుమీదుగా సర్వాధికారాలను అనుభవిస్తుంది. మంత్రులు తమ చర్యలకు వ్యక్తిగతంగాను సమష్టిగాను శాసనసభలోని దిగువ సభకు బాధ్యత వహిస్తారు. దీనినే బాధ్యతాయుత ప్రభుత్వమంటారు. ఇదేవిధమైన పద్ధతి రాష్ట్రస్థాయిలోకూడా అనుసరిస్తున్నారు. అక్కడ గవర్నర్ పేరుమీద ముఖ్యమంత్రి, అతని మంత్రి మండలి అధికారం చెలాయిస్తారు. వారు విధానసభకు బాధ్యత వహిస్తారు.

## 7. సమాఖ్య రాజ్యలక్షణాలుగల ఏకకేంద్రరాజ్యము

భారత రాజ్యాంగ నిర్మాతలు దేశంలో నెలకొని ఉన్న కొన్ని ప్రత్యేక పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని, భారత దేశాన్ని సమాఖ్య రాజ్య లక్షణాలు గల ఏక కేంద్ర రాజ్యంగా రూపొందించినారు. ఇది శాంతియుత పరిస్థితులలో సమాఖ్య రాజ్యంగా పనిచేసినా అత్యయిక పరిస్థితులలో ఏక కేంద్ర రాజ్యంగా మారిపోతుంది. రాజ్యాంగ నిర్మాతలు రాష్ట్రాలకు స్వేచ్ఛను ఇవ్వడంతోపాటు బలమైన కేంద్ర ప్రభుత్వాన్ని కూడా ఏర్పాటు చేసినారు. భారత దేశంలోని సమాఖ్య నిర్మాణం కెనడా సమాఖ్యను పోలి ఉంటుంది.

భారత దేశం సమాఖ్యరాజ్యము (Federal State) అని రాజ్యాంగంలో ఎక్కడా చెప్ప లేదు. కేంద్ర ప్రభుత్వాన్ని "యూనియన్ ప్రభుత్వము" (Union Government) అని మాత్రమే వర్ణించినారు. భారత రాజ్యాంగంలో కొన్ని ముఖ్య లక్షణాలు ఉన్నా దీనిని యూనియన్‌గా అభివర్ణించడంలో అనేక ప్రయోజనాలు ఉన్నాయని డా॥ అంబేద్కర్ అన్నారు. భారత సమాఖ్య, భారత రాష్ట్రాలు చేసుకొన్న ఒడంబడిక ఫలితంగా ఏర్పడలేదు. కాబట్టి అవి సమాఖ్య నుంచి విడిపోవడానికి వీలులేదు. నిజమైన సమాఖ్యలో ఇది సాధ్యము. ఈ విషయాన్ని ధృవపరచడానికే "సమాఖ్య" అనే పదానికి బదులు "యూనియను" అనే పదం వాడటం జరిగిందని ఆయన అన్నారు.

డైసీ అనే ప్రసిద్ధ ఆంగ్లేయ న్యాయవేత్త సమాఖ్య రాజ్యానికి మూడు ప్రధాన లక్షణాలు ఉంటాయని చెప్పినాడు :

1. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య అధికారాల పంపిణీ
2. స్వతంత్ర ప్రతిపత్తి గల ఉన్నత న్యాయస్థానము
3. లిఖితము, ఉన్నతము అయిన దృఢ రాజ్యాంగము.

భారత రాజ్యాంగానికి దాదాపు ఈ మూడు లక్షణాలు ఉన్నాయి. కాబట్టి భారతదేశాన్ని సమాఖ్య రాజ్యమని పిలవవచ్చు. కాని ఇది నిజమైన సమాఖ్య కాదు. దీనిలో ఈ కింది ఏక కేంద్ర రాజ్య లక్షణాలు కూడా ఉన్నాయి :

1. అమెరికా సమాఖ్యలో ఉన్నట్లు భారత సమాఖ్యలో కూడా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలనే రెండు ప్రభుత్వాలు ఉన్నాయి. అవి తమ తమ పరిధిలో సర్వ స్వతంత్రంగా వ్యవహరిస్తాయి. ఆ రెండు ప్రభుత్వాల మధ్య అధికారాలను 7వ షెడ్యూల్ ప్రకారం పంపిణీ చేసినారు. ఆ అధికారాలను సాధారణ సమాఖ్యలో వలె రెండు జాబితాలుగా విభజించడానికి బదులు మూడు జాబితాలుగా విభజించినారు : 1. తంతి తపాల, రక్షణ, విదేశీవ్యవహారాలు కరెన్సీ, శాంతి భద్రతలు, బ్యాంకులు మొదలైన 97 అంశాలను కేంద్ర జాబితా (Union list) లో చేర్చినారు. 2. పోలీసు భూమిశిస్తు, స్థానిక సంస్థలు. ఆరోగ్యము, వ్యవసాయము

మొదలైన 66 అంశాలను రాష్ట్ర జాబితా (State list) లో చేర్చినారు. 42 వ రాజ్యాంగ సవరణ ద్వారా 1976లో రాష్ట్ర జాబితాలోని విద్య, వ్యవసాయము ఉమ్మడి జాబితాలోకి మార్చినారు. ఆ తరువాత వచ్చిన జనతా ప్రభుత్వం విద్యను మాత్రం తిరిగి రాష్ట్ర జాబితాలోకి చేర్చవలెనని యోచించింది. తరువాత ఆ యోచన ఫలించలేదు. 3. వివాహము, విడాకులు, విద్యుచ్ఛక్తి, ఫాక్టరీలు, కార్మిక సంఘాలు మొదలైన 47 అంశాలను ఉమ్మడి జాబితాలో (Concurrent list) చేర్చినారు. ఈ అధికారాల పంపిణీని పరిశీలిస్తే రాష్ట్రాల కంటె కేంద్ర ప్రభుత్వానికే ఎక్కువ అధికారాలు లభించినట్లు తెలుస్తున్నది. నిజమైన సమాఖ్యలో కేంద్రం కంటె రాష్ట్రాలకే ఎక్కువ అధికారాలు ఉంటాయి. భారత రాజ్యాంగం ఏ జాబితాలో చేరని అవశిష్టాధికారాలను (Residuary Powers) రాష్ట్రాలకు ఇవ్వడానికిబదులు కేంద్రానికిఇచ్చింది. ఈ అధికారాలలో కేంద్రజాబితాలోని అంశాలను కేంద్ర ప్రభుత్వము, రాష్ట్ర జాబితాలోని అంశాలను రాష్ట్రప్రభుత్వాలు నిర్వహిస్తాయి. ఉమ్మడి జాబితాలోని అంశాలపై రెండు ప్రభుత్వాలు శాసనాలు చేయవచ్చు. ఒకే అంశంపై కేంద్రము, రాష్ట్రము కూడా శాసనం చేస్తే కేంద్ర ప్రభుత్వ శాసనమే చెల్లుతుంది. దీనిని బట్టి భారత సమాఖ్యలో కేంద్రం బలమైనదని రుజువవుతున్నది.

2. భారతదేశం సమాఖ్య రాజ్యంగా కనిపించినా రాష్ట్ర వ్యవహారాలలో కేంద్రం అనేక సందర్భాలలో జోక్యం చేసుకొంటున్నది. 249 వ నిబంధన ప్రకారం దేశ శ్రేయస్సు కోసం రాష్ట్ర జాబితాలోని అంశాలపై పార్లమెంట్ ఒక సంవత్సరంపాటు శాసనాలు చేయవలెనని రాజ్యసభ 2/3 వంతు మెజారిటీతో ఒక తీర్మానాన్ని ఆమోదిస్తే రాష్ట్రాలకు కావలసిన శాసనాలను కేంద్ర ప్రభుత్వమే రూపొందిస్తుంది. ఈ కాలవ్యవధి అవసరమయితే మరొక సంవత్సరంపాటు పొడిగించవచ్చు. నిజమయిన సమాఖ్యలో కేంద్ర ప్రభుత్వము రాష్ట్ర వ్యవహారాలలో ఎటువంటి పరిస్థితులలోనూ జోక్యం చేసుకోదు.

3. 357వ నిబంధన ప్రకారం ఏ రాష్ట్రంలో నయినా రాజ్యాంగబద్ధమైన పరిపాలన నిర్వహించడం అసాధ్యమని రాష్ట్రగవర్నర్ రాష్ట్రపతికి వర్తమానం పంపితే ఆ రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన ప్రవేశపెట్టవచ్చు. అటువంటప్పుడు రాష్ట్రప్రభుత్వం రద్దు అవుతుంది.

4. 355 నిబంధన ప్రకారం దేశంలో ఆర్థికాత్యయిక పరిస్థితి ప్రకటించినప్పుడు రాష్ట్ర మనీ బిల్లులు (Money Bills) అన్నిటినీ రాష్ట్రపతి ఆమోదానికి పంపించవలె.

5. 256,257 నిబంధనలప్రకారం కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలకు పరిపాలనా పరమైన ఆదేశాలు పంపించవచ్చు. 352 నిబంధన కింద దేశంలో ఆత్యయిక పరిస్థితి ప్రకటించి నప్పుడూ కూడా కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు పరిపాలనా పరమయిన ఆదేశాలు పంపించవచ్చు. రాష్ట్ర జాబితాలోని అంశాలపై పార్లమెంట్ శాసనాలు చేయవచ్చు. కేంద్రప్రభుత్వం పంపిన ఆదేశాలను రాష్ట్రాలు గౌరవించి అమలుపరచవలె. లేకపోతే కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర విషయాలలో జోక్యం చేసుకోవచ్చు. 1976 లో తమిళనాడులో రాష్ట్రపతి పాలన ప్రవేశ పెట్టడానికి, అక్కడ అధికారంలో ఉన్న డి. ఎమ్. కె. ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వం సూచించిన 20 సూత్రాల పథకాన్ని అమలు పరచడానికి విముఖత చూపడమే కారణము.

6. 252 వ నిబంధన ప్రకారం రెండు లేదా అంతకంటే ఎక్కువ రాష్ట్రాల శాసన

సభలు ఒక తీర్మానం ద్వారా తమ రాష్ట్రాలకు కావలసిన శాసనాలను పార్లమెంట్ రూపొం దించవలెనని తీర్మానిస్తే ఆ రాష్ట్రాలకు పార్లమెంట్ శాసనాలు చేయవచ్చు.

7. 31 (B), 286 (3) నిబంధనల ప్రకారం కొన్ని రాష్ట్ర ప్రభుత్వ బిల్లులురాష్ట్రపతి ఆమోదం లేనిదే అమలులోకిరావు. రాజ్యాంగంలోని ఈ నిబంధనలన్నీ కేంద్రానికి రాష్ట్ర వ్యవహారాలలో జోక్యం చేసుకొనే అవకాశమిస్తున్నాయి.

8. రాజ్యాంగాన్ని సంరక్షించి అమలుపరచడానికి స్వతంత్ర ప్రతిపత్తిగల న్యాయ శాఖ, సుప్రీమ్‌కోర్ట్ ఆధ్వర్యంలో పనిచేస్తుంది. సుప్రీమ్‌కోర్ట్‌కు రాష్ట్రహైకోర్ట్‌లపై అదుపు ఉంది. నిజమైన సమాఖ్యలో రెండు న్యాయవ్యవస్థలు ఉంటాయి. రాష్ట్ర న్యాయస్థానాలు వేరుగా ఉంటాయి. ఇండియాలో కేంద్రీకృత న్యాయవ్యవస్థ ఉంది.

9. భారతరాజ్యాంగము లిఖిత రాజ్యాంగము. అది దేశంలో అత్యున్నతమైన చట్టము. కాని అది పూర్తిగా దృఢరాజ్యాంగంకాదు. కొన్ని విషయాలలో అది అదృఢంగా ఉంటుంది. నిజమైన సమాఖ్యలో రాజ్యాంగాన్ని సవరించే అధికారం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు రెండిటికీ ఉంటుంది. రాష్ట్రాలు కూడా రాజ్యాంగసవరణలు ప్రతిపాదించవచ్చు. కాని ఇండియాలో రాష్ట్రాలకు ఆ అధికారం లేదు. కొన్ని రాజ్యాంగ సవరణలకు రాష్ట్ర ప్రభుత్వాల అనుమతి కూడా అవసరంలేదు. కేంద్రమే వాటిని మార్చవచ్చు. అంతేకాక భారతదేశంలో రాష్ట్రాలకు విడిగా రాజ్యాంగాలులేవు. అమెరికాలో రాష్ట్రాలకు విడిగా రాజ్యాంగాలు ఉన్నాయి.

10. ఇండియాలో రాష్ట్రగవర్నర్లను రాష్ట్రపతి, కేంద్రమంత్రిమండలి సలహాపై నియమిస్తాడు. పైగా ఏ వ్యక్తి తన సొంత రాష్ట్రానికి గవర్నర్ కాకూడదు. రాష్ట్రేతరుని మాత్రమే గవర్నరుగా నియమించవలననే నియమం ఉంది. గవర్నర్లు కేంద్రంచే నియమించ బడి, దానిచేతనే తొలగించబడటంవల్ల వారు రాష్ట్రంలో కేంద్రానికి ఏజంట్లువలె పనిచేసే అవకాశం లేకపోలేదు. నిజమైన సమాఖ్యలో రాష్ట్రగవర్నర్లు ఆ రాష్ట్ర ప్రజలచే ఎన్నుకో బడతారు. అంతేగాని రాజ్యాధిపతిచే నియమించబడరు.

11. అమెరికా రాజ్యాంగంలో కేంద్ర రాష్ట్రప్రభుత్వాలకు విడి విడిగా పౌరత్వ హక్కులు నిర్వచించినారు. భారతదేశంలో ద్వంద్వ పౌరత్వంలేదు. భారతీయుడు భారత పౌరుడుగానే చెలామణీ అవుతాడు. అతనికి విడిగా తన రాష్ట్రపౌరత్వం ఉండదు. దీనిని ఏక పౌరత్వవిధానమంటారు. ఈ పద్ధతి ఏకకేంద్రరాజ్యాలలో ఉంటుంది సమాఖ్యలలో ద్వంద్వ పౌరత్వం ఉంటుంది.

12. సమాఖ్య రాజ్యాలైన అమెరికా సంయుక్తరాష్ట్రాలు, స్విట్జర్లండ్‌లలో కేంద్ర శాసన సభలోని ఎగువ సభలో రాష్ట్ర ప్రభుత్వాలన్నిటికీ సరిసమానంగా ప్రాతినిధ్యముంది. కాని భారతదేశంలో ఆ విధంగా లేదు. రాజ్యసభలో అన్ని రాష్ట్రాలకు సమానసభ్యత్వం లేదు. రాజ్యసభలో సభ్యత్వం ఆ యా రాష్ట్రాల జనాభాను బట్టి ఇవ్వబడింది. రాజ్యసభలో రాష్ట్రాల ప్రతినిధులతో బాటు 12 మంది నామినేటెట్ సభ్యులు కూడా ఉంటారు. వారిని రాష్ట్రపతి కేంద్రమంత్రిమండలి, రాష్ట్ర ప్రభుత్వాల సిఫార్సులపై నియమిస్తాడు.

13. దేశంలో కొన్ని కేంద్రపాలిత ప్రాంతాలు ఉన్నాయి. వాటిపై కేంద్రానికి పూర్తి అధికారముంది. అంతే కాక రాష్ట్ర శాసనసభలో ఎగువసభను ఏర్పాటుచేయవలెనన్నా లేదా

ఉన్నదానిని రద్దు చేయవలెనన్నా ఆ రాష్ట్రం అభ్యర్థనపై కేంద్రం మాత్రమే ఆపని చేయ గలదు.

14. రాజ్యాంగము ఇండియాలో బలమైన కేంద్రప్రభుత్వం ఏర్పాటు చేసిందనడానికి ఇంకా అనేక నిదర్శనాలు ఉన్నాయి. దేశానికంతటికీ ఆర్థిక విధానాలను సూచించే ఆర్థిక కమీషన్‌ను 5 సం॥కు ఒకసారి రాష్ట్రపతి నియమిస్తాడు. ఆడిటర్ జనరల్ ఆఫ్ ఇండియా కేంద్రపద్దులనే కాక రాష్ట్ర పద్దులను కూడా ఆడిట్ చేస్తాడు. రాష్ట్రాల అకౌంటెంట్ జనరల్స్ అతనికి లోబడిపనిచేస్తారు. యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్‌చే ఎంపిక చేయబడిన ఆలిండియా సర్వీసు ఉద్యోగులు రాష్ట్రపరిపాలనలో కూడా ప్రధానమైన పాత్ర నిర్వహిస్తారు. వారిపై రాష్ట్రాలకంటె కేంద్రానికే ఎక్కువ అదుపు ఉంది. దేశానికంతటికీ కలిపి ఒకే ఒక ప్రణాళికా సంఘము, ఎన్నికల సంఘము ఉన్నాయి. ప్రణాళికా సంఘానికి ప్రధానమంత్రి అధ్యక్షుడుగా ఉంటాడు. ప్రత్యక్ష పరిపాలనలో కూడా కేంద్రంలోను, రాష్ట్రాలలోనూ, ఒక రాజకీయపార్టీ అధికారంలో ఉంటే దేశంలో ఏక కేంద్రరాజ్యలక్షణాలు మరింత స్పష్టంగా కనిపిస్తాయి. పై అంశాలను బట్టి భారతదేశాన్ని సమాఖ్యలక్షణాలుగల ఏకకేంద్రరాజ్యమని చెప్పవలసిఉంటుంది.

## 8. స్వతంత్ర ప్రతిపత్తిగల ఉన్నత న్యాయస్థానము

భారత రాజ్యాంగము న్యాయశాఖకు పూర్తిస్వతంత్ర్య ప్రతిపత్తి కల్పించింది. దానిని కార్యనిర్వాహకవర్గం అదుపులోగాని, శాసననిర్మాణశాఖ అదుపులోగాని లేకుండా చేసింది. ఉన్నత న్యాయస్థానాలలోని న్యాయమూర్తులను రాష్ట్రపతి నియమించినా వారిని తొలగించే అధికారం అతనికి లేదు. పార్లమెంట్ మాత్రమే వారిని తొలగించగలదు. వారి వేతనాలను భారతసంఘటితనిధి నుంచి ఇచ్చే ఏర్పాటు చేయడం ద్వారా వాటిపై పార్లమెంట్‌కు ఎటువంటి అధికారం లేకుండా రాజ్యాంగం జాగ్రత్తపడింది. ఉన్నత న్యాయస్థానాలైన సుప్రీమ్‌కోర్ట్ హైకోర్ట్‌లు రాజ్యాంగానికి సంరక్షకులుగా వ్యవహరిస్తాయి. అవి రాజ్యాంగానికి అర్థవివరణ చేస్తాయి. పౌర హక్కులను కాపాడతాయి. ప్రభుత్వం యొక్క చర్యలు రాజ్యాంగ విరుద్ధంగా ఉంటే అవి చెల్లవని తీర్పు ఇస్తాయి. దీనినే "న్యాయసమీక్ష" అని అంటారు.

## 9. మతప్రమేయం లేని లౌకిక రాజ్యము (Secular State)

రాజ్యాంగము భారతదేశాన్ని మతప్రమేయంలేని లౌకిక రాజ్యంగా రూపొందించింది. అంటే భారతదేశ పరిపాలన ఏ మత సూత్రాలకు అనుగుణంగా జరుగదన్నమాట. ప్రజలు తమకు నచ్చిన మతాన్ని అనుసరించవచ్చు. మతం పేరిట ప్రభుత్వం ప్రజల నుంచి పన్నులు వసూలు చేయదు. ప్రభుత్వ పదవుల విషయంలో మత విచక్షణ చూపదు. ప్రభుత్వం నడిపే విద్యాలయాలలో మతబోధ జరుగదు. ప్రభుత్వ సహాయం పొందే ప్రైవేట్ విద్యాలయాలలోను మత సంస్థలలోను విద్యార్థి అభీష్టానికి వ్యతిరేకంగా నిర్బంధంగా మతబోధ జరగదు. ప్రభుత్వం అన్ని మతాలవారి అభివృద్ధికి తోడ్పడుతుంది. ఒక్క మాటలో చెప్పవలెనంటే ప్రభుత్వం ఏ మతాన్ని నిరసించదు, ఏ మతాన్ని బలపరచదు. మతం విషయంలో అది తటస్థంగా ఉంటుంది. అటువంటి రాజ్యాన్ని లౌకిక రాజ్యము అంటారు. మత ప్రసక్తిగల

రాజ్యాలలో (Theocratic states) పరిస్థితి దీనికి విరుద్ధంగా ఉంటుంది. వాటిలో అధికార మతం (State religion) ఉంటుంది. ఆ మత సూత్రాల కనుగుణంగా పరిపాలన జరుగుతుంది. ఆ మతానికి ఇతర మతాలకంటె ప్రత్యేకత ఉంటుంది. అన్య మతాలు నిషిద్ధం కూడా కావచ్చు. ఉదాహరణకు, పాకిస్తాన్, ఇరాన్‌లలో పరిపాలన ఇస్లాం మత గ్రంథమైన ఖొరాన్‌లో చెప్పబడిన సూత్రాల కనుగుణంగా జరుగుతుందని ఆ దేశ రాజ్యాంగాలు సూచిస్తున్నాయి. కొన్ని దేశాలు నాస్తికవాద రాజ్యాలు (Atheistic states) గా ఉంటాయి. అవి మతానికి విరోధులు. మన రాజ్యాంగ నిర్మాతలు మానవ ప్రగతిలో మతం ప్రాముఖ్యాన్ని, దాని ద్వారా జరిగిన అనర్థాలను రెండిటిని అవగాహన చేసుకొని చివరకు లౌకిక విధానం శ్రేష్ఠమైనదని ఎంచి ఆ పద్ధతిని సూచించినారు. నిజానికి భారతదేశం లౌకిక రాజ్యమని రాజ్యాంగం నిర్దిష్టంగా ఎక్కడా చెప్పలేదు. కొన్ని నిబంధనలు పరిశీలిస్తే ఆ అభిప్రాయం కలుగుతుంది. 42వ రాజ్యాంగ సవరణ రాజ్యాంగ ప్రస్తావనను మార్చి, భారతదేశం లౌకిక రాజ్యమనే విషయాన్ని స్పష్టం చేసింది.

## 10. దృఢ, అదృఢ రాజ్యాంగము (Rigid and flexible Constitution)

భారత రాజ్యాంగము బ్రిటిష్ రాజ్యాంగం కంటె దృఢమైనది, అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగం కంటె అదృఢమైనది. దీనిలో దృఢ అదృఢ లక్షణాలు రెండూ మేళవించి ఉండటానికి కారణం, దీనిని సవరించడానికి ఒక పద్ధతిని సూచించడానికి బదులు రాజ్యాంగ నిర్మాతలు మూడు పద్ధతులను సూచించడమే.

కొత్త రాష్ట్రాలను నెలకొల్పడం, రాష్ట్ర శాసనసభలో విధాన పరిషత్తు లేకపోతే నెలకొల్పడం, అవసరం లేకపోతే రద్దుచేయడం రాష్ట్రాల పేర్లు మార్చడం, షెడ్యూల్డ్ కులాలు, జాతులు, తెగల పరిపాలనకు సంబంధించిన అంశాలు మొదలైన వాటిని సవరించడానికి పార్లమెంట్‌లోని ఉభయ సభలు ఆ మేరకు ఒక తీర్మానాన్ని సాధారణ మెజారిటీ (Simple majority) తో ఆమోదిస్తే వాటిని సవరించవచ్చు. ఇది సులభ పద్ధతి. దీని ప్రకారం రాజ్యాంగము అదృఢమైనది అని చెప్పవచ్చు.

2. రాష్ట్రపతి అధికారాలలోను, ఎన్నికల విధానంలోను మార్పు తేవలెనన్నా, ఉన్నత న్యాయస్థానాల నిర్మాణము, అధికారాలలోను మార్పులు తేవలెనన్నా, పార్లమెంట్ అధికారాలను మార్చవలెనన్నా, దాని కనుగుణంగా ఒక తీర్మానాన్ని పార్లమెంట్‌లోని ఉభయ సభలు మొదట సాధారణ మెజారిటీతో ఆమోదించవలె. ఆ తరవాత ఆ తీర్మానాన్ని ఏ సభ కా సభ, సభకు హాజరైన వారిలో 2/3 వంతు మెజారిటీతో ఆమోదించవలె. ఆ విధంగా పార్లమెంట్ ఆమోదం పొందిన ఆ బిల్లును మొత్తం రాష్ట్రాలలో 1/2 వంతు రాష్ట్రాలు ఆమోదించవలె. ఈ సవరణ విధానం చాలా క్లిష్టమైనది. దీని ప్రకారం చూస్తే రాజ్యాంగము దృఢమైనదిగా కనిపిస్తుంది.

3. మూడవ పద్ధతి అంతకష్టంకాదు; మరీ అంతసులభమూకాదు. ఈ పద్ధతిలో ప్రాథమిక హక్కులను, రాజ్యాంగంలోని అనేక ఇతర నిబంధనలను సవరించవచ్చు. ఈ పద్ధతిలో సవరణ తీర్మానాన్ని పార్లమెంట్ ఉభయ సభలు మొదట సాధారణ మెజారిటీతోను

తరవాత 2/3 వంతు మెజారిటీతోను ఆమోదిస్తే సవరణ చేయవచ్చు. ఇటీవల జనతా ప్రభుత్వం 44వ రాజ్యాంగ సవరణను ఆమోదించింది.

పైన చెప్పిన లక్షణాలతోపాటు భారత రాజ్యాంగంలో గమనించదగిన కొన్ని ఇతర ముఖ్య లక్షణాలున్నాయి. భారత రాజ్యాంగము భారత పౌరులకు ఏకపౌరత్వం ఇచ్చింది. ఇక్కడి ప్రజాస్వామ్య వ్యవస్థ వయోజన ఓటింగ్ ప్రాతిపదికపై పనిచేస్తుంది. 21 సంవత్సరాలు నిండిన స్త్రీ పురుషులకు రాజ్యాంగం ఓటు హక్కు కల్పించింది. భారత రాజ్యాంగం ప్రకారం దేవనాగరి లిపిలో ఉండే హిందీ దేశ భాషగా గుర్తించబడింది.

## ప్రశ్నలు

### వ్యాస ప్రశ్నావళి

1. భారత రాజ్యాంగ నిర్మాణ చరిత్రను క్లుప్తంగా వివరించండి.
2. భారత రాజ్యాంగం ముఖ్య లక్షణాలను క్లుప్తంగా విశదీకరించండి.
3. భారత రాజ్యాంగము, భారత పౌరులకు ఇచ్చిన ప్రాథమిక హక్కులను విపులీకరించండి.
4. భారత రాజ్యాంగంలో పొందు పరిచిన నిర్దేశక నియమాలు, ప్రాథమిక హక్కుల కంటె ఎట్లా శ్రేష్ఠమైనవో తెలిపి, వాటిని అమలుపరచడంలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఎంతవరకు సఫలీకృతమైనవో వివరించండి.
5. "భారత రాజ్యాంగ సమాఖ్య రాజ్య లక్షణాలుగల ఏకకేంద్ర రాజ్యము"- చర్చించండి.

### సంక్షిప్త సమాధాన ప్రశ్నావళి

ఈ క్రింది విషయాలను క్లుప్తంగా వివరించండి.

(1) రాజ్యాంగ పరిషత్తు (2) ముసాయిదా కమిటీ (3) సర్వసత్తాక, ప్రజాస్వామిక, సామ్యవాద, లౌకిక, గణతంత్ర రాజ్యము (4) రాజ్యాంగ ప్రస్తావన లేదా అవతారిక (5) ఆస్తి హక్కు (6) స్వాతంత్ర్యపు హక్కు (7) రాజ్యాంగ పరిహార హక్కు (8) లౌకిక లేదా మత ప్రమేయంలేని రాజ్యము (9) రాజ్యాంగ సవరణ (10) ప్రాథమిక హక్కులకు నిర్దేశక నియమాలకు మధ్య తేడాలు (11) భారత రాజ్యాంగంలో అధికారాల పంపిణీ (12) భారత రాజ్యాంగానికి ఆధారాలు.

# 7

# భారత ప్రభుత్వము

## (Government of India)

### భారత ప్రభుత్వ నిర్మాణము

భారత ప్రభుత్వము కేంద్ర, రాష్ట్ర, స్థానిక ప్రభుత్వాలు అని మూడు అంతస్తులలో నిర్మించబడి ఉంది. వీటిలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు స్థూలంగా మూడు భాగాలుగా వర్గీకరించబడినాయి. స్థానిక ప్రభుత్వం మాత్రం పట్టణ, గ్రామీణ సంస్థలని రెండు భాగాలుగా వర్గీకరించబడింది.

ఏ. కేంద్రప్రభుత్వము

1. *కేంద్ర కార్యనిర్వాహణశాఖ* : దీనిలో రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధాన మంత్రి, కేంద్రమంత్రిమండలి ఉంటారు.

2. *కేంద్ర శాసన నిర్మాణశాఖ* : దీనిలో రాష్ట్ర పతి, రాజ్యసభ, లోక్‌సభ ఉంటాయి

3. *కేంద్రన్యాయశాఖ* : దీనిలో భారత ఉన్నత న్యాయస్థానమైన భారత సుప్రీమ్ కోర్ట్ ముఖ్యమైనది.

బి. రాష్ట్రప్రభుత్వము

1. *రాష్ట్ర కార్యనిర్వాహణశాఖ* : గవర్నర్, ముఖ్యమంత్రి, రాష్ట్ర మంత్రి మండలి దీనిలో ప్రధానమైనవారు.

2. *రాష్ట్రశాసననిర్మాణశాఖ* : దీనిలో గవర్నర్, విధాన పరిషత్తు విధానసభ ఉంటాయి.

3. *రాష్ట్రన్యాయశాఖ* : దీనిలో హైకోర్ట్‌లు, జిల్లాకోర్ట్‌లు, దిగువకోర్ట్‌లుఉంటాయి

సి. స్థానికప్రభుత్వము

1. *పట్టణసంస్థలు* : (ఏ) కార్పొరేషన్లు లేదా నగరపాలక సంస్థలు (బి) పుర పాలక సంఘాలు ముఖ్యమైనవి. ఇవికాక (సి) కంటోన్‌మెంట్ బోర్డ్‌లు, (డి) పోర్ట్‌ట్రస్టులు (ఇ) ఇంప్రూవ్‌మెంట్ ట్రస్టులు కూడా దీనిలో చేర్చవచ్చు.

3. *గ్రామీణసంస్థలు* : (ఏ) జిల్లాపరిషత్ (బి) పంచాయతీ సమితి (సి) గ్రామ పంచాయతీ. ఈ సంస్థలను గురించి తరవాతి పేజీలలో వివరంగా చర్చించినాము. వీటిలో స్థానిక సంస్థల నిర్మాణం మాత్రం అన్ని రాష్ట్రాలలో ఒకే విధంగా లేదు.

### భారత అధ్యక్షుడు

### (President of India)

భారత అధ్యక్షుడిని రాష్ట్రపతి అని కూడా అంటారు. అతడు భారత గణతంత్ర

రాజ్యానికి అధిపతి. రాష్ట్రపతి భారతదేశ ప్రథమ పౌరుడు. భారత జాతి గౌరవ ప్రతిష్ఠలకు, రాజ్య సమైక్యతకు, ప్రజల ఆశయాలకు, ఆకాంక్షలకు అతడు చిహ్నము. రాజ్యాంగంలోని 53 వ నిబంధన ప్రకారం దేశ కార్యనిర్వాహణాధికారం అతని ఆధీనంలో వుంటుంది. ఆ అధికారాన్ని అతడు స్వయంగా కాని, లేదా తన కింది అధికారుల ద్వారా కాని వినియోగించవచ్చు. భారత రిపబ్లిక్‌కు అతడు సర్వాధికారి కాబట్టి అతని ఆమోదముద్ర లేనిదే ఏ బిల్లూ శాసనం కాజాలదు. దేశ పరిపాలనంతా అతని పేరు మీద జరుగుతుంది.

అర్హతలు

రాష్ట్రపతి పదవికి పోటీచేసే వ్యక్తి 35 సం॥లు నిండిన భారతీయ పౌరుడై ఉండవలె. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలలో ఆదాయాన్నిచ్చే పదవిలో ఉండరాదు. ఒకవేళ ఆ విధంగా ఉంటే పదవీ ప్రమాణ స్వీకారానికి ముందు ఆ పదవికి రాజీనామా ఇవ్వవలె. రాష్ట్రపతి పదవి చేపట్టే వ్యక్తి కేంద్ర, రాష్ట్ర శాసన సభలలో సభ్యుడై ఉండరాదు. 1977 లో శ్రీ నీలం సంజీవరెడ్డి రాష్ట్రపతి పదవిని చేబట్టబోయేముందు అంతవరకు తాము నిర్వహిస్తున్న స్పీకర్ పదవికి రాజీనామా ఇచ్చినారు. యివి కాక పార్లమెంటు సమయాను కూలంగా చేసే యితర అర్హతలు ఆయనకు ఉండవలెను. ఉదాహరణకు 1972 వరకు రాష్ట్రపతి పదవికి పోటీచేసే అభ్యర్థి నామినేషన్ పత్రంపై యిద్దరు నియోజకులు సంతకం చేస్తే సరిపోయేది. అయితే ఈ పద్ధతి వల్ల ప్రతిసారీ అనేకమంది అభ్యర్థులు ఆ పదవికి పోటీచేసి ఆ పదవికి ఉండే గౌరవ ప్రతిపత్తులకు హాని కలిగిస్తున్నారని రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి ఎన్నికల చట్టాన్ని సవరించడం జరిగింది. ప్రస్తుతం నామినేషన్ పత్రంపై ఆ అభ్యర్థిని బలపరుస్తూ కనీసం 40 మంది నియోజకుల సంతకాలు ఉండవలె. ఈ పదవికి పోటీచేసే వ్యక్తి నామినేషన్ పత్రంతోపాటు రు. 2500/- ధరావతు (Deposit) చెల్లించవలె. ఎన్నికలలో 1/6 వంతు కంటె తక్కువ ఓట్లు వస్తే ఆ ధరావతు కోల్పోతాడు.

ఎన్నికల విధానము

పార్లమెంట్ ఉభయ సభలకు సంబంధించిన ఎన్నికైన సభ్యులు, రాష్ట్ర విధానసభలలో ఎన్నికైన సభ్యులు, సుమారు 4000 మంది ఓటర్లు కలిసి ఒక ఎన్నికల గణంగా (Electoral college) ఏర్పడి రాష్ట్రపతిని ఎన్నుకొంటారు. రాష్ట్రపతి ఎన్నిక పరోక్ష రహస్య ఓటింగ్ ప్రకారం జరుగుతుంది. ఓటును బదిలీచేసే నిష్పత్తి ప్రాతినిధ్య పద్ధతి ఈ ఎన్నికలలో ఉపయోగిస్తారు. సామాన్యంగా ఈ పద్ధతి బహుసభ్య నియోజక వర్గాలలో వాడతారు. కాని ఇండియాలో రాష్ట్రపతి ఎన్నికల విషయంలో ఈ పద్ధతి ఏకసభ్య నియోజక వర్గంలో ఉపయోగించబడింది.

ఈ విధానంలో ఎన్నికలలో పాల్గొనే ఓటర్ల ఓటు విలువ నిర్ణయించడానికి ప్రత్యేకమైన పద్ధతి రాజ్యాంగములో సూచించబడింది. దాని ప్రకారం ఒక రాష్ట్రంలో విధానసభ సభ్యుని ఓటు విలువ నిర్ణయించవలెనంటె ఈ కింది సూత్రం అనుసరిస్తారు :

$$\text{రాష్ట్ర విధానసభ సభ్యుని ఓటు విలువ (M. L. A.)} = \frac{\text{రాష్ట్ర జనాభా} \div 1000}{\text{ఆ రాష్ట్ర విధానసభలో ఎన్నికైన సభ్యులసంఖ్య}}$$

ఉదాహరణకు, ఒక రాష్ట్ర జనాభా 20,849,840 ఉండి, ఆ రాష్ట్ర విధానసభలో ఎన్నికైన శాసన సభ్యుల సంఖ్య 208 ఉన్నట్లయితే, ఆ రాష్ట్ర విధాన సభ సభ్యుని (M. L. A.) ఓటు విలువ పై సూత్రం ప్రకారం 100 అవుతుంది,

$$\frac{20{,}849{,}840}{208} \div 1000 = 100$$

దీనిలో శేషము సగం కంటె ఎక్కువగా ఉంటే ఒకటిగా పరిగణిస్తారు. ఇదే విధంగా పార్లమెంట్ సభ్యుని ఓటు విలువ నిర్ణయించడానికి అన్ని రాష్ట్రాలలోని విధానసభ సభ్యుల ఓట్ల మొత్తం విలువ లెక్కకట్టి ఆ వచ్చిన సంఖ్యను పార్లమెంట్‌లో ఎన్నికైన సభ్యులతో భాగించవలె. ఆ విధంగా లెక్కించగా వచ్చే సంఖ్య ఒక్కొక్క పార్లమెంట్ సభ్యుని ఓటు విలువ అవుతుంది.

ఎన్నికలలో పెద్ద రాష్ట్రాల ప్రభావం తగ్గించడానికి, రాష్ట్రపతి పదవి, కుటిల పార్టీ రాజకీయాలకు అతీతంగా ఉండేటట్లు చేయడానికి, నిజమైన మెజారిటీ సంపాదించగలిగిన వ్యక్తి రాష్ట్రపతి పదవి వంటి ఉన్నత పదవి చేపట్టేటట్లు చేయడానికి ఈ పద్ధతిని వినియోగించబడింది.

ప్రమాణ స్వీకారము

రాష్ట్రపతిగా ఎన్నికైన వ్యక్తి ఆ పదవిని చేపట్టేముందు సుప్రీమ్‌కోర్ట్ ప్రధాన న్యాయమూర్తి సమక్షంలోగాని లేదా ఒక సీనియర్ న్యాయమూర్తి సమక్షంలోగాని పదవీ ప్రమాణ స్వీకారం చేయవలె. ఈ ప్రమాణ స్వీకారానికి ఎంతో ప్రాముఖ్యం ఉంది. అది రాజ్యాంగంలో అతని స్థానాన్ని నిర్ణయిస్తుంది. దానిని ఉల్లంఘిస్తే అతనిపై మహాభియోగ తీర్మానం ప్రవేశపెట్టడానికి వీలవుతుంది.

రాష్ట్రపతిగా ఎనికైన వ్యక్తి "నేను నా విధులు విశ్వాస పూర్వకంగా నిర్వహిస్తాను. రాజ్యాంగాన్ని, చట్టాన్ని నా శాయశక్తులా సంరక్షిస్తాను ప్రజలకు, వారి సంక్షేమానికి అంకిత మవుతాను" అని ప్రమాణం చేయవలె.

పదవీ కాలము

సామాన్యంగా రాష్ట్రపతి పదవికి 5 సం॥ కొకసారి ఎన్నికలు జరుగుతాయి. పదవీ విరమణ చేసిన రాష్ట్రపతి తిరిగి ఆ పదవికి పోటీ చేయవచ్చు. కాని ఒకే వ్యక్తి రెండు పర్యాయాలు మించి పోటీ చేయరాదనే సంప్రదాయాన్ని ఇంతవరకు పాటిస్తున్నారు. పదవికాలం పూర్తి కాకుండానే రాష్ట్రపతి తన పదవికి రాజీనామా ఇవ్వవచ్చు. ఆ పదవిలో ఉన్న వ్యక్తి మరణించినా లేదా అతనిపై మహాభియోగ తీర్మానం ఆమోదించినా, పదవి ఖాళీ అయిన నాటి నుంచి 6 నెలలలోగా దానికి ఎన్నికలు జరపవలె. ఎన్నికైన నాటినుంచి 5 సం॥ వరకు క్రొత్త రాష్ట్రపతి అధికారంలో ఉంటాడు. ఏ కారణంగానైనా రాష్ట్రపతి పదవి ఖాళీ అయినప్పుడు తిరిగి అది భర్తీ అయ్యేంతవరకు ఉపరాష్ట్రపతి తాత్కాలిక రాష్ట్రపతిగా పనిచేస్తాడు. 1969 లో శ్రీజాకీర్ హుస్సేన్ రాష్ట్రపతి పదవిలో ఉండగా మరణించినారు. ఉపరాష్ట్రపతి

శ్రీ వి. వి. గిరి తాత్కాలిక రాష్ట్రపతి అయినారు. అయితే ఆయన కూడా రాష్ట్రపతి పదవికి పోటీ చేయడంకోసం తన తాత్కాలిక రాష్ట్రపతి పదవికి రాజీనామా చేయడంతో ఖాళీ ఎట్లా పూర్తిచేయవలె? అనే సమస్య ఉత్పన్నమయింది. అప్పుడు ఒక పార్లమెంటరీ చట్టంద్వారా అటువంటి పరిస్థితులలో సుప్రీమ్ కోర్ట్ ప్రధాన న్యాయమూర్తి తాత్కాలిక రాష్ట్రపతిగా వ్యవహరించవలెననీ ఆయనకు వీలుకాని పక్షంలో ఒక సీనియర్ న్యాయమూర్తి ఆ పదవి చేపట్టవలెనీ తీర్మానించారు. దాని ప్రకారం అప్పుడు సుప్రీమ్‌కోర్ట్ ప్రధాన న్యాయమూర్తిగా వ్యవహరిస్తున్న శ్రీ హిదయతుల్లా తిరిగి ఎన్నికలు జరిగి కొత్త రాష్ట్రపతిని ఎన్నుకొనేవరకు తాత్కాలిక రాష్ట్రపతి పదవి చేపట్టినారు.

## మహాభియోగము లేదా అభిశంసన (Impeachment)

రాష్ట్రపతి రాజ్యాంగాన్ని అతిక్రమిస్తే రాజ్యాంగంలోని 56. 61 నిబంధనల ప్రకారం పార్లమెంట్ మహాభియోగ తీర్మానం ఆమోదించడం ద్వారా అతనిని పదవినుంచి తొలగించవచ్చు. దానికి ఈ కింది పద్ధతి అనుసరంచవలె :

1. పార్లమెంట్ ఉభయ సభలలో ఏ సభ అయినా 14 రోజుల వ్యవధితో ఒక నోటీస్ జారీచేసి మహాభియోగ తీర్మానాన్ని సభలో ప్రవేశపెట్టవలె. ఆ తీర్మానంపై ఆ సభకు చెందిన నాలగవ వంతు సభ్యులు సంతకం చేయవలె.

2. ఆ విధంగా ప్రవేశపెట్టిన తీర్మానాన్ని చర్చించి ఆ సభ 2/3వంతు మెజారిటీతో ఆమోదించవలె.

3. ఒక సభ ఆమోదించిన ఆ తీర్మానంలోని ఆరోపణలపై న్యాయాన్యాయ విచారణ జరిపించడానికి రెండవ సభ ఒక కమిటీని ఏర్పాటు చేస్తుంది; లేదా తానే స్వయంగా ఆరోపణలపై విచారణ జరుపుతుంది.

4. ఆ విచారణలో ఆరోపణలు రుజువై, ఆ తీర్మానాన్ని ఆ సభలోని మొత్తం సభ్యులలో 2/3 వ వంతు సభ్యులు ఆమోదిస్తే ఆరోజునుంచి అధ్యక్షుడు పదవీచ్యుతుడు అవుతాడు.

ఇంతవరకు ఏ రాష్ట్రపతీ మహాభియోగ తీర్మానానికి గురై పదవి కోల్పోలేదు. 1970 అక్టోబర్ నెలలో అప్పటి రాష్ట్రపతి శ్రీ వి.వి. గిరిపై అటువంటి తీర్మానం ప్రవేశపెట్టి తరవాత ఉపసంహరించుకొన్నారు. ఈ మధ్య రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి లోక్ సభలో మెజారిటీ పార్టీ నాయకుడు, జనతా పార్టీ నాయకుడు అయిన శ్రీ జగ్‌జీవన్‌రామ్‌కు ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసే అవకాశం ఇవ్వకుండా లోక్‌సభ రద్దుచేసి ఎన్నికల నిర్వహించవలెనని ఆదేశించడం ద్వారా రాజ్యాంగాన్ని అతిక్రమించినారని, కాబట్టి ఆయనపై మహాభియోగ తీర్మానం ప్రవేశపెడతామని కొందరు జనతా నాయకులు అన్నారు. అయితే ఈ విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి.

## వేతనము - విశేషాధికారాలు (Salary and privileges)

రాష్ట్రపతి విశేషాధికారాలు (Privileges), వేతనము పార్లమెంట్ నిర్ణయిస్తుంది. (59 Article), వాటిని వారి పదవీకాలంలో మార్చకూడదు. రాష్ట్రపతికి నెలకు

రు. 10,000/- వేతనము, ఇతర భత్యము లభిస్తాయి. మాజీ రాష్ట్రపతులు శ్రీ బాబూరాజేంద్ర ప్రసాద్ నెలకు రు. 2500/-, శ్రీ రాధాకృష్ణన్ రు. 3000/- వేతనం మాత్రమే స్వీకరించి మిగిలిన మొత్తాన్ని ప్రధానమంత్రి సహాయనిధికి ఇచ్చివేసినారు. ప్రస్తుత రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి కూడా రు. 3000/- వేతనం తీసుకుంటున్నారు. పదవీ విరమణచేసిన రాష్ట్రపతికి నెలకు రు. 1500/- వారి జీవితాంతం వరకు పించనుగా లభిస్తుంది. దానికి ఆదాయపు పన్ను ఉండదు. రాష్ట్రపతి తన ప్రయాణాలకు, సిబ్బంది వేతనాలకు, ఇంటి ఖర్చులకు, తాను స్వయంగా ఇచ్చే సహాయక గ్రాంటుకు, విందులు వినోదాల నిర్వాహణకు సంవత్సరానికి 15 లక్షల 23 వేల రూపాయలు ఖర్చుపెట్టవచ్చు. అతనికి ఉచిత వైద్యసదుపాయం, ఉచిత నివాస గృహము లభిస్తుంది. ఢిల్లీలో రాష్ట్రపతిభవన్ కాక సిమ్లా, హైదరాబాద్‌లలో ఆయనకు నివాసగృహాలు ఉన్నాయి.

రాష్ట్రపతిపై అతని పదవీకాలంలో ఎటువంటి క్రిమినల్ చర్య తీసుకోకూడదు. అరెస్టు చేయకూడదు. విచారణ సమయంలో అతడు స్వయంగా న్యాయస్థానాలకు రానక్కరలేదు. 361 వ నిబంధన ప్రకారం రాష్ట్రపతిపై సివిల్ దావా వేయవలెనంటే 2 నెలలు గడువు కావలె. మహాభియోగ తీర్మానంలోని నేరారోపణలను చర్చించేటప్పుడు మినహా అతని చర్యలను ఎవరూ న్యాయస్థానంలో సవాలు చేయరాదు.

## రాష్ట్రపతి అధికారాలు - విధులు (Powers & functions of the President)

రాష్ట్రపతి అధికారాలు విధులు ఈ క్రింది శీర్షికలకింద వివరించవచ్చు :

1. ***కార్యనిర్వాహణాధికారాలు (Executive Powers)*** : రాజ్యాంగంలోని 52 వ నిబంధన ప్రకారం రాష్ట్రపతి దేశానికి ప్రధాన కార్యనిర్వాహణాధికారి. ప్రభుత్వకార్య క్రమాలన్నీ అతని పేరుమీదుగా జరుగుతాయి. అతడు ఈ అధికారాన్ని స్వయంగా గాని, లేదా తన ప్రతినిధిద్వారాగాని, వినియోగించవచ్చు. 74వ నిబంధన ప్రకారం రాష్ట్రపతి తన అధికారాలను మంత్రి మండలి సలహా ప్రకారం వినియోగించవలె. 1976 లో చేసిన 42 వ రాజ్యాంగ సవరణ రాష్ట్రపతి మంత్రిమండలి సలహాను తప్పక పాటించవలెనని సూచించింది. బ్రిటన్‌లో రాజు లేదా రాణివలె రాష్ట్రపతి మంత్రిమండలి సలహా తప్పక పాటించవలెననే నియమం ఈ సవరణకు ముందు మన దేశంలో లేదు. పార్లమెంటరీ విధానంలో మంత్రిమండలి మాత్రమే తన చర్యలకు శాసనసభకు బాధ్యత వహిస్తుంది (75 (4) నిబంధన), రాష్ట్రపతి కాదు. కాబట్టి అతడు నామమాత్రంగా వ్యవహరించవలెనని కొందరు అంటారు. అయితే రాష్ట్రపతి బ్రిటన్ రాజు, రాణివలె మంత్రిమండలి సలహా తప్పక పాటించనక్కరలేదు. డా. రాజేంద్రప్రసా ఉద్దేశంలో రాష్ట్రపతి రాజ్యాంగానికి బద్ధుడు. దానిని కాపాడటంకోసం అతడు రాజ్యాంగ విరుద్ధంగా ఉన్నాయనుకొనే బిల్లులపై తన ఆమోదముద్ర తిరస్కరించవచ్చు, అతడు వాటిపై తన ఆమోద ముద్ర వేస్తే రాజ్యాంగాన్ని అతిక్రమించినట్లు అవుతుంది. తద్వారా అతడు మహాభియోగ తీర్మానాన్ని ఎదుర్కొనవలసివస్తుంది. అంతేగాక బ్రిటన్‌లో వలె ఇండియాలో రాష్ట్రపతి పదవి వంశపారంపర్యంగా లంభించదు. తనను ఎన్నుకొన్న నియోజకులపట్ల అతనికి కొన్ని బాధ్యతలు ఉన్నాయి. కాబట్టి కొన్ని సందర్భాలలో అతడు మంత్రిమండలి సలహా తోసిపుచ్చవచ్చు అనే వాదన మరొకటి ఉంది.

కేంద్రంలోవచ్చినమార్పుదృష్ట్యా, ఉత్తరాది రాష్ట్రాలలో శాసనసభలు రద్దుచేసి, అక్కడ రాష్ట్రపతిపాలన ప్రవేశపెట్టి, ఎన్నికలు జరిపించవలెనని అప్పట్లో కొత్తగా అధికారంలోకి వచ్చిన జనతా ప్రభుత్వం తీసుకొన్న నిర్ణయంపై మే, 1977 లో అప్పటి తాత్కాలిక రాష్ట్రపతి శ్రీ బి. డి. జెట్టి వెంటనే తన ఆమోద ముద్ర వేయలేదు. ఈ చర్య చాలా సంచలనాన్ని సృష్టించింది.

2. *ఉన్నతాధికారులను నియమించే అధికారము* : రాష్ట్రపతి పార్లమెంట్‌లో మెజారిటీ పార్టీ నాయకుడిని ప్రధానమంత్రిగా నియమిస్తాడు. ఏ ఒక పార్టీకి మెజారిటీ రానప్పుడు, లేదా మెజారిటీ సభ్యులు తమ కందరికీ ఆమోదయోగ్యమైన వ్యక్తిని తమ నాయకునిగా ఎంపిక చేసుకోవడంలో విఫలమైనప్పుడు, ప్రధాని నియామకంలో రాష్ట్రపతికి తిరుగులేని అధికారాలు లభిస్తాయి. అవసరమైతే అతడు అన్ని పార్టీల ఆమోదంతో అన్ని పార్టీలు కలసిన ఒక జాతీయ ప్రభుత్వాన్ని తన పర్యవేక్షణలో నెలకొల్పవచ్చు.

ప్రధానమంత్రి సలహాపై రాష్ట్రపతి మంత్రిమండలిలోని ఇతర మంత్రులను నియమిస్తాడు. ప్రధానిచేత, మంత్రులచేత అతడు పదవీ ప్రమాణాలు చేయిస్తాడు. ప్రధానమంత్రి మంత్రివర్గ తీర్మానాలను, నిర్ణయాలను రాష్ట్రపతికి తెలియజేయవలె. మంత్రిమండలి సిద్ధాంతరీత్యా రాష్ట్రపతి విశ్వాసాన్ని చూరగొన్నంత కాలం పదవిలో ఉంటుంది. అయితే వాస్తవంలో వారు పార్లమెంట్‌లో మెజారిటీ నిలుపుకోగలిగినంతకాలం పదవిలో ఉంటారు.

రాష్ట్రపతి దేశానికి సర్వ సైన్యాధ్యక్షుడుగా వ్యవహరిస్తాడు. యుద్ధాన్ని ప్రకటించడానికి, సంధి ఒడంబడికలు చేసుకోడానికి అతనికి మాత్రమే అధికారముంది. త్రివిధ దళాధిపతులను అతడు నియమిస్తాడు. రాష్ట్రగవర్నర్లను, ఛీఫ్‌కమీషనర్లను, లెఫ్టినెంట్ గవర్నర్లను రాయబారులను, కంట్రోలర్ ఆడిటర్ జనరల్, అటార్నీ జనరల్, సుప్రీమ్‌కోర్ట్ న్యాయమూర్తులను, యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యులను, ప్రధాన ఎన్నికల అధికారిని, ఆర్థిక కమిషన్ సభ్యులను, నదీజలాల కమిషన్ సభ్యులను నియమిస్తాడు. నిమ్న జాతుల సంక్షేమానికి ఒక ఉన్నతాధికారిని నియమిస్తాడు. వెనకబడిన ప్రాంతాల అభివృద్ధి కమిషన్ సభ్యులను, అంతర్ రాష్ట్ర సంఘ సభ్యులను (Inter state council) కూడా రాష్ట్రపతి నియమించవలసి వుంది. ఈ నియామకాలన్నీ రాష్ట్రపతి, ప్రధానమంత్రి, మంత్రిమండలి సలహాప్రకారం చేస్తాడు.

3. *శాసన నిర్మాణాధికారాలు* : పార్లమెంట్‌ను సమావేశ పరచడానికి (To summon), దీర్ఘకాల వాయిదా వేయడానికి (To prorogue), రద్దు చేయడానికి (To dissolve), సమావేశ వాయిదా తేది తెలపకుండా అర్ధాంతరంగా ముగించడానికి (Sine die) రాష్ట్రపతికి అధికారముంది. ఒక పర్యాయం పార్లమెంట్‌ను రద్దుచేస్తే 6 నెలలలోగా తిరిగి దానిని సమావేశపరచవలె. సాధారణ ఎన్నికల తరవాత సంయుక్త సమావేశాన్ని ఏర్పాటుచేసి ప్రారంభోపన్యాసం ఇవ్వవచ్చు. సంవత్సరానికొకసారి పార్లమెంట్ సంయుక్త సమావేశం ఏర్పాటుచేసి రాబోయే సంవత్సరంలో తన ప్రభుత్వం చేబట్టబోయే విధానాన్ని వివరిస్తూ ఉపన్యాస మివ్వవచ్చు. ఒక సభ ఆమోదించిన బిల్లును మరొక సభ తిరస్కరించినప్పుడు, విదేశీ ప్రముఖులు విచ్చేసి నప్పుడు కూడా రాష్ట్రపతి సంయుక్త సమావేశాన్ని ఏర్పాటు చేయవచ్చు. రాష్ట్రపతి తన అభిప్రాయాలను పార్లమెంట్‌కు సందేశాల రూపంలో

పంపవచ్చు ; లేదా తానే స్వయంగా సమావేశాలకు హాజరై తన అభిప్రాయాలు వివరించ వచ్చు. రాష్ట్రపతి సందేశాలను, ఉపన్యాసాలను పార్లమెంట్ విధిగా చర్చించవలె.

అతడు పార్లమెంట్ చేసిన బిల్లులను ఆమోదించవచ్చు లేదా తన ఆమోదముద్ర వేయ కుండా తాత్కాలికంగా నిలపవచ్చు (To with hold assent) లేదా పునరాలోచనకు పంపవచ్చు. అయితే ఉభయసభలు దానిని తిరిగి ఆమోదిస్తే ఆ బిల్లుపై అతడు తప్పక తన ఆమోదముద్ర వేయవలె. భారత రాష్ట్రపతికి, అమెరికా అధ్యక్షునివలె 'వీటో' (Veto) అధికారం లేదు.

రాష్ట్రాల సరిహద్దులు మార్చడానికి, రాష్ట్రాల పునర్విభజనకు సంబంధించిన బిల్లులు అతని అనుమతిలేనిదే పార్లమెంట్‌లో ప్రవేశపెట్ట కూడదు. దేశ శ్రేయస్సు కొరకు, ప్రభుత్వా వసరాలు నేరవేర్చడానికి పార్లమెంట్ సమావేశంలో లేనిసమయంలో అతడు ఆర్డినెన్స్‌లు జారీ చేయవచ్చు. వాటికి మామూలు శాసనాలకు ఉన్నంత విలువ ఉంటుంది. అయితే రాష్ట్ర పతి జారీచేసిన ఆర్డినెన్స్‌లను పార్లమెంట్ తిరిగి సమావేశమైన ఆరు వారాలలోగా ఆమోదించ వలె. వాటిని ఆ గడువులోగా అమోదించకపోయినా లేదా తిరస్కరించినా అవి రద్దు అవు తాయి ; లేదా రాష్ట్రపతే వాటిని ఈ లోగా ఏ క్షణంలోనైనా ఉపసంహరించవచ్చు.

ప్రతి సంవత్సరం అతడు కంట్రోలర్ ఆడిటర్ జనరల్, ఆర్థిక కమిషన్, యూని యన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్, వెనకబడిన ప్రాంతాల అభివృద్ధి కమిషన్ మొదలైన వాటి నివేదికలను తన సిఫార్సుతో పార్లమెంట్‌కు పంపుతాడు.

4. ***ఆర్థికాధికారాలు*** : రాష్ట్రపతి ఆమోదం లేనిదే ఆర్థిక బిల్లులను శాసన సభలో ప్రవేశపెట్ట కూడదు. కేంద్ర బడ్జెట్, అనుబంధ బడ్జెట్ (Supplementary budget) లు కూడా అతని అనుమతి లేనిదే పార్లమెంట్ ముందుంచరాదు. ఐదు సంవత్సరాల కొక పర్యాయం రాష్ట్రపతి ఆర్థిక కమిషన్ (Finance commission) ను ఏర్పాటు చేస్తాడు. అది కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలమధ్య ఆర్థిక వనరుల పంపిణీపైన, దేశ ఆర్థిక విధానము, పొదుపువంటి విషయాలపైన సిఫార్సులు చేస్తుంది. ఆర్థిక బిల్లులను తిరస్కరించే అధికారం గాని, పునరాలోచనకు పంపే అధికారంగాని అతనికి లేదు. కంట్రోలర్ ఆడిటర్ జనరల్ (C. A. G.) రూపొందించిన వార్షిక ఆర్థిక నివేదికను అతడు పార్లమెంట్‌కు సమర్పిస్తాడు. 1976 లో చేసిన 42 వ రాజ్యాంగ సవరణ ప్రకారం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల అకౌంట్ల నిర్వహణా పత్రాలను రాష్ట్రపతి రూపొందిస్తాడు. పూర్వం ఈ పనిని కంట్రోలర్ ఆడిటర్ జనరల్ చేసేవాడు.

5. ***న్యాయాధికారాలు*** : రాష్ట్రపతి సుప్రీమ్ కోర్ట్, హైకోర్ట్ న్యాయమూర్తులను నిం మిస్తాడు. కాని వారిని తొలగించే అధికారం ఆయనకు లేదు. తగిన కారణముంటే సుప్రీమ కోర్ట్ విధించిన శిక్షను తాత్కాలికంగా నిలిపివేయ వచ్చు (Reprive), శిక్షలు అమలు కాకుండా వాయిదా వేయవచ్చు (Respite), ఒక రక న శిక్షను మరొక రకమైన శిక్షగా మార్చవచ్చు (Commutation), శిక్షను పూ గా రద్దుచేసి క్షమాభిక్ష పెట్టవచ్చు (Pardon). ఈ అధికారాలన్నీ కేంద్ర జాబితాలోని అంశాలకు సంబంధించిన నేరాలకు మాత్రమే పరిమితము.

6. ***అత్యవసరాధికారాలు (Emergency Powers)*** : రాజ్యాంగంలోని 352 వ

నిబంధన ప్రకారం భారత రాష్ట్రపతికి అసాధారణాధికారాలు ఉన్నాయి. వాటిని అతడు దేశంలో అత్యవసర పరిస్థితి ఏర్పడినప్పుడు వినియోగించవచ్చు. రాజ్యాంగంలో మూడు రకాల అత్యవసర పరిస్థితులను వివరించినారు.

1. దేశంలో అంతః కలహాలు చెలరేగి దేశ శాంతి భద్రతలకు, రక్షణకు తీవ్రమైన ప్రమాదం ఏర్పడిందని భావించినా లేదా భారతదేశం విదేశీ దురాక్రమణకు గురైనా లేదా మరొక దేశంతో యుద్ధం తలపెట్టినా దేశం మొత్తంమీదగాని, లేదా ఒక ప్రాంతానికి వర్తించే ట్లుగాని అత్యవసర పరిస్థితి ప్రకటించవచ్చు. మొదట 1962 లో భారతదేశం చైనా దురాక్రమణను ఎదుర్కొన్నప్పుడు బాహ్య అత్యవసర పరిస్థితి (External emergency) ప్రకటించినారు. 1965 పాకిస్థాన్ యుద్ధమప్పుడు కూడా అదే కొనసాగింది. తిరిగి డిసెంబర్ 3, 1971 న బంగ్లాదేశ్ యుద్ధమప్పుడు అప్పటి రాష్ట్రపతి శ్రీ వి. వి గిరి అత్యవసర పరిస్థితి ప్రకటించినారు. 1975 లో శ్రీమతి ఇందిరాగాంధి ప్రభుత్వం కాలంలో మొదటిసారిగా ఆంతరంగిక అత్యవసర పరిస్థితి Internal emergency) ప్రకటించడం జరిగింది.

2. ఒక రాష్ట్రంలో రాజ్యాంగబద్ధంగా పరిపాలన నిర్వహించడం అసాధ్యమని ఆ రాష్ట్ర గవర్నర్ రాష్ట్రపతికి సందేశం పంపితే, దానిని పురస్కరించుకొని ఆ రాష్ట్రంలో 356వ నిబంధన ప్రకారం రాష్ట్రపతి పరిపాలన ప్రవేశపెట్టవచ్చు. ఈ విధమైన పరిపాలన ఇప్పటికే అనేక రాష్ట్రాలలో ప్రవేశపెట్టినారు. జై ఆంధ్ర ఉద్యమకాలంలో ఆంధ్ర రాష్ట్రంలో కూడా రాష్ట్రపతిపాలన ప్రవేశపెట్టినారు.

3. దేశమంతాగాని, లేదా కొన్ని రాష్ట్రాలుగాని ఆర్థిక సంక్షోభానికి గుర్తైతే రాజ్యాంగంలోని 360 నిబంధన ప్రకారం రాష్ట్రపతి ఆర్థికాత్యయిక పరిస్థితి ప్రకటించవచ్చు. ఇంత వరకు ఆర్థికాత్యయిక పరిస్థితి మనదేశంలో ప్రకటించ లేదు.

రాష్ట్రపతి తాను జారీచేసిన అత్యవసర పరిస్థితి ప్రకటనను పార్లమెంట్ ముందు ఉంచవలె. పార్లమెంట్ 2 నెలల గడువులోగా దానిని ఆమోదిస్తే రాష్ట్రపతి పరిపాలనకు సంబంధించిన తీర్మానం 6 నెలలు అమలులో ఉంటుంది. అవసరమైతే దీనిని 6 నెలల కొకసారి చొప్పున ఒక తీర్మానం ద్వారా పొడిగించవచ్చు. రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన ఏ పరిస్థితులు లోను 3 సంవత్సరాలకు మించి పొడిగించకూడదు. యుద్ధము, అంతఃకలహాలు, ఆర్థిక సంక్షోభంవల్ల ప్రకటించే అత్యయిక పరిస్థితిని కూడా పార్లమెంట్ 2 నెలలలోగా ఆమోదించవలె. ఒకవేళ ఈ గడువులోగా పార్లమెంట్ రద్దు అయితే కొత్త పార్లమెంట్‌కు 6 నెలలలోగా ఎన్నికలు నిర్వహించవలె. కొత్త పార్లమెంట్ ఏర్పడిన 30 రోజులలోగా ఈ తీర్మానాన్ని ఆమోదించవలె పార్లమెంట్ ఆమోదిస్తే 6 నెలలు అమలులో ఉంటుంది. 6 నెలలకొకసారి చొప్పున దాని కాలపరిమితిని పొడిగిస్తూ పార్లమెంట్ తీర్మానిస్తే ఈ అత్యవసర పరిస్థితిని అవసరమైనంతకాలం కొనసాగించవచ్చు. రాష్ట్రపతి ప్రవేశపెట్టిన అత్యవసర పరిస్థితియొక్క ఉచితానుచితాలను ప్రశ్నించే హక్కు ఎవ్వరికీ లేదు.

దేశంలో మొదటి తరహా అత్యవసర పరిస్థితి ప్రకటించినప్పుడు (1) పార్లమెంట్ అన్ని జాబితాలలోని అంశాలపైన శాసనాలు చేయవచ్చు. (2) రాష్ట్ర ప్రభుత్వ చట్టాలు. కార్యనిర్వాహణ కేంద్రప్రభుత్వ శాసనాలకు, విధానాలకు అనుగుణంగా ఉండవలె. (3) రాష్ట్ర విషయాలపై రాష్ట్రపతి ఆజ్ఞలు జారీ చేయవచ్చు (4) ప్రాథమిక హక్కులు రద్దు అవుతాయి.

రాష్ట్రంలో రాష్ట్రపతిపాలన ప్రకటిస్తే (1) రాష్ట్రపతిపాలన గవర్నర్ సహాయంతో రాష్ట్రపతి నిర్వహిస్తాడు. దీనికోసం గవర్నర్‌కు సలహాదారులను కేంద్రప్రభుత్వం నియమిస్తుంది (2) రాష్ట్ర శాసనసభ రద్దు చేయవచ్చు (3) రాష్ట్ర పతిపాలనకు కావలసిన శాసనాలు, బడ్జెట్‌ను పార్లమెంట్ రూపొందిస్తుంది.

ఆర్థికాత్యయిక పరిస్థితి ప్రకటిస్తే (1) రాష్ట్రపతి రాష్ట్రాలకు ఆర్థికమైన ఆజ్ఞలు జారీ చేయవచ్చు (2) ప్రభుత్వోద్యోగుల వేతనాలు తగ్గించవచ్చు (3) కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య వనరుల పంపిణీలో మార్పులు చేయవచ్చు (4) రాష్ట్ర మనీ బిల్లులను పార్లమెంట్ ఆమోదించవలె (5) ప్రాథమిక హక్కులు రద్దు అవుతాయి.

శ్రీమతి గాంధీ హయాంలో ప్రకటించిన ఆంతరంగిక అత్యవసర పరిస్థితి అనుభవాలను పురస్కరించుకొని హోమ్‌మంత్రి చరణ్‌సింగ్ 13-7-1977 న రాజ్యాంగం నుంచి 352 వ నిబంధన తొలగించవలెనని ప్రతిపాదించినాడు. చివరకు 44వ రాజ్యాంగ సవరణ 38, 39, 42 రాజ్యాంగ సవరణలలోని అనర్థాలు తొలగించి అత్యవసర పరిస్థితి ప్రకటన విషయంలో ఈ కింది మార్పులు తెచ్చింది :

సాయుధ తిరుగుబాటు జరిగినప్పుడు మాత్రమే అంతరంగిక అత్యవసర పరిస్థితి ప్రకటించవలె దీనిని ప్రకటించడానికి కాబినెట్ లిఖిత పూర్వక అనుమతి ఇవ్వవలె కాబినెట్ సలహాపై మాత్రమే రాష్ట్రపతి అత్యవసర పరిస్థితి ప్రకటించవలె. అత్యవసర పరిస్థితి ప్రకటన దాదాపు రాజ్యాంగ సవరణతో సమానమైనది కాబట్టి ఆ తీర్మానాన్ని పార్లమెంట్ ఉభయసభలు రాజ్యాంగ సవరణవలె ప్రత్యేక మెజారిటీతో (2/3 వంతు మెజారిటీ) ఆమోదించవలె పార్లమెంట్ దానిని ఆ విధంగా ఆమోదిస్తే 6 నెలలు అమలులో ఉంటుంది. అత్యవసర పరిస్థితి ప్రకటనపై చర్చ జరపవలెనని, దానికోసం ఒక ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేయమని పార్లమెంట్ సభ్యులలో 10 వ వంతు సభ్యులు ఒక "రిక్విజిషన్ సమావేశాన్ని" కోరవచ్చు. అత్యవసర పరిస్థితిని సవాలుచేసే తీర్మానం సాధారణ మెజారిటీతో ఆమోదిస్తే అది రద్దు అవుతుంది. ఒకదురాక్రమణ ఎదుర్కొవడానికి అత్యవసర పరిస్థితి ప్రకటించినప్పుడు మాత్రమే ప్రాథమిక హక్కులు వాటికవి రద్దు అవుతాయి. సాయుధ తిరుగుబాటప్పుడు ఒక ప్రత్యేక తీర్మానం ద్వారా మాత్రమే అవి రద్దు అవుతాయి.

## రాష్ట్రపతి స్థానము

పైన చర్చించిన అంశాలను బట్టి భారత రాష్ట్రపతి రాజ్యాంగంలోను, దేశ పరిపాలనలోను ఒక ప్రత్యేకమైన స్థానాన్ని అలంకరిస్తున్నట్లు తెలుస్తున్నది. పార్లమెంట్‌లో ఒక పార్టీకి పూర్తి మెజారిటీ లభిస్తే రాష్ట్రపతికి ప్రధానమంత్రి నియామకం సులభమవుతుంది. అట్లా కాక అనిశ్చిత రాజకీయ పరిస్థితి ఏర్పడినప్పుడు, అంతఃకలహాలవల్ల పార్టీలు చీలిపోవడం, పార్టీ ఫిరాయింపులవల్ల మంత్రివర్గాలు కూలిపోవడం వంటి సంఘటనలు అధికం కావడం, ఏ పార్టీకీ పార్లమెంట్‌లో కచ్చితమైన మెజారిటీ లభించకపోవడం, కనీసం సంకీర్ణ మంత్రివర్గాలయినా స్థిరంగా పనిచేయలేకపోవడం వంటి క్లిష్ట పరిస్థితి ఎదురైతే రాజ్యాధినేతగా రాష్ట్రపతి చొరవతీసుకొని పరిపాలనకు మార్గదర్శకత్వం వహించి, పార్లమెంటరీ ప్రజాస్వామ్య నియమాలకు హానికలగని విధంగా పరిపాలనను ప్రభావితం చేయక తప్పదు.

ఇటీవల జనతాపార్టీ పతనంతో దేశంలో ఏర్పడిన రాజకీయ సంక్షోభంలో రాష్ట్రపతి హుందాగా, విజ్ఞతతో వ్యవహరించి భారత రాజ్యాంగంలో రాష్ట్రపతి క్లిష్ట పరిస్థితులలో ఎంత మాత్రం నామ మాత్రం కాదని ఋజువుచేసినారు.

రాష్ట్రపతి మంత్రిమండలి సలహా ఎంతవరకు పాటించవలె అనే అంశం కూడా వివాదాస్పదమైనదే. రాష్ట్రపతి తన విధి నిర్వహణలో రాజ్యాంగానికి బద్ధుడు. పూర్తిగా మంత్రి మండలి సలహా ప్రకారం నడిస్తే అతడు రాజ్యాంగాన్ని ఉల్లంఘించే ప్రమాద ముంది. తద్వారా తన పదవికే ముప్పు రావచ్చు. అయితే, పార్లమెంటరీ సంప్రదాయాల ప్రకారం రాజ్యాంగంలోని 75 (4) నిబంధన ప్రకారం పరిపాలనా బాధ్యత మంత్రి మండలిదే కాబట్టి అతడు దాని సలహా పాటించడం సమంజసము. ఈ మధ్యకాలంలో రాష్ట్రపతి ఎన్నికలలో 'ఓటర్లు పార్టీ క్రమశిక్షణ, పార్టీ "విప్" (Whip) కు లోబడి ఓటుచేయక అంతరాత్మ ప్రబోధం ప్రకారం ఓటుచేసే నూతన సంప్రదాయాలు వాడుకలోకి రావడంతో రాష్ట్రపతి ఎన్నికపై అధికార పక్షానికి ఉండే పట్టు సడలిపోతున్నది. దీనివల్ల ఎన్నికయ్యే రాష్ట్రపతులు అధికార పక్షానికి లోబడే "రబ్బరు స్టాంపులు" కాకుండా పోయినా ఆశ్చర్యపడ నక్కర లేదు. రాజకీయ సంక్షోభాలవల్ల ఏర్పడే ఆపద్ధర్మ ప్రభుత్వాలకు నిర్ణయాధికారం లేనప్పుడు పాలనా విధానాన్ని రాష్ట్రపతి ప్రభావితం చేయడం మనం గమనిస్తున్నాము. ఇక పోతే అత్యవసరాధికారాలు కూడా రాష్ట్రపతికి తిరుగులేని అధికారాలిచ్చినాయి. రాష్ట్రపతి రాజ్యాంగాన్ని అతిక్రమిస్తేనే మహాభియోగానికి గురి అవుతాడు. అయితే అతడు రాజ్యాంగ బద్ధంగా ఉంటూనే అత్యవసర పరిస్థితి ప్రకటించి కనీసం 9 నెలలు నియంతగా వ్యవహరించే అవకాశ ముందని కొందరు రాజ్యాంగ నిపుణులు భావిస్తున్నారు.

ఇటువంటి అవకాశాలు ఎన్నో భారత రాష్ట్రపతికి ఉన్నా రాజ్యాంగంలో రాష్ట్రపతి నామమాత్రమేననే విషయాన్ని మొట్టమొదటి రాష్ట్రపతి డా. బాబూ రాజేంద్రప్రసాద్, రాజ్యాంగ ముసాయిదా కమిటీ అధ్యక్షులు డా. అంబేద్కర్‌లు స్పష్టం చేసినారు. వారి దృష్టిలో భారత రాష్ట్రపతి రాజ్యాధినేతేగాని ప్రభుత్వాధినేతకాదు. కాబట్టి అతడు బ్రిటన్‌లో రాజు లేదా రాణివలె ఉండవలె. అతని పదవి గొప్ప గౌరవ మర్యాదలతో కూడినది. కాబట్టి పార్లమెంటరీ ప్రజాస్వామ్య పద్ధతులు గౌరవించే ప్రతిభావంతుడు, ఉదార భావాలు కలవాడు, మంచి అనుభవము, సామర్థ్యము, రాజకీయ అవగాహనకల వ్యక్తి ఆ పదవి చేపడితే దేశ భవిష్యత్తుకై కృషిచేయగలడు.

## ఉపరాష్ట్రపతి
## (Vice - President)

### ఎన్నిక - అర్హతలు

రాజ్యాంగము దేశానికి రాష్ట్రపతితోపాటు ఉపరాష్ట్రపతి కూడా ఉండవలెనని సూచించింది. ఉపరాష్ట్రపతిని పార్లమెంట్‌లోని ఉభయ సభలు కలిసి నిష్పత్తి ప్రాతినిధ్య విధానం ద్వారా పరోక్షంగా ఎన్నుకొంటారు. ఉపాధ్యక్ష పదవికి పోటీచేసే వ్యక్తి 35 సంవత్సరాలు నిండిన భారతీయ పౌరుడై ఉండవలె. రాజ్యసభ సభ్యుడుగా ఎన్నికకావడానికి కావలసిన అర్హతలు ఉండవలె. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలలో ఆదాయాన్నిచ్చే ప్రభుత్వోద్యోగంతో

ఉండకూడదు. కేంద్ర రాష్ట్ర శాసనసభలలో సభ్యుడై ఉండకూడదు. ఒకవేళ ఆ విధంగా సభ్యుడై ఉంటే ఉపరాష్ట్రపతి పదవి చేపట్టడానికి ముందు దానికి రాజీనామా ఇవ్వవలె.

### పదవీకాలము

ఉపరాష్ట్రపతి పదవీకాలం 5 సంవత్సరాలు. తిరిగి ఆపదవికి ఎన్నిక కావచ్చు, పదవీ కాలం పూర్తికాకముందే రాజీనామా ఇవ్వవచ్చు ; లేదా పార్లమెంట్ ఒక తీర్మానం ద్వారా ఆయనను పదవినుంచి తొలిగించవచ్చు. రాజ్యాంగంలోని 67 (c) నిబంధన ప్రకారం ఒక తీర్మానాన్ని రాజ్యసభ 14 రోజులు నోటీస్‌తో ప్రతిపాదించి దానిని సభలోని అధికసంఖ్యాకులు బలపరచి ఆమోదిస్తే, ఆ తీర్మానాన్ని లోక్‌సభ కూడా ఆమోదిస్తే ఆయనను పదవినుంచి తొలిగించవచ్చు. ఒక వేళ ఏకారణం చేతనైనా ఉపాధ్యక్షపదవి ఖాళీ అయితే సాధ్యమైనంత తొందరలో కొత్త ఉపాధ్యక్షుని ఎన్నుకోవలె. ఆరోజునుంచి కొత్త ఉపాధ్యక్షుడు 5 సం. పాటు పదవిలో ఉంటాడు. కొత్త ఉపరాష్ట్రపతి పదవీ బాధ్యతలు చేపట్టే ముందు రాష్ట్రపతి సమక్షంలో పదవీ ప్రమాణ స్వీకారం చేయవలె.

### వేతనము — విధులు

ఉపరాష్ట్రపతి రాజ్యసభకు ఛైర్మన్ (Ex-Officio chairman) గా వ్యవహరిస్తాడు. ఆయనకు వేతనము ఆహోదాలోనే లభిస్తుంది. ఉపరాష్ట్రపతి పదవికి రాజ్యాంగం వేతన మంటూ ఏర్పాటు చేయలేదు. అతనికి నెలకు రు. 2250/- వేతనము రు. 500 భత్యము లభిస్తాయి. ఉచిత నివాసగృహము ఇస్తారు. అధ్యక్షుడు తన పదవికి రాజీనామా చేసినా, మరణించినా ఉపరాష్ట్రపతి కొత్తరాష్ట్రపతిని ఎన్నుకొనేవరకు తాత్కాలికంగా రాష్ట్రపతి విధులు నిర్వహిస్తాడు. రాష్ట్రపతి అస్వస్థతవల్ల తన విధులు నిర్వహించలేని స్థితిలో ఉంటే, ఆయన తిరిగి తన విధులు నిర్వహించే వరకు ఉపరాష్ట్రపతి ఆయన విధులు నిర్వహిస్తాడు. శ్రీ రాజేంద్రప్రసాద్ అస్వస్థులయినప్పుడు శ్రీ రాధాకృష్ణన్, రాధాకృష్ణన్ అస్వస్థులయినప్పుడు శ్రీ జాకిర్‌హుస్సేన్ రాష్ట్రపతి విధులు నిర్వహించినారు. అటువంటప్పుడు ఉపరాష్ట్రపతికి రాష్ట్రపతికి లభించే జీతభత్యాలు లభిస్తాయి.

ఉపరాష్ట్రపతి రాజ్యసభ సమావేశంలో లేనప్పుడు విదేశాలలో సుహృద్భావ పర్యటనలు జరుపుతాడు. అయితే ఆయన ప్రత్యక్షంగాకాని, పరోక్షంగాకాని ప్రభుత్వం తరఫున ఎటువంటి అభిప్రాయాలూ వ్యక్తంచేయరాదు. రాజ్యాగం ఈ పదవికి ప్రత్యేకంగా అధికారాలు ఇవ్వక పోయినా, ఉపాధ్యక్షపదవికి ఎంతో గౌరవప్రతిపత్తులు ఉన్నాయి.

## కేంద్ర మంత్రి మండలి
## (Council of Ministers)

ప్రభుత్వయంత్రాంగానికి మంత్రిమండలి జీవము. మంత్రుల శక్తిసామర్థ్యాలపై పరిపాలన ఆధారపడి ఉంటుంది. సర్ జాన్‌మెరియట్ (Sir John Merriot) మంత్రిమండలిని గురించి ప్రస్తావిస్తూ ప్రభుత్వయంత్రాంగానికి మంత్రిమండలి కీలకం (ఇరుసు) వంటిది అనీ, అది దాని చుట్టూ పరిభ్రమణ చేస్తూ ఉంటుంది అనీ అన్నాడు (It is the pivot

round which the whole govt. machinary revolves). రామ్సే మ్యూర్ (Ramsay Mure) "రాజ్యమనే నౌకకు కాబినెట్ చుక్కాని వంటిది" అని వర్ణించినాడు (Cabinet is the steering wheel of the ship of the state). సర్ ఐవర్ జెన్నింగ్స్ (Sir Iver Jennings) మంత్రిమండలిని 'రాజ్యాంగ ప్రధాన భూమికగా' కీర్తించినాడు (It is the core of the constitution). బాగి హాట్ అనే ఆయన మంత్రిమండలిని, కార్యనిర్వాహక వర్గము, శాసన నిర్మాణశాఖలను కలిపే ఒక "బకల్"తో పోల్చినాడు (Council of ministers is the buckle that fastens the executive and legislative departments together). ఒక్క మాటలో చెపపలె నంటే దేశసౌభాగ్యానికి, శాంతి భద్రతలకు, అభ్యుదయానికి మంత్రిమండలి సామర్థ్యం ఒక కొలమానము.

భారతరాజ్యాంగంలోని 74 వ నిబంధన ప్రకారం అధ్యక్షునికి పరిపాలనలో సలహాలివ్వడానికి, సహాయపడటానికి ప్రధానమంత్రి అధ్యక్షతన పనిచేసే మంత్రిమండలి ఉండవలె. రాష్ట్రపతి లోక్‌సభలోని మెజారిటీ పార్టీ నాయకుడిని లేదా తన దృష్టిలో సభ యొక్క విశ్వాసాన్ని పొందగల వ్యక్తిని ప్రధానమంతిగా నియమిస్తాడు. అతని సలహాపై మంత్రి మండలిలోని ఇతర మంత్రులను నియమిస్తాడు. రాష్ట్రపతి విశ్వాసాన్ని చూరగొన్నంత కాలం మంత్రిమండలి అధికారంలో ఉంటుంది. నిజానికి పార్లమెంటరీ విధానంలో మంత్రిమండలి లోక్‌సభలో తనకు గల మెజారిటీ నిలుపుకోగలిగినంత కాలం అధికారంలో ఉంటుంది. మంత్రులు తమ చర్యలకు వ్యక్తిగతంగా బాధ్యత వహించడమే కాక సమష్టిగా కూడా బాధ్యతవహించవలె

మంత్రులు పార్లమెంట్‌లో ఏదైన ఒక సభలో తప్పక సభ్యులై ఉండవలె. ఏ సభలోనూ సభ్యుడుకాని వ్యక్తి మంత్రిగా నియమించబడితే, ఆ విధంగా నియమించబడిన నాటినుంచి ఆరు నెలలలోగా ఏదో ఒక సభలో సభ్యత్వాన్ని సంపాదించవలె. లేకపోతే అతడు తన పదవిని కోల్పోతాడు. మంత్రిమండలిలోని మంత్రులంతా ఒకేపార్టీవారు కావలెననే నియమంలేదు. "సంకీర్ణ మంత్రివర్గాలలో" (Coalition ministries) అనేకపార్టీలకు చెందిన మంత్రులు ఉంటారు. సభలో ఏ ఒక్క పార్టీకి (సంపూర్ణమైన) నిరపేక్షమైన మెజారిటీ (Adsolute majority) రానప్పుడు, ఏకాభిప్రాయంగల కొన్ని పార్టీలు కలవడంద్వారా అటువంటి మంత్రివర్గాలు ఏర్పడతాయి అటువంటి మంత్రివర్గాలు స్థిరంగాపని చేయలేవు. అవి అతుకుల బొంత వంటివి. ఇంతవరకు సంకీర్ణ మంత్రి వర్గాలు రాష్ట్రాలవరకే పరిమితంగా ఉండగా ఇటీవల జనతాపార్టీ ప్రభుత్వం పతనం కావడంతో కేంద్రంలో చరణ్‌సింగ్ ఆధ్వర్యంలో ఒక తాత్కాలిక సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడింది. దానిలో జనతా (సెక్యులర్) సి. ఎఫ్.డి. కాంగ్రెస్, అకాలీదళ్, ఆలిండియా అన్నా డి.ఎం.కె. పార్టీలు భాగస్వాములుగా ఉండేవి. సామాన్యంగా సంకీర్ణ మంత్రి వర్గాలు సుస్థిరంగా పనిచేయవు.

కాబినెట్ విధానంలో సమిష్టిబాధ్యతా సూత్రాన్ని (Principle of collective responsibility) సక్రమంగా అమలుపరచవలెనంటే, ఒక పార్టీకి శాసనసభలో పూర్తి మెజారిటీ లభించడం, మంత్రులంతా ఒకటే పార్టీవారై ఉండటం మంచిది ; లేకపోతే వారిలో ఉండే సిద్ధాంతపరమైన వ్యత్యాసాలు వారిని ఎక్కువకాలం కలిసి పనిచేయనివ్వవు. 1947 లో

కేంద్రంలో ఏర్పడిన జాతీయ ప్రభుత్వంలో ఉన్న 14 మంది మంత్రులలో 5 గురు మంత్రులు (శ్రీబల్దేవ్‌సింగ్, శ్రీజాన్‌మత్తాయ్, శ్రీ అంబేద్కర్, శ్రీ శ్యాంప్రసాద్ ముఖర్జీ, శ్రీ సి హెచ్. బాబాలు) కాంగ్రెస్ వారు కాదు. తమకు నచ్చనప్పుడు శ్రీ ముఖర్జీ, శ్రీ మత్తాయ్‌లు రాజీనామా ఇచ్చినారు.

ప్రమాణ స్వీకారము

ప్రధాన మంత్రి ఎంపిక పూర్తి అయిన తరవాత అతడు తన మంత్రిమండలిలోని మంత్రుల జాబితాను రాష్ట్రపతికి సమర్పిస్తాడు. రాష్ట్రపతి వారిని మంత్రులుగా నియమించి వారందరిచేత తానే ప్రమాణస్వీకారం చేయిస్తాడు. వారు పదవీప్రమాణ స్వీకారంతోపాటు ప్రభుత్వరహస్యాలు బహిర్గతం చేయమని (Oath of Secrecy) మరొక ప్రమాణం కూడా చేయవలె.

వేతనాలు

మంత్రులు మూడు రకాలుగా ఉంటారు :

(1) కాబినెట్ హోదామంత్రులు - వీరు ఆర్థికశాఖ హోమ్‌శాఖ విదేశీ వ్యవహారాలశాఖ, రక్షణశాఖవంటి ముఖ్యమైనశాఖలు నిర్వహిస్తారు. వీరికి నెలకు రు॥ 3000/- వేతనము, రు॥ 500/- భత్యము లభిస్తాయి.

(బి) స్టేట్ మంత్రులు - వీరు చిన్న చిన్న శాఖలకు అధిపతులుగా ఉంటారు. వీరికి నెలకు రు॥ 3000/- వేతనం లభిస్తుంది.

(సి) డిప్యూటీ మంత్రులు - వీరికి స్వాధీనాధికారం ఉండదు. స్వయంగా ఏ శాఖా నిర్వహించరు. ఒక కాబినెట్ మంత్రిత్వశాఖకు సహాయమంత్రిగా ఉంటారు. వీరికి నెలకు రు॥ 2000/ - వేతనం లభిస్తుంది.

బ్రిటన్‌లో పార్లమెంటరీ కార్యదర్శులను నియమించే సంప్రదాయం ఉంది. వీరు మంత్రులకు సహాయకులుగా ఉంటారు మంత్రిత్వశాఖల నిర్వహణలో అనుభవం సాధించు కొంటారు. ఈపద్ధతి ఇప్పుడిప్పుడే మనదేశంలో కూడా అడుగు పెడుతున్నది.

మంత్రులందరికీ ఉచిత నివాసగృహము, తదితరసౌకర్యాలు కల్పిస్తారు. మంత్రి మండలిలో ఎంతమంది సభ్యులు ఉండవలె అనే విషయంలో ఒక నియమం లేదు. 1947 లో కేంద్ర మంత్రిమండలిలో 14 గురు మంత్రులు మాత్రమే ఉండగా అక్టోబర్, 1974 నాటి శ్రీమతి ఇందిరాగాంధి మంత్రి వర్గంలో వీరి సంఖ్య 60కి పెరిగింది. 1977 లో ఏర్పడిన జనతా ప్రభుత్వంలో ప్రారంభంలో వీరి సంఖ్య 44. పరిపాలనా సంస్కరణల సంఘము (Administrative Reforms Commission) కేంద్ర మంత్రిదళిలో మంత్రుల సంఖ్య ఎటువంటి పరిస్థితులలోను 45కు మించకూడదని, అందులో కాబినెట్ హోదామంత్రులు 16 గురు మాత్రమే ఉండవలెనని సూచించింది. రాష్ట్రప్రభుత్వంలో వీరి సంఖ్య 25 కు పెరగకూడదు, అని సిఫార్సుచేసింది. అయితే ఈ నియమం ఎవరూ పాటించడం లేదు.

సామాన్యంగా మంత్రివర్గం నిర్మాణంలో అన్ని వర్గాలకు, అన్ని ప్రాంతాలవారికి ప్రాతి నిధ్యం వచ్చేటట్లుచూస్తారు. నేడు రాజకీయ ప్రయోజనాలు కూడా దృష్టిలో పెట్టుకొని మంత్రి

వర్గనిర్మాణం జరుగుతున్నది బుద్ధికుశలత, దూరదృష్టి, జ్ఞానసంపద వాస్తవిక దృక్పథము, చిత్తశుద్ధి, నాయకత్వశక్తి, రాజకీయవ్యక్తిత్వం, సేవాదృక్పథము కలవారిని మంత్రులుగా నియమించవలెనని పరిపాలనా సంస్కరణల సంఘం సూచించింది.

సమష్టిబాధ్యత

పార్లమెంటరీ విధానంలో మంత్రిమండలి ఒక జట్టుగా పనిచేస్తుంది. మంత్రిమండలి నిర్ణయాలు రాష్ట్రపతి పేరుమీద అమలు పరిచినా వాటివల్ల కలిగే కష్టనష్టాలకు, కీర్తి ప్రతిష్ఠలకు రాష్ట్రపతికి ఎటువంటి సంబంధమూ లేదు. కాబట్టి తమ చర లన్నిటికీ వారు పార్లమెంట్‌లోని దిగువ సభకు సమష్టిగా బాధ్యత వహించవలె. ఈ సమ బాధ్యతా సూత్రము పార్లమెంటరీ విధానానికి మూల ప్రాతిపదిక. మంత్రులంతా కలిసి ప్రభుత్వపాలనా సాగరాన్ని కలిసి మధించవలె. ఫలితాన్ని కలిసి అనుభవించవలె. వారికి లోక్ సభలో మెజారిటీ పోతే తమ పదవికి రాజీనామా ఇవ్వవలె. ఈ సమష్టి బాధ్యత అమలు పరచడం ప్రధానమంత్రి విధి. ప్రధానమంత్రి సలహాపై రాష్ట్రపతి మంత్రివర్గాన్ని రద్దుచేసి క్రొత్త మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయవచ్చు; లేదా ప్రధానమంత్రి రాజీనామా ఇస్తే మంత్రిమండలి రద్దు అవుతుంది. ఇంతకుముందు శ్రీ ఎమ్.సి. చాగ్లా విదేశీ వ్యవహారాల మంత్రిగా ఉండగా విద్యామంత్రి డా. త్రిగుణసేన్ ప్రవేశపెట్టిన త్రిభాషా సూత్ర పథకం తీవ్రమైన విమర్శకు గురి అయింది. దక్షిణాదిని ఆందోళనలు జరిగినాయి. ఆ సందర్భంలో సమష్టి బాధ్యతకు కట్టుబడి శ్రీ చాగ్లా తమ పదవికి రాజీనామా ఇచ్చినారు. విదేశీ వ్యవహారమంత్రిగా త్రిభాషా సూత్ర పథకంతో తనకు ప్రత్యక్షంగా సంబంధం లేకపోయినా మంత్రివర్గ సభ్యుడుగా తనకు ఆ విషయంలో సంబంధం ఉందని భావించి తాను రాజీనామా ఇస్తున్నానని ఆయన ప్రకటించినారు.

పార్లమెంటరీ విధానంలో మంత్రులు తాము నిర్వహించే శాఖల విషయంలో వ్యక్తిగతంగా కూడా బాధ్యత వహించడం మంచి సంప్రదాయము. శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి రైల్వే మంత్రిగా ఉండగా రైలు ప్రమాదం జరగ్గా దానికి శాఖాధిపతిగా తాను బాధ్యుడనని చెప్పి ఆయన తన పదవికి రాజీనామా ఇచ్చినారు. మంత్రులు తమ విధి నిర్వహణలో ఇటువంటి నైతిక ప్రమాణాలు పాటించడం ద్వారా తమ బాధ్యతల విషయంలో వారు ఎంత అప్రమత్తతతో ఉన్నదీ విశదమవుతుంది. తాము ఎన్నుకొన్న ప్రతినిధులు పదవీ వ్యామోహపరులు కాదని కర్తవ్య పరాయణులని ప్రజలు గుర్తిస్తారు.

మంత్రులు ప్రధానికి సహచరులైనా అతనితో తీవ్ర విభేదాలు వస్తే తమ పదవికి రాజీనామా ఇవ్వవలె; లేకపోతే రాష్ట్రపతి ద్వారా ప్రధాని వారిని తొలగించవచ్చు. 1978లో ప్రధాని మురార్జీతో చరణ్‌సింగ్, రాజనారాయణ్‌లకు అభిప్రాయ భేదాలు రాగా వారిని మంత్రివర్గం నుంచి తొలగించినారు. ఈ మధ్య తాత్కాలిక ప్రధాని చరణ్‌సింగ్ తన మంత్రివర్గ సహచరుడు హెచ్. ఎమ్. బహుగుణకు ఇదే విధంగా మంత్రివర్గం నుంచి ఉద్వాసన చెప్పినాడు. 1968 లో హిందీ వ్యతిరేకోద్యమం సమయంలో డా కె.ఎల్. రావ్, శ్రీ సి. సుబ్రహ్మణ్యం తమ మంత్రి పదవులకు రాజీనామా ఇచ్చినారు.

మంత్రిమండలి పార్లమెంట్ (లోక్‌సభ) విశ్వాసాన్ని పొందగలిగినంత కాలం మాత్రమే పదవిలో ఉంటుంది. ఈ కింది పరిస్థితులలో మంత్రిమండలి రాజీనామా ఇవ్వవలె :

(ఏ) మంత్రిమండలిపై ప్రవేశపెట్టిన విశ్వాసరాహిత్య తీర్మానాన్ని లోక్ సభలో మెజారిటీ సభ్యులు ఆమోదించినప్పుడు.

(బి) ప్రభుత్వం ప్రవేశపెట్టిన బిల్లు పార్లమెంట్‌లో వీగిపోయినప్పుడు.

(సి) ప్రతిపక్షాలు ప్రవేశపెట్టిన బిల్లు ప్రభుత్వం వ్యతిరేకించినా గెలుపొందినప్పుడు.

(డి) బడ్జెట్‌లో ప్రతిపక్షాలు ప్రవేశపెట్టిన కోత తీర్మానం ఆమోదించబడినప్పుడు.

(ఇ) మంత్రుల వేతనాలలో నామమాత్రపు కోత తీర్మానం ఆమోదించినప్పుడు.

విధులు

1. మంత్రిమండలి కేంద్ర ప్రభుత్వ విధానాలను రూపొందించి, ప్రభుత్వోద్యోగుల సహాయంతో వాటిని అమలు పరచవలె.

2. కాబినెట్ మంత్రులు ప్రభుత్వ బిల్లులను పార్లమెంటులో ప్రవేశపెట్టి వాటిని సభలో వివిధ దశలలో నడిపించి వాటిపై సభ ఆమోదాన్ని సంపాదించవలె.

3. ఆర్థికమంత్రి బడ్జెట్‌ను రూపొందించి దానిపై పార్లమెంట్ ఆమోదాన్ని పొందవలె బడ్జెట్‌ను సభలో ఆమోదింపజేయడం మంత్రివర్గానికి విషమ పరీక్ష.

4. మంత్రులు శాఖాధిపతులుగా పాలనా శాఖలను సమర్థవంతంగా నిర్వహించడం ద్వారా పాలనా లక్ష్యాలను సాధించవలె. శాఖలో పనిచేసే ఉద్యోగులను అదుపులో ఉంచవలె. వారిపై క్రమశిక్షణా చర్యలు తీసుకోవలె. వారికి ఆదేశాలిచ్చి వారు పౌర విధులు శ్రద్ధగా నిర్వహించేటట్లు చూడవలె.

5. దేశంలో శాంతి భద్రతల పరిరక్షణకు కట్టుదిట్టమైన చర్యలు తీసికొని దేశ సమగ్రతను కాపాడవలె. విదేశీ దురాక్రమణల నుంచి దేశాన్ని సంరక్షించవలె.

6. జాతీయ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని విదేశాంగ విధానాన్ని రూపొందించవలె. అంతర్జాతీయ స్నేహ సహకారాలను పెంపొందించవలె.

7. మంత్రిమండలి అభివృద్ధి ప్రణాళికలు రూపొందించి ప్రజా సంక్షేమానికి కృషి చేయవలె. పేదల, వెనకబడిన వర్గాల, అల్ప సంఖ్యాకుల ప్రయోజనాలు కాపాడటానికి సకల చర్యలు తీసుకోవలె.

8. శాసన సభ సమావేశాలలో పాల్గొని సభ్యుల ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వవలె. విమర్శలను ఎదుర్కొని విధానాలు సరిదిద్దుకోవడమో లేదా తమ చర్యలను సమర్థించుకోవడమో చేయవలె.

9. దేశంలో వరదలు, క్షామాలు, అతివృష్టి, అనావృష్టి పరిస్థితులు ఏర్పడినప్పుడు, తదితర క్లిష్ట పరిస్థితులు వచ్చినప్పుడు, ఆయా ప్రాంతాలలో పర్యటించి ప్రజల కష్టసుఖాలు స్వయంగా తెలుసుకొని వాటిని ఎదుర్కోవడానికి సత్వర చర్యలు తీసుకోవలె.

10. కాబినెట్ అన్ని శాఖల పనులను సమన్వయపరిచి వాటికి దర్శకత్వం వహించవలె. ఒక్కమాటలో చెప్పవలెనంటే రాజ్య వ్యవహారాలన్నింటిలో మంత్రిమండలి పాత్ర ఉంటుంది.

కాబినెట్ కమిటీలు

మొత్తం మంత్రిమండలి ఎప్పుడో కాని సమావేశం కాదు. కాబినెట్ మాత్రం కనీసం వారానికొకసారయినా సమావేశమవుతుంది. నేడు కాబినెట్ నిర్వహించవలసిన విధులు పెరగడం వల్ల కాబినెట్‌లో కూడా సభ్యుల సంఖ్య ఎక్కువవుతూ ఉండటం వల్ల ప్రతి విషయాన్ని వాటి సమావేశాలతో కూలకషంగా చర్చించడం కష్టమవుతున్నది. పరిపాలనలో సమన్వయం తేవడం కూడా కష్టమవుతున్నది. దీనికోసం 1964 నుంచి కమిటీ పద్ధతి ప్రారంభించినారు. సమస్యలు విపులంగా చర్చించి సముచిత నిర్ణయాలు తీసుకోవడానికి వీలుగా కాబినెట్, కమిటీలుగా పనిచేస్తుంది. 1970 నుంచి వీటి ప్రాముఖ్యం పెరిగింది. వీటన్నిటికి ప్రధాని అధ్యక్షుడు వీటిలో కొన్ని శాశ్వతమైనవి (Standing committees). శాశ్వత కమిటీలలో రాజకీయ వ్యవహారాల సంఘము (Political affairs committee), పార్లమెంటరీ వ్యవహారాల సంఘము (parliamentary affairs committee), ఆహారము - వ్యవసాయము సంఘము (Food and agriculture committee) మొదలైనవి ముఖ్యమైనవి. కొన్ని ప్రత్యేక విషయాలు చర్చించడానికి తాత్కాలిక సంఘాలు (Adhoc committees) నెలకొల్పుతారు. 1964 ఒరిస్సా ముఖ్యమంత్రిపైన, ఆయన మంత్రివర్గ సహచరులపైన వచ్చిన అవినీతి ఆరోపణలపై విచారణ జరపడానికి ఒక తాత్కాలిక కమిటీ నియమించారు.

## ప్రధానమంత్రి
## (Prime Minister)

ప్రధానమంత్రి కేంద్ర ప్రభుత్వానికి మకుటంలేని మహారాజు, 'మంత్రిమండలి అనే భవనానికి పునాదివంటి వాడు' (Key stone of the cabinet arch), మంత్రిమండలిని సౌరకుటుంబంతో పోలిస్తే దానిలో అతడు సూర్యునివలె ప్రకాశించేవాడు (Sun among the planets). ప్రధానమంత్రి మంత్రిమండలికి నాయకుడు. మంత్రులలో అతడు ప్రథముడు. అతడు సమర్పించిన జాబితాలోని వ్యక్తులనే రాష్ట్రపతి మంత్రులుగా నియమిస్తాడు. మంత్రులు అతనికి సహచరులేగాని, కింది ఉద్యోగులు కారు. పార్టీలోను, రాజకీయ రంగంలోను పేరు, పలుకుబడి కలవారే మంత్రులవుతారు కాబట్టి వారితో సహకరించి, చాకచక్యంతో నడుచుకోవలె.

ప్రధానిని రాష్ట్రపతి నియమిస్తాడు. లోక్ సభలో మెజారిటీ పార్టీనాయకుడిని అతడు ఆ పదవిలో నియమిస్తాడు. రాజ్యాంగ రీత్యా మంత్రుల నియామకం తొలగింపులో ప్రధానికి తిరుగులేని పాత్ర ఉంది. కాని ఆ పని చేసేటప్పుడు దానివల్ల ఏర్పడే రాజకీయ పరిణామాలను అతడు తీసుకోవలె. ముందువెనక, ఆలోచించి నడుచుకోవలె; లేకపోతే పార్టీలోను, పార్లమెంట్‌లోను తీవ్రపరిణామాలు వస్తాయి. అటువంటి సమయంలో పార్టీ అధ్యక్షుని సలహా పాటించడం మంచిది. 1969 లో ఇందిరాగాంధి, ఉపప్రధాని మురార్జీదేశాయ్‌ని పదవినుంచి తొలగించగా పార్టీలో తీవ్రమైన విభేదాలు వచ్చినాయి. అదే విధంగా 1972 లో మురార్జీ దేశాయ్ తన మంత్రివర్గంనుంచి ఉపప్రధాని చరణ్ సింగ్‌ను తొలగించగా చివరకది జనతా పార్టీ పతనానికి మూలమయింది.

విధులు - స్థానము

ప్రధానమంత్రి మంత్రిమండలి సమావేశాలకు అధ్యక్షత వహిస్తాడు. మంత్రిత్వ శాఖల నిర్వహణలో మంత్రులకు సహాయపడతాడు. వివిధ శాఖల కార్యకలాపాలను సమన్వయ పరుస్తాడు. అతడు మంత్రుల మధ్య వచ్చే వివాదాలు పరిష్కరించి వారి మధ్య సంధాన కర్తగా ఉంటాడు. ప్రధానమంత్రి ప్రణాళికా సంఘానికి అధ్యక్షుడు. ఈ విధి రాజ్యాంగపర మైనది కాకపోయినా దీనిని ఒక సంప్రదాయంగా పాటిస్తున్నారు. అతడు లోక్‌సభలో మెజారిటీ పార్టీ నాయకుడు లేదా సభలో అధిక సంఖ్యాకుల మద్దతు పొందగల వ్యక్తి కాబట్టి లోక్‌సభకు నాయకుడు. ప్రభుత్వ విధానాలు రూపొందించడంలోను, శాసనాలు చేసి వాటిని ఆమోదించడంలోను అతడు కీలకమైన పాత్ర నిర్వహిస్తాడు. అతడు పార్లమెంట్‌కు నాయకుడుగా వ్యవహరించడమే కాక దేశానికి నాయకత్వం వహిస్తాడు. దేశంలో సాధారణ ఎన్నికల నిర్వహణ నిజానికి ప్రధానమంత్రి ఎంపిక దృష్టిలో పెట్టుకొని జరుగుతాయి ఏ పార్టీని ఎన్నుకొంటే ఎవరు ప్రధానమంత్రి అవుతారు అనే విషయాన్నే ఆలోచిస్తారు

ప్రధానమంత్రి, మంత్రిమండలి నిర్ణయాలు ఎప్పటికప్పుడు రాష్ట్రపతికి తెలియజేయవలె. అతని సూచనలు తిరిగి మంత్రులకు తెలుపవలె. అంతేకాక పార్లమెంట్‌కు రాష్ట్రపతికి మధ్య కూడా అతడు వారధివలె పనిచేస్తాడు. ప్రభుత్వ సామర్థ్యము, జాతీయ, అంతర్జాతీయ రంగాలలో దేశ కీర్తి ప్రతిష్ఠలు అతని వ్యక్తిత్వము, మూర్తిత్వము మీద ఆధారపడి ఉంటాయి. కాబట్టి ఈ పదవి నిర్వహించే వారికి చాలా విశాల దృక్పథము, దూరదృష్టి, దీక్ష, పట్టుదల, సామర్థ్యము, అవగాహన శక్తి, సౌశీల్యము, కర్తవ్య పరాయణత, యుక్తాయుక్త విచక్షణా జ్ఞానము, పదిమందితో కలిసిమెలసి ఉండటం, వారు తన మార్గాన్ని అనుసరించేటట్లు ప్రభావితం చేయగలగడం వంటి విశిష్ట లక్షణాలు ఉండవలె. అటువంటివారే ఆ పదవిలో రాణిస్తారు. పదవికి వన్నె తెస్తారు.

ప్రధాని నిర్వహించవలసిన బరువు బాధ్యతలు చాలా క్లిష్టమైనవి. నెహ్రూ ప్రధానిగా ఉండగా కొన్ని సందర్భాలలో ఆయనకు రోజుకు 18 గం|| నుంచి 20 గం|| కూడా పనిచేసే వారు. ప్రధానమంత్రి పదవిలో ఉండేవారు ఎంతో మానసికమైన ఒత్తిడికి, శారీరకమైన శ్రమకు లోనవుతారు. అయినా పట్టుదలతో విసుగు చెందని విక్రమార్కునివలె పనిచేయవలె కాబట్టి ఆ పదవి చేపట్టే వారికి మానసికంగాను, శారీరకంగాను దార్ఢ్యము, ఉత్సాహము ఉండవలె.

ప్రధానమంత్రి పార్లమెంట్‌లోను, బయటా మంత్రులపై వచ్చే విమర్శలను ఎదుర్కొని తగిన జవాబు చెప్పవలె. వారిని క్లిష్ట పరిస్థితిలో ఆదుకోవలె. అన్ని వేళలా, వారిని, వారి పనులను సమర్థించవలె. మంత్రిమండలిలో పార్లమెంటరీ విధానానికి మూలమైన సమష్టి బాధ్యత వ్యక్తిగత బాధ్యత అమలు జరిగేట్లు చేయవలె.

## లోక్‌పాల్

ప్రధానమంత్రి, కేంద్రమంత్రులు, రాష్ట్ర ముఖ్యమంత్రులు పార్లమెంటు సభ్యులు మొదలైన ప్రజా నాయకులపై వచ్చే అవినీతి ఆరోపణలు, రాజకీయ నాయకుల అనుచిత చర్యలు, అవినీతి నిరోధక చట్టము, ఐ. పి. సి. 9 వ అధ్యాయం కింద శిక్షార్హమైన నేరాలు

దర్యాప్తు చేయడానికి 28-7-77 న లోక్‌పాల్ బిల్లు పార్లమెంట్‌లో ప్రవేశపెట్టినారు. ఆ బిల్లు ప్రకారం లోక్‌పాల్‌ను రాష్ట్రపతి నియమిస్తాడు. నియామకమప్పుడు అతడు ఉపరాష్ట్రపతి, స్పీకర్‌తో సంప్రదిస్తాడు. అతనికి సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి హోదా ఉంటుంది. అతని పదవీ కాలం 5 సంవత్సరాలు. రాజకీయ రంగంలో ఉన్న, లేదా ఒకప్పుడు ఉండిన ఏ వ్యక్తిని గురించి అయినా 5 సంవత్సరాలకు మించని కాలంలో వచ్చిన అక్రమ ప్రవర్తన ఫిర్యాదులు లోక్‌పాల్ పరిధిలోకి వస్తాయి.

ఈ బిల్లుకు ఇంకా పార్లమెంట్ అనుమతి లభించలేదు. ప్రస్తుత రాజకీయ నైతిక పతనావస్థలో ఇటువంటి బిల్లు కొన్ని మార్పులతోనైనా అమలులోకి రావడం హర్షణీయము. కర్ణాటక రాష్ట్రప్రభుత్వము ఇదే సూత్రాలపై రాష్ట్రస్థాయిలో రాష్ట్రమంత్రులు, శాసనసభ్యులు, ఉన్నత పదవులలో ఉండే అధికారులపై వచ్చే అవినీతి ఆరోపణలను దర్యాప్తు చేయడానికి "లోకాయుక్త" బిల్లును ఆమోదించింది. జస్టిస్ సి. హొన్నయ్య ఆ రాష్ట్రానికి మొట్టమొదటి లోకాయుక్తగా అక్టోబర్ 2, 1979 నియమితులయినారు. ఇతర రాష్ట్ర ప్రభుత్వాలకు ఇది మార్గదర్శక మవుతుందని ఆశిద్దాము.

## భారత పార్లమెంట్
## (Indian Parliament)

రాష్ట్రపతి, రాజ్యసభ, లోక్‌సభను కలిపి ఉమ్మడిగా పార్లమెంట్ అని పిలుస్తారు. రాజ్యాంగంలోని 79 వ నిబంధన ప్రకారం భారతదేశ పరిపాలనకు కావలసిన శాసనాలను అది రూపొందిస్తుంది. భారత పార్లమెంట్‌కు బ్రిటిష్ పార్లమెంట్ వలె తిరుగులేని అధికారాలులేవు. అది రాజ్యాంగ పరంగా నడచుకోవలె. రాజ్యాంగ విరుద్ధమైన దాని చర్యలు చెల్లనేరవని సుప్రీమ్ కోర్టు తీర్పు ఇవ్వవచ్చు.

భారత పార్లమెంట్ ద్వంద్వ శాసనసభ. ఎగువ సభను రాజ్యసభ అని, దిగువ సభను లోక్‌సభ అని పిలుస్తారు. కొన్ని విషయాలలో మినహా రెండు సభలకూ సరిసమానమైన అధికారాలు ఉన్నాయి. రెండు సభలలోని సభ్యులను పార్లమెంట్ సభ్యులనే అంటారు.

### పార్లమెంట్ నిర్మాణము

*రాజ్యసభ* : రాజ్యాంగంలోని 80 వ నిబంధన ప్రకారం రాజ్యసభలో 250 మంది సభ్యులు ఉంటారు. అందులో 238 మంది సభ్యులను రాష్ట్ర శాసనసభలు, కేంద్రపాలిత ప్రాంతాలు ఎన్నుకొంటాయి. మిగిలిన 12 మంది సభ్యులను రాష్ట్రపతి సాహిత్యము, విజ్ఞానము, కళలు, సంఘసేవ వంటి రంగాలలో ప్రముఖులైన వారిని ఎంచుకొని సభ్యులుగా నియమిస్తాడు. రాజ్యసభ సభ్యులను రాష్ట్రవిధాన సభలోని ఎన్నికైన సభ్యులు నిష్పత్తి ప్రాతినిధ్య ఎన్నిక విధానం ద్వారా ఎన్నుకొంటారు. రాజ్యసభలో అన్ని రాష్ట్రాలకు సరిసమానమైన సభ్యత్వం లేదు. వివిధ రాష్ట్రాలకు, కేంద్ర పాలిత ప్రాంతాలకు కేటాయించిన ప్రతినిధుల సంఖ్యను రాజ్యాంగంలోని 4 వ షెడ్యూల్‌లో వివరించినారు. దీని ప్రకారం ఆంధ్రప్రదేశ్-18, అస్సాం-7, బీహార్-22, గుజరాత్-11, హర్యానా-5, కేరళ-9, మధ్యప్రదేశ్-16, తమిళనాడు-18, మహారాష్ట్ర-19, కర్ణాటక-12, ఒరిస్సా-10, పంజాబ్-7, రాజస్థాన్-10,

సిక్కిం-1, ఉత్తరప్రదేశ్-34, పశ్చిమబెంగాల్-16, జమ్మూ-కాశ్మీర్-4, నాగాలాండ్-1 ఢిల్లీ-3, హిమాచల్‌ప్రదేశ్-3, మణిపూర్-1, త్రిపుర-1, పాండిచ్చేరి-1. మేఘాలయ-1, అరుణాచల్‌ప్రదేశ్-1, మిజోరమ్-1, (మొత్తం = 232).

*సభ్యుల అర్హతలు - పదవీకాలము* : రాజ్యసభ సభ్యత్వానికి పోటీ చేసే వ్యక్తి 30 సం॥ నిండిన భారతీయపౌరుడై ఉండవలె ఆదాయాన్నిచ్చే ప్రభుత్వోద్యోగంలో ఉండ కూడదు. పార్లమెంట్ నిర్ణయించే ఇతర అర్హతలు కలిగి ఉండవలె. రాజ్యసభ శాశ్వతసభ. ఈ సభలోని సభ్యులు లోక్‌సభ సభ్యులవలె మొత్తం అందరూ ఒకే పరాయ్యం పదవిని కోల్పోరు. ప్రతి 2 సంవత్సరాలకు ఒక పర్యాయం 1/3 వంతు సభ్యులు పదవీ విరమణ చేస్తారు. అంటే ఈ సభలో ఎప్పుడూ కొందరు కొత్త సభ్యులు కొందరు పాతసభ్యులు ఉంటారన్న మాట. ఒక్కొక్క సభ్యుడు 6 సంవత్సరాలు పదవిలో ఉంటాడు.

రాజ్యసభ సమావేశాలకు ఉపరాష్ట్రపతి అధ్యక్షత వహిస్తాడు. అతనిని ఛైర్మన్ అని పిలుస్తారు. సభ్యులు తమలో ఒకరిని ఉపాధ్యక్షునిగా (Deputy chairman) ఎన్ను కొంటారు. అధ్యక్షునికి నెలకు రు॥ 2250/- వేతనము రు॥ 500/- భత్యంలభిస్తాయి. ఉపాధ్యక్షునికి నెలకు రూ॥ 2000/- వేతనం లభిస్తుంది. వీరిద్దరికి అన్ని సదుపాయాలున్న ఉచిత నివాసగృహం ఇస్తారు.

*లోక్‌సభ* : ఇది ప్రజాప్రతినిధిసభ. 1976 జనవరి నెలలో లోక్‌సభ నియోజక వర్గాలను పునర్ వ్యవస్థీకరించినారు. దాని ప్రకారం ప్రస్తుతం ఈ సభలో మొత్తం స్థానాల సంఖ్య 542 కి మించకూడదు. వివిధరాష్ట్రాలకు లభించిన స్థానాలసంఖ్య ఈ కిందివిధంగా ఉంది.

ఆంధ్రప్రదేశ్-42, అస్సామ్-14, బీహార్-54, గుజరాత్-26, హర్యానా-10, హిమాచల్‌ప్రదేశ్-4, జమ్మూ-కాశ్మీర్-6, కర్ణాటక-28, కేరళ-20, మధ్యప్రదేశ్-40, మహారాష్ట్ర-48, మణిపూర్-2, మేఘాలయ-2, నాగాలాండ్-1, ఒరిస్సా-21, పంజాబ్-13, రాజస్థాన్-25, సిక్కిం-1, తమిళనాడు-39, త్రిపుర-2, ఉత్తరప్రదేశ్-85, పశ్చిమ బెంగాల్-42, అండమాన్ నికోబార్ ద్వీపాలు-1, అరుణాచల్ ప్రదేశ్-2, చండీఘర్-1, దాద్రానగర్ హవేలి-1, ఢిల్లీ-7 గోవా, డయ్యూ, డామన్-2, లక్షద్వీప్-1, మిజోరమ్-1, పుదుచ్చేరి-1.

దేశాన్ని పైన సూచించిన ప్రకారం నియోజకవర్గాలుగా విభజించి, ప్రత్యక్ష వయోజన ఓటింగ్ విధానం ద్వారా ఎన్నుకొంటారు. ఒక్కొక్క నియోజకవర్గంలో దాదాపు 6 1/2 నుంచి 7 1/2 లక్షల మంది ఓటర్లు ఉంటారు. షెడ్యూల్డ్ కులాలకు, తెగలవారికి కొన్ని నియోజకవర్గాలు రిజర్వ్ చేస్తారు. ఆ నియోజకవర్గాలనుంచి ఆ కులాలు, తెగలకు చెందిన వారు మాత్రమే పోటీ చేయవలె. లోక్ సభకు ఎన్నికైన సభ్యులలో ఆంగ్లో-ఇండియన్ వర్గానికి చెందిన సభ్యులు ఎవరూ లేకపోతే, ఆ వర్గంవారిని ఇద్దరిని రాష్ట్రపతి లోక్ సభ సభ్యులుగా నామినేట్ చేయవచ్చు.

*అర్హతలు - పదవీకాలము* : లోక్ సభకు పోటీ చేసే అభ్యర్థి 25 సంవత్సరాలు వయస్సు నిండిన భారతీయ పౌరుడై ఉండవలె. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలలో ఆదాయాన్నిచ్చే పదవిలో ఉండకూడదు. 2 సం॥ జైలుశిక్ష అనుభవించిన నేరస్థులు, దివాళాకోరులు, మన్తో

చాంచల్యం గలవారు, ఎన్నికలలో అవినీతికి పాల్పడినవారు దీనికి పోటీ చేయడానికి అనర్హులు ఇవికాక పార్లమెంట్ సమయానుకూలంగా నిర్ణయించే ఇతర అర్హతలు కూడా వీరికి ఉండవలె.

లోక్ సభ పదవీకాలం 5 సంవత్సరాలు. ఈ కాలపరిమితిని పార్లమెంట్ అత్యవసర పరిస్థితి కాలంలో ఒక్కొక్క సంవత్సరం చొప్పున ఆ పరిస్థితి ఉన్నంతకాలం పొడిగించవచ్చు. అత్యవసర పరిస్థితి తొలిగిన 6 నెల్లలో పార్లమెంట్‌ను రద్దుచేసి ఎన్నికలు నిర్వహించవలె

లోక్‌సభలో మంత్రిమండలి మెజారిటీ కోల్పోయి, మరొక మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయడానికి వీలు పడనప్పుడు, లేదా ప్రధానమంత్రి లోక్ సభను రద్దుచేసి తిరిగి సాధారణ ఎన్నికలు జరిపించమని రాష్ట్రపతికి సలహా ఇచ్చినప్పుడు, రాష్ట్రపతి దీనికి ఎన్నికలు జరిపిస్తాడు. ప్రధాని మెజారిటీ కోల్పోయినప్పుడు అతడు ఎన్నికలు జరిపించమని సలహా ఇస్తే, ఆ సలహాను రాష్ట్రపతి పాటించవలెనా లేదా అనేది వివాదాస్పదమైన అంశము.

లోక్ సభ కనీసం 6 నెలలకొక పర్యాయం సమావేశమవుతుంది. దీనిని రాష్ట్రపతి ఏర్పాటు చేస్తాడు. సమావేశం నిర్వహించవలెనంటే "కోరమ్" (Quorum - సభ నిర్వహించడానికి హాజరు కావలసిన కనీస సభ్యుల సంఖ్య) సభ మొత్తం సభ్యత్వంలో 10 వ వంతు ఉండవలె.

### పార్లమెంట్ సభ్యుల వేతనాలు

వీరి వేతనాలను పార్లమెంట్ నిర్ణయిస్తుంది. ప్రస్తుతం వీరికి నెలకు రు. 500/- వేతనం లభిస్తున్నది. సమావేశ కాలంలో రోజుకు రు. 50/-భత్యం లభిస్తుంది. కొద్ది అద్దెపై వారికి ఢిల్లీలో నివాసగృహం ఇస్తారు. సమావేశం మధ్యలో రెండు పర్యాయాలకు మించకుండా తమ ప్రాంతాలకు వెళ్ళడానికి తిరిగి సమావేశాలకు హాజరు కావడానికి, మొదటి తరగతి రైలు టికెట్‌గాని, విమానం టికెట్‌గాని వారు పొందవచ్చు. లోక్ సభ సమావేశంలో ఉన్న కాలంలో ఏ సభ్యుడైనా 60 రోజులు వరసగా సభకు హాజరు కాకపోతే అతడు తన సభ్యత్వం కోల్పోతాడు.

## సభాపతి
## (Speaker)

లోక్ సభ ఏర్పడిన మొదటి సమావేశంలో ఒక సీనియర్ సభ్యుని అధ్యక్షతన లోక్ సభ సమావేశాలను నిర్వహించడానికి సభ్యులు తమలో ఒకరిని సభాపతి (స్పీకర్) గాను మరొకరిని ఉప సభాపతి (డిప్యూటీ స్పీకర్) గాను ఎన్నుకొంటారు. సామాన్యంగా అధికారపక్షం నుంచి స్పీకర్‌ను, ప్రతిపక్షం నుంచి డిప్యూటీ స్పీకర్‌ను ఎన్నుకోవడం సంప్రదాయము. స్పీకర్ పదవికి ఎన్నికైన సభ్యుడు తనపార్టీ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చి ఏ పార్టీకిచెందని తటస్థ వ్యక్తిగా వ్యవహరించడం మంచి సంప్రదాయము.

స్పీకర్‌కు నెలకు రు. 2750/- వేతనము, డిప్యూటీ స్పీకరుకు నెలకు రు. 2000/- వేతనం లభిస్తాయి. అన్ని వసతులుగల ఉచిత నివాస గృహం వీరికి ఇస్తారు. స్పీకర్

వేతనము, భారత సంఘటిత నిధి (Consolidated fund of India) కి సంబంధించిన ఖర్చుగా పరిగణిస్తారు. స్పీకర్ సభలో లేనప్పుడు, డిప్యూటీ స్పీకర్ ఆతని విధులు నిర్వహించి, ఆయన వేతనం తీసుకొంటాడు. ఇరువురికి వీలు కాకపోతే స్పీకర్‌చే నామినేట్ చేయబడిన 6 గురు అధ్యక్షుల జాబితా (Panel of chairmen) లోని వారెవరైనా ఆ విధులు నిర్వహిస్తారు.

## పదవీకాలము - అభిశంసన

స్పీకర్ పదవీ కాలం 5 సంవత్సరాలు. లోక్‌సభ రద్దు అయినా స్పీకర్ పదవిలో కొనసాగుతాడు. కొత్త లోక్‌సభ మొదటి సమావేశంలో కొత్త సభాపతి ఎన్నికయ్యే వరకు ఆయన పదవిలో ఉంటాడు. ఈ లోగా ఏ కారణంచేత నైనా తన సభ్యత్వం కోల్పోతే అతడు తన పదవి కోల్పోతాడు. పదవీ కాలం ముగియక ముందే అతడు తన పదవికి తనంతతానుగా రాజీనామా ఇవ్వవచ్చు. లేదా 14 రోజుల గడువుతో ఒక నోటీసు జారీచేసి, తరవాత ఒక అభిశంసన తీర్మానం ప్రతిపాదించి, సభ మొత్తం సభ్యులలో సగానికి పైగా ఆమోదిస్తే స్పీకర్‌ను పదవి నుంచి తొలగించవచ్చు. ఆ తీర్మానంపై చర్చ జరిగేటప్పుడు ఆయన అధ్యక్ష స్థానంలో ఉండకూడదు. ఇంతవరకు ఒక్క పర్యాయం 1954 లో శ్రీమావ్ లంకర్‌పై అటువంటి తీర్మానం ప్రవేశపెట్టినారు. అయితే దానిని తరవాత ఉపసంహరించుకొన్నారు.

## స్పీకర్ అధికారాలు - విధులు

1. స్పీకర్ లోక్ సభకు అధ్యక్షత వహించి సభా కార్యక్రమాలు క్రమబద్ధంగా హుందాగా జరిగేటట్లు చూడవలె. సభ్యులు క్రమశిక్షణతో పార్లమెంటరీ సంప్రదాయాలకు అనుగుణంగా నడుచుకొనేటట్లు చేయవలె.

2. స్పీకర్ అనుమతి లేనిదే సభలో ఎవరూ మాట్లాడకూడదు. ఆయన సభలో అందరికీ మాట్లాడే అవకాశం కల్పించవలె, సమన్యాయం జరిగేటట్లు చూడవలె. ప్రత్యేకంగా చొరవ తక్కువగా ఉండే సభ్యులకు ప్రోత్సాహమివ్వవలె.

3. బిల్లులపైన, తీర్మానాలపైన ఓటింగ్ జరిపించి సభ నిర్ణయాలు బహిరంగ పరచవలె. అతడు ఓటింగ్‌లో పాల్గొనకూడదు. కాని ఓటింగ్‌లో సభ్యుల ఓట్లు సమానంగా చీలితే "కాస్టింగ్ ఓటు" (Casting vote - నిర్ణయపు ఓటు) వేసి ఏదో ఒక పక్షాన్ని గెలిపించవచ్చు.

4. లోక్‌సభ సచివాలయ సిబ్బందిని స్పీకర్, సభ ఆమోదంతో నియమించవలె.

5. సభ్యుల మర్యాదలు, గౌరవ ప్రతిపత్తులు, హక్కులు కాపాడవలె. పార్లమెంట్ సభ్యులకు కొన్ని విశేషాధికారాలు (Privileges) ఉన్నాయి. వారిని స్పీకర్ అనుమతి లేనిదే అరెస్ట్ చేయకూడదు. ఒకవేళ చేసినా ఆ విషయం ఆయనకు వెంటనే తెలియజేయవలె. ఎప్పుడు విడుదల చేసింది కూడా తెలుపవలె.

6. సభ్యులుగాని, సభ్యేతరులుగాని సభా మర్యాదలకు హాని కలిగిస్తే వారిపై స్పీకర్ చర్య తీసుకొంటాడు. అవసరమైతే వారిని మందలిస్తాడు.

7. సభ్యులు తాము సభలో ప్రభుత్వాన్ని అడగదలుచుకొన్న ప్రశ్నలను స్పీకర్‌కు అందజేయవలె. ఆయన వాటిని పరిశీలించి అడగదగిన ప్రశ్నలకు సమయాన్ని నిర్ణయిస్తాడు.

8. సభ్యుల ప్రశ్నలకు ప్రభుత్వం నుంచి సముచితమైన సమాధానాలు లభించేటట్లు చూడటం అతని విధి.

9. మనీ బిల్లులు (Money Bills) ఏవో సాధారణ బిల్లు లేవో నిర్ణయించడంలో అతని అధికారం తిరుగులేనిది.

10. స్పీకర్ పార్లమెంటరీ కమిటీలను నియమించి వాటి పనులను పరిశీలిస్తాడు. కొన్ని కమిటీలకు ఆయనే అధ్యక్షత వహిస్తాడు. వాటి సిఫార్సులు, నివేదికలు సభకు సమర్పిస్తాడు.

11. సభా కార్యక్రమాలను 'రికార్డు' చేయిస్తాడు. సభామర్యాదలకు భంగకరంగా ఉండే ఉపన్యాసాలు, సంభాషణలు, చర్చలు రికార్డు నుంచి తొలగించమని ఆదేశిస్తాడు.

12. సభలో ఎవరైనా అదుపు తప్పి అతని ఇష్టానికి వ్యతిరేకంగా మాట్లాడినా, ప్రవర్తించినా వారిని హెచ్చరించవచ్చు ; సభ నుంచి బహిష్కరించవచ్చు ; లేదా "సార్జంట్ ఎట్ ఆర్మ్స" (Sargent at arms) సహాయంతో సభ నుంచి బలవంతంగా బయటకు పంపవచ్చు.

13. సభలో అస్తవ్యస్తమైన పరిస్థితి ఏర్పడి కార్య క్రమ నిర్వహణ కష్టమైతే సభా కార్యక్రమాలు వాయిదా వేయడానికి, లేదా రద్దుచేయడానికి అధికారముంది.

14. సభా కార్యక్రమాలు కమిటీల నిర్వహణకు కావలసిన నియమ నిబంధనలను అతడు రూపొందిస్తాడు.

స్పీకర్ పదవి చాలా గౌరవప్రదమైనది. బ్రిటన్‌లో ఒకసారి స్పీకర్‌గా ఎన్నుకొన్న వారినే తిరిగి ఆ పదవికి ఎన్నుకొంటారు. ఈ పదవికి గొప్ప గౌరవ ప్రతిష్ఠలున్నాయి. నేటి వరకు ఈ పదవి చేపట్టిన వారందరూ దాని హుందాతనానికి భంగం కలగకుండా ప్రవర్తించినారు.

## పార్లమెంట్ విధులు - అధికారాలు

పార్లమెంట్ విధులను అధికారాలను ఈ క్రింది విధంగా వర్గీకరించవచ్చు :

### శాసన నిర్మాణాధికారాలు

ప్రజా శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని దేశ పరిపాలన నిర్వహించడానికి కావలసిన శాసనాలను తయారుచేయడం పార్లమెంట్ యొక్క ప్రధాన విధి. కేంద్ర, ఉమ్మడి జాబితాలలో ఉన్న అన్ని అంశాలపైన పార్లమెంట్ శాసనాలు చేయవచ్చు. సాధారణంగా రాష్ట్ర జాబితాలోని అంశాలపై శాసనాలు చేసే అధికారం దీనికి లేదు. కాని రాష్ట్రంలో, రాష్ట్రపతి పరిపాలన ప్రవేశ పెట్టినప్పుడు రాష్ట్ర జాబితాలోని అంశాలపై పార్లమెంట్ శాసనాలు చేయవచ్చు. ఏదైనా ఒక రాష్ట్రానికి గాని లేదా కొన్ని రాష్ట్రాలకు గాని జాతీయ ప్రయోజనాల దృష్ట్యా పార్లమెంట్ రాష్ట్ర జాబితాలోని అంశాలపై శాసనాలు చేయవలెనని రాజ్యసభ తీర్మానిస్తే, ఒక సంవత్సరంపాటు ఆ రాష్ట్రానికి లేదా రాష్ట్రాలకు పార్లమెంట్ శాసనా లు చేయ

వచ్చు. ఈ కాలపరిమితిని ఆవసరమైతే రాజ్యసభ పొడిగించవచ్చు. కొన్ని రాష్ట్రాల శాసన సభలు ఒక తీర్మానం ద్వారా తమ రాష్ట్రాలకు శాసన నిర్మాణ బాధ్యత పార్లమెంట్ చేపట్ట వలెనని స్వయంగా కోరినప్పుడు ఆ రాష్ట్రాలవరకు రాష్ట్ర పట్టికలోని అంశాలపై పార్లమెంట్ శాసనాలు చేస్తుంది. కేంద్రానికి, రాష్ట్రాలకు చెందని అవశిష్టాధికారాలపై (Residuary powers) శాసనాలు చేసే అధికారం పార్లమెంట్‌కు మాత్రమే ఉంది. పార్లమెంట్ సమా వేశంలో లేనప్పుడు రాష్ట్రపతి జారీచేసే ఆర్డినెన్స్‌లు, అత్యవసర ప్రకటనలు, తిరిగి అది సమావేశమైనప్పుడు ఆమోదించవలె; లేకపోతే అవి రద్దు అవుతాయి పార్లమెంట్ తనకుగల అధికారాలను కేంద్ర మంత్రిమండలికి కాని లేదా మరి ఏ ఇతర ప్రభుత్వ విభాగానికిగాని దత్తం చేయవచ్చు. దీనినే "దత్త శాసన నిర్మాణము" (Delegated Legislation) అంటారు.

### కార్యనిర్వాహకవర్గంపై అజమాయిషీ

పార్లమెంటరీ విధానంలో మంత్రివర్గము తన చర్యలకు పార్లమెంట్‌కు బాధ్యత వహి స్తుంది. మంత్రులను ప్రశ్నలు అడగడం ద్వారాను, వారి పనులపై ఆక్షేపణ తీర్మానాలు ప్రవేశపెట్టడం ద్వారాను, అవిశ్వాస తీర్మానాలు ఆమోదించడం ద్వారాను, ఆర్థికమంత్రి ప్రతి పాదించిన బడ్జెట్‌ను తిరస్కరించడం ద్వారాను, లేదా వ్యయంలో నామమాత్రపు కోత తీర్మా నాలు ఆమోదించడం ద్వారాను, మంత్రుల వేతనాలలో కోత తీర్మానాలు ఆమోదించడం ద్వారాను పార్లమెంట్ మంత్రివర్గాన్ని అదుపులో పెడుతుంది. రాష్ట్రపతిపై మహాభియోగ తీర్మానం ప్రతిపాదించి ఆమోదించడం ద్వారా పార్లమెంట్ అతనిని కూడా అదుపులో పెట్ట గలదు. అతడు రాజ్యాంగ బద్ధంగా నడుచుకొనేటట్లు చేయగలదు.

### ఆర్థికాధికారాలు

ఆర్థిక విషయాలలో పార్లమెంట్‌కు ఉండే అధికారాలు తిరుగులేనివి. పార్లమెంట్ అనుమతి లేనిదే కొత్త పన్నులు విధించ కూడదు. ప్రభుత్వ ఆదాయ వ్యయ పట్టిక (బడ్జెట్- Budget) దాని అనుమతితో అమలుపరచబడుతుంది. ప్రతి సంవత్సరం బడ్జెట్‌పై పార్ల మెంటు ఆమోదం పొందడం మంత్రివర్గానికి విషమ పరీక్ష అని చెప్పవచ్చు.

ఆర్థిక విషయాలకు సంబంధించిన బిల్లులను "మనీ బిల్లు" (Money bil. అంటారు. ఏ బిల్లు మనీ బిల్లు, ఏ బిల్లు సాధారణ బిల్లు అనే విషయాన్ని స్పీకర్ నిర్ణ యిస్తాడు. ఈ విషయంలో అతని అధికారం తిరుగులేనిది. మనీ బిల్లులను ఆమోదించడంలో రాజ్యసభ కంటె లోక్ సభకే ఎక్కువ అధికారాలున్నాయి. ఆర్థిక బిల్లులను తప్పనిసరిగా లోక్ సభలోనే ప్రవేశపెట్టవలె. లోక్ సభ ఆమోదించిన తరవాత దానిని రాజ్య సభకు పంపుతారు. మనీ బిల్లును రాజ్యసభ 14 రోజుల గడువులో తిరిగి లోక్ సభకు పంపవలె. అది చేసిన సవరణలను లోక్ సభ ఆమోదించవచ్చు లేదా తిరస్కరించవచ్చు.

అధ్యక్షుడు సమర్పించిన ఆడిట్ నివేదికను ఇది చర్చిస్తుంది. లోపాలకు ప్రభుత్వాన్ని సంజాయిషీ కోరుతుంది. పార్లమెంట్ ఆర్థిక కమిటీలైన ప్రభుత్వ అంచనాల సంఘము

(Public Estimates Committee), ప్రభుత్వ ఖాతాల సంఘము (Public Accounts Committee) ప్రభుత్వ పద్దుల నన్నిటిని పరిశీలించి నియంత్రిస్తాయి.

న్యాయాధికారాలు

పార్లమెంట్ ప్రధాన విధి శాసన నిర్మాణమే అయినా భారత పార్లమెంటుకు కొన్ని న్యాయాధికారాలు కూడా ఉన్నాయి. సుప్రీమ్‌కోర్ట్, హైకోర్ట్ న్యాయమూర్తుల సంఖ్యను పెంచే అధికారం, వారిని పదవినుంచి తొలగించే అధికారం పార్లమెంటుకు మాత్రమే ఉంది. వారిపై ప్రవేశపెట్టిన అభియోగ తీర్మానాన్ని ఉభయ సభలు మొదట సాధారణ మెజారిటీతోను పిదప 2/3వ వంతు మెజారిటీతోను ఆమోదిస్తే న్యాయమూర్తులను పదవినుంచి తొలగించ వచ్చు. న్యాయస్థానానికి ఈ విషయంలో ఇచ్చిన అధికారం వల్ల న్యాయశాఖ స్వతంత్ర ప్రతిపత్తి కాపాడబడింది.

పార్లమెంట్, గౌరవ ప్రతిష్ఠలకు హాని కలిగించేటట్లు ఎవరైనా మాట్లాడినా, వ్రాసినా సభ్యుల హక్కులకు భంగం కలిగించినా వారిపై చర్య తీసుకోవడానికి దానికి అధికారముంది. ఉదాహరణకు, 1951 లో శ్రీ హెచ్. జె ముద్గాల్ అనే సభ్యుడు సభను కించపరచినందుకు ఆయనను పార్లమెంట్ సభనుంచి బహిష్కరించిరి. శ్రీ సుబ్రహ్మణ్యస్వామిని కూడా పార్లమెంట్ అదే విధంగా బహిష్కరించినది. బొంబాయినుంచి వెలువడే పత్రిక "బ్లిట్జ్" (Blitz) సంపాదకుడు సభ్యుల మర్యాదకు భంగం కలిగించేటట్లు వ్రాసినందుకు ఆయనపై చర్య తీసుకోవడంజరిగింది. తనపై తీసుకొన్న చర్య ప్రాథమిక హక్కులకు విరుద్ధమని ఆయన సుప్రీమ్ కోర్ట్‌లో వాదించినా ప్రయోజనం లేకపోయింది. 1975లో అప్పటి ప్రధానమంత్రి శ్రీమతి గాంధి పార్లమెంటుకు మారుతీ ప్రాజెక్ట్ వ్యవహారాలపై సమాచారం అందకుండా అడ్డుపడినందుకు సభా హక్కుల కమిటీ ఆమెను నవంబర్ 1978లో సభనుంచిబహిష్కరించింది

ఎన్నికల విధులు

రాజ్యసభ, లోక్ సభలలోని ఎన్నికైన సభ్యులు అందరూ కలిసి రాష్ట్రపతిని ఎన్నుకొనే నియోజక గణంలో భాగంగా ఉంటారు. ఉపరాష్ట్రపతిని పార్లమెంట్‌లో ఉభయ సభ సభ్యులు కలిసి ఎన్నుకొంటారు.

రాజ్యాంగాన్ని సవరించే అధికారము

రాజ్యాంగాన్ని సవరించే అధికారాన్ని రాజ్యాంగం పార్లమెంటుకు ఇచ్చింది. రాజ్యాంగ సవరణను పార్లమెంట్ ఉభయ సభలలో ఏ సభ అయినా ప్రతిపాదించవచ్చు. రాజ్యాంగ సవరణలు ప్రతిపాదించే అధికారం రాష్ట్ర శాసన సభలకు లేదు. భారత రాజ్యాంగాన్ని సవరించడానికి రాజ్యాంగంలో మూడు పద్ధతులు సూచించినారు. కొన్ని సవరణలు చేయడానికి పార్లమెంట్ ఉభయ సభలు దానికి సంబంధించిన తీర్మానాన్ని సాధారణ మెజారిటీతో ఆమోదిస్తే సరిపోతుంది. కొన్ని సవరణలకు ఉభయ సభలలో సాధారణ మెజారిటీ, 2/3వ వంతు మెజారిటీతో ఆమోదం కావలె. కొన్ని సవరణలకు మాత్రం సాధారణ మెజారిటీ, 2/3 వంతు మెజారిటీతోబాటు అధిక రాష్ట్రాల శాసన సభల ఆమోదం కూడా కావలె.

ఒక సభ ఆమోదించిన సవరణను మరొక సభ తిరస్కరిస్తే ఏం చేయవలెననే విషయాన్ని గురించి రాజ్యాంగంలో ప్రస్తావించలేదు. అయితే సుప్రీమ్ కోర్ట్ తీర్పు ప్రకారం రెండు సభల మధ్య ప్రతిష్టంభన ఏర్పడితే రాష్ట్రపతి రాజ్యాంగంలోని 108 వ నిబంధన ప్రకారం ఒక సంయుక్త సమావేశం ఏర్పాటుచేసి మొత్తం సమావేశంలో దానిని ఓటింగ్‌కు పెట్టవలె.

### ప్రజాభిప్రాయ వేదిక

దేశ పరిపాలనకు సంబంధించిన అనేక విషయాలపైన, బిల్లులపైన పార్లమెంట్ సమావేశాలలో సభ్యులు స్వేచ్ఛగా తమ అభిప్రాయాలు వ్యక్తం చేస్తారు. పార్లమెంట్ సభ్యులు ప్రజా ప్రతినిధులు కాబట్టి, వారు దేశంలో వివిధ ప్రాంతాలకు చెందినవారు కాబట్టి వారి అభిప్రాయాలు, విమర్శలు, చర్చల ద్వారా ప్రజాభిప్రాయం వ్యక్తమవుతుంది. దేశం నలుమూలల జరుగుతున్న సంఘటనలు. ప్రజల కష్టసుఖాలు ప్రభుత్వం దృష్టికి వస్తాయి. వాటిపై ప్రభుత్వం వెంటనే తగిన చర్యలు తీసుకొనేటట్లు చేయడానికి పార్లమెంట్ సమావేశాలు తోడ్పడతాయి. మేధావులు, అనుభవజ్ఞులు అయిన సభ్యులు వ్యక్తంచేసే అభిప్రాయాలను బట్టి ప్రభుత్వం తన విధానాలను మలుచుకోవచ్చు. తప్పులు సరిదిద్దుకోవచ్చు. సభ్యులు సమర్థులు, మంచి వాక్పటిమ, వాక్చాతుర్యము కలవారైతే వారు సభలో చేసిన ఉపన్యాసాలు యావత్‌దేశాన్ని ఆకర్షిస్తాయి. తద్వారా ప్రజాభిప్రాయం తీర్చి దిద్దబడుతుంది.

### ఇతర విధులు

పైన సూచించిన విధులేకాక పార్లమెంట్ ఇతరత్రా అనేక విధులు నిర్వర్తిస్తుంది. అది రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, సుప్రీమ్ కోర్ట్, హైకోర్ట్ ప్రధాన న్యాయమూర్తులనే కాక కంట్రోలర్ ఆడిటర్ జనరల్, ఛీఫ్ ఎలెక్షన్ కమీషనర్, యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యులను కూడా వారు తమ విధులు సరిగా నిర్వహించకపోయినా, ప్రవర్తన సరిగా లేకపోయినా అభిశంసన ద్వారా పదవినుంచి తొలగించగలదు. దీనికి ఒక సభ అభిశంసన తీర్మానం ప్రవేశపెడితే రెండవ సభ ఆరోపణలపై న్యాయాన్యాయ విచారణ చేస్తుంది. అత్యవసర పరిస్థితులలో పార్లమెంట్ మిలటరీ న్యాయస్థానాలను (Martial law courts) ఏర్పాటు చేసి సామాన్య పౌరులకు సంబంధించిన నేరాలను విచారణ జరిపించవచ్చు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో పార్లమెంట్‌కు సార్వభౌమాధికారం ఉండనే వాదన ఉంది.

### పార్లమెంట్ సంయుక్త సమావేశము

ఎన్నికల తరవాత కొత్త పార్లమెంట్ ఏర్పడగానే జరిగే మొదటి సమావేశం సంయుక్త సమావేశంగా ఉంటుంది. అంటే రాజ్యసభ లోక్ సభ సభ్యులంతా ఒకేచోట సమావేశమవుతారు. ఆ సమావేశానికి రాష్ట్రపతి హాజరై తన ప్రభుత్వ విధానాలను వివరిస్తాడు. ప్రతి సంవత్సరం మొదట్లో కూడా రాష్ట్రపతి ఇటువంటి సంయుక్త సమావేశం ఏర్పాటు చేస్తాడు. విదేశీ ప్రముఖులుగాని, రాష్ట్రపతిగాని పార్లమెంట్ నుద్దేశించి ప్రసంగించ తలచినా, ఆర్థిక బిల్లులు, మినహా ఇతర బిల్లుల విషయంలో ఉభయ సభల మధ్య అభిప్రాయ భేదాలు వచ్చినా లేదా ఒక సభ ఆమోదించిన సాధారణ బిల్లును రెండవ సభ 6 నెలలు

గడచినా చర్చించకపోయినా అధ్యక్షుడు సంయుక్త సమావేశం ఏర్పాటుచేయవచ్చు. బిల్లులపై సంయుక్త సమావేశంలో ఓటింగ్ జరిగితే ఆ సమావేశంలో లోక్ సభ సభ్యుల సంఖ్య అధికం కావడంవల్ల తుది నిర్ణయాల విషయంలో సామాన్యంగా ఆ సభదే పై చేయిగా ఉంటుంది.

## సుప్రీం కోర్టు
## (Supreme Court)

ఆధునిక నాగరక సమాజంలో న్యాయవ్యవస్థకు ప్రత్యేక స్థానముంది. అవినీతి అధికార దుర్వినియోగము, అన్యాయాలు, అక్రమాలు, దౌర్జన్యం, హింస వంటి చెడులను అరికట్టి సమాజాన్ని సన్మార్గంలో పెట్టడానికి, పౌరుల ధన, మాన ప్రాణాలకు రక్షణ చేకూర్చడానికి పటిష్టమైన న్యాయవ్యవస్థ అవసరము. న్యాయవ్యవస్థ రాజ్యాంగ సూత్రాలు సక్రమంగా అమలు జరిగేటట్టు చూడటం ద్వారా రాజ్యాంగాన్ని సంరక్షిస్తుంది. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు చేసే శాసనాల రాజ్యాంగ విహితత్వాన్ని పరిశీలించి రాజ్యాంగ విరుద్ధమైన వాటిని చెల్లవని కొట్టివేస్తుంది. శక్తివంతమైన, రాజ్యాంగబద్ధమైన, స్వతంత్ర ప్రతిపత్తిగల న్యాయవ్యవస్థ ప్రజాస్వామ్య విజయానికి బలమైన పునాది వేస్తుంది. పౌర హక్కులకు భద్రత చేకూరుస్తుంది. నియంతృత్వాన్ని నివారించి వ్యక్తియొక్క నైతిక, భౌతిక, రాజకీయ ప్రగతికి దోహదం చేస్తుంది. తనకు సక్రమంగా, సకాలంలో, నిష్పక్షపాతంగా న్యాయం జరుగుతుందని పౌరుడు భావించిన నాడే అతనికి రాజ్య వ్యవస్థపైన, ప్రభుత్వంపైన విశ్వాసం కలుగుతుంది. సమాఖ్య రాజ్య వ్యవస్థ సమర్థవంతంగా పనిచేయడానికి, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య సమన్వయం తేవడానికి కూడా స్వతంత్ర ప్రతిపత్తిగల న్యాయవ్యవస్థ అవసరము. ఈ లక్ష్యాలు దృష్టిలో ఉంచుకొని భారత రాజ్యాంగ నిర్మాతలు మనదేశ న్యాయవ్యవస్థను తీర్చిదిద్దినారు. "ప్రపంచంలో ఏ దేశపు సుప్రీం కోర్టుకులేని అధికారాలు భారత సుప్రీం కోర్టుకు ఉన్నాయి" అని కీర్తిశేషులు, ప్రముఖ న్యాయవాది, రాజ్యాంగ ముసాయిదా కమిటీ సభ్యులు అయిన శ్రీ అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ అభిప్రాయపడినారు.

### న్యాయమూర్తుల నియామకము

రాజ్యాంగంలోని 124వ నిబంధన ప్రకారం మన దేశానికి ఒక ప్రధాన న్యాయమూర్తి 7 ఇతర న్యాయమూర్తులతో భారత ఉన్నత న్యాయస్థానం ఏర్పాటు చేయబడింది. దానిని సుప్రీం కోర్ట్ అంటారు. 1956కు ముందు దీనిలో 7 గురు న్యాయమూర్తులు ఉండేవారు. తరవాత వీరి సంఖ్య 10 కి పెంచినారు. 1960 లో 13 కు, ఆ తరవాత 14 కు పెంచినారు. డిసెంబర్ 1977 నుంచి వీరి సంఖ్య 17 కి పెంచడం జరిగింది. అవసరాన్నిబట్టి న్యాయమూర్తుల సంఖ్యను పెంచే అధికారం పార్లమెంట్‌కు ఉంది. పదవీ విరమణ చేసిన న్యాయమూర్తులను దీనిలో అవసరమైతే న్యాయమూర్తులుగా నియమించవచ్చు.

### అర్హతలు

సుప్రీమ్‌కోర్ట్ ప్రధాన న్యాయమూర్తిని పదవీ విరమణచేస్తున్న ప్రధాన న్యాయమూర్తి

సలహా ప్రకారం రాష్ట్రపతి నియమిస్తాడు. ఇతర న్యాయమూర్తుల నియామకం విషయంలో అతడు ప్రధాన న్యాయమూర్తిని, ఇతర న్యాయమూర్తులను సంప్రదిస్తాడు. సుప్రీమ్ కోర్టు న్యాయమూర్తిగా నియమించబడటానికి ఈ క్రింది అర్హతలు కావలె :

1. భారతీయ పౌరుడై ఉండవలె.

2. హైకోర్టులో 5 సం॥ న్యాయమూర్తిగా పనిచేసి ఉండవలె లేదా సుప్రీమ్ కోర్టులో కాని హైకోర్టులోగాని 10 సం॥ న్యాయవాదిగా పనిచేసి ఉండవలె. ట్రిబ్యునల్స్‌లోను, ప్రభుత్వ న్యాయశాఖలోను గల అనుభవం కూడా ఈ విషయంలో లెక్కలోకి తీసుకొంటారు.

3. రాష్ట్రపతి దృష్టిలో ప్రజ్ఞావంతుడై ప్రముఖ న్యాయ శాస్త్రవేత్త అయి ఉండవలె.

## పదవీకాలము - అభిశంసన

న్యాయమూర్తులు 65 సం॥ వయసు నిండేవరకు పదవిలో ఉంటారు. తమ పదవీకాలం ముగియక ముందే పదవికి రాజీనామా ఇవ్వవచ్చు. లేదా పార్లమెంట్ అభిశంసన తీర్మానం ఆమోదిస్తే రాష్ట్రపతి వారిని పదవినుంచి తొలిగిస్తాడు. న్యాయమూర్తిపై ప్రవేశపెట్టిన ఆరోపణ తీర్మానాన్ని ఒక సభ అత్యధిక మెజారిటీతో ఆమోదిస్తే, రెండవ సభ దానిపై నేర విచారణ జరుపుతుంది. న్యాయమూర్తి అవినీతికి పాల్పడినాడనిగాని, ప్రవర్తన సరిగా లేదనిగాని, అధికారం దుర్వినియోగం చేసినాడనిగాని, అసమర్థుడుగా మారినాడనిగాని విచారణలో రుజువైతే, ఆ తీర్మానాన్ని ఆనాడు సభకు హాజరైనవారిలో 2/3 వంతు సభ్యులు ఆమోదిస్తే రాష్ట్రపతి ఆ న్యాయమూర్తిని పదవినుంచి తొలిగిస్తాడు.

## వేతనాలు - సర్వీస్ నిబంధనలు - స్వతంత్ర ప్రతిపత్తి

ప్రధాన న్యాయమూర్తికి నెలకు 5000/- రు. వేతనము, ఇతర న్యాయమూర్తులకు నెలకు రు. 4000/- వేతనము రాజ్యాంగం నిర్ణయించింది. వారికి సర్వ సౌకర్యాలతో ఉచిత నివాసగృహం ఇస్తారు. వీరి వేతనాన్ని భారత సంఘటిత నిధినుంచి ఇస్తారు. కాబట్టి దానిపై పార్లమెంట్‌కు అదుపులేదు. వాటినిగురించి పార్లమెంట్ చర్చించకూడదు. వారి పదవీకాలంలో వారి వేతనాలలో మార్పులు చేయరాదు. వారి పని షరతులను (Conditions of service) వారి పదవీ కాలంలో వారికి అసౌకర్యాలు కలిగేటట్లు మార్చకూడదు. న్యాయమూర్తులు తమ పదవీ విరమణ తరవాత ఆదాయాన్నిచ్చే ప్రభుత్వోద్యోగంలో చేరకూడదు. ప్రాక్టీస్ చేయకూడదు. అయితే వారిని విచారణా సంఘాలకు, ట్రిబ్యునల్స్‌కు, కమిషన్లకు అధిపతులుగా నియమించవచ్చు. దేశంలో ఆర్థిక అత్యవసర పరిస్థితి ప్రకటించినప్పుడు మాత్రమే వీరి వేతనాలు సవరించడానికి వీలవుతుంది.

న్యాయమూర్తులను తొలిగించడంలో రాష్ట్రపతి అశక్తత ఎటువంటిదో మనం ఇంతకు ముందే తెలుసుకొన్నాము. శాసన సభలలోను, సమావేశాలలోను, ఇతరత్రాను న్యాయమూర్తుల తీర్పులనుగురించి, వారు తమ విధి నిర్వహణలో చేసిన నిర్ణయాలగురించి ఎవరూ ఏ విధమైన ఆరోపణలు, విమర్శలు, చర్చలు జరపకూడదు. వారి తీర్పులను ప్రభావితం చేయడానికి ఎటువంటి ప్రయత్నాలూ చేయకూడదు.

న్యాయమూర్తులు పదవిలో చేరేముందు తాము నిష్పక్షపాతంగా, నిర్భయంగా, అవి

నీతికి లోనుకాకుండా, నిజాయతీతోను, మంచి మనసుతోను తమ విధులు నిర్వహిస్తామని, రాజ్యాంగాన్ని కాపాడతామని రాష్ట్రపతి సమక్షంలో ప్రమాణం చేయవలె. రాజ్యాంగం తీసుకొన్న పై చర్యలవల్ల భారతదేశంలో న్యాయవ్యవస్థ యొక్క స్వతంత్ర ప్రతిపత్తి కాపాడబడింది.

భారత సుప్రీమ్‌కోర్ట్ ఢిల్లీలో ఉంది. రాష్ట్రపతి అనుమతితో ప్రధాన న్యాయమూర్తి దానిని ఏ రాష్ట్ర రాజధానికైనా మార్చవచ్చు. రాజ్యాంగంలోని 143 వ నిబంధన ప్రకారం రాజ్యాంగానికి సంబంధించిన వివాదాలను 5గురు న్యాయమూర్తులు గల "ధర్మాసనం" (Bench of Judges) విచారిస్తుంది. 42 వ రాజ్యాంగ సవరణ ధర్మాసనంలో ఉండవలసిన న్యాయమూర్తుల సంఖ్యను 7 కు పెంచింది. వీరు తమ తీర్పులను 2/3 వంతు మెజారిటీతో ప్రకటించవలె సుప్రీమ్ కోర్ట్ ఎప్పుడైనా ఏదైనా వివాదాన్ని విచారించవలసి వచ్చినప్పుడు న్యాయమూర్తుల "కోరం సంఖ్య" (Quorum) తగ్గినప్పుడు తాత్కాలిక న్యాయమూర్తులను (Ad hoc judges) నియమిస్తారు.

## సుప్రీమ్ కోర్ట్ అధికారాలు

సుప్రీమ్ కోర్ట్ అధికారాలను ఐదు భాగాలుగా వర్గీకరించవచ్చు: (1) ఒరిజినల్ విచారణ పరిధి (Original Jurisdiction) (2) అప్పీళ్ళ విచారణ పరిధి (Appellate Jurisdiction) (3) సలహా సూచక అధికారం పరిధి (Advisory Jurisdiction) (4) కోర్ట్ ఆఫ్ రికార్డ్ (Court of Record) (5) ఇతర అధికారాలు.

1. *ఒరిజినల్ అధికార పరిధి (Original Juri·dic ton)*: సుప్రీమ్ కోర్ట్‌కు ఈ క్రింది కేసుల విషయంలో ఒరిజినల్ అధికారాలు ఉన్నాయి. (1) భారత ప్రభుత్వానికి, ఒకటి లేదా అంతకుమించి రాష్ట్ర ప్రభుత్వాలకు మధ్య వచ్చిన వివాదాలు (2) రాష్ట్రాల మధ్య వచ్చిన వివాదాలు (3) భారత ప్రభుత్వము, ఒకటి లేదా అంతకంటె ఎక్కువ రాష్ట్ర ప్రభుత్వాలు ఒక పక్షంగాను మరొకవైపు ఒకటి లేదా అంతకంటె ఎక్కువ రాష్ట్రాలు వేరొక పక్షంగాను ఉండగా ఏర్పడిన వివాదాలు. (4) 32 వ నిబంధన ప్రకారం రాజ్యాంగంలో సూచించిన ప్రాథమిక హక్కులను అమలు పరచడంలో తలెత్తిన వివాదాలు పరిష్కరించడానికి హైకోర్ట్‌లతో పాటు సుప్రీమ్‌కోర్ట్‌కు కూడా ఒరిజినల్ అధికారాలున్నాయి. (5) ఒక వ్యక్తి తన ప్రాథమిక హక్కులకు భంగం వాటిల్లిందని సుప్రీమ్ కోర్ట్‌కు నేరుగా ఫిర్యాదు చేసుకొన్నప్పుడు, వాటి రక్షణకు హెబియస్ కార్పస్, మాండమస్, సెర్షియోరారి, ఇంజంక్షన్ కోవారంటో, ప్రొహిబిషన్ వంటి ప్రత్యేక "రిట్లు" (Writs) జారీచేయడానికి దీనికి ఒరిజినల్ అధికారాలున్నాయి.

2. *అప్పీళ్ళ విచారణా పరిధి (Appellate jurisdiction)*: రాష్ట్రాలలోని హైకోర్ట్‌లు ఇచ్చిన తీర్పులపై సుప్రీమ్ కోర్ట్‌కు అప్పీలు చేసుకొవచ్చు. అటువంటి అప్పీళ్ళకు హైకోర్ట్ అనుమతి ఉండవలె. ఆతీర్పులో రాజ్యాంగాన్ని వ్యాఖ్యానించడానికి సంబంధించిన అంశంగాని, అర్థవివరణ చెప్పవలసిన అంశంగాని ఇమిడి ఉంటే హైకోర్ట్ సుప్రీమ్ కోర్ట్‌కు అప్పీలు చేసుకోడానికి తప్పక సర్టిఫికేట్ ఇస్తుంది. సివిల్ కేసుల విషయంలో అయితే కేసు విలువ కనీసం రు. 20,000/- ఉన్నా, లేదా ఒక ముఖ్యమైన న్యాయ విషయం దానిలో

ఇమిడిఉన్నా అటువంటి కేసులకు మాత్రమే సుప్రీమ్ కోర్ట్‌కు అప్పీలు చేసుకోవడానికి హైకోర్ట్ అనుమతి ఇస్తుంది.

సుప్రీమ్ కోర్ట్‌కు వచ్చే అప్పీళ్ళను నాలుగు రకాలుగా వర్గీకరించ వచ్చు. అవి : (1) రాజ్యాంగ సంబంధమైన అప్పీళ్ళు (2) క్రిమినల్ అప్పీళ్ళు (3) సివిల్ అప్పీళ్ళు (4) స్పెషల్ అప్పీళ్ళు. సుప్రీమ్ కోర్ట్‌కు కేంద్ర జాబితాలోని అన్ని అంశాలపైన అధికార ముంది. 42వ రాజ్యాంగ సవరణ కేంద్ర శాసనాలను హైకోర్ట్ రాజ్యాంగ విరుద్ధమని ప్రకటించరాదని తీర్మానించింది.

3. *సలహారూపక అధికార పరిధి* : పార్లమెంట్ చేయబోయే శాసనం విషయంలో గాని ఇతర విషయాలలో గాని న్యాయసంబంధమైన అంశం ఇమిడి ఉందని భావిస్తే సుప్రీమ్ కోర్ట్ సలహా కోరవచ్చు. విదేశాలతో భారత ప్రభుత్వం చేసుకొన్న ఒప్పందాలపై అర్థవివరణ చెప్పమని రాష్ట్రపతి సుప్రీమ్ కోర్ట్‌ను కోరవచ్చు. ఆగస్టు 3, 1978 న రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి, అత్యవసర పరిస్థితికి సంబంధించిన కేసులపై న్యాయ విచారణ జరపడానికి ప్రత్యేక న్యాయస్థానాలు ఏర్పాటు చేయవచ్చా? లేదా? అనే విషయంపై సుప్రీమ్ కోర్ట్ సలహా కోరగా, సుప్రీమ్ కోర్ట్ సెప్టెంబర్ 12, 1978 న 5 గురు న్యాయమూర్తులతో ఒక ధర్మాసనాన్ని ఏర్పాటుచేసి అటువంటి న్యాయస్థానాల ఏర్పాటు చట్ట బద్ధమేనని చెప్పింది.

4. *కోర్ట్ ఆఫ్ రికార్డ్* (*Court of record*) : సుప్రీమ్‌కోర్ట్ వివిధ కేసులపై ఇచ్చిన తీర్పులను, వాటికి సంబంధించిన రికార్డులను అచ్చువేయించి భద్రపరుస్తుంది. ఆ తీర్పులు, వాటిలోని న్యాయ సూత్రాలు దేశంలోని ఇతర కోర్ట్‌లకు మార్గదర్శక మవుతాయి. న్యాయ విచారణలో వాటిని ఉదహరిస్తే దిగువ కోర్ట్‌లు వాటిని ఆమోదించి తీరవలె. ఎందుచేత నంటే సుప్రీమ్‌కోర్ట్ తీర్పుకు తిరుగు లేదు. దాని నిబంధనావళిని ఉల్లంఘిస్తే కోర్ట్ ధిక్కారణ (**Contempt of court**) నేరం కింద శిక్షించ బడతారు. సుప్రీమ్‌కోర్ట్ తన తీర్పులను తాను పునః పరిశీలించవచ్చు.

5. *ఇతర అధికారాలు* : సుప్రీమ్‌కోర్ట్ పనిచేయడానికి కావలసిన నియమ నిబంధనలను తాను స్వయంగా రూపొందించు కొంటుంది. దానిలో పనిచేసే సిబ్బందిపై దానికి పూర్తి అదుపు ఉంటుంది. ఈ విషయాలన్నిటిని ప్రధాన న్యాయమూర్తి చూసుకొంటారు.

**ప్రత్యేక అనుమతి (Special leave)** 

ఏదైనా అప్పీలులో హైకోర్ట్ సర్టిఫికెట్ ఇవ్వడానికి నిరాకరిస్తే ఆ కేసుపై చేసిన అప్పీలును ప్రత్యేక పరిస్థితులలో సుప్రీమ్‌కోర్ట్ స్వీకరించవచ్చు. సామాన్యంగా కేసు ఆసక్తి కరమైనది అయితే ఆవిధంగా చేస్తుంది. ఇది తరచు సివిల్, రాజ్యాంగ పరమైన అప్పీళ్ళ విషయంలో జరుగుతుంది. క్రిమినల్ కేసులలో తక్కువ. 

**న్యాయసమీక్ష (Judicial Review)** 

ప్రజాస్వామిక రాజ్యాలలో రాజ్యాంగాన్ని కాపాడే బాధ్యత ఉన్నత న్యాయస్థానాలపై ఉంది. భారత సుప్రీమ్‌కోర్ట్ రాజ్యాంగ సంరక్షకంగా రాజ్యాంగానికి అర్థ వివరణ చెబుతుంది. రాజ్యాంగములో ప్రకరణముల విషయాలు గల సందేహాలను, అర్థ వివరణలను సుప్రీం కోర్ట్ సంపూర్ణంగా చర్చించి, సముచిత నిర్ణయాలు చేస్తుంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేసిన

శాసనాలు రాజ్యాంగ విరుద్ధంగా ఉంటే అవి రాజ్యాంగ విరుద్ధము (Ultra vires=against constitution కాబట్టి అవి చెల్లవు (Null and void) అని ప్రకటిస్తుంది. దీనిని న్యాయ సమీక్ష (Judicial Review) అంటారు.

## పబ్లిక్ సర్వీస్‌లు
(Public Services)

### పబ్లిక్ సర్వీస్‌ల ప్రాముఖ్యము

గడచిన అధ్యాయాలలో మన సివిల్ సర్వీస్‌లను గురించి కొన్ని విషయాలు తెలుసు కొన్నాము. ఈ అధ్యాయంలో వాటికి సంబంధించిన మరికొన్ని విషయాలు తెలుసు కొందాము.

ఏ దేశంలోనైనా ప్రభుత్వ శక్తి సామర్థ్యాలు ఆ దేశ పరిపాలనను నిర్వహించే సివిల్ సర్వీస్ ఉద్యోగుల నీతి, నిజాయతీ, నైపుణ్యము, శక్తిసామర్థ్యాలు మొదలైన అంశాలపై ఆధారపడి ఉంటుంది. నేడు ప్రభుత్వాలు అనేక కార్యక్రమాలు నిర్వహిస్తున్నాయి. వాటిని విజయవంతంగా అమలుపరచి, ప్రభుత్వలక్ష్యాలు సాధించవలెనంటే సమర్థులైన సివిల్ సర్వీస్ ఉద్యోగులు అవసరము. పూర్వపు పోలీస్ రాజ్యాలలో కంటె నేటి శ్రేయోరాజ్యాలలో వీరి విధులు ద్విగుణీకృతమైనాయి. శ్రేయోరాజ్య ఆదర్శాలు నెరవేరవలెనంటే ప్రతి ఉద్యోగి తన బాధ్యతలు గుర్తించి కష్టపడి పని చేయవలె.

మానవుని వలె రాజ్యాలు కూడా నేడు సంఘజీవులుగా మారినాయి. ఆధునిక పోటీ ప్రపంచంలో అవి తమ అస్తిత్వాన్ని కాపాడుకోవలెనంటే అంతర్జాతీయ స్నేహ సహకారాలు వర్తకవాణిజ్యాలు అభివృద్ధి చేసుకోవలె. దీనికి ప్రత్యేక శిక్షణగల సివిల్ సర్వీస్ ఉద్యోగులు అవసరము.

పరోక్ష ప్రజాస్వామ్యాలలో ప్రజాప్రతినిధులు పేరుకు మాత్రమే పాలకులు. వారు, రాజకీయ దురంధరులేగాని పరిపాలన నిపుణులు కారు. వారు ప్రజల నాడి గ్రహించి ప్రజాభిప్రాయాన్ని, ఆలోచనలను సివిల్ సర్వీస్ ఉద్యోగుల దృష్టికి తెస్తే వారు వాటిని ఆచరణాత్మకమైన పాలనా విధానాలుగా మలుస్తారు. వాటిని అమలుపరచి ఫలితాలు సాధిస్తారు.

వివిధ రంగాలలో నిపుణులైన సివిల్ సర్వీస్ ఉద్యోగులు మంత్రులకు సలహాలిచ్చి పరిపాలన క్రమబద్ధంగా జరగడానికి తోడ్పడతారు. ప్రజాస్వామ్యాలలో మంత్రివర్గాలు అస్థిరంగా ఉంటాయి. శాఖలకు ఆధిపత్యం వహించే మంత్రులు మారినా, అధికార పక్షం మారినా దాని ప్రభావం పరిపాలన మీద గణనీయంగా లేకుండా చూసి, పరిపాలన స్థిరంగా, ఎటువంటి ఒడుదుడుకులు లేకుండా సాఫీగా జరిగేటట్లు చూసే బాధ్యత శాశ్వత ప్రభుత్వోద్యోగులదే.

సివిల్ సర్వీస్ ఉద్యోగులు తమ విధి నిర్వహణలో రాజకీయాలకు అతీతంగా వ్యవహరించవలె. అధికార పక్షం నిర్ణయాలు నిష్పక్షపాతంగా అమలు పరచవలె. ప్రభుత్వానికి విశ్వాసపాత్రులై కష్టించి పనిచేయవలె ప్రతి ఉద్యోగి దేశ శ్రేయస్సు, సంఘాభ్యుదయం తన ప్రాథమిక లక్ష్యంగా పెట్టుకొని పనిచేస్తే దేశం అగ్రరాజ్యంగా మారుతుంది.

### ఇండియాలో సివిల్ సర్వీస్‌ల అభివృద్ధి

ఇండియాలో క్రమబద్ధమైన, ఆధునిక సివిల్ సర్వీస్‌లు బ్రిటిష్ వారి పాలనా

కాలంలో వెలుగులోకి వచ్చినాయి. ఆంగ్లేయులు ఈస్టిండియా కంపెనీ వ్యవహారాలు నిర్వహించడానికి ఫాక్టర్లు (Factors), రైటర్లు (Writers) అనే ఉద్యోగులను నియమించినారు. క్రమేణ ఉద్యోగుల నియామకానికి అర్హతలు, వయో పరిమితి, మొదలైనవి నిర్ణయించినారు. శాస్త్రీయమైన ప్రాతిపదికపై సివిల్ సర్వీస్‌ల నిర్మాణము కొంతవరకు కారన్‌వాలీస్ గవర్నర్ జనరల్‌గా ఉండగా జరిగింది. 1793 లో కవనెంటెడ్ సర్వీస్‌లు (Covenanted services) ప్రారంభించినారు. మన దేశంలో గుర్తింపు పొందిన మొట్ట మొదటి సివిల్ సర్వీస్‌లు ఇవేనని చెప్పవచ్చు. 1855 లో ఇండియాలో పని చేయడానికి కావలసిన ఉన్నతాధికారులను నియమించడానికి ఇంగ్లండ్‌లో ఒక సివిల్ సర్వీస్ కమిషన్ ఏర్పాటు చేసినారు. 1861 లో ప్రవేశపెట్టిన ఇండియన్ సివిల్ సర్వీస్ చట్టము (Indian Civil Service Act) అంతకుముందు అమలులో ఉన్న "కవనెంటెడ్ సివిల్ సర్వీస్‌లను", తదితర సివిల్ సర్వీస్‌లకు చెందిన ఉద్యోగుల నియామకాలను ధృవపరచింది. భవిష్యత్తులో నియమింపబడే ఉద్యోగు లందరు ఇంగ్లండ్‌లో నిర్వహించే పోటీ పరీక్షలలో కూర్చొని ఉత్తీర్ణులు కావలెనని తీర్మానించింది. లండన్‌లోని సివిల్ సర్వీస్ కమిషనర్లు ఈ పరీక్షలు నిర్వహించేవారు.

ఈ చట్టంవల్ల భారతీయులకు ఎటువంటి ప్రయోజనం చేకూరలేదు. 1870 నాటికి ఒకే ఒక భారతీయుడు పోటీ పరీక్షలలో కృతార్థుడయినాడు. తరవాత 1870 లో మరొక సివిల్ సర్వీస్ చట్టం ప్రవేశపెట్టబడింది. దాని ప్రకారం పోటీ పరీక్షలతో నిమిత్తం లేకుండా, సివిల్ సర్వీస్ అధికారులను నియమించడానికి గవర్నర్ జనరల్‌కు అధికారం లభించింది. కాని దీనివల్ల కూడా భారతీయులకు పెద్ద ప్రయోజనం చేకూరలేదు.

1885 లో ఏర్పాటైన భారత జాతీయ కాంగ్రెస్ కృషి ఫలితంగా 1893 బ్రిటిష్ పార్లమెంట్ చట్టం రూపొందించినారు. అది పోటీ పరీక్షలు ఇండియాలోనే నిర్వహించడానికి ఏర్పాట్లు చేసింది. ఆ తరవాత ఇండియాలోని సివిల్‌సర్వీస్‌ల నిర్మాణంలోను, అవి పనిచేస్తున్న తీరుతెన్నులలోను సంస్కరణలు ప్రవేశపెట్టడానికి 1912 లో "ఇలింగ్‌టన్ కమీషన్" (Islington commission), 1923 లో "లీ కమీషన్" (Lee commission) లను నియమించినారు, వాటి సిఫార్సుల ప్రకారం 1935 లో భారత ప్రభుత్వ చట్టంలో ఒక ఫెడరల్ సివిల్ సర్వీస్ కమీషన్ ఏర్పాటుచేసినారు. దీనివల్ల ప్రభుత్వోద్యోగాలలో భారతీయుల పరిస్థితి కొంతవరకు మెరుగయింది.

ఇంత జరిగినా 1947 లో స్వాతంత్ర్యం వచ్చేనాటికి ఉన్నత పదవులలో భారతీయు సంఖ్య అతి స్వల్పం మాత్రమే. 1950 లో అమలులోకి వచ్చిన నూతన రాజ్యాంగంలో, 307 వ నిబంధన నుంచి 319 వ నిబంధన వరకుగల వివిధ నిబంధనలు దేశంలో క్రమబద్ధమైన, స్థిరమైన పబ్లిక్ సర్వీస్‌లు నెలకొల్పడానికి కావలసిన చర్యలు తీసుకొన్నాయి.

## పబ్లిక్ సర్వీస్‌లలో రకాలు

ఇండియాలో పబ్లిక్ సర్వీస్‌ల వర్గీకరణ అశాస్త్రీయంగా ఉంది. వాటిని కచ్చితంగా వివరించడం కష్టము. అవి అనేక రకాలుగా ఉన్నాయి. వాటిలో ఈ కింది నాలుగు వర్గాలు ప్రధానమైనవి :

1. ఆలిండియా సర్వీస్‌లు (All India services)

2. కేంద్ర ప్రభుత్వ సర్వీస్‌లు (Central services)
3. కేంద్ర సచివాలయ సిబ్బంది సర్వీస్‌లు (Central Secretariat Services)
4. రాష్ట్ర ప్రభుత్వ సర్వీస్‌లు (State Services). వీటిని గూర్చి విపులంగా తెలుసుకొందాము.

1. *అలిండియా సర్వీస్‌లు లేదా అఖిల భారత సర్వీస్‌లు :* మన రాజ్యాంగంలో ప్రస్తావించిన అలిండియా సర్వీస్‌లు దేశ పరిపాలనా యంత్రాంగానికి ఇంధనం వంటివి. ఇండియాలో వీటి చరిత్ర 1854 లో టి. బి. మెకాలే చేసిన సిఫార్సుల ద్వారా మొదలైందని చెప్పవచ్చు. ఆనాడు ఇవి బ్రిటిష్ ప్రభుత్వానికి ఇనప చట్రం వలె పనిచేసినాయి. స్వాతంత్ర్యం వచ్చిన తరవాత నూతన రాజ్యాంగంలో కూడా ఇవి కొనసాగినాయి. ఈ సర్వీస్‌కు చెందిన ఉద్యోగులు దేశంలోని ఏ ప్రాంతంలోనైనా పనిచేయవలె. అందుకే వాటికా పేరు వచ్చింది.

దేశంలోని మేధావి వర్గం అలిండియా సర్వీస్ ఉద్యోగాలలోకి ఎంపిక అవుతారు. వీరిని జాతీయ ప్రాతిపదికపై జరిగే పోటీ పరీక్షల ద్వారా ఎన్నుకొంటారు. ఇటువంటి మేధావుల సేవలను యావత్ దేశము పొందే అవకాశ ముంటుంది. వీరు ఎటువంటి ప్రాంతీయ భేదాలు లేకుండా అన్ని ప్రాంతాలలో పని చేయడంవల్ల విభిన్న ప్రాంతాలకు చెందిన ప్రజలతో కలసి జీవించడంవల్ల, జాతీయ సమైక్యతా భావాన్ని పెంపొందించగలరు. రా ష్ట్ర ప్రభుత్వోద్యోగులలో ఉండే సంకుచిత దృక్పథం వీరిలో కనిపించదు. ఏదైనా ఒక రా ష్ట్రా నికి నిపుణులైన ఉద్యోగుల కొరత ఏర్పడితే అలిండియా సర్వీస్ ఉద్యోగులు ఆ లోటు పూరించగలరు. అత్యవసర పరిస్థితులలోను, రాష్ట్రాలలో రాష్ట్రపతి పరిపాలన ప్రవేశ పెట్టినప్పుడు రాష్ట్రాల పరిపాలనా భారాన్ని స్వీకరించడానికి వీరు సిద్ధంగా ఉంటారు. దేశం అంతా ఒకే విధమైన నైపుణ్యము, సామర్థ్యము గల పాలకులను నియమించడానికి కూడా ఈ సర్వీస్‌లు తోడ్పడతాయి.

అలిండియా సర్వీస్ ఉద్యోగులను తరచు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య బదిలీ చేస్తుంటారు. కాబట్టి వారు ఆ రెండు ప్రభుత్వాల మధ్య సమన్వయము, సామరస్యము తేగలరు. వీరిపై రాష్ట్ర ప్రభుత్వాల కంటె కేంద్ర ప్రభుత్వానికే ఎక్కువ అదుపు ఉంటుంది. కాబట్టి రాష్ట్ర స్థాయిలో వీరు ఎటువంటి రాజకీయ ఒత్తిడులకు లొంగక నిర్భయంగా నిష్పక్షపాతంగా విధులు నిర్వర్తించగలరు. అదే రాష్ట్ర ప్రభుత్వోద్యోగు లయితే ఆ విధంగా ఉండలేరు. ఈ సర్వీస్‌లకు చెందిన వారు తమ స్వంత రాష్ట్రంలోనేకాక పరాయి రాష్ట్రాలలో కూడా పని చేయవలసి ఉంటుంది. దీనివల్ల వారిపై స్థానిక ఒత్తిడుల ప్రభావము, ప్రాంతీయ దురభిమానము తక్కువగా ఉంటాయి.

అలిండియా సర్వీస్‌లు బ్రిటిష్ నిరంకుశ పరిపాలనా కాలంలో వెలుగులోకి వచ్చినవి కావడంవల్ల స్వతంత్ర్య భారతావనిలో వీటికి స్థానం ఉండకూడదు అనే విమర్శ ఉంది. కాని నేడు దేశ పరిపాలనలో ఈ ఉద్యోగుల పాత్ర ఎటువంటిదో మనందరికీ తెలిసిన విషయమే కాబట్టి ఈ విమర్శలో బలంలేదు. ఈ సర్వీస్‌లకు చెందిన వారు పరాయి రాష్ట్రాలలో పని చేస్తారు. వారికి ఆ ప్రాంతం గురించికాని, అక్కడి ప్రజల మనస్తత్వం, రాజకీయ చైతన్యము, స్థానిక భాష మొదలైన విషయాలను గూర్చి కాని తెలియదు. దీనివల్ల వారు స్థానిక సమస్యలు పరిష్కరించడంలో కృతకృత్యులు కాలేరని కొందరు అంటారు. కాని ఈ వాదంలో కూడా

నిజంలేదు. వీరి ఎంపిక, శిక్షణ ఒక విశిష్టమార్గంలో జరుగుతుంది. కాబట్టి వారు ఎటువంటి బరువు బాధ్యతలనైనా సులభంగా మోయగలరు. వారు నేడు తమ విధులు సంతృప్తికరంగా నిర్వహిస్తున్నారనేది నిర్వివాదాంశము.

ఆలిండియా సర్వీసులను మూడువర్గాలుగా (Categories) విభజించినారు. మొదటి వర్గంలో (Category I) ఐ. ఏ. ఎస్, ఐ. ఎఫ్. ఎస్. రెండో వర్గంలో (Category II) ఐ. పి. ఎస్, గ్రూప్ 'బి' పోలీస్ సర్వీస్‌లు, మూడో వర్గంలో (Category III) కేంద్ర ప్రభుత్వ సర్వీస్‌లకు చెందిన గ్రూప్ 'ఎ', గ్రూప్ 'బి' సర్వీస్‌లు ఉంటాయి. వీరిలో ఐ. ఎ. ఎస్. (ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీస్) ఐ. పి. ఎస్. (ఇండియన్ పోలీస్ సర్వీస్ ముఖ్యమైనవి).

ఒక రాష్ట్ర సర్వీస్‌ను ఆలిండియా సర్వీస్‌గా మార్చవలెనంటే రాష్ట్ర శాసన సభ అందుకు సంబంధించిన తీర్మానాన్ని 2/3 వంతు మెజారిటీతో ఆమోదించవలె. దానికి అధిక రాష్ట్రాల శాసన సభల ఆమోదం లభించవలె. తరవాత ఆ తీర్మానాన్ని రాజ్యసభ 2/3 వంతు మెజారిటీతో ఆమోదిస్తే వీటిలో మార్పు చేయవచ్చు.

1962 నుంచి ఇండియన్ సర్వీస్ ఆఫ్ ఇంజనీర్స్, ఇండియన్ ఫారెస్ట్ సర్వీస్ ఆలిండియా సర్వీస్‌లలో చేర్చినారు. ఇవి కాక ఇండియన్ ఎడ్యుకేషనల్ సర్వీస్, ఇండియన్ మెడికల్ సర్వీస్, ఇండియన్ జ్యుడిషియల్ సర్వీస్, ఇండియన్ అగ్రికల్చరల్ సర్వీస్, ఇండియన్ కమర్షియల్ సర్వీస్‌లను ఆలిండియా సర్వీస్‌లుగా మార్చవలెనని భావిస్తున్నారు. అయితే కొన్ని రాష్ట్రాలు దీనికి విముఖంగా ఉన్నాయి.

## ఆలిండియా సర్వీస్‌లు. కేంద్ర ప్రభుత్వోద్యోగుల భర్తీ

ఆలిండియా సర్వీస్‌లు, కేంద్ర ప్రభుత్వ సర్వీస్‌లు, కేంద్ర సచివాలయ సిబ్బందిని భర్తీచేయడానికి యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ దేశంలోని ప్రధాన నగరాలన్నిటిలోను బహిరంగ పోటీపరీక్షలు నిర్వహిస్తుంది. ఈ పరీక్షకేంద్రాలు బ్రిటన్, నేపాల్, భూటాన్‌లలో కూడా ఉన్నాయి. దాదాపు 26 కేంద్రాలలో ఈ పరీక్షలు నిర్వహిస్తారు. ఈ పోటీ పరీక్షలలో కూర్చునేవారికి కనీస వయోపరిమితి 21 స॥ ఉండవలె. గరిష్టవయోపరిమితి 26 సంవత్సరాలు. పరీక్ష వ్రాయడానికి ప్రథమ శ్రేణిలో ఉ త్తీర్ణులైన పట్టభద్రులు కాని, లేదా ద్వితీయ శ్రేణిలో ఉత్తమస్థాయి మార్కులతో ఉత్తీర్ణుడైన గ్రాడ్యుయేట్ పట్టభద్రుడు కాని అయి ఉండవలె. పరీక్షస్థాయి పోస్ట్ గ్రాడ్యుయేట్ తరగతి స్థాయిలో ఉంటుంది. పరీక్ష రెండు భాగాలలో జరుగుతుంది.

(ఎ) *లిఖిత పరీక్ష (Written Test)*: దీనిలో (1) ఇంగ్లీష్ (2) వ్యాసరచన (3) ప్రపంచ జ్ఞానము (General Knowledge) తప్పని సరిగా వ్రాయవలసిన పేపర్లు ఉంటాయి. ఐ. ఏ. ఎస్. ఐ. ఎఫ్. ఎస్. (I. F. S.) వారికి మూడు ఐచ్ఛిక పత్రాలు (Optional papers) ఉంటాయి. ఈ ఆరు పేపర్లుకాక మరి రెండు అదనపు ఐచ్ఛిక పత్రాలు (Additional optional papers) ఉంటాయి. ఐ. పి. ఎస్ (I. P. S.) వారికి రెండు ఐచ్ఛిక పత్రాలు మాత్రమే ఉంటాయి. అదనపు ఐచ్ఛిక పత్రాలు ఉండవు. అంటే వారికి మొత్తం పేపర్ల సంఖ్య ఐదు మాత్రమే.

**(బి) *ఇంటర్వ్యూ లేదా మౌఖికపరీక్ష (Interview or oral test)*** : లిఖిత

పరీక్షలో 50% మార్కులు వచ్చిన వారికి ఇంటర్‌వ్యూ నిర్వహిస్తారు. రెండింటిలో వచ్చిన మార్కులను బట్టి తుది ఎంపిక చేసి, ఉత్తీర్ణులయిన అభ్యర్థుల పేర్లు ప్రభుత్వ గెజిట్ లోను, వార్తా పత్రికలలోను ప్రకటిస్తారు.

కొఠారి కమిషన్ నివేదిక ననుసరించి 1979 నుంచి ఆలిండియా సర్వీస్‌ల పరీక్షా విధానంలో మార్పులు తేనున్నట్లు 19-11-1978 న కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. ఆ ప్రకటన ప్రకారం ఐ ఏ. ఎస్, ఐ. పి. ఎస్; గ్రూప్ 'బి' పోలీస్ సర్వీస్‌లు, గ్రూప్ 'ఎ', 'బి' కేంద్ర ప్రభుత్వ సర్వీస్‌లకు ఉమ్మడి పరీక్షలు ఉంటాయి. పరీక్షలు ఇంగ్లీష్‌తో పాటు 8 వ షెడ్యూల్‌లోని అన్ని భాషలలో వ్రాయవచ్చు అని అన్నారు. అయితే తరవాత సవరణలో ఇంగ్లీష్, హిందీ భాషలలో మాత్రమే వ్రాయవలెఅన్నారు. ఇది అన్యభాషల వారికి అన్యాయం చేసినట్లు అవుతుంది. పరీక్ష రెండుభాగాలుగా ఉంటుంది :

(ఎ) *ప్రాథమిక పరీక్ష (Objective test)* (బి) *ముఖ్య పరీక్ష.*

(ఎ) *ప్రాథమిక పరీక్ష* : ప్రాథమిక పరీక్షలో రెండు పేపర్లు ఉంటాయి. (1) ప్రపంచ జ్ఞానము (General Education or general studies) (2) ఐచ్ఛిక పాఠ్యాంశాలకు సంబంధించి ఒక పేపరు.

(బి) ***ముఖ్యపరీక్ష*** : ఇది రెండు భాగాలుగా ఉంటుంది. (1) లిఖితభాగం (2) మౌఖిక భాగం. ప్రాథమిక పరీక్షలో ఉత్తీర్ణులైన వారిని మాత్రమే ముఖ్యపరీక్షకు కూర్చోనిస్తారు. ప్రతి సంవత్సరం అటువంటివారు సుమారు 6,000 మంది ఉంటారని అంచనా వేయబడింది. దీనిలోని లిఖితభాగంగా 4 పేపర్లు ఉంటాయి. అవి (అ) జనరల్ స్టడీస్ (General studies) (ఆ) జనరల్ ఇంగ్లీష్ (General English) (ఇ) మొదటి ఐచ్ఛిక పత్రము (I Optional) (ఈ) రెండో ఐచ్ఛిక పత్రము (II Optional.) వీటిలో 50% మార్కులతో ఉత్తీర్ణులయిన వారిని ఇంటర్‌వ్యూకు పిలుస్తారు.

ముఖ్యపరీక్ష వ్రాయడానికి కనీసం పట్ట భద్రుడై ఉండవలె. గ్రాడ్యుయేట్ తరగతిలో చివరి సంవత్సరంలో ఉన్నవారు కూడా పరీక్ష వ్రాయవచ్చు. పరీక్షకు హాజరు కావడానికి గరిష్ఠ వయోపరిమితి 26 సంవత్సరాలనుంచి 28 సం॥ కు పెంచినారు. ఈ పరీక్షలు మూడు అవకాశాలలో (3 attempts) ఉత్తీర్ణులుకావలె. షెడ్యూల్‌కులాలు, తరగతులవారు మాత్రం నిర్ణీత వయోపరిమితి లోగా ఎన్ని పర్యాయాలైనా వ్రాయవచ్చును.

ఈ పోటీ పరీక్షలలో ఉత్తీర్ణులైన వారికి ముస్సోరీ (Mussoorie) లో గల 'లాల్ బహదూర్ శాస్త్రీ జాతీయ పరిపాలనా అకాడమి" (Lal Bahadur Sastri National Academy of Administration) లో ఒక సంవత్సరం పాటు శిక్షణ ఇస్తారు. ఈ శిక్షణే గాక వారు సచివాలయంలోను, ఇతర శిక్షణాలయాలలోను కూడా శిక్షణ పొందుతారు. శిక్షణ పూర్తి అయినాక పరీక్ష జరిపి వారిని ప్రభుత్వ విభాగాలలో నియమిస్తారు. ఇండియన్ పోలీస్ సర్వీస్ ఉద్యోగులకు పూర్వం మౌంట్ అబు (Mount Abu) లోని పోలీస్ శిక్షణాలయంలో శిక్షణ ఇచ్చేవారు. ప్రస్తుతం ఈ శిక్షణాలయాన్ని హైదరాబాద్‌కు తరలించినారు. దీని పేరు సర్దార్ వల్లభాయి పటేలు పోలీస్ ట్రైనింగ్ కళాశాలగా మార్చినారు.

2. *కేంద్ర ప్రభుత్వ సర్వీస్‌లు* : కేంద్ర ప్రభుత్వ సర్వీస్‌లలో పనిచేసే ఉద్యోగులు కేంద్రప్రభుత్వ పాలనా శాఖలలో పనిచేస్తారు. కేంద్రప్రభుత్వ సర్వీస్‌లు అనేక రకాలు.

వీటిని తిరిగి గ్రూప్‌లుగా విభజించినారు, ఈ సర్వీస్‌లు 1974 కు ముందు 4 తరగతులుగా విభజింపబడి ఉన్నాయి. వాటిని క్లాస్ I, II, III, IV అని పిలిచేవారు. 1974 తరవాత వీటిని గ్రూప్ 'ఏ. బి, సి,డి' అనే పేరుతో పిలుస్తున్నారు. గ్రూప్ 'ఏ' కేంద్ర ప్రభుత్వ సర్వీస్‌లు ప్రస్తుతం 33 ఉన్నాయి. గ్రూప్ 'బి' సర్వీస్‌లు 25 ఉన్నాయి. వాటిలో ఈ కింది సర్వీసులు ముఖ్యమైనవి :

*గ్రూప్ 'ఏ' సర్వీసులు :* (1) ఇండియన్ ఫారిన్ సర్వీస్ (2) ఇండియన్ ఆడిట్ అండ్ అక్కౌంట్ సర్వీస్ (3) ఇండియన్ డిఫెన్స్ అక్కౌంట్ల సర్వీస్ (4) ఇండియన్ కస్టమ్స్ సర్వీస్ (5) ఇండియన్ పోస్టల్ సర్వీస్ (6) ఇండియన్ ఇన్‌కమ్‌టాక్స్ సర్వీస్ మొదలైనవి.

*గ్రూప్ 'బి' కేంద్ర ప్రభుత్వ సర్వీస్‌లు :* (1) పోస్ట్‌మాస్టర్స్ సర్వీస్ (2) లేబర్ ఆఫీసర్స్ సర్వీస్ (3) సెంట్రల్ హెల్త్ సర్వీస్ మొదలైనవి.

వీరంతా కేంద్ర ప్రభుత్వ పాలనా శాఖలలో పనిచేస్తూ కేంద్ర ప్రభుత్వ పాలనా యంత్రాంగాన్ని నడిపిస్తారు. వీరిని కూడా యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ నిర్వహించే పోటీ పరీక్షల ద్వారా ఎంపిక చేస్తారు.

3. *కేంద్ర సచివాలయ సిబ్బంది సర్వీస్‌లు* (Central Secretariat services : ఆలిండియా సర్వీస్‌లు, కేంద్రప్రభుత్వ సర్వీస్‌లు కాక కేంద్రప్రభుత్వానికి సంబంధించిన కేంద్ర సచివాలయంలో పనిచేసే ఉన్నతోద్యోగులను కేంద్ర సచివాలయ సిబ్బంది అంటారు. వీరిని స్వాతంత్ర్యానికి పూర్వం ఇంపీరియల్ సెక్రటేరియట్ సర్వీస్‌లు (Imperial Secretariat Services) అని పిలిచేవారు. 1950 నుంచి ఈ సిబ్బంది పేరు కేంద్ర సచివాలయ సిబ్బందిగా మార్చబడింది. వీరిని యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ పోటీ పరీక్షల ద్వారా కొందరిని కింది గ్రేడులనుంచి, పదోన్నతిద్వారా కొందరిని ఎంపిక చేస్తారు. ఈ సిబ్బందిని నాలుగు తరగతులుగా విభజించినారు :

1. సెంట్రల్ సెక్రటేరియట్ సర్వీస్-గ్రేడ్ I ... అండర్ సెక్రటరీ
2. ,, ,, ,, -గ్రేడ్ II .. సూపరింటెండెంట్
3. ,, ,, ,, -గ్రేడ్ III ... అసిస్టెంట్ సూపరింటెండెంట్
4. ,, ,, ,, -గ్రేడ్ IV . అసిస్టెంట్

ఈ పై నాలుగు కాక ప్రస్తుతం మరొక కొత్తగ్రేడ్‌ను కూడా నిలో చేర్చినారు. దానిని సెలెక్షన్‌గ్రేడ్ (Selection grade) అని పిలుస్తారు. ఇది అన్ని గ్రేడ్‌లకంటె ఉన్నతమైనది. దీనిలో జాయింట్ సెక్రటరీ (Joint Secretary), డైరక్టర్, డిప్యూటీ సెక్రటరీలు మొదలైనవారుంటారు.

*ఉద్యోగ రక్షణ హామీలు :* భారత రాజ్యాంగం ప్రకారం ఆలిండియా సర్వీస్ ఉద్యోగులకు, కేంద్ర ప్రభుత్వ సర్వీస్‌లు, కేంద్ర సచివాలయ సిబ్బందికి విధి నిర్వహణ విషయంలో కొన్ని హామీ లున్నాయి. అవి :

1. తమను నియమించిన అధికారికంటె తక్కువ హోదాగల అధికారిచే పదవినుంచి తొలగించబడకూడదు.

2. ఒక ఉద్యోగిని పదవినుంచి తొలగించ వలసి వచ్చినా, హోదా తగ్గించ వలసి

వచ్చినా ఆ విషయంలో ఆ ఉద్యోగి తన పై అధికారులకు సంజాయిషీ చెప్పుకోడానికి అవకాశ మివ్వవలె. అటువంటి అవకాశం ఇవ్వకుండా చర్యతీసుకోవడం రాజ్యాంగ విరుద్ధము.

3. కొన్ని పరిస్థితులలో ఏ ఉద్యోగి అయినా తన హక్కులకు తనపై అధికారి బుద్ధి పూర్వకంగా హాని కలిగించడానికి ప్రయత్నించినట్లు భావిస్తే అతడు ఆ విషయంలో ఉన్నత న్యాయస్థానంలో అప్పీలు చేసుకోవచ్చు.

4. *రాష్ట్రప్రభుత్వ సర్వీస్‌లు* : రాష్ట్ర ప్రభుత్వ సర్వీస్‌లకు చెందిన ఉద్యోగులు రాష్ట్ర ప్రభుత్వ పాలనా యంత్రాంగాన్ని నడిపిస్తారు. దేశం మొత్తంమీద అన్ని రాష్ట్రాలలో కలిపి ఈతరహా ఉద్యోగులు దాదాపు 2 మిలియన్లకు పైగానే ఉన్నారు. ప్రతి రాష్ట్రంలోను కలక్టర్, సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్, మొ॥ సర్వీసుల నుంచి ఆ పై స్థాయి పదవులలో ఉండే ఉద్యోగులు ఆలిండియా సర్వీస్ ఉద్యోగులు కాగా, వాటికి దిగువన ఉండే పదవులను రాష్ట్ర ప్రభుత్వ సర్వీస్ ఉద్యోగులు నిర్వహిస్తారు. కేంద్రంలో ఆలిండియా సర్వీస్‌లు, సెంట్రల్ సర్వీస్‌లు, కేంద్ర సచివాలయ సిబ్బంది ఏ విధంగా ఉన్నాయో అదే విధంగా రాష్ట్రంలో కూడా శాఖీయంగా రాష్ట్ర ప్రభుత్వ సర్వీస్ ఉద్యోగులు ఉంటారు. ప్రతి సర్వీస్ గ్రూప్ I, II, III, IV అని నాలుగు వర్గాలుగా విభజించబడింది. వీటిలో గ్రూప్ 'I' గ్రూప్ 'II' తరగతులకు చెందినవారు. ఉన్నతస్థాయి పదవులను, గ్రూప్ 'III' తరగతికి చెందిన వారు, గుమాస్తా ఉద్యోగులు (Clerical jobs) గ్రూప్ 'IV' తరగతికి చెందినవారు మెసెంజర్లు, అటెండర్లు, వాచ్‌మన్, డ్రైవర్ వంటి పదవులు నిర్వహిస్తారు. రాష్ట్ర సర్వీస్‌లలో ఈ కింది సర్వీస్‌లు ముఖ్యమైనవి. వీటి నిర్మాణంలో అన్ని రాష్ట్రాలలో ఒకే విధంగా లేదు.

1. ట్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీస్ లేదా ప్రొవెన్షియల్ సివిల్ సర్వీస్ (State Administrat Service or Provincial Civil Service).

2. స్టేట్ పోలీస్ సర్వీస్, (3) స్టేట్ మెడికల్ సర్వీస్ (4) స్టేట్ జుడిషియల్ సర్వీస్ (5) స్టేట్ ఎడ్యుకేషనల్ సర్వీస్ (6) స్టేట్ ఫారెస్ట్ సర్వీస్ (7) స్టేట్ పబ్లిక్ హెల్త్ సర్వీస్ (8) స్టేట్ రెవిన్యూ సర్వీస్ (9) స్టేట్ అగ్రికల్చరల్ సర్వీస్ (10) స్టేట్ ఇంజనీరింగ్ సర్వీస్ మొదలైనవి.

కేంద్ర స్థాయిలో I. A. S. ; I. P S. లు ఎంత ముఖ్యమైనవో రాష్ట్ర స్థాయిలో ప్రొవిన్షియల్ సివిల్ సర్వీస్ (P.C.S.), స్టేట్ పోలీస్ సర్వీస్ అంతముఖ్యమైనవి. రాష్ట్ర ప్రభుత్వోద్యోగాలను గెజిటెడ్, నాన్‌గెజిటెడ్ (Gazetted and non-gazetted) అని రెండు రకాలుగా వర్గీకరించినారు. గెజిటెడ్ ఉద్యోగి నియామకము, బదిలీ, పదోన్నతి, పదవి విరమణ మొదలైన విషయాలు ప్రభుత్వ గెజిట్‌లో ప్రకటించబడతాయి. వారికి ఒక ఆఫీస్ ఉంటుంది. వారు పర్యవేక్షణ (Supervision) దర్శకత్వము (Direction) వంటి విధులు నిర్వహిస్తారు. రాష్ట్రంలో పనిచేసే ఆలిండియా సర్వీస్ ఉద్యోగులుకూడా గెజిటెడ్ ఉద్యోగులే. దీనికి భిన్నమైన వారు నాన్‌గెజిటెడ్ ఉద్యోగులు. రాష్ట్ర సర్వీస్‌లలో గ్రూప్ 'I' గ్రూప్ 'II' (Group I & II) సర్వీస్‌లు గెజిటెడ్ హోదాగలవి; గ్రూప్ III, గ్రూప్ IV (Group III & IV) నాన్ గెజిటెడ్ హోదాగల పదవులు.

గ్రూప్ I సర్వీస్‌లలో అధిక భాగం ఉద్యోగులు గ్రూప్ II సర్వీస్‌నుంచి పదోన్నతి ద్వారా గ్రహించ బడతారు. కొద్దిమంది మాత్రం రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్

—

నిర్వహించే బహిరంగ పోటీ పరీక్షలద్వారా ప్రత్యక్షంగా ఎంపిక చేసుకోబడతారు. గ్రూప్ II సర్వీసులలో అధికభాగం ప్రత్యక్ష భర్తీద్వారాను స్వల్పభాగం గ్రూప్ III సర్వీసునుండి ప్రమోషన్ ద్వారాను ఎంపిక చేసుకోబడతారు. ప్రతిశాఖలోను గ్రూప్ III సర్వీస్ వారుంటారు. ఇవి "సబార్డినేట్ ఎక్సిక్యూటివ్ సర్వీస్" (Subordinate Executive Service) అని "క్లెరికల్ సర్వీస్" (Clerical Service) అని రెండు రకాలు. వీటిలో మొదటి దానిలో తాసీల్దార్లు, సబ్ ఇన్‌స్పెక్టర్లు, డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ ఎడ్యుకేషన్ మొదలైన వారు ఉంటారు. రెండో తరహా ఉద్యోగాలలో గుమాస్తాలు ఉంటారు. వీరు L D C, (లోయర్ డివిజన్ క్లర్కులు) U. D. C. (అప్పర్ డివిజన్ క్లర్కులు) అని ఇతర్త్రా అనేక తరహాలుగా ఉంటారు. వీరిలో అధికభాగాన్ని ప్రత్యక్ష భర్తీ ద్వారాగాని లేదా డిపార్ట్‌మెంట్ పరీక్షలద్వారాగాని ఎంపికచేస్తారు. గ్రూప్IV సర్వీస్‌లలో ప్యూన్‌లు, వాచ్‌మన్‌లు కార్పెంటర్లు, డ్రైవర్లు, కళాశీలు మొదలైనవారు ఉంటారు.

*రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల శిక్షణ* : మొదటనుంచీ రాష్ట్రప్రభుత్వోద్యోగుల శిక్షణ అన్ని రాష్ట్రాలలోను నిర్లక్ష్యం చేయబడింది. 1962 లో టి. టి. కృష్ణమాచారి వీరికి శిక్షణ ఇవ్వడంలో గల ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పినాడు. ఉత్తర ప్రదేశ్, బీహార్ రాష్ట్రాలు తమ రాష్ట్రప్రభుత్వోద్యోగులకు శిక్షణ ఇవ్వడంలో ముందంజవేసినాయి. కేంద్రప్రభుత్వం అడుగుజాడలలో శిక్షణాలయాలు స్థాపించినాయి. విశ్వవిద్యాలయాలు కూడా ఈ విషయంలో పాలు పంచుకొన్నాయి నేడు దాదాపు అన్ని రాష్ట్రాలు తమ రాష్ట్ర ప్రభుత్వోద్యోగులకు ప్రత్యేక శిక్షణాలయాలు ఏర్పాటు చేసినాయి. ఈ శిక్షణాలయాలు జాతీయపరిపాలనా అకాడమీ నమూనాలో నిర్వహించబడు తున్నాయి. ఉద్యోగులకు పునరభ్యసనతరగతులు, ప్రాతిపదిక అధ్యయన తరగతులు (Orientation courses and back - ground training courses) నిర్వహిస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రభుత్వోద్యోగుల శిక్షణ నిమిత్తం అనేక శిక్షణాలయాలు నెలకొల్పబడినాయి. వాటిలో కొన్ని దిగువ ఇవ్వబడినాయి :

1. అకౌంట్ ట్రైనింగ్ స్కూల్ - హైదరాబాద్, గుంటూరు
2. ఫింగర్ ప్రింట్స్ బ్యూరో - హైదరాబాద్
3. ఫైర్ సర్వీస్ ట్రైనింగు స్కూల్ - హైదరాబాద్
4. పోలీస్ ట్రైనింగు కాలేజి - అనంతపూర్, వైజాగ్
5. అడ్మినిస్ట్రేటివ్ ఓరియన్‌టేషన్ అండ్ స్టడీ సెంటర్ - హైదరాబాద్
6. సివిల్ డిఫెన్స్, ఎమర్జన్సీ రిలీఫ్ ట్రైనింగ్ ఇన్‌స్టిట్యూట్ - హైదరాబాద్

ఉస్మానియా, ఆంధ్ర, వేంకటేశ్వర విశ్వవిద్యాలయాలలో ప్రభుత్వపాలనా శాస్త్రము, స్థానిక స్వపరిపాలన వంటికోర్సులు నిర్వహిస్తున్నారు. రాష్ట్రప్రభుత్వోద్యోగులు రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఆధ్వర్యంలో పనిచేస్తారు.

## పబ్లిక్ సర్వీస్ కమిషన్లు

ప్రభుత్వ పరిపాలన సమర్థవంతంగా ఉండవలెనంటే దానిని నిర్వహించే ఉద్యోగులు సమర్థులై ఉండవలె. పోటీ పరీక్షల ద్వారా తెలివైన, ఉత్సాహవంతులైన యువతీ యువకు

లను నిష్పక్షపాతంగా ఎంపిక చేసుకొన్నప్పుడే అది సాధ్యమవుతుంది. భర్తీ మొదలుకొని పదవీ విరమణ వరకు గల వివిధ ఉద్యోగి బృందపాలనా పరమైన విషయాలు శాస్త్రీయం గాను, ఎటువంటి అరమరికలు లేకుండాను నిర్వహించడానికి వీలుగా భారత రాజ్యాంగము కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు విడివిడిగా పబ్లిక్ సర్వీస్ కమిషన్లను ఏర్పాటు చేసింది.

రాజ్యాంగంలోని 315 వ నిబంధన ప్రకారం కేంద్ర ప్రభుత్వోద్యోగుల నియామకం నిమిత్తం యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ (U. P. S. C.) నూ, రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల నియామకానికి ఒక్కొక్క రాష్ట్రానికి ఒక్కొక్క స్టేట్ పబ్లిక్ సర్వీస్ కమిషన్(S.P.S.C.) నూ ఏర్పాటు చేయడం జరిగింది. రెండుమూడు చిన్న రాష్ట్రాలుకలిపి సమిష్టిగా ఒక సర్వీస్ కమిషన్ ఏర్పాటు చేసుకోవచ్చు. 316 వ నిబంధన ప్రకారం యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యులను, చైర్మన్‌ను రాష్ట్రపతి నియమిస్తాడు. రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ల సభ్యులను చైర్మన్‌ను ఆయా రాష్ట్రాల గవర్నర్లు నియమిస్తారు. ఉమ్మడి కమిషన్ల సభ్యులను, చైర్మన్‌ను కూడా రాష్ట్రపతే నియమిస్తాడు. యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్‌లో 6-8 మధ్య, రాష్ట్ర సర్వీస్ కమిషన్లలో ముగ్గురు లేదా నలుగురు సభ్యులు ఉంటారు. రెండు సందర్భాలలోను మొత్తం సభ్యులలో కనీసం సగం మంది 10 సం॥ పరిపాలనానుభవం కలిగినవారై ఉండవలె.

యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యుల పదవీకాలం 6 సం॥ లేదా 65 సం॥ వయోపరిమితి వరకు. ఈ రెండింటిలో ఏది ముందు పూర్తి అయితే అప్పుడు పదవి విరమణ చేయవలె. రాష్ట్ర సర్వీస్ కమిషన్‌ల సభ్యుల పదవీకాలము 6 సం॥ లేదా 60 స॥ వయసు నిండే వరకు. 1976 లో 42 వ రాజ్యాంగ సవరణ ద్వారా వీరి పదవి విరమణ వయసు 62 సం॥కు పెంచినారు. వీరు తమ పదవీకాలం పూర్తికాకముందే రాజీనామా ఇవ్వవచ్చు. వీరు తమ అధికారాన్ని దుర్వినియోగం చేసినా, అవినీతికి పాల్పడినా యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యులను పార్లమెంట్, రాష్ట్ర సర్వీస్ కమిషన్ల సభ్యులను రాష్ట్ర శాసన సభలు2/3 వంతు మెజారిటీతో ఒక తీర్మానాన్ని ఆమోదిస్తే యూనియన్ పబ్లిక్ కమిషన్ సభ్యులను రాష్ట్రపతి; రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యులను రాష్ట్ర గవర్నర్లు పదవినుంచి తొలగిస్తారు.

వీరి జీత భత్యాలను యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ విషయంలో రాష్ట్రపతి, రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ల విషయంలో రాష్ట్ర గవర్నర్లు నిర్ణయిస్తారు. రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యులు తమ పదవీ విరమణ తరవాత యు. పి. ఎస్. సి. సభ్యులు కావచ్చు. అదే విధంగా యు. పి. యస్. సి. సభ్యులు దానికి ఛైర్మన్ కావడానికి అర్హులు. ఛైర్మన్‌గాని, పదవి విరమణ చేసిన సభ్యులుగాని ఆదాయాన్నిచ్చే ఎటువంటి ప్రభుత్వోద్యోగంలో ఉండకూడదు.

*సర్వీస్ కమిషన్ల విధులు* : సర్వీస్ కమిషన్లు ఈ కింది విధులు నిర్వహిస్తాయి.

1. ఇవి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల నియామకానికి అవసరమైన పోటీ పరీక్షలు నిర్వహించి, ప్రతిభావంతులైన వారిని ఎంపిక చేయడంలో తోడ్పడతాయి.

2. రాష్ట్ర ప్రభుత్వాలు కోరితే యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ ఆయా రాష్ట్రా లకు ఉద్యోగుల ఎంపిక, నియామకం విషయాలలో తగిన నియమావళిని రూపొందించి, దానిని అమలు చేయడంలో తోడ్పడుతుంది.

**3. భర్తీ పద్ధతులనుగురించి, నియామకకాలంలో, ఒక సర్వీస్ నుంచి మరొక సర్వీస్‌కు**

బదిలీ విషయంలో పాటించవలసిన సూత్రాలను గురించి, అటువంటి నియామకాలకు, పదోన్నతికి, బదిలీకి తగిన అభ్యర్థులను నిర్ణయిస్తూ సర్వీసు కమీషన్‌లు ప్రభుత్వాలకు సలహా యిస్తాయి.

4. సర్వీస్ కమీషన్‌లు మంత్రిత్వ శాఖలకు, డిపార్ట్‌మెంట్‌లకు భర్తీ నియమాలను (Recruitment Rules) రూపొందించడంలోను, విధులను అనుసరించి జాబితాలను తయారు చేయడంలోనూ సహకరిస్తుంది. ఈ సందర్భంలో అర్హతలు, అనుభవాన్ని, భర్తీ పద్ధతులను నిర్ణయించాల్సిన బాధ్యత కమీషన్‌లపై ఉంది.

5. ఉద్యోగి బృంద నిర్వహణ విషయంలో సర్వీస్ కమిషన్లు ఆయా ప్రభుత్వాలకు సలహాలు యిస్తాయి.

6. యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ రాష్ట్రపతికి, రాష్ట్ర సర్వీసు కమిషన్లు రాష్ట్ర గవర్నర్లకు వార్షిక నివేదికలు అందచేస్తాయి. వాటిని వారు శాసనసభ ముందు ఉంచుతారు.

## కేంద్ర ప్రభుత్వ పరిపాలనా వ్యవస్థ

గడిచిన పేజీలలో మనం ఇండియాలో కేంద్ర ప్రభుత్వ నిర్మాణ, విధులు మొదలైన అంశాలను గురించి తెలుసుకొన్నాము. ఇప్పుడు కేంద్ర కార్యనిర్వాహక వర్గానికి సంబంధించిన పాలనా శాఖలలో (మంత్రిత్వాలలో) ముఖ్యమైన హోమ్‌శాఖను గురించి సంక్షిప్తంగా తెలుసు కొందాము.

### ఆంతరంగిక వ్యవహారాల శాఖ (Ministry of Home or Internal Affairs)

భారత ప్రభుత్వ పాలనా శాఖలలో ఆంతరంగిక వ్యవహారాల శాఖ అతిముఖ్యమైనది. దీనిని దేశ వ్యవహారాలశాఖ లేదా హోమ్‌శాఖ (Department of Home) అని కూడా అంటారు. 1968 నుంచి ఈ శాఖ అధికారాలు కొంత తగ్గినా నేటికీ కేం ప్రభుత్వ పరిపాలనాశాఖ లన్నిటిలోకి ఇది అతి ముఖ్యమైన శాఖగా పరిగణించబడుతుంది. ఒకప్పుడు భారత ప్రభుత్వం అంటే హోమ్‌శాఖ అనేంత ప్రాముఖ్యం దీనికి ఉండేది. సర్దార్ వల్లభ భాయ్ పటేల్, శ్రీ గోవింద వల్లభ పంత్ వంటి ప్రముఖులు ఈ శాఖను నిర్వహించినారు. ఈ శాఖ నిర్వహించే విధులు ఈ కింది విధంగా ఉంటాయి :

(ఏ) ***శాంతి భద్రతల పరిరక్షణ*** : ఆంతరంగికంగా దేశంలో శాంతి భద్రతలు కాపాడటం హోమ్‌శాఖ ప్రధాన విధి. దీనికోసం ఈ శాఖ రాష్ట్ర ప్రభుత్వాలకు కావలసిన సలహా సహాయాలను అందిస్తుంది. కేంద్ర పోలీస్ సిబ్బంది కేంద్ర రిజర్వ్ పోలీసు దళాలు (C.R.P.), గూఢాచారి దళాలు, స్పెషల్ ఆర్మ్‌డ్ పోలీసు దళాలు (S.A.P.), సివిల్ డిఫెన్స్, కేంద్ర పారిశ్రామిక భద్రతా దళము, సరిహద్దు భద్రతా దళము (B.S.F.), హోమ్‌గార్డ్ దళాలు మొదలైన వాటిని ఏర్పాటుచేసి, వారి శిక్షణ ఏర్పాట్లు, పర్యవేక్షణ చేస్తుంది. జైళ్ళ నిర్వహణ, అత్యవసర సర్వీస్‌ల నిర్వహణ, రైల్వేపోలీస్ దళాల పర్యవేక్షణ దీని అధికార పరిధిలో భాగము. ఆయుధాలు, మందుగుండు సామగ్రివంటి వాటి నిర్మాణము, వినియోగము అదుపులో ఉంచుతుంది. ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టము (P.D. Act), మీసా చట్టము (M. I. S. A. Act) మొదలైన చట్టాలు రూపొందించి అమలుపరచడం ద్వారా సంఘవిద్రోహ కార్యకలాపాలు, మతకల్లోలాలు, హింసాకాండ, దౌర్జన్యము చెలరేగకుండాను,

అంతర్యుద్ధాలు తలెత్తకుండాను తగిన చర్యలు తీసుకొంటుంది. దేశంలో ఆంతరంగికంగా శాంతి భద్రతలు కాపాడటానికి కావలసిన అనేక అనుబంధ విధులు ఇది నిర్వహిస్తుంది.

(బి) *న్యాయపరిపాలన :* హోమ్‌శాఖ దేశంలోని న్యాయస్థానాల నిర్వహణకు కావలసిన నియమ నిబంధనలను తయారుచేస్తుంది. ఉన్నత న్యాయస్థానాలలోని న్యాయమూర్తుల నియామకంలో ఇది న్యాయశాఖతోపాటు రాష్ట్రపతికి సలహాలిస్తుంది. ఉన్నత న్యాయస్థానాల అధికార పరిధిని నిర్దేశించడం, క్షమాభిక్షకై పెట్టుకొన్న అర్జీలను పరిశీలించి ఆ విషయంలో తీసుకోవలసిన చర్యలను గురించి రాష్ట్రపతికి సలహా ఇస్తుంది.

(సి) *రాష్ట్ర ప్రభుత్వాలతో సంబంధాలు:* కొత్త రాష్ట్రాలలో పునర్వ్యవస్థీకరణ, రాష్ట్రాల సరిహద్దులను మార్చడం వంటి విధులను ఆంతరంగిక వ్యవహారాల శాఖ నిర్వహిస్తుంది. ఆర్థిక, సాంఘిక. పరిపాలనా పరమైన విషయాలలో జోనల్ కౌన్సిళ్ళ ద్వారా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య సమన్వయం తెస్తుంది. రాష్ట్ర ప్రభుత్వాలు ఉమ్మడి జాబితాలోని అంశాలపై శాసనాలు చేయవలెనంటే హోమ్‌శాఖతో సంప్రదించవలె. అంతరాష్ట్రీయ సమావేశాలు ఏర్పాటుచేసి, వాటి నిర్వహణకు కావలసిన నిధులు సమకూరుస్తుంది. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్యసంబంధాలు మెరుగుపరుస్తుంది.

(డి) *రాజకీయ సంబంధమైనవిధులు (political functions):* రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, గవర్నర్లు, స్పీకర్ మొదలైన వారి వేతనాలు, విశేషాధికారాలు నిర్ణయిస్తుంది. రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి ఎన్నికలకు కావలసిన ఆదేశాలిస్తుంది. గవర్నర్ల నియామకానికి సిఫార్సులు చేస్తుంది. జాతీయ పతాకము, జాతీయ గీతము, జాతీయ చిహ్నాల విషయంలో పాటించవలసిన గౌరవ మర్యాదలు, నియమాలు నిర్దేశిస్తుంది. రాష్ట్రపతి, రాష్ట్ర గవర్నర్లు, రాష్ట్ర ప్రభుత్వాల పతాకాలు, చిహ్నాలు నిర్ణయిస్తుంది. వాటి విషయంలో పాటించవలసిన సంప్రదాయాలను విశదీకరిస్తుంది. దేశ అధికార భాషను, రాష్ట్రాల అధికార భాషలను నిర్ణయిస్తుంది. అధికార భాషా ప్రచారానికి అధికార భాషా కమిషన్ ఏర్పాటుచేసి దాని ఛైర్మన్, సభ్యులను నియమిస్తుంది. రాజ్యాంగంలోని అత్యవసర పరిస్థితి ప్రకటనకు సంబంధించిన విషయాలు పరిశీలిస్తుంది. విదేశీ ప్రముఖులు భారతదేశం వస్తే వారికి లభించవలసిన స్వాగత సత్కారాలు నిర్ణయిస్తుంది. జాతీయ అవార్డులు, విశిష్ట సేవా పతకాలు నిర్ణయించి వాటికి అర్హులైన వారిని ఎంపిక చేస్తుంది. జాతీయ పర్వదినాలు జరిపించడం, జాతీయ సమైక్యత కాపాడటానికి కావలసిన ముందు జాగ్రత్త చర్యలు తీసికోవడం ఈశాఖ విధి.

(ఇ) *కేంద్ర పాలిత ప్రాంతాల పరిపాలన :* కేంద్ర పాలిత ప్రాంతాల పరిపాలనకు లెఫ్టినెంట్ గవర్నర్లను, ఛీఫ్ కమిషనర్లను నియమిస్తుంది. కేంద్ర పాలిత ప్రాంతాల పరిపాలనకు కావలసిన శాసనాలు రూపొందిస్తుంది. వాటికి పరిపాలనాధికారులను, న్యాయాధికారులను నియమిస్తుంది.

(ఎఫ్) *విదేశీయులకు సంబంధించిన విధులు :* విదేశీ రాజకీయ సంస్థలు, సాంస్కృతిక సంస్థలు, మత ప్రచార సంస్థలు, విదేశీ పౌరులయొక్క కార్యకలాపాలపై నిఘావేసి ఉంచడం, భారతీయ పౌరత్వపు అర్హతలు నిర్ణయించడం, పరదేశీయులకు మన దేశంలో పౌరత్వం ఇవ్వడం, మనదేశం నుంచి విదేశాలకు వెళ్ళేవారికి పాస్‌పోర్ట్‌లు మంజూరు చేయడం, ఇతర దేశాలనుంచి మన దేశానికి వచ్చే వారికి 'వీసా'లు, గుర్తింపు పత్రాలు, అనుమతి

పత్రాలు ఇవ్వడం, అంతర్జాతీయ నేరస్థులు, దుండగులు, స్మగ్లర్ల యొక్క కార్యకలాపాలను అదుపులో పెట్టడం, వారిని పట్టుకోవడంలో ఇతర దేశాలతో సహకరించడం, విదేశీ విద్రోహ కార్యకలాపాల నివారణకు తగిన చర్యలు తీసుకోవడం హోమ్‌శాఖ విధులు. ఐక్యరాజ్య సమితికి సంబంధించిన అంతర్జాతీయ న్యాయసూత్రాలు అమలుపరచడానికి అన్ని చర్యలు తీసుకొంటుంది.

(జి) *ప్రభుత్వోద్యోగులకు సంబంధించిన విధులు :* ఉద్యోగి బృందపాలనలో దీని పాత్ర ముఖ్యమైనది. ఆలిండియా సర్వీస్‌లు, కేంద్ర ప్రభుత్వోద్యోగులు, కేంద్ర సచివాలయ సిబ్బందికి సంబంధించిన సర్వీస్ నిబంధనలు రూపొందిస్తుంది. వారి ప్రమోషన్లు, బదలీలు, క్రమశిక్షణ చర్యలు, వేతనాలు మొదలైన విషయాలు దీని అధికార పరిధిలో ఉంటాయి. పబ్లిక్ సర్వీస్ కమిషన్‌ల సభ్యుల, నియామకంలో రాష్ట్రపతికి సలహా ఇస్తుంది. వారి విధులు, వేతనాలు నిర్ణయిస్తుంది. ప్రభుత్వ సర్వీస్‌లను పునర్వ్యవస్థీకరించడం, పరిపాలనా సంస్కరణలను అమలుపరచడం, జాతీయ పరిపాలనా అకాడమి, జాతీయ పోలీస్ శిక్షణా కళాశాల, తదితర ప్రభుత్వోద్యోగుల శిక్షణాలయాల నిర్వహణ దీని విధి.

(హెచ్) *ఇతర విధులు :* హోమ్‌శాఖ ప్రణాళికా సంఘం సిపార్సులపై సలహాల నిస్తుంది. వెనకబడిన వర్గాలు, వెనకబడిన కులాలు, తదితర బలహీన వర్గాల వారి ప్రయోజనాలు కాపాడటానికి తగిన చర్యలు తీసుకొంటుంది. జనన మరణ లెక్కలు, జనాభా లెక్కలు తయారుచేస్తుంది. అగ్నిమాపక దళాలు నెలకొల్పి వారికి శిక్షణ ఇప్పిస్తుంది. విచారణా సంఘాలు ఏర్పాటుచేసి అవినీతికి పాల్పడిన అధికారులు, అనధికారులు, రాజకీయ నాయకుల చర్యలు బహిరంగ పరుస్తుంది. వివిధ రంగాలలో మానవశక్తి (Man power) కి సంబంధించి గణాంకాలు తయారుచేస్తుంది. స్త్రీలయొక్క, పిల్లలయొక్క హక్కులు కాపాడటం, అభ్యంతరకరమైన సాహిత్యం దేశంలో ప్రచురణ కాకుండా చూడటం, అది దేశంలోకి దిగుమతి కాకుండా జాగ్రత్తలు తీసుకోవడం, ముద్రణాలయాలను అదుపులో పెట్టడం, సెన్సార్ నిబంధనలు నిర్ణయించడం, పత్రికా స్వాతంత్ర్యం కాపాడటం వరదలు, భూకంపాలు, అంటు వ్యాధులు వంటి జాతీయ ఉపద్రవాలు వచ్చి ఆస్తినష్టం, ప్రాణనష్టం జరిగితే ముందు జాగ్రత్త చర్యలు తీసుకోవడం వంటి అనేక విధులు ఈ శాఖ నిర్వహిస్తుంది.

పైన చెప్పిన విధులను బట్టి దేశ పరిపాలనలో హోమ్‌శాఖ ప్రాముఖ్యం విశదమవుతుంది. ఈ విధుల నిర్వహణకై హోమ్‌శాఖను 19 డివిజన్లుగా విభజించినారు. దీనికి ఒక కాబినెట్ హోదా మంత్రి అధిపతిగా ఉంటాడు. ఆయనకు ఇద్దరు స్టేట్ మంత్రులు, ఒక ఉప మంత్రి సహాయకులుగా ఉంటారు. వీరిలో ఒక స్టేట్ మంత్రి ఉద్యోగిబృందం నిర్వహణ - పరిపాలనా సంస్కరణల విభాగానికి (Department of Personnel and Administrative Reforms) అధిపతిగా ఉంటాడు. ఈ రాజకీయ అధిపతులుకాక హోమ్‌శాఖకు ఒక ప్రధాన కార్యదర్శి, ఒక అదనపు కార్యదర్శి, ఇతర అధికార సిబ్బంది శాశ్వత ప్రభుత్వోద్యోగులుగా ఉంటారు.

# ప్రశ్నలు

## వ్యాస ప్రశ్నావళి

1. భారత రాష్ట్రపతి అధికారాలు, విధులు వివరించి దేశపాలనలో అతని స్థానాన్ని చర్చించండి.
2. కేంద్ర మంత్రిమండలి నిర్మాణము, అధికారాలు, విధులు విపులీకరించండి.
3. భారత పార్లమెంట్ నిర్మాణము, అధికారాలు, విధులను గురించి క్లుప్తంగా వివరించండి.
4. భారత సుప్రీమ్ కోర్ట్ నిర్మాణము, అధికార పరిధి, విధులు వివరించండి.
5. ఆలిండియా సర్వీస్‌లను గురించి క్లుప్తంగా ఒక వ్యాసం వ్రాయండి.
6. హోమ్‌శాఖ నిర్మాణము, విధులనుగురించి క్లుప్తంగా వివరించండి.

## సంక్షిప్త సమాధాన ప్రశ్నావళి

1. భారత ప్రభుత్వ నిర్మాణం గురించి క్లుప్తంగా వివరించండి.
2. భారత రాష్ట్రపతి ఎన్నికల విధానం గురించి తెలపండి.
3. భారత రాష్ట్రపతిని పదవీచ్యుతుని చేయడానికి రాజ్యాంగం సూచించిన పద్ధతి ఏది?
4. భారత రాష్ట్రపతికి రాజ్యాంగం కల్పించిన విశేషాధికారాలు వివరించండి.
5. భారత రాష్ట్రపతికి గల అసాధారణాధికారాలను వివరించి రాజ్యాంగంలో వాటి ఔచిత్యాన్ని గురించి వివరించండి.
6. భారత ఉపరాష్ట్రపతిని గురించి క్లుప్తంగా వివరించండి.
7. 'సమష్టి బాధ్యత, (Collective Responsibility) అంటే ఏమిటి ? పార్లమెంటరీ విధానంలో దాని ప్రాముఖ్యం తెలపండి.
8. కేంద్ర ప్రభుత్వంలో ప్రధానమంత్రి అధికారాలు, విధులు, స్థానము వివరించండి.
9. ఉన్నతస్థాయి పాలకులలో అవినీతి, అధికార దుర్వినియోగం నివారించడంలో లోక్‌పాల్ పాత్ర ఎటువంటిదో వివరించండి.
10. సభాపతి (Speaker) అధికారాలు, విధులు క్లుప్తంగా తెలపండి.
11. న్యాయ సమీక్ష (Judicial review) అంటే ఏమిటి ?
12. భారత దేశంలో న్యాయస్థానాల స్వతంత్ర ప్రతిపత్తి కాపాడటానికి భారత రాజ్యాంగం తీసుకొన్న చర్యలు ఏవి ?
13. కేంద్ర సచివాలయ సిబ్బంది నిర్మాణం, విధులు వివరించండి.
14. రాష్ట్ర ప్రభుత్వ సర్వీస్‌ల నిర్మాణాన్ని విపులీకరించండి.
15. ఆధునిక రాజ్యాలలో పబ్లిక్ సర్వీస్‌ల ప్రాముఖ్యము, పాత్ర వివరించండి.
16. ఇండియాలో పబ్లిక్ సర్వీస్ కమిషన్ల నిర్మాణం, విధులు వివరించండి.

# 8
# రాష్ట్ర ప్రభుత్వము
(State Government)

రాజ్యాంగంలోని ఆరో భాగంలో రాష్ట్ర ప్రభుత్వాల వ్యవస్థ గురించి వివరించబడింది. మన దేశంలో కేంద్రంలోవలె రాష్ట్ర స్థాయిలో కూడా ప్రభుత్వ నిర్మాణంలో పార్లమెంటరీ పద్ధతిని అనుసరించినారు. రాష్ట్ర ప్రభుత్వానికి ప్రధాన కార్య నిర్వాహకుడు గవర్నర్. ప్రభుత్వ యంత్రాంగాన్ని నడిపించడంలో ఆయనకు సలహా లివ్వడానికి ముఖ్యమంత్రి నాయకత్వంలో మంత్రిమండలి పని చేస్తుంది. రాష్ట్ర పరిపాలనకు కావలసిన శాసనాలను రాష్ట్ర శాసన సభ రూపొందిస్తుంది. రాష్ట్ర శాసన సభ కొన్ని రాష్ట్రాలలో ఏక శాసనసభ గాను, కొన్ని రాష్ట్రాలలో ద్వంద్వ శాసన సభగాను ఉంది. రాష్ట్ర న్యాయ వ్యవస్థలో అత్యున్నత న్యాయస్థానం హైకోర్టు. దానికి దిగువ ఇతర కోర్టులు పనిచేస్తున్నాయి. ఈ రాష్ట్ర ప్రభుత్వాంగాల నిర్మాణం, విధులు ఎట్లా ఉంటాయి అనే దానిని గురించి మరింత విపులంగా చర్చిద్దాము.

## గవర్నర్
(Governor)

రాజ్యాంగం రీత్యా ప్రతి రాష్ట్రానికి పాలకుడుగా ఒక గవర్నర్ ఉంటాడు. అతనిని "రాజ్యపాల్" అని కూడా పిలుస్తారు. 7 వ రాజ్యాంగ సవరణ (1956) ప్రకారం ఒకే వ్యక్తిని రెండు లేదా అంతకంటె ఎక్కువ రాష్ట్రాలకు గవర్నర్‌గా నియమించవచ్చు. దేశానికి రాష్ట్రపతి ఎటువంటి వాడో రాష్ట్రాలకు గవర్నర్ అటువంటి వాడు. అతడు రాష్ట్ర ప్రధాన కార్యనిర్వాహకుడు.

### నియామకము - అర్హతలు

కేంద్ర మంత్రిమండలి, ప్రధాన మంత్రి సలహా ప్రకారం గవర్నర్‌ను, భారత రాష్ట్రపతి నియమిస్తాడు. రాష్ట్ర పాలకుని దేశాధిపతి నియమించే ఈ పద్ధతి మనం కెనడా రాజ్యాంగం నుంచి గ్రహించినాము. ఈ మధ్య ఏర్పడిన సంప్రదాయం ప్రకారం ఒక రాష్ట్రానికి గవర్నరును నియమించే టప్పుడు ఆ రాష్ట్ర ముఖ్యమంత్రిని కూడా సంప్రదిస్తున్నారు. అతడు రాష్ట్రపతి విశ్వాసాన్ని పొందగలిగినంత కాలం పదవిలో ఉంటాడు. సాధారణంగా అతని పదవీ కాలం ఐదు సంవత్సరాలు. అదే వ్యక్తిని తిరిగి ఎన్నిసారులైనా గవర్నర్‌గా నియమించవచ్చు.

రాజ్యాంగంలోని 157 వ నిబంధన ప్రకారం గవర్నర్‌గా నియమితుడయ్యే వ్యక్తి 35 సంవత్సరాలు నిండిన భారతీయ పౌరుడై ఉండవలె. అతడు ఆదాయాన్నిచ్చే ఏ ప్రభు

త్వోద్యోగంలోను ఉండకూడదు. కేంద్ర రాష్ట్ర శాసన సభలలో అతడు సభ్యుడై ఉండ కూడదు. ఒకవేళ ఆ విధంగా ఉంటే గవర్నర్ పదవి చేపట్టడంతో ఆ పదవి రద్దుఅవుతుంది. ఏ రాష్ట్రానికి చెందిన వ్యక్తిని ఆ రాష్ట్రానికి గవర్నర్‌గా నియమించక, రాష్ట్రేతరుని మాత్రమే గవర్నర్‌గా నియమించే సాంప్రదాయం కూడా నేడు పాటిస్తున్నారు.

గవర్నర్ జీత భత్యాలను పార్లమెంట్ నిర్ణయిస్తుంది. ఆయనకు నెలకు 5500/- రూపాయల వేతనం లభిస్తుంది. ఆయన నివాసార్థం రాష్ట్ర రాజధానిలో అన్ని సౌకర్యాలుగల 'రాజభవన్' ను ఉచిత నివాస గృహంగా ఇస్తారు. గవర్నర్‌గా నియమితుడైన వ్యక్తి హైకోర్ట్ ప్రధాన న్యాయమూర్తి సమక్షంలో ప్రమాణ స్వీకారం చేయవలె

అధికారాలు - విధులు

గవర్నర్ అధికారాలను నాలుగు భాగాలుగా విభజించవచ్చు. 1. కార్యనిర్వహణాధి కారాలు 2. శాసన నిర్మాణాధికారాలు 3. ఆర్థికాధికారాలు 4. న్యాయాధికారాలు.

(ఏ) *కార్యనిర్వహణాధికారాలు* : 1. రాజ్యాంగ రీత్యా రాష్ట్రప్రభుత్వానికి గవర్నర్ ప్రధాన కార్యనిర్వాహకుడు. 166వ నిబంధన ప్రకారం రాష్ట్ర కార్యనిర్వహణాధికారం అంతా అతని అధీనంలో ఉంటుంది. అతడు ఈ అధికారాన్ని స్వయంగా కాని లేదా రాష్ట్ర ప్రభుత్వ అధికారుల ద్వారా గాని వినియోగించవచ్చు. సామాన్యంగా అతడు తన అధికారాలను రాష్ట్ర మంత్రి మండలి సలహా ప్రకారం వినియోగిస్తాడు. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో మంత్రివర్గ సలహాను అతడు తోసిపుచ్చి కొన్ని బిల్లులను రాష్ట్రపతి అనుమతికి పంపించవచ్చు.

2. రాష్ట్ర విధాన సభలో మెజారిటీ పార్టీ నాయకుని గవర్నర్ రాష్ట్ర ముఖ్యమంత్రిగా నియమిస్తాడు. శాసన సభలో ఏ ఒక్క పార్టీకి పూర్తి మెజారిటీ లభించకపోతే ముఖ్యమంత్రి ఎంపికలో అతడు కీలకమైన పాత్ర నిర్వహిస్తాడు.

3. ముఖ్యమంత్రి సలహాపై అతడు మంత్రిమండలిలో ఉండే ఇతర మంత్రులను నియ మిస్తాడు. మంత్రులు గవర్నర్ విశ్వాసాన్ని పొందగలిగినంత కాలం పదవిలో ఉంటారుకాని వాస్తవానికి వారు శాసన సభలో మెజారిటీ నిలుపుకోగలిగినంత కాలం పదవిలో ఉంటారు.

4. గవర్నర్ రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలకు చాన్సలరుగా వ్యవహరిస్తాడు. విశ్వ విద్యాలయాల ఉపాధ్యక్షులను అతడే నియమిస్తాడు.

5. రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ చైర్మన్‌ను, సభ్యులను అతడు నియమిస్తాడు.

6. ప్రభుత్వ న్యాయవాది, అడ్వకేట్ - జనరల్‌ను, ప్రభుత్వ వ్యాపార సంస్థల అధ్య క్షులను అతడు నియమిస్తాడు.

ఈ నియామకాలన్నీ అతడు మంత్రిమండలి సలహా ప్రకారం చేస్తాడు. మంత్రిమండ లికి, గవర్నరుకు మధ్య రాష్ట్ర ముఖ్యమంత్రి సంధానకర్తగా పనిచేస్తాడు.

(బి) *శాసన నిర్మాణాధికారాలు* : 1. రాష్ట్ర శాసన సభలో గవర్నరు ఒక భాగము. రాష్ట్ర శాసన నిర్మాణంలో అతడు ప్రత్యేకమైన పాత్ర నిర్వహిస్తాడు. శాసన సభను సమా వేశ పరచడానికి, దీర్ఘకాలం వాయిదా వేయడానికి, లేదా రద్దు చేయడానికి ఆయనకు అధికార ముంది.

2. శాసన సభ ప్రథమ సమావేశంలో గవర్నరు ప్రారంభోపన్యాసం చేస్తాడు.

రాబోయే సంవత్సరంలో తన ప్రభుత్వ విధానాలను గురించి స్థూలంగా వివరిస్తాడు. సంవత్సరానికొక పర్యాయం బడ్జెట్ సమావేశంలో అతడు ఉభయ సభలను ఉద్దేశించి ప్రసంగిస్తాడు.

3. రాష్ట్రపతివలె గవర్నర్ కూడా అవసరమనుకొంటే శాసన సభకు సందేశాలు పంపించవచ్చు. వాటిని సభ వెంటనే చర్చించి తగిన నిర్ణయాలు తీసుకోవలె.

4. రాష్ట్రంలో వరదలు, భూకంపాలు వంటి క్లిష్ట పరిస్థితులు ఏర్పడినప్పుడు, పండగలు, జాతీయ పర్వదినాలు వచ్చినప్పుడు అతడు రాష్ట్ర ప్రజల నుద్దేశించి ప్రసంగించవచ్చు. వారికి ధైర్యం చెప్పవచ్చు. శుభాకాంక్షలు తెలపవచ్చు.

5. రాష్ట్ర బిల్లులు ఏవైనా తీవ్ర వివాదానికి అవకాశ మిస్తాయని భావించినప్పుడు, అతడు వాటిని రాష్ట్రపతి ఆమోదానికి పంపుతాడు.

6. రాష్ట్ర శాసనసభ ఆమోదించిన బిల్లులు గవర్నర్ ఆమోద ముద్ర లేనిదే అమలులోకి రావు.

7. రాష్ట్ర శాసన సభ సమావేశంలో లేనప్పుడు అతడు ప్రభుత్వం పని చేయడానికి కావలసిన శాసనాలను "ఆర్డినెన్స్" ల రూపంలో జారీ చేస్తాడు. వాటికి మామూలు శాసనాలకు ఉన్నంత విలువ ఉంటుంది. వాటిని రాష్ట్ర శాసనసభ తిరిగి సమావేశం అయిన ఆరు వారాల లోగా ఆమోదించవలె.

8. రాష్ట్రంలో రాజ్యాంగ బద్ధమైన పరిపాలన జరగడం లేదని గవర్నర్ భావించినప్పుడు రాష్ట్రంలో 'రాష్ట్రపతి పాలన' ప్రవేశ పెట్టమని అతడు కేంద్ర ప్రభుత్వానికి సందేశం పంపవచ్చు. రాష్ట్రపతి పాలన రాష్ట్రంలో అమలులో ఉన్నప్పుడు అతడే రాష్ట్రానికి నిజమైన పాలకుడవుతాడు. తిరిగి రాష్ట్ర శాసన సభకు ఎన్నికలు జరిగి, కొత్త ప్రభుత్వం ఏర్పడేవరకు రాష్ట్ర పరిపాలనను అతడు కేంద్రంచే నియమించబడిన సలహాదారుల (గవర్నర్ సలహాదారులు) సహాయంతో నిర్వహిస్తాడు.

(సి) **ఆర్థికాధికారాలు**: 1. శాసన సభలో ఆర్థిక బిల్లులు ప్రవేశపెట్టడానికి గవర్నర్ అనుమతి కావలె. బడ్జెట్ ప్రవేశ పెట్టటానికి కూడా అతని అనుమతి కావలె. కొత్త పన్నులు విధించడానికి సంబంధించిన సిఫార్సులు సభలో ప్రవేశ పెట్టడానికి ముందు అతని ఆమోద ముద్ర కావలె.

2. ప్రతి సంవత్సరం అకౌంటెంట్ – జనరల్ రాష్ట్ర ఆర్థిక నివేదిక గవర్నర్ సమర్పిస్తాడు. దానిని అతడు శాసన సభ ముందుంచవలె.

3. ఆర్థిక బిల్లులపై తన ఆమోద ముద్ర వేయకుండా నిలిపి ఉంచే అధికారము గవర్నరుకు లేదు.

(డి) **న్యాయాధికారాలు** : గవర్నర్ కొన్ని ప్రత్యేక పరిస్థితులలో రాష్ట్ర న్యాయ స్థానాలు విధించిన శిక్షలు నిలపవచ్చు లేదా నేరస్తునికి క్షమాభిక్ష పెట్టవచ్చు. గవర్నర్‌కు ఉన్న న్యాయాధికారాలు రాష్ట్ర న్యాయశాఖ పరిధికిమాత్రమే పరిమితము. అతడు వినియోగించే న్యాయాధికారాలు రాష్ట్రపతి అధికారాలకు అనుకూలంగా ఉండవలె.

## గవర్నర్ స్థానము

స్వాతంత్ర్యానికి ముందు గవర్నర్లకు నిరంకుశాధికారాలు ఉండేవి. నూతన రాజ్యాంగం

రాష్ట్రాలలో కూడా పార్లమెంటరీ పద్ధతిపై పరిపాలనా యంత్రాంగాన్ని నిర్మించడంతో, కేంద్రంలో రాష్ట్రపతివలె, రాష్ట్రాలలో గవర్నర్లు కూడా నామ మాత్రపు కార్యనిర్వహణాధి కారులుగా మారిపోయినారు. వారిని రాష్ట్ర ప్రజలు ఎన్నుకోరు. కనీసం వారు ఆ రాష్ట్ర వ్యాస్తవ్యులైనా కారు. వారిలో కొందరికి ఆ ప్రాంతంలో మాట్లాడే భాష కూడా రాదు. ఈ కారణంగా రాష్ట్ర పరిపాలనలో వారు నామమాత్రమైన పాత్ర మాత్రమే వహిస్తున్నారు. అంతేకాక గవర్నర్ తన అధికారాన్ని మంత్రిమండలి సలహా ప్రకారం వినియోగించవలె. కాబట్టి గవర్నరు పదవి రాష్ట్ర పరిపాలన ప్రభావితం చేయడానికేగాని, అధికారం చెలాయించ డానికి కాదని తెలుస్తున్నది.

పైన చెప్పిన విషయాలు వాస్తవమే అయినా రాష్ట్రపతి పదవితో పోలిస్తే గవర్నరు పదవి నామ మాత్రం అనిపించదు. గవర్నరు, రాష్ట్రపతికి, కేంద్ర ప్రభుత్వానికి రాష్ట్ర స్థాయిలో ఏజెంట్‌గా వ్యవహరిస్తాడు. అతడు తన చర్యలకు, రాష్ట్రపతికి బాధ్యుడు. కాబట్టి కొన్ని సందర్భాలలో అతడు మంత్రిమండలి సలహా పెడచెవిని పెట్టి కొన్ని బిల్లులపై తన ఆమోద ముద్ర వేయక వాటిని రాష్ట్రపతికి ఆమోదానికి పంపిస్తాడు. రాష్ట్రంలో రాష్ట్రపతి పరిపాలన ప్రవేశపెట్టడానికి గవర్నరు రాష్ట్రపతికి పంపే సందేశమే మూలము. ఆ సందేశం యొక్క ఉచితానుచితాలు ఎవరూ ప్రశ్నించలేరు. కాని తుది నిర్ణయం కేంద్రానిదే. రాష్ట్రపతి పాలనలో అతడు రాష్ట్రానికి పూర్తి పాలకుడుగా వ్యవహరిస్తాడు.

మొత్తం మీద గవర్నరు పదవి చాలా క్లిష్టమైనది. అతడు ఏక కాలంలో ఇద్దరు యజమానులను సంతృప్తి పరచవలె. ఒకవైపు తనను నియమించి నియంత్రించే రాష్ట్రపతిని మరొకవైపు రాష్ట్ర ప్రజలకు ప్రాతినిధ్యం వహించే మంత్రిమండలిని అతడు సంతృప్తి పరచవలె. ఇది కత్తిమీద సాము వంటిది. రాష్ట్ర మంత్రిమండలికి గవర్నరుతో వివాదం వస్తే ఆ విషయంలో గవర్నరు నిర్ణయం తిరుగులేదని రాజ్యాంగ నిపుణులు భావించినారు. ఉదా హరణకు, పశ్చిమ బెంగాల్‌లో శ్రీ ధర్మవీర గవర్నరుగా ఉండగా ముఖ్యమంత్రి అజయ్ ముఖర్జీ నాయకత్వాన గల మంత్రివర్గం రూపొందించిన ప్రసంగాన్ని చదవవలసి వచ్చినప్పుడు అందులో కొన్ని భాగాలు ఆయన చదవడానికి నిరాకరించినాడు. దీనిపై వారికి వివాదం రాగా గవర్నర్ చర్య రాజ్యాంగ విహితమేనని నిర్ణయించి నారు.

## రాష్ట్ర మంత్రిమండలి
### (Council of Ministers)

రాజ్యాంగము గవర్నర్ రాష్ట్రానికి ప్రధాన కార్య నిర్వాహకునిగా నిర్దేశించినప్పటికీ, 163 వ నిబంధన ప్రకారం ఆయనకు సలహా లివ్వడానికి, పరిపాలనా బాధ్యతలు నిర్వహించ డానికి ముఖ్యమంత్రి నాయకత్వంలో పనిచేసే మంత్రిమండలి ఉంటుంది. 164 వ నిబంధన ప్రకారం అది గవర్నరు విశ్వాసాన్ని పొందగలిగినంతకాలం పదవిలో ఉంటుంది. మంత్రి మండలి తన చర్యలకు రాష్ట్ర శాసన సభలోని దిగువ సభకు సమష్టిగా బాధ్యత వహిస్తుంది.

**నియామకము - వేతనాలు - అర్హతలు**

రాష్ట్రంలో సాధారణ ఎన్నికల తరవాత రాష్ట్ర శాసన సభలో మెజారిటీ పార్టీ నాయ

కుడిని గవర్నర్ ముఖ్యమంత్రిగా నియమిస్తాడు. ఒక వేళ ఏపార్టీకి మెజారిటీ రాకపోతే ఏకాభిప్రాయం గల కొన్ని పార్టీలు కలిసి తమ నాయకుడిని నిర్ణయిస్తాయి. అతని సలహా ప్రకారం మంత్రివర్గంలోని ఇతర మంత్రులను నియమిస్తాడు. రాజ్యాంగం ప్రకారం వారు గవర్నర్ విశ్వాసం పొందగలిగినంత కాలం పదవిలో ఉంటారని చెప్పబడినా వాస్తవానికి మంత్రివర్గానికి విధాన సభలో మెజారిటీ ఉన్నంతకాలం దాని పదవికి ఎటువంటి ప్రమాదమూ ఏర్పడదు.

మంత్రిగా నియమించబడిన వ్యక్తి భారతీయ పౌరుడై ఉండవలె. అతడు రాష్ట్ర విధాన పరిషత్తులోగాని, విధాన సభలోగాని సభ్యుడై ఉండవలె. సభ్యుడు కాని వ్యక్తిని మంత్రిగా నియమిస్తే ఆరు నెలల గడువులోగా అతడు ఏదో ఒక సభలో సభ్యత్వాన్ని సంపాదించు కోవలె ; లేకపోతే అతని పదవి రద్దు అవుతుంది. మంత్రుల జీత భత్యాలను రాష్ట్ర శాసన సభ నిర్ణయిస్తుంది. మంత్రి పదవిని అధిష్టించబోయే ముందు ప్రతి మంత్రి రాష్ట్ర గవర్నర్ సమక్షంలో పదవీ ప్రమాణ స్వీకారంతోపాటు ప్రభుత్వ రహస్యాలను కాపాడతానని కూడా ఒక ప్రమాణం చేయవలె.

మంత్రి మండలిలో మంత్రులు మూడు రకాలుగా ఉంటారు. హోమ్, ఆర్థికశాఖ, రెవిన్యూశాఖ వంటి ముఖ్యమైన శాఖలు నిర్వహించేవారిని కాబినెట్ హోదా మంత్రులు అంటారు. అముఖ్యమైన చిన్న శాఖలను నిర్వహించే వారిని స్టేట్ మంత్రులు అంటారు. వీరు కాక స్వాధీనాధికారంలేని ఉపమంత్రులు కూడా కొందరు ఉంటారు. వారు కాబినెట్ మంత్రులకు సహాయకులుగా ఉంటారు. రాష్ట్ర స్థాయిలో కూడా ఈ మధ్య బ్రిటన్‌లోవలె పార్లమెంటరీ కార్యదర్శులను నియమించే సంప్రదాయం ప్రారంభమైంది.

రాష్ట్రమంత్రివర్గంలో ఉండవలసిన మంత్రుల సంఖ్యను రాజ్యాంగం నిర్ణయించలేదు. కాని పరిపాలనా సంస్కరణల సంఘము రాష్ట్ర మంత్రివర్గ పరిమాణం 25 కు మించకూడదని సిఫార్సు చేసింది. కాని ఈ సిఫార్సును ఎవరూ పాటించడం లేదు. ముఖ్య మంత్రులు తమ అవసరాలనుబట్టి ఇష్టానుసారం మంత్రులను నియమిస్తున్నారు.

మంత్రి మండలి రాష్ట్ర శాసన సభకు సమష్టిగా బాధ్యత వహిస్తుంది. మంత్రులు మంత్రివర్గ నిర్ణయాల విషయంలో సమష్టి బాధ్యత వహించడమే కాక తమ తమ శాఖల నిర్వహణ విషయంలో వారు వ్యక్తిగతంగా కూడా బాధ్యత వహించడం మంచి పద్ధతి. మంత్రి మండలిలో సమష్టి బాధ్యత, వ్యక్తిగత బాధ్యతలను ముఖ్యమంత్రి అమలుపరచవలె.

## మంత్రిమండలి అధికారాలు – విధులు

మంత్రిమండలి రాష్ట్ర ప్రభుత్వానికి ప్రధాన కార్యనిర్వహణాధికారి. అది ప్రభుత్వ పాలనా విధానాన్ని రూపొందించి అమలుపరుస్తుంది. రాష్ట్ర పరిపాలన నిర్వహించడానికి కావలసిన బిల్లులను తయారుచేసి వాటిని శాసన సభలో ప్రవేశపెట్టి దాని అనుమతితో వాటిని చట్టాలుగా రూపొందిస్తుంది. మంత్రులు తమ తమ శాఖలకు సంబంధించిన బిల్లులను శాసన సభలో వివిధ దశలలో నడిపిస్తారు. రాష్ట్ర శాసన సభ ఆమోదము, గవర్నర్ సమ్మతి లభించిన శాసనాలను, బడ్జెట్‌ను మంత్రిమండలి శాశ్వత ప్రభుత్వోద్యోగుల సహాయంతో అమలు పరుస్తుంది.

మంత్రులు శాసనసభ చర్చలలో పాల్గొని సభ్యుల ప్రశ్నలకు సమాధానాలిస్తారు. శాసన సభా కార్యక్రమాల నిర్వహణలో మంత్రిమండలి ప్రముఖ పాత్ర వహిస్తుంది. అసెంబ్లీ సమావేశంలో లేనప్పుడు ఆ యా జిల్లాలకు సంబంధించిన మంత్రులు, శాసన సభ్యులు, పార్లమెంట్ సభ్యులు సమావేశమై, జిల్లా సమస్యలు, జిల్లా తక్షణావసరాలు పరిశీలిస్తారని ఈ మధ్యనే ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ మర్రి చెన్నారెడ్డి ప్రకటించినారు. 31-7-78 నుంచి సత్వర సమస్యల పరిష్కారానికి రాష్ట్రంలో మంత్రివర్గ ఉపసంఘాలు ఏర్పాటుచేయ నున్నట్లు ఆయన ప్రకటించినారు. అవి వివిధ శాఖలకు సంబంధించిన విషయాలు పరిశీలించే శాశ్వత సంఘాలు. ఈ క్రింది ఐదు మంత్రివర్గ ఉపసంఘాలు రాష్ట్రంలో ఏర్పాటు చేయబడి నాయి. అవి :

1 వ *ఉపసంఘము* - పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి, ప్రణాళికలు, ఆర్థిక సమన్వయ విషయాలు.

2 వ *ఉపసంఘము* - వ్యవసాయము, నీటి పారుదల, అడవులు.

3 వ *ఉపసంఘము* - బలహీన వర్గాలకు సంబంధించిన పథకాలు, సాంఘిక సంక్షేమము, స్త్రీ శిశు సంక్షేమము.

4 వ *ఉపసంఘము* - విద్య, ఆరోగ్యము, గృహనిర్మాణము, పంచాయతీరాజ్ వ్యవహారాలు.

5 వ *ఉపసంఘము* - శాంతి భద్రతలు, లెజిస్లేటివ్ విషయాలు.

మంత్రిమండలి రాష్ట్ర ప్రయోజనాలు దృష్టిలో పెట్టుకొని ప్రణాళికలు రూపొందించి అమలుపరచవలె. రాష్ట్రంలో శాంతి భద్రతలు కాపాడటం, ప్రజా సంక్షేమ కార్యక్రమాలు చేపట్టి అమలుపరచడం, పారిశ్రామికంగా రాష్ట్రాన్ని అభివృద్ధిచేసి నిరుద్యోగ సమస్య నిర్మూలించడం, రాష్ట్రాన్ని ఆర్థికంగా అభివృద్ధిచేయడం దీని విధి. విద్య, వైద్య సహాయము, ప్రజారోగ్యము వంటి ప్రజాహిత కార్యక్రమాలు నెరవేర్చవలె. సాంస్కృతిక కార్యక్రమాలు, చేతి పనులు, కళలు ప్రోత్సహించవలె. ఒక్కమాటలో చెప్పవలెనంటే రాష్ట్రాన్ని వివిధ రంగాలలో ముందుకు నడిపించి రాష్ట్ర ప్రజల భౌతిక, నైతిక ప్రగతికి గట్టి పునాది వేయడం మంత్రిమండలి విధి. వారి శక్తి సామర్థ్యాలు, నైతిక ప్రవర్తన, దూరదృష్టి, నైపుణ్యమే దీనికి ఆధారాలు,

## ముఖ్యమంత్రి

## (Chief Minister)

రాష్ట్రప్రభుత్వ రథసారథి ముఖ్యమంత్రి. మంత్రిమండలిలో ముఖ్యమంత్రి ప్రథముడు. ఆయన మంత్రిమండలికి, గవర్నర్‌కు మధ్య వారధివలె పనిచేస్తాడు. మంత్రిమండలి నిర్ణయాలు గవర్నర్‌కు, ఆయన అభిప్రాయాలు మంత్రిమండలికి తెలియజేయడం ఆయన విధి. రాష్ట్ర మంత్రివర్గంలో ఉండవలసిన మంత్రులను అతడు తన ఇష్టప్రకారం ఎంపికజేసు కొంటాడు. మంత్రులు అతని అభీష్టం ప్రకారం పదవిలో ఉంటారు. మంత్రికి, ముఖ్యమంత్రికి మధ్య అభిప్రాయభేదాలు వస్తే మంత్రి రాజీనామా ఇవ్వవలె; లేకపోతే గవర్నర్‌తో చెప్పి అతడు వారిని మంత్రివర్గం నుంచి తొలిగిస్తాడు. మంత్రుల నియామకంలోను, తొలిగింపు

లోను ముఖ్యమంత్రి ప్రధానంగా తన రాజకీయ స్థితిగతులు అంచనా వేసుకొని తగిన నిర్ణయాలు తీసుకోవలె; లేదా చిక్కుల పాలవుతాడు. మంత్రులు కూడా పలుకుబడి గల పార్టీ నాయకులే కాబట్టి వారితో తగాదా పడేటప్పుడు వారి బలాబలాలు తెలుసుకొని నడుచుకోవలె. మంత్రుల ఎంపికలో నేడు కుల, మత, ప్రాంతీయ వర్గతత్వాలు, ఆశ్రిత పక్షపాతము, రాజకీయ ఒత్తిడులు, స్వప్రయోజనాలు చోటు చేసుకుంటున్నాయి. కొన్ని సందర్భాలలో ముఖ్యమంత్రుల ఎంపికతో కూడా పార్టీ అధిష్టానవర్గం కలుగజేసుకొని ముఖ్యమంత్రులను మార్చిన సందర్భాలు, కొత్తవారిని, శాసన సభ్యులు కాని వారిని ముఖ్యమంత్రులుగా నియమించిన సందర్భాలు కూడా ఉన్నాయి. అటువంటి ముఖ్యమంత్రులు రాష్ట్ర శాసన సభా పార్టీలో మెజారిటీ సభ్యుల అభిమానం పొందలేకపోవడం తరవాత సమస్యలు ఎదుర్కోవలసి రావడం జరుగుతున్నది.

ముఖ్యమంత్రి రాష్ట్ర శాసన సభకు నాయకుడు. శాసన సభా కార్యక్రమాలను స్పీకర్ ముఖ్యమంత్రి, ప్రతిపక్ష నాయకునితో సంప్రదించి నిర్ణయిస్తాడు. శాసన సభలో ప్రశ్నోత్తరాల సమయంలోను, చర్చలలోను ముఖ్యమంత్రి తన మంత్రివర్గసహచరులకు పూర్తిసహకారం ఇవ్వవలె. వారు ఇరకాటంలో పడేటట్లు ఉంటే వారిని సమర్థించి చిక్కులనుంచి బయటకు లాగవలె. పార్టీ సభ్యులు గాని, మంత్రులుగాని తనతో సహకరించక పోయినా లేదా శాసన సభలో మెజారిటీ కోల్పోయే ప్రమాదమున్నా చివరి ప్రయత్నంగా శాసన సభను రద్దుచేసి తిరిగి సాధారణ ఎన్నికలు జరిపించమని ముఖ్యమంత్రి గవర్నర్‌కు సలహా ఇవ్వవచ్చు. తమ తమ నియోజకవర్గాలలో ప్రజోపయోగ కార్యక్రమాలు, పనులు చేయించుకోవడంలో శాసన సభ్యులు, మంత్రులు ముఖ్యమంత్రి మీద ఆధారపడక తప్పదు. తనకున్న అధికారాలతో అతడు వారు, తన విధానాలు బలపరిచేటట్లు చూసుకొంటాడు.

ముఖ్యమంత్రి మంత్రులకు శాఖలు కేటాయిస్తాడు. మంత్రివర్గంలోను మంత్రుల శాఖలలోను అతడు మార్పులు చేయవచ్చు. మంత్రిత్వ శాఖల నిర్వహణలో అతడు మంత్రులకు సహాయపడతాడు. వివిధ శాఖల మధ్య సమన్వయం తెస్తాడు. మంత్రివర్గ సమావేశాలకు అధ్యక్షత వహిస్తాడు. మంత్రుల మధ్య తలెత్తిన వివాదాలు పరిష్కరించి వారు ఒక జట్టుగా పనిచేసేటట్లు చూస్తాడు. రాష్ట్ర ప్రజల ఆశయాలకు, ఆకాంక్షలకు ముఖ్యమంత్రి ఆశాజ్యోతి. రాష్ట్ర పరిపాలనా పటుత్వం ముఖ్యమంత్రి శక్తి యుక్తులపైన, సామర్థ్యము, చిత్తశుద్ధి, నీతి నిజాయితీలపైన ఆధారపడి ఉంటుంది. కేంద్ర పరిపాలనా వ్యవస్థలో ప్రధానమంత్రికి ఎటువంటి పరపతి, పలుకుబడి, పాత్ర ఉంటుందో రాష్ట్ర స్థాయిలో ముఖ్యమంత్రికి అటువంటి పాత్ర ఉంటుంది. కేంద్ర మంత్రివర్గంలో స్థానం పొందడానికి, కేంద్ర నాయకత్వం వహించడానికి రాష్ట్ర ముఖ్యమంత్రి పదవి ఒక సోపానము.

## రాష్ట్ర శాసన సభ
## (State Legislature)

రాజ్యాంగం అన్ని రాష్ట్రాలకు శాసన నిర్మాణం నిమిత్తం ఒక శాసన సభను ఏర్పాటు చేసింది. కాని అన్ని రాష్ట్రాలలో శాసన సభ నిర్మాణం ఒకే విధంగా లేదు. ఆంధ్రప్రదేశ్, బీహార్, మహారాష్ట్ర, జమ్ము-కాశ్మీర్, తమిళనాడు, కర్నాటక, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్

ఈ 8 రాష్ట్రాలలోని శాసన సభలలో రెండుసభలు (ద్వంద్వ శాసన సభ - Bicameral legislature) ఉన్నాయి అస్సామ్, గుజరాత్, కేరళ, ఒరిస్సా. రాజస్థాన్ మొదలైన మిగిలిన రాష్ట్రాలలో ఏక శాసన సభ (Unicameral legislature) ఉంది. శాసన సభలో ఒకే సభ ఉంటే ఆ సభను విధాన సభ (Legislative assembly) అంటారు. రెండు సభలు ఉంటే ఎగువ సభను విధాన పరిషత్తు Legitlative council) అని, దిగువ సభను విధాన సభ (Legislative Assembly) అని పిలుస్తారు. రాష్ట్ర గవర్నర్ రాష్ట్ర శాసన సభలో ఒక భాగము.

రాజ్యాంగంలోని 169 వ నిబంధన ప్రకారం రాష్ట్రంలోని ఎగువ సభను రద్దుచేయు డానికి లేదా దానిని నెలకొల్పడానికి ఆ రాష్ట్ర శాసన సభలోని మొత్తం సంఖ్యలో సగానికి పైగా సభ్యులు ఆ మేరకు ఒక తీర్మానాన్ని మొదట ఆమోదించవలె. దానిని తరవాత ఆ రోజు సభకు హాజరయి ఓటింగ్‌లో పాల్గొనే వాటిలో 2/3 వంతు మెజారిటీ సభ్యులు ఆమో దించవలె. దానిని పార్లమెంట్‌లోని ఉభయ సభలు సాధారణ మెజారిటీతో ఆమోదిస్తే విధాన పరిషత్తు ఏర్పాటు చేయవచ్చు లేదా రద్దు చేయవచ్చు.

## విధాన పరిషత్తు (Legislative Council)

విధాన పరిషత్తును శాసన మండలి అని కూడా అంటారు. దీనిలోని సభ్యులను "మెంబర్ ఆఫ్ ది లెజిస్లేటివ్ కౌన్సిల్" (M. L. C.) అని అంటారు. శాసనమండలి సభ్యుల సంఖ్య ఆ రాష్ట్ర విధాన సభలోని సభ్యుల సంఖ్యలో 1/4 వంతుకు మించకుండాను 40 కి తగ్గకుండాను ఉండవలె. 7 వ రాజ్యాంగ సవరణ ఈ గరిష్ఠ పరిమితిని 1/4 వంతు నుంచి 1/3 వంతుకు పెంచింది. ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్ సభ్యత్వం 90.

ఈ సభలోని సభ్యులను ఐదు రకాలుగా ఎంపిక చేస్తారు. వీరిలో 1/3 వంతు సభ్యు లను విధానసభ సభ్యులు ఎన్నుకొంటారు. మరొక 1/3 వంతు సభ్యులను రాష్ట్రంలోని స్థానిక సంస్థల ప్రతినిధులు ఎన్నుకొంటారు. 1/12 వంతు సభ్యులను రాష్ట్రంలోని పట్టభద్రులు, మరొక 1/12 వంతు సభ్యులను ఉపాధ్యాయులు, పోగా మిగిలిన 1/6 వంతు సభ్యులను గవర్నర్ కళలు, విజ్ఞానము, సాహిత్యము, సంఘ సేవ మొదలైన రంగాలలో ప్రముఖులైన వారిని ఎంపికజేసి సభ్యులుగా నియమిస్తాడు. విధాన పరిషత్తు పరోక్షంగా నైష్పత్తిక ప్రాతి నిధ్యం ప్రకారం ఎన్నికయ్యే సభ.

విధాన పరిషత్తుకు పోటీచేసే వ్యక్తి 30 సంవత్సరాలు నిండి భారతీయ పౌరుడై ఉండవలె. అతనికి పార్లమెంట్ నిర్ణయించిన ఇతర అర్హతలు ఉండవలె. ఇది శాశ్వత సభ. దీనిలోని సభ్యులలో 1/3 వంతు ప్రతి 2 సంవత్సరాలకు ఒకసారి పదవీ విరమణ చేస్తారు. అంటే ప్రతి సభ్యుడు 6 సంవత్సరాలపాటు పదవిలో ఉంటాడు. శాసన మండలి సమావేశాల నిర్వహణకు ఛైర్మన్, డిప్యూటీ ఛైర్మన్‌లను సభ్యులు తమ నుంచి ఎన్నుకొంటారు.

## విధాన సభ (Legislative Assembly)

రాష్ట్ర విధాన సభలోని సభ్యుల సంఖ్య రాష్ట్ర జనాభానుబట్టి నిర్ణయమవుతుంది. సుమారు 75 వేలమంది ఓటర్లు ఉండే ఒక ప్రాంతాన్ని ఒక నియోజకవర్గంగా విభజించి

ఒక్కొక్క నియోజకవర్గంనుంచి ఒక్కొక్క సభ్యుని ప్రత్యక్ష, రహస్య ఓటింగ్ విధానం ద్వారా నియోజకవర్గంలోని 21 సంవత్సరాలు నిండిన వయోజనులైన ఓటర్లు ఎన్నుకొంటారు. షెడ్యూల్ కులాలకు, తరగతుల వారికి కొన్ని నియోజకవర్గాలు వీటిలో రిజర్వ్ చేస్తారు. ఆ నియోజకవర్గాలనుంచి వారు మాత్రమే పోటీచేయవలె. దీని ద్వారా ఆ వర్గాలు, కులాల వారికి శాసన సభలో సభ్యత్వం లభింపజేసినారు. ఆంగ్లోఇండియన్ వర్గానికి చెందిన సభ్యులు ఎవరూ ఎన్నుకోబడనప్పుడు గవర్నర్ ఆ వర్గానికి చెందిన వారిని కొందరిని సభ్యులుగా నియమించ వచ్చు. రాజ్యాంగ రీత్యా రాష్ట్ర విధానసభలో 60 మందికి తక్కువ కాకుండాను 500 కి మించకుండాను సభ్యులు ఉండవలె. ఉత్తరప్రదేశ్ విధాన సభలో అన్నిటికంటె ఎక్కువ 430 స్థానాలు, సిక్కిం విధాన సభలో అన్నిటికంటె తక్కువ 30 స్థానాలు ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ విధాన సభలో మొత్తం 301 స్థానాలున్నాయి. ఈ సభలోని సభ్యులను మెంబర్ ఆఫ్ ది లెజిస్లేటివ్ అసంబ్లీ (M. L A.) అని అంటారు.

ఈ సభకు పోటీచేసే వ్యక్తి 25 సంవత్సరాలు నిండిన భారతీయ పౌరుడై ఉండవలె. అతనికి పార్లమెంట్ నిర్ణయించే యితర అర్హతలు ఉండవలె. ఒకే వ్యక్తి రెండు సభలలో సభ్యుడు కారాదు. ఈ పదవికి పోటీచేసే వ్యక్తి ఆదాయాన్నిచ్చే ప్రభుత్వోద్యోగంలో ఉండకూడదు. సభ అనుమతిలేకుండా 60 రోజులు మించి హాజరు కాకపోతే సభ్యత్వాన్ని కోల్పోతాడు.

ఈ సభ కాలపరిమితి 5 సంవత్సరాలు. అత్యవసర పరిస్థితిలో దీని కాలపరిమితి ఒక్కొక్కమారు ఒక సంవత్సరంపాటు పొడిగించవచ్చు. ఐదు సంవత్సరాలు పూర్తి కాక ముందే ముఖ్యమంత్రి సలహాపై దీనిని గవర్నర్ రద్దుచేసి తిరిగి ఎన్నికలు జరిపించవచ్చు. క్రొత్త సభకు ఆరు నెలలలోగా ఎన్నికలు జరిపించవలె. గవర్నర్ కనీసం ఆరునెలలకొకసారి శాసనసభ సమావేశాలు జరిపించవలె.

శాసనసభ కార్యక్రమాల నిర్వహణకు సభ్యులు తమలో ఒకరిని స్పీకర్‌గాను, మరొకరిని డిప్యూటీ స్పీకర్‌గాను ఎన్నుకొంటారు. సభా కార్యక్రమాలు జరపడానికి కనీసం హాజరు కావలసిన సభ్యుల సంఖ్య (Quorum - కోరమ్) మొత్తం సభ్యత్వంలో 1/10 వంతు లేదా 10 మంది సభ్యులు.

రాష్ట్ర శాసన సభ్యులకు 1974 నుంచి నెలకు రు॥ 350/- వేతనం లభిస్తున్నది. జనవరి 1974 నుంచి నియోజకవర్గ భత్యం నెలకు రు॥ 250/- అదనంగా లభిస్తున్నది. అంటే మొత్తం నెలకు రు॥ 600/- లభిస్తున్నది. సమావేశకాలంలో రోజు రు॥ 30/- భత్యం లభిస్తుంది రాష్ట్రరాజధానిలో వసతిగృహం ఉంటుంది. సమావేశాలకు రానూపోనూ మొదటి తరగతి రైలు లేదా విమాన చార్జీ ఇస్తారు. ఉచిత వైద్య సహాయం లభిస్తుంది. 1-11-76 నుంచి ఐదు సంవత్సరాలు సభ్యుడుగా ఉన్నవారికి రు॥ 200/- నుంచి రు॥ 500/- వరకు పింఛను లభించే ఏర్పాటు చేసినారు. రాష్ట్రంలో ఉచిత బస్సు ప్రయాణ సౌకర్యముంది.

శాసనసభ అధికారాలు - విధులు

1. *శాసన నిర్మాణము:* రాష్ట్ర శాసనసభ రాష్ట్ర జాబితా, ఉమ్మడి జాబితాలోని అన్ని అంశాలపైన శాసనాలు చేస్తుంది. ఉమ్మడి జాబితాలోని అంశాలపైన రాష్ట్ర శాసనసభ

చేసిన శాసనాలు అదే అంశంపై కేంద్రం చేసిన శాసనానికి అనుగుణంగా లేకపోతే చెల్లవు. రాష్ట్రపరిపాలనకు ప్రభుత్వంగాని, లేదా ఇతర సభ్యులుగాని ప్రవేశపెట్టిన బిల్లులను అది చర్చించి ఆమోదించవచ్చు; లేదా తిరస్కరించవచ్చు. ప్రతి బిల్లును రెండు సభలు ఆమోదించవలె. ఆ పైన దానిపై గవర్నర్ అమోదముద్ర పడితే అది చట్టం అవుతుంది. విధానసభ ఆమోదించిన బిల్లును విధాన పరిషత్ తిరస్కరించినా లేదా దానికి ఆమోదయోగ్యం కాని రీతిలో సవరణలు ప్రతిపాదించినా లేదా 3 నెలల గడువులోగా విధాన పరిషత్ ఆ బిల్లుకు తన ఆమోదాన్ని తెలపకపోయినా విధానసభ అదే బిల్లును రెండవసారి ఆమోదించి విధాన పరిషత్తుకు తిరిగి పంపితే దానిని ఒక నెల లోపల విధాన పరిషత్ ఆమోదించవలె. ఈ గడువు లోగా విధాన పరిషత్ దానిని ఆమోదించినా, తిరస్కరించినా ఆ బిల్లుకు ఉభయ సభల ఆమోదం లభించినట్లుగా భావించి గవర్నర్ సమ్మతికి పంపుతారు. అంటే విధాన పరిషత్ ఒక బిల్లును అమోదించకుండా నాలుగు నెలలు మించి ఎటువంటి పరిస్థితులలోను ఉంచలేదని చెప్పవచ్చు. ఈ సభల మధ్య బిల్లులను ఆమోదించడం విషయంలో అభిప్రాయ భేదాలువస్తే కేంద్ర పార్లమెంట్‌లో మాదిరి సంయుక్త సమావేశం ఏర్పాటు చేయడానికి వీలులేదు.

ఆర్థిక బిల్లులు మినహా మిగిలిన బిల్లులను ఉభయ సభలలో ఏ సభలో అయినా ప్రవేశ పెట్టవచ్చు. శాసనసభ సమావేశంలో లేనప్పుడు ప్రభుత్వానికి అవసరమైన శాసనాలను రాష్ట్ర గవర్నర్ ఆర్డినెన్స్‌ల రూపంలో ప్రకటిస్తాడు. వాటిని శాసనసభ తరవాత సమావేశంలో ఆమోదించవలె.

2. *ఆర్థికాధికారాలు* : ఆర్థిక విషయాలలో విధానసభకు, విధానపరిషత్ కంటె ఎక్కువ అధికారాలున్నాయి. ఆర్థికబిల్లును మొదట విధానసభలో మాత్రమే ప్రవేశ పెట్టవలె. విధానసభ ఆమోదించిన ఆర్థికబిల్లును విధానపరిషత్ 14 రోజుల గడువులోగా ఆమోదించవలె. ఆ గడువు తరవాత దానిని ఆ సభ ఆమోదించినా తిరస్కరించినా అది గవర్నర్ ఆమోదానికి వెడుతుంది. బడ్జెట్‌ను ఆమోదించడానికి డిమాండ్‌లలో కోత విధించడానికి లేదా ఆమోదించడానికి, గ్రాంట్లు మంజూరు చేయడానికి శాసనసభకు అధికారముంది. కాని డిమాండ్‌లను పెంచడానికి దానికి అధికారంలేదు. కొత్తపన్నులు విధించడానికి గవర్నర్ అనుమతి కావలె.

3. *మంత్రిమండలిపై అజమాయిషీ* : రాష్ట్ర మంత్రిమండలి శాసన సభలోని దిగువసభకు సమష్టిగా బాధ్యత వహిస్తుంది. శాసనసభలో మెజారిటీ గల పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తుంది. శాసన సభ్యులు మంత్రులను ప్రశ్నలు అడగడం ద్వారాను, వాయిదా తీర్మానాలు, అభిశంసన తీర్మానాలు, బడ్జెట్‌లో కోత తీర్మానాలు, ఆమోదించడం ద్వారాను అదుపులో ఉంచుతుంది. ఈ విషయంలో విధానపరిషత్ కంటె విధానసభకు ఎక్కువ అధికారాలున్నాయి. ఎగువసభ మంత్రిమండలిపై అవిశ్వాసం ప్రకటించినా ప్రయోజనంలేదు.

4. *ఎన్నికల అధికారాలు* : విధానసభ సభ్యులు విధానపరిషత్ సభ్యులలో 1/3 వంతు మందిని ఎన్నుకొంటారు. రాష్ట్రపతి ఎన్నికలలో విధానసభ్యులు పాల్గొని ఓటువేస్తారు. రాష్ట్రంలో విశ్వవిద్యాలయాల ప్రతినిధులను ఎన్నుకొనే హక్కు ఉభయసభలకు ఉంది.

5. *రాజ్యాంగాన్ని సవరించే అధికారము* : రాజ్యాంగంలోని కొన్ని నిబంధనలను సవరించడానికి ఉద్దేశించిన బిల్లులు పార్లమెంట్ ఆమోదించిన తరవాత అధిక రాష్ట్రాల శాసన

సభల ఆమోదం కూడా పొందవలసి ఉంటుంది. ద్వంద్వ శాసనసభలు ఉన్న రాష్ట్రాలలో దానిని ఉభయసభలు ఆమోదించవలె. విధాన పరిషత్ లేనిచోట విధానసభ ఆమోదిస్తే సరిపోతుంది.

## రాష్ట్ర శాసనసభ అధికారాలపై పరిమితులు

రాజ్యాంగం రాష్ట్ర శాసనసభలపై ఈ కింది పరిమితులు విధించింది.

1. దేశంలో అత్యవసర పరిస్థితి ప్రకటించినప్పుడు రాష్ట్ర శాసన సభలను అధ్యక్షుడు రద్దుచేసి వాటి అధికారాలు పార్లమెంట్‌కు అప్పగించవచ్చు. అటువంటి పరిస్థితులలో పార్లమెంట్‌కు రాష్ట్ర పరిపాలనకు కావలసిన శాసనాలు చేసే హక్కు లభిస్తుంది.

2. కొన్ని బిల్లులను రాష్ట్ర శాసన సభలో ప్రవేశపెట్టేముందు రాష్ట్రపతి అనుమతి కావలె.

3. గవర్నర్ కొన్ని బిల్లులను వెంటనే ఆమోదించక రాష్ట్రపతి ఆమోదానికి పంపవచ్చు.

4 ఏదైనా ఒక రాష్ట్రానికి లేదా రాష్ట్రాలకు జాతీయ ప్రయోజనాల దృష్ట్యా పార్లమెంట్ రెండు సంవత్సరాల పాటు శాసన నిర్మాణ బాధ్యతను స్వీకరించవలెనని, రాజ్యసభ 2/3 వంతు మెజారిటీతో తీర్మానిస్తే పార్లమెంట్‌కు రాష్ట్రాల విషయంలో శాసన నిర్మాణంచేసే హక్కు లభిస్తుంది.

# హైకోర్టు

దేశంలోని అన్ని పెద్ద రాష్ట్రాలలోను న్యాయనిర్వహణకై రాజ్యాంగం హైకోర్టులను ఏర్పాటు చేసింది. అవి రాష్ట్ర స్థాయిలో ఉన్నత న్యాయస్థానాలు. 1957 లో చేసిన 7 వ రాజ్యాంగ సవరణ అవసరమైతే కొన్ని రాష్ట్రాలకు కలిపిగాని, కేంద్రపాలిత ప్రాంతాలకుకలిపిగాని ఒకే హైకోర్టు ఏర్పాటు చేసుకోవచ్చునని సూచిస్తున్నది. హైకోర్టుల భౌగోళిక అధికార పరిధిని (Territorial jurisdiction) పార్లమెంట్ నిర్ణయిస్తుంది.

## న్యాయమూర్తుల నియామకము

హైకోర్టులో ఒక ప్రధాన న్యాయమూర్తి, పార్లమెంట్ నియమించిన మేరకు కొంతమంది ఇతర న్యాయమూర్తులు ఉంటారు. వీరి సంఖ్య అన్ని రాష్ట్రాలలో ఒకే విధంగా లేదు. 1956లో చేసిన 7వ రాజ్యాంగ సవరణ ప్రకారం హైకోర్టులో పని ఒత్తిడి ఎక్కువగా ఉంటే అవసరాన్నిబట్టి 2 సంవత్సరాల కాలానికి తాత్కాలిక న్యాయమూర్తులను నియమించవచ్చు. ఒక న్యాయమూర్తి సెలవు పెట్టినా విధులు నిర్వహించే స్థితిలో లేకపోయినా ఆయన స్థానంలో తాత్కాలికంగా మరొకరిని నియమించవచ్చు.

హైకోర్టు ప్రధానన్యాయమూర్తిని రాష్ట్రపతి, సుప్రీమ్‌కోర్టు ప్రధాన న్యాయమూర్తితోను, గవర్నర్‌తోను సంప్రదించి నియమిస్తాడు. ఇతర న్యాయమూర్తులను నియమించేటప్పుడు ఆయన హైకోర్టు ప్రధాన న్యాయమూర్తితో కూడా సంప్రదించి నియమిస్తాడు. హైకోర్టు

న్యాయమూర్తులను ఒక కోర్టు నుంచి మరొక దానికి బదిలీ చేయవచ్చు. దీనివల్ల సమర్థులైన న్యాయమూర్తుల సేవలను వివిధ రాష్ట్రాలు పొందవచ్చు.

ఈ కింది పట్టిక ఇండియాలో వివిధ రాష్ట్రాలలో గల హైకోర్టులు వాటి భౌగోళిక అధికార పరిధి, వాటి ఉనికి, వాటిలో పనిచేసే న్యాయమూర్తుల సంఖ్యను వివరిస్తుంది :

| వరస సంఖ్య | హైకోర్ట్ పేరు | భౌగోళిక అధికార పరిధి | ఉనికి | న్యాయ మూర్తుల సంఖ్య |
|---|---|---|---|---|
| 1 | అలహాబాద్ | ఉత్తరప్రదేశ్ | అలహాబాద్ | 34 |
| 2 | ఆంధ్రప్రదేశ్ | ఆంధ్రప్రదేశ్ | హైదరాబాద్ | 18 |
| 3 | అస్సామ్ | అస్సామ్, నాగాలాండ్, మేఘాలయా, మణిపూర్, త్రిపుర | గౌహతి | 6 |
| 4 | బొంబాయి | మహారాష్ట్ర | బొంబాయి | 30 |
| 5 | కలకత్తా | ప. బెంగాల్, అండమాన్ నికోబార్ దీవులు | కలకత్తా | 37 |
| 6 | ఢిల్లీ | ఢిల్లీ | న్యూఢిల్లీ | 17 |
| 7 | గుజరాత్ | గుజరాత్ | అహమ్మదాబాద్ | 16 |
| 8 | హిమాచల్‌ప్రదేశ్ | హిమాచల్ ప్రదేశ్ | సిమ్లా | 3 |
| 9 | జమ్ము, కాశ్మీర్ | జమ్ము, కాశ్మీర్ | శ్రీనగర్ | 5 |
| 10 | కర్నాటక | కర్నాటక | బెంగుళూరు | 1? |
| 11 | కేరళ | కేరళ, లక్కదీవి, మినికోయ్, అమిన్‌దీవి | కొచ్చిన్ | 15 |
| 12 | మధ్యప్రదేశ్ | మధ్యప్రదేశ్ | జబల్‌పూర్ | 20 |
| 13 | మద్రాసు | తమిళనాడు | మద్రాస్ | 20 |
| 14 | ఒరిస్సా | ఒరిస్సా | కటక్ | 7 |
| 15 | పాట్నా | బీహార్ | పాట్నా | 23 |
| 16 | పంజాబ్ | పంజాబ్, హర్యానా | చండీఘర్ | 17 |
| 17 | రాజస్థాన్ | రాజస్థాన్ | జోధ్‌పూర్ | 10 |

అర్హతలు

హైకోర్ట్ న్యాయమూర్తిగా నియమించబడే వ్యక్తి భారతీయ పౌరుడై ఉండవలెను.

రాష్ట్రంలోని దిగువ న్యాయస్థానంలో 10 సంవత్సరాలు న్యాయాధిపతిగా కాని లేదా హైకోర్టులో 10 సంవత్సరాలు న్యాయవాదిగా కాని అనుభవం కలవారై ఉండవలె. పూర్వానుభవం లేని వారిని, న్యాయశాస్త్రకోవిదులు కానివారిని హైకోర్టులో న్యాయమూర్తులుగా నియమించకూడదు. వీరు గవర్నర్ సమక్షంలో తమ బాధ్యతలు సక్రమంగా నిర్వహిస్తామని, నిష్పక్షపాతంగా వ్యవహరిస్తామని, రాజ్యాంగాన్ని కాపాడతామని ప్రమాణం చేయవలె.

## పదవీ కాలము, పని షరతులు

16 వ రాజ్యాంగ సవరణ ప్రకారం వీరి పదవీ విరమణ వయసు 62 సంవత్సరాలు. ముందుగానే రాజీనామా చేయవచ్చు. సుప్రీమ్ కోర్ట్ న్యాయమూర్తులవలె పార్లమెంట్ 2/3 వంతు మెజారిటీతో ఒక అభిశంసన తీర్మానం ఆమోదిస్తే రాష్ట్రపతి వీరిని పదవినుంచి తొలగించవచ్చు. 7 వ రాజ్యాంగ సవరణ ప్రకారం పదవీ విరమణ తరవాత వీరు తాము పనిచేసిన హైకోర్ట్ మినహా ఇతర హైకోర్టులలోగాని, సుప్రీమ్ కోర్టులోగాని ప్రాక్టీస్ చేయవచ్చు.

## వేతనాలు

హైకోర్ట్ ప్రధాన న్యాయమూర్తికి నెలకు రు. 4000/-, ఇతర న్యాయమూర్తులకు రు. 3000/- వేతనాలు లభిస్తాయి. వీరికి ఇతర సౌకర్యాలు కల్పిస్తారు. వీరి వేతనాలు రాష్ట్ర సంఘటిత నిధి (Consolidated fund) నుంచి ఇస్తారు. అత్యవసర పరిస్థితి ప్రకటించి నప్పుడు మినహా వీరి వేతనాలు తగ్గించడానికి వీలులేదు.

## హైకోర్ట్ అధికారాలు

1. *ఒరిజినల్ అధికార పరిధి* : 226 వ నిబంధన ప్రకారం హక్కుల రక్షణ కొరకు హైకోర్ట్ ప్రత్యేక "రిట్‌లు" (Writs) జారీ చేయవచ్చు. వ్యక్తులయొక్క, సంస్థల యొక్క, ప్రభుత్వంయొక్క హక్కులు కాపాడటానికి నిలుపుదల ఉత్తరువులు (Stay orders) ఇవ్వవచ్చు. అయితే ప్రభుత్వవాదం వినకుండా ఆ విధమైన ఉత్తరువులు ఇవ్వకూడదు. వివాహాలు, వీలునామాలు, నౌకా సంబంధమైన వివాదాలు, కోర్ట్ ధిక్కరణ నేరాలు మొదలైన వాటిలో దీనికి ఒరిజినల్ అధికారాలున్నాయి. సాధారణంగా హైకోర్ట్ ఏ జిల్లాలో ఉంటుందో ఆ జిల్లాకు అది జిల్లా కోర్ట్‌గా కూడా పనిచేస్తుంది. కలకత్తా, మద్రాస్, బొంబాయి హైకోర్ట్‌లకు సివిల్, క్రిమినల్ నేరాలపై కూడా ఒరిజినల్ అధికారాలున్నాయి. అటువంటి కేస్‌ల విలువ కనీసం రు. 20,000 ఉండవలె. హైకోర్ట్ రాజ్యాంగాన్ని వ్యాఖ్యానించి అర్థవివరణ చెబుతుంది.

2. *అప్పీళ్ళ అధికార పరిధి* : రాష్ట్ర న్యాయవ్యవస్థలో ఇది ఉన్నతమైనది. జిల్లా కోర్టుల నుంచి వచ్చే సివిల్, క్రిమినల్ అప్పీళ్ళను అది విచారణ చేస్తుంది. ఈ కోర్ట్ తీర్పులు మున్ముందు దిగువ కోర్టులకు మార్గదర్శకంగా ఉంటాయి.

3. *దిగువ కోర్టులపై అజమాయిషీ* : హైకోర్ట్ న్యాయమూర్తులు దిగువ కోర్టులు పని చేస్తున్న తీరుతెన్నులు పరిశీలిస్తారు. వాటిని అప్పుడప్పుడు తనిఖీ చేస్తారు. వాటి నిర్వహణకు

నియమ నిబంధనలు రూపొందిస్తారు. ట్రిబ్యునల్స్‌కు పని అప్పగించి వాటి నిర్వహణ పర్యవేక్షించడం హైకోర్ట్ విధి. ఇది కోర్ట్‌లో పనిచేసే ఉద్యోగుల వేతనాలు నిర్ణయిస్తుంది. ప్రత్యేక ఉత్తరువులద్వారా కేస్‌లను ఒక కోర్ట్ నుంచి మరొక కోర్ట్‌కు బదిలీ చేస్తుంది; లేదా కేస్‌లను తిరిగి విచారణ చేయమని ఆదేశిస్తుంది. హైకోర్ట్ తీర్పులపై సుప్రీమ్ కోర్ట్‌కు హైకోర్ట్ అనుమతితో అప్పీలు చేసుకోవచ్చు. దీని తీర్పులను ప్రభుత్వంకాని, శాసన సభలుగాని, ప్రైవేట్ వ్యక్తులుగాని విమర్శించకూడదు.

## జిల్లా న్యాయవ్యవస్థ

జిల్లాలో ఉత్పన్నమయ్యే సివిల్, క్రిమినల్ కేసుల విచారణకు విడివిడిగా సివిల్, క్రిమినల్ కోర్ట్‌లు ఉన్నాయి.

### సివిల్ కోర్ట్‌లు

జిల్లాకొక జిల్లా సివిల్ కోర్ట్ ఉంది. దానికి జిల్లా జడ్జి లేదా జిల్లా అడిషనల్ జడ్జి అధిపతి. ఆయనను గవర్నర్ పబ్లిక్ సర్వీస్‌లు నిబంధనల ప్రకారం హైకోర్ట్ ప్రధాన న్యాయమూర్తితో సంప్రదించి నియమిస్తాడు. పదవినుంచి తొలగించే అధికారం కూడా ఆతనికి ఉంది. జిల్లాలోని అన్ని సివిల్ కోర్ట్‌లు అతని అధికారానికి లోబడి పనిచేస్తాయి. జిల్లాకోర్ట్ వివాహం, విడాకులు, వారసత్వం, వ్యాపారం, హిందూ-ముస్లింలకు సంబంధించిన కేస్‌లు విచారణ చేస్తుంది. దీనికి ఒరిజినల్, అప్పీళ్ళ అధికారాలున్నాయి.

జిల్లాలో కేస్‌ల ఒత్తిడి తగ్గించడానికి సీనియర్ జడ్జి కోర్ట్‌లు కూడా ఉంటాయి. అవి రు. 5000/- నుంచి రు. 1000/- వరకు జరిమానా విధించగల కేసులను చూస్తాయి. తాలూకా కేంద్రాలలో సబ్ కోర్ట్‌లు లేదా సబ్ జడ్జి కోర్ట్‌లు లేదా సబార్డినేట్ కోర్ట్ ఉంటాయి. అవి రు, 1000/-నుంచి రు. 500/-రూపాయల వరకు జరిమానా విధించగల కేసులను చూస్తాయి. తాలూకాలో తాలూకా మునిసిఫ్ కోర్ట్ ఉంటుంది. దాని తీర్పులపై ఆస్తి విలువను బట్టి ఆకోర్ట్, అనుమతిస్తే సబ్‌కోర్ట్‌కు జిల్లాకోర్ట్‌ప అప్పీలు చేసుకోవచ్చు. ఇవి రు. 500/- లోపు జరిమానా విధించగలదు.

మునిసిపల్ నేరాలకు ఆనరరీ బెంచ్ కోర్ట్‌లు మునిసిపాలిటీలుండే పట్టణాలలో ఉంటాయి. పంచాయతీ చట్టం ద్వారా కొన్నిచోట్ల గ్రామాలలో న్యాయ పంచాయతీలు కూడా పని చేస్తున్నాయి. అవి రు. 250/- విలువైన సివిల్ కేసులను విచారించి రు. 10/- వరకు జరిమానా విధించగలవు. గ్రామాలలో వచ్చే చిన్న చిన్న తగాదాల పరిష్కారానికి ఇవి తోడ్పడతాయి.

### క్రిమినల్ కోర్ట్‌లు

జిల్లాలోని క్రిమినల్ కోర్ట్‌లలో "సెషన్స్‌కోర్ట్" ఉన్నతమైనది. జిల్లా జడ్జి లేదా సెషన్స్ జడ్జి దీనికి అధిపతి. ఒక్కొక్కప్పుడు ఒకే న్యాయస్థానం సివిల్ కేసులు విచారణ జరిగేటప్పుడు సివిల్ కోర్ట్‌గాను, క్రిమినల్ కేసులు విచారణ జరిగేటప్పుడు సెషన్స్ కోర్ట్‌గాను కూడా వ్యవహరిస్తుంది ఇవి ఇండియన్ పీనల్ కోడ్ (I. P. C.), క్రిమినల్ ప్రొసీజర్ కోడ్

(C. P. C.) ప్రకారం తీర్పులు ఇస్తాయి. ఇవి యావజ్జీవ కారాగార శిక్ష వరకు అన్ని శిక్షలు విధించవచ్చు. ఇది విధించిన మరణ శిక్షను హైకోర్టు ధృవీకరించవలెను.

జిల్లాలో అవసరానికి చాలినన్ని సబ్ కోర్టులు ఉన్నాయి. అవి సివిల్ కేసులే గాక క్రిమినల్ కేసులు కూడా విచారిస్తాయి. క్రిమినల్ కేసులను అవి విచారణ చేసేటప్పుడు వాటిని అసిస్టెంట్ సెషన్స్ కోర్ట్ అంటారు. ఇవి కాక జిల్లా స్థాయిలో కావలసినన్ని I క్లాస్ మేజిస్ట్రేట్ కోర్టులు ఉన్నాయి. అవి క్రిమినల్ కేసులు మాత్రమే విచారించి 2 సం॥ కఠిన శిక్ష, రూ. 2000/- జరిమానా విధించగలవు. I క్లాస్ మేజిస్ట్రేట్‌కు మునిసిఫ్‌తో సమాన హోదా ఉంటుంది. అందుచేత ఒక్కొక్కచోట క్రిమినల్ కేసులు తక్కువ ఉంటే ఎడిషినల్ - మునిసిఫ్ - కమ్ - ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్‌ను నియమిస్తారు. వీరు సివిల్, క్రిమినల్ కేసులు రెండూ విచారణ చేస్తారు.

తాలూకా స్థాయిలో II క్లాస్ మేజిస్ట్రేట్, కోర్టులు ఉన్నాయి. ఇవి క్రిమినల్ కేసులు విచారిస్తాయి. నేరస్థులకు ఆరు నెలలవరకు కారాగార శిక్ష, రూ. 500/- వరకు జరిమానా విధించవచ్చు. పెద్ద గ్రామాలు, టౌన్‌లలో III క్లాస్ మేజిస్ట్రేట్ కోర్టులు కూడా ఉన్నాయి. అవి ఒక నెలవరకు శిక్ష విధించి రూ. 100/- జరిమానా విధించగలవు.

ఉన్నత న్యాయస్థానాలు దిగువ కోర్టుల రికార్డులు, లెక్కలు పరిశీలించవచ్చు. దిగువ న్యాయస్థానంలో న్యాయమూర్తి తన అధికారానికి లోబడి ఇచ్చిన తీర్పులోని లోపాలకు సంజాయిషీ కోరే అధికారం మాత్రం వాటికి లేదు. అయితే ఆ తీర్పులు చట్టవిరుద్ధమనిపిస్తే వాటిని రద్దు చేయవచ్చు. ఇవికాక రాష్ట్రంలో లాండ్ రెవిన్యూ పాలనకు రెవిన్యూ కోర్టులు వేరుగా ఉన్నాయి.

## ప్రశ్నలు

### వ్యాస ప్రశ్నావళి

1. రాష్ట్ర గవర్నర్‌ను గురించి క్లుప్తంగా ఒక వ్యాసం వ్రాయండి.
2. రాష్ట్ర శాసనసభ నిర్మాణము, అధికారాలు, విధులు వివరించండి.
3. రాష్ట్ర హైకోర్ట్ పనిచేసే విధానం వివరించండి.

### సంక్షిప్త సమాధాన ప్రశ్నావళి

1. రాష్ట్ర మంత్రిమండలి అధికారాలు, విధులు విశదీకరించండి.
2. రాష్ట్ర పరిపాలనలో ముఖ్యమంత్రి పాత్ర ఎటువంటిది.
3. జిల్లాలో న్యాయవ్యవస్థ పనిచేస్తున్న విధానం వివరించండి.
4. మీ రాష్ట్రంలో విధాన పరిషత్ నిర్మాణాన్ని, అధికారాలను విపులీకరించండి.

# 9

# కేంద్ర-రాష్ట్ర సంబంధాలు

సమాఖ్య విధానంలో కేంద్ర-రాష్ట్ర సంబంధాలు అతిముఖ్యమైన అంశము. భారత రాజ్యాంగవేత్తలు సమాఖ్య విధానాన్ని రాజ్యాంగంలో సూచించినప్పటికీ, వారు పూర్తిగా ఇటు అమెరికన్ సమాఖ్య విధానాన్నిగాని, అటు సోవియట్ యూనియన్ సమాఖ్య వ్యవస్థను గాని అనుసరించలేదు. కాగా ఆనాటి దేశకాల పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని ఆచరణ సాధ్యమైన పద్ధతిలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను రూపొందించినారు.

1977 మార్చి లోకసభ ఎన్నికలలో జనతాపార్టీ కేంద్రంలో అధికారంలోకి వచ్చిన తరవాత కేంద్ర-రాష్ట్ర సంబంధాలను రాజ్యాంగపరంగా పునఃపరిశీలించవలెనని కొన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులు వాదించడం ప్రారంభించినారు. కేంద్ర-రాష్ట్ర సంబంధాలలో మార్పులు అవసరమా అని చర్చించడానికి ముందు మన రాజ్యాంగంలో కేంద్ర-రాష్ట్ర సంబంధాలను ఏ విధంగా వివరించినారో తెలుసుకొందాము.

## రాజ్యాంగవేత్తల లక్ష్యాలు

భారత రాజ్యాంగ వేత్తలు రాజకీయ సంవిధానాన్ని రూపొందించేటప్పుడు కొన్ని ప్రధానమైన ప్రయోజనాలకు ప్రాముఖ్య మిచ్చినారు. ఆర్థికంగా వెనకబడిన దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం ఒక్కటే అంతిమ లక్ష్యం కాదు. ఆర్థికాభివృద్ధి, సామాజిక సంక్షేమాన్ని సాధించడానికి ప్రణాళికలను రూపొందించి అమలుజరపడం ఎంతైనా అవసరము. ఆర్థికాభివృద్ధి ప్రణాళికాబద్ధమైనప్పుడే దేశంలోని ప్రకృతి సిద్ధమైన సంపదలు (వివిధ ప్రాంతాలలోని) సార్థకంగా వినియోగమై దారిద్ర్య నిర్మూలనం సాధ్యమవుతుంది. ఈ లక్ష్యంతో ప్రణాళికలను రూపొందించడానికి, వాటిని విజయవంతంగా, సమర్థవంతంగా అమలు జరపడానికి దేశమంతా ఒకే పాలనలో ఉండడం అవసరము. గత చరిత్ర దృష్ట్యా మాత్రమే గాక భవిష్యత్తులో నిర్వహించవలసిన కార్యకలాపాల దృష్ట్యా కూడా దేశ సమైక్యతను నిలబెట్టడం తమ కర్తవ్యంగా రాజ్యాంగ పరిషత్ సభ్యులు భావించినారు.

అంతేగాక రాజ్యాంగ పరిషత్ సమావేశమైన కాలంలో దేశంలో జరిగిన అవాంఛనీయమైన పరిణామాలు కూడా జాతి సమగ్రతను నిలబెట్టగల పటిష్ఠమైన కేంద్ర ప్రభుత్వ అవసరాన్ని రాజ్యాంగవేత్తల గుర్తుకు తెచ్చినాయి. ఆ కాలంలో దేశంలో ఆహారపదార్థాలు, అత్యవసర వస్తువుల కొరత ఎంతగానో ఏర్పడింది. లభించిన వనరులను రాష్ట్రాలకు పంపిణీచేయడం, విదేశాలనుంచి వాటిని దిగుమతి చేసుకోవలసిన అవసరం తీవ్రమైనాయి. ఇటువంటి జటిలమైన సమస్యలను ఉన్నతాధికారాలు గల ఒక్క కేంద్ర ప్రభుత్వమే పరిష్కరించగలదు. అంతేగాక అసాధారణ పరిస్థితులు భవిష్యత్తులో కూడా ఏర్పడవచ్చు. అందువల్ల దేశ సమైక్యతను

నిలబెట్టి సమర్థవంతంగా పరిపాలన చేయడానికి శక్తి సామర్థ్యాలున్న ఒక కేంద్ర ప్రభుత్వాన్ని స్థాపించడమే ఏకైక మార్గమనే భావం రాజ్యాంగ పరిషత్ సభ్యులందరికీ కలిగింది.

ఈ విధంగా గతకాలపు చరిత్ర, వర్తమాన పరిస్థితులు, భవిష్యత్తుకు సంబంధించిన ఆశయాలు దేశ సమైక్యతను నిలబెట్టవలసిన అవసరాన్ని రుజువు చేసినాయి. కాని రాజ్యాంగ నిర్మాతలు రాష్ట్ర ప్రభుత్వాలు పూర్తిగా కేంద్రానికి లోబడి పనిచేసే ఏకకేంద్ర ప్రభుత్వ విధానాన్ని వాంఛించలేదు. ఎందుకంటే అటువంటి విధానం ఆచరణ సాధ్యంకాదు. అంతేగాక దేశంలో అనేక వర్గాలలో ఏకత్వాభిమానంతో పాటు భిన్నత్వ భావాలు కూడా బలపడినాయి. తత్ఫలితంగా జాతీయాసక్తులతో బాటు ప్రాంతీయ ప్రయోజనాలను సమన్వయం చేసే సమాఖ్య విధానం అమలులోకి వచ్చింది.

## రాజ్యాంగ నిబంధనలు

భారత సమాఖ్య విధానంలో కేంద్ర-రాష్ట్రాలు రాజ్యాంగ నిబంధనల ప్రకారం ఏర్పడి రాజ్యాంగం నిర్దేశించిన పరిధులలో తమతమ ఆధికారాలను, విధులను నిర్వహిస్తున్నాయి. అయినప్పటికీ కేంద్ర-రాష్ట్ర సంబంధాలలో కేంద్రం వైపు రాజ్యాంగ సంవిధానం ఎక్కువ మొగ్గుచూపుతున్నది. తత్ఫలితంగా ఒక బలమైన కేంద్ర ప్రభుత్వం ఏర్పడింది. కేంద్రము, 22 రాష్ట్ర ప్రభుత్వాలకు రాజ్యాంగం సూచించిన శాసన నిర్మాణ, కార్యనిర్వాహక, ఆర్థికాధికారాలు ఉన్నాయి. కేంద్రానికి, రాష్ట్రాలకు ప్రత్యేక శాసనసభలు, కార్యనిర్వాహక వర్గాలు ఉన్నాయి రాష్ట్రాలు కేంద్ర ప్రభుత్వ ప్రతినిధులుగా లేదా ప్రాంతీయ కార్యాలయాలుగా పనిచేయక పోయినప్పటికీ వాటికి రాజ్యాంగపరంగా స్వతంత్ర ప్రతిపత్తి ఉన్నప్పటికీ అవి అనేక సందర్భాలలో కేంద్ర ప్రభుత్వ పర్యవేక్షణ, అధికారాలకు లోబడి పనిచేయవలె. కేంద్ర రాష్ట్రాలు రాజ్యాంగపరంగా, స్వతంత్రంగా వాటి వాటి పరిధులలో వ్యవహరిస్తాయి. కాని భారత రాజ్యాంగం సూచించిన రాజకీయ సంవిధానం నిజమైన సమాఖ్య కాదు రాష్ట్రాలకు కేంద్రంతో పాటు సమాన హోదా, స్వతంత్ర ప్రతిపత్తి లేవు. రాష్ట్రాలకు సార్వభౌమాధికారం ఉందనే సిద్ధాంతంపై భారత రాజ్యాంగం ఏర్పడలేదు అనేక అంశాలలో రాష్ట్రాలపై కేంద్రానికి ఆధిక్యత ఉందని రాజ్యాంగ నిబంధనలు తెలియజేస్తున్నాయి.

కేంద్ర-రాష్ట్ర సంబంధాలను స్థూలంగా 4 విభాగాలుగా చర్చించవచ్చు : (1) శాసన సంబంధాలు (2) కార్యనిర్వాహక సంబంధాలు (3) ఆర్థిక సంబంధాలు (4) అత్యవసర పరిస్థితిలో కేంద్ర-రాష్ట్ర సంబంధాలు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్యగల సంబంధాలు రాజ్యాంగంలోని 7 వ షెడ్యూలు ద్వారా విదితమవుతాయి.

## శాసన సంబంధాలు

పరిపాలనకు సంబంధించిన అధికారాలను రాజ్యాంగంలో కేంద్ర జాబితా, రాష్ట్ర జాబితా, ఉమ్మడి జాబితాలుగా విభజించినారు. కేంద్ర జాబితా దేశరక్షణ, విదేశ వ్యవహారాలు, ఆర్థిక విధానాలు, బాంకింగ్, కరెన్సీ, రైల్వేలు మొదలైన 97 అంశాలున్నాయి. వీటిపై చట్ట నిర్మాణంచేసే అధికారం కేంద్ర పార్లమెంట్‌కు మాత్రమేఉంది. రాష్ట్ర జాబితాలో శాంతి భద్రతలు, ప్రజారోగ్యం, వ్యవసాయం, అడవులు, పంచాయతీరాజ్ మొదలైన 66

అంశాలున్నాయి. వీటిపై చట్టాలు చేసే అధికారం రాష్ట్ర శాసన సభలకు ఉంది. ఉమ్మడి జాబితాలో నేర నిరోధక చట్టం, ప్రక్రమము [Criminal law & Procedure], వివాహము, ఒడంబడికలు, ధర్మ నిధులు, కార్మిక సంక్షేమం, భీమా, ఆర్థిక - సాంఘిక ప్రణాళికలు మొదలైన 47 అంశాలున్నాయి. వీటిపై చట్టాలుచేసే అధికారం కేంద్ర పార్లమెంట్‌కు, రాష్ట్ర శాసన సభలకు సమానంగా ఉంటుంది. కాని ఏ అంశంపైనైనా కేంద్ర, రాష్ట్ర చట్టాలలో వైవిధ్యం ఉన్నట్లయితే కేంద్ర చట్టమే అమలులోకి వస్తుంది. అంతేగాక రాజ్యాంగంలో ఉదహరించని ఏ అధికారాలూ (అవశేష అధికారాలు) రాష్ట్రాలకు లేవు. అవన్నీ కేంద్రానికి లభించాయి.

కొన్ని ప్రత్యేకమైన పరిస్థితులలో రాష్ట్ర ప్రభుత్వానికి రాజ్యాంగం ఇచ్చిన శాసన నిర్మాణాధికారాలను కేంద్ర ప్రభుత్వం పరిమితం చేయవచ్చు ; లేదా తాత్కాలికంగా రద్దుచేసి పార్లమెంట్ రాష్ట్ర జాబితాలోని అంశాలపై చట్టాలు రూపొందించే అధికారాన్ని పొందవచ్చు. ఇటువంటి ప్రత్యేక పరిస్థితులు ఈ కింది విధంగా ఉంటాయి :

1. జాతీయ ప్రయోజనం దృష్ట్యా రాష్ట్ర జాబితాలోని ఏ అంశంపైనైనా పార్లమెంట్ చట్టాలను రూపొందించవలెనని రాజ్యసభ 2/3 వంతు మెజారిటీతో ఒక తీర్మానాన్ని ఆమోదించినట్లయితే రాష్ట్ర జాబితాలోని సదరు అంశంపై చట్టనిర్మాణం చేసే అధికారం కేంద్ర పార్లమెంట్‌కు లభిస్తుందని 249 వ రాజ్యాంగ నిబంధన చెబుతున్నది. ఈ అధికారం పార్లమెంట్‌కు ఒక సంవత్సర కాలం లభిస్తుంది. తరువాత ఒక్కొక్క సంవత్సరానికి సదరు అధికారాన్ని రాజ్యసభ పొడిగించవచ్చు.

2. జాతీయ అత్యవసర పరిస్థితిని రాష్ట్రపతి ప్రకటించిన కాలంలో పార్లమెంట్ రాష్ట్ర జాబితాలోని ఏ అంశంపైనైనా చట్ట నిర్మాణం చేసే అధికారాన్ని పొందుతుంది [250 నిబంధన].

3. 252వ నిబంధన ప్రకారం 2 లేదా 3 రాష్ట్రాల శాసన సభలు ఒక తీర్మానం ద్వారా ఆయా రాష్ట్రాలకు ఉపయోగకరంగా ఒక సాధారణ చట్టాన్ని (Common Legislation) రూపొందించమని పార్లమెంట్‌ను కోరవచ్చు.

4. ఒక రాష్ట్రంలో ప్రభుత్వం రాజ్యాంగ నిబంధనలకు అనుగుణంగా పనిచేయడంలో విఫలమైనప్పుడు, ఆ రాష్ట్ర ప్రభుత్వాన్ని రద్దుచేసి రాష్ట్రపతి పాలన విధించినప్పుడు ఆ రాష్ట్ర శాసన సభ చట్ట నిర్మాణాధికారాలు కేంద్ర పార్లమెంట్‌కు బదలీ అవుతాయి [356 (A)].

5. కొన్ని సందర్భాలలో శాసన సభ ఆమోదించిన తీర్మానాన్ని రాష్ట్ర గవర్నర్ వెంటనే ఆమోదించకుండా రాష్ట్రపతి (కేంద్ర ప్రభుత్వం) ఆమోదానికి పంపవచ్చు. దానిని రాష్ట్రపతి ఆమోదించవచ్చు లేదా తిరస్కరించవచ్చు, లేదా ఎటువంటి పర్యాలోచనకు తీసుకోకుండా మౌనం పాటించవచ్చు. అటువంటి పరిస్థితులలో రాష్ట్ర శాసన సభ తలపెట్టిన ఆ తీర్మానం అమలులోకి రాదు.

## కార్యనిర్వాహక సంబంధాలు

సాధారణ పరిస్థితులలో రాష్ట్ర ప్రభుత్వ కార్య నిర్వాహణాధికారం రాష్ట్ర జాబితాలోని

అన్ని అంశాలకు వర్తిస్తుంది. కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాలకు కార్యనిర్వహణాధికారాన్ని విని యోగించడంలో ఈ కింది సందర్భాలలో కొన్ని ఆదేశాలు ఇవ్వవచ్చు.

1. కేంద్ర చట్టాలను రాష్ట్రంలో అమలుపరచడానికి రాష్ట్ర ప్రభుత్వం సహకరించవలె (256 వ నిబంధన).

2. రాష్ట్ర ప్రభుత్వం తన కార్యనిర్వహణాధికారాన్ని వినియోగించడంలో కేంద్ర ప్రభుత్వ కార్యనిర్వహణాధికారంలో జోక్యం చేసుకోరాదు [256 వ నిబంధన].

3. ప్రజాశ్రేయస్సు, జాతీయ ప్రాముఖ్యము ఉన్న సైనిక, రవాణా, ప్రచార సాధనా లను రాష్ట్ర ప్రభుత్వం సంరక్షించవలె [257 (2)].

4. రాష్ట్రంలోని కేంద్ర ప్రభుత్వ రైలుమార్గాలకు, ఆస్తులకు, కార్యాలయాలకు రాష్ట్ర ప్రభుత్వం రక్షణ కల్పించవలె [257 (3)].

5 షెడ్యూల్డ్ కులాలు, తెగలవారి సంక్షేమ, ప్రయోజనాల నిమిత్తం కేంద్రం రూపొందించి అమలుజరిపే పథకాలకు అనుగుణంగా ఉండవలె [339 (2)].

6. భాషాపరమైన అల్పసంఖ్యాక వర్గాలకు చెందిన విద్యార్థులకు వారి మాతృభాషలో విద్యా బోధన నిమిత్తం ప్రాథమిక స్థాయివరకు అవకాశాలు కల్పించవలె [350 (A)].

7. హిందీభాష అభివృద్ధికి, వ్యాప్తికి కృషి చేయవలె [351].

అత్యవసర పరిస్థితిని ప్రకటించినప్పుడు రాష్ట్ర ప్రభుత్వాన్ని రద్దు చేయకుండా, రాష్ట్ర పరిపాలనపై పూర్తి ఆధిపత్యాన్ని స్థాపించుకోవడానికి కేంద్ర ప్రభుత్వానికి అధికారం లభి స్తుంది [353 (A)]. రాష్ట్రంలో రాష్ట్రపతి పరిపాలనను విధించినప్పుడు రాష్ట్ర కార్యనిర్వహ ణాధికారం రాష్ట్రపతి (కేంద్రప్రభుత్వం) కి బదలీ అవుతుంది. ఆర్థిక సంక్షోభంవల్ల అత్యవసర పరిస్థితిని ప్రకటించినప్పుడు రాష్ట్ర ఆర్థిక తీర్మానాలను, శాసనసభ ఆమోదించిన తరవాత వాటికి రాష్ట్రపతి ఆమోదం అవసరము [360 (4)].

రాష్ట్రాల కార్యనిర్వహణాధికారంపై కేంద్రం యాజమాన్యం వహించడంలో, నియంత్రణ చేయడంలో అఖిల భారత ఉద్యోగి బృందం (I. C. S.) కూడా ఒక సాధనంగా ఉంది I. A. S., I. P S. మొదలైన ఉద్యోగి బృందాలు ఈ సందర్భంలో పేర్కొనదగినవి వీటి ఉద్యోగులను నియమించే అధికారం, వారి జీత భత్యాలు, సేవా సదుపాయాలు, క్రమ శిక్షణకు సంబంధించిన నియమ నిబంధనలను నిర్ణయించే అధికారం పూర్తిగా కేంద్ర ప్రభు త్వానికే ఉంది.

## ఆర్థిక సంబంధాలు

భారత సమాఖ్య కేంద్రీకృతం కావడానికి కేంద్ర, రాష్ట్రాల మధ్య ఏర్పడే ఆర్థిక సంబంధాలే ఒక ప్రబల నిదర్శనము. రాష్ట్రాలకంటె, కేంద్రానికే వనరులు ఎక్కువగా ఉండటం వల్ల రాష్ట్రాలు కేంద్ర ప్రభుత్వ సహాయ నిధులపై, ఋణాలపై ఆధారపడి ఉంటున్నాయి. ఆదాయం పన్ను, ఎగుమతి, దిగుమతులపై సుంకాలు, ఉత్పత్తి అయిన ఇతర వస్తువులపై ఎక్సైజ్ సుంకాలు, కంపెనీ పన్ను, ఆస్తుల విలువపై, పెట్టుబడులపై పన్ను మొదలైన 12 రకాల ఆదాయ మార్గాలను రాజ్యాంగం కేంద్రానికి కల్పించింది. ఆదే విధంగా భూమి శిస్తు,

అమ్మకం పన్ను, వినోదపు పన్ను, మత్తుపానీయాలపై పన్ను మొదలైన 19 ఆదాయ మార్గాలు రాష్ట్రాలకు ఉన్నాయి.

రాష్ట్రాలకు ఆర్థిక వనరులను పంపిణీ చేయడంలో సలహా ఇవ్వడానికి ఏర్పడిన ఆర్థిక సంఘాన్ని (Finance commission) కేంద్ర ప్రభుత్వం నియమిస్తుంది. అంతేకాక రాజ్యాంగంలోని 290 వ, 291 వ నిబంధనలు కేంద్ర, రాష్ట్రాలకు ఋణాలు సేకరించే అధికారాన్ని ఇచ్చినాయి. అయితే ఈ సందర్భంలో కేంద్రానికే ఎక్కువ అధికారం ఉంది.

ఆర్థిక విధానాలను అమలుపరచడానికి ప్రణాళికలను రూపొందించే జాతీయ ప్రణాళికా సంఘం కేంద్ర ప్రభుత్వ యాజమాన్యంలోనే ఉంటుంది పారిశ్రామికీకరణ, ఆర్థికాభివృద్ధి ప్రణాళికా బద్ధం అవడంవల్ల వీటికి తగిన ఆదాయమార్గాలు రాష్ట్ర ప్రభుత్వాలకు లేకపోవడం వల్ల అవి కేంద్ర ప్రభుత్వ దయాధర్మాలపై ఆధారపడి ఉంటాయి.

## కేంద్ర-రాష్ట్ర సంబంధాలపై అత్యవసర పరిస్థితి ప్రభావము

352 వ నిబంధన ప్రకారం రాష్ట్రపతి జాతీయ అత్యవసర పరిస్థితిని ప్రకటించినప్పుడు కేంద్ర ప్రభుత్వాధికారం రాష్ట్రాలకు కూడా వర్తిస్తుంది. రాష్ట్ర ప్రభుత్వాధికారాలు, కార్యకలాపాలు కేంద్ర ప్రభుత్వాదేశాలకు అనుగుణంగా ఉండవలె. ఒక మాటలో చెప్పవలెనంటే ఎటువంటి రాజ్యాంగ సవరణతో నిమిత్తంలేకుండా జాతీయ అత్యవసర పరిస్థితి ప్రకటన భారత సమాఖ్యను ఏకకేంద్ర ప్రభుత్వ వ్యవస్థగా మార్చడానికి కేంద్ర ప్రభుత్వానికి అవకాశము, అధికారము రాజ్యాంగమే కల్పించింది.

ఒక రాష్ట్రంలో ప్రభుత్వాన్ని రద్దుచేసే అధికారం 356వ నిబంధన రాష్ట్రపతి కిచ్చింది. అటువంటి సందర్భాలలో రాష్ట్రపతి అంటే కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర శాసన సభను రద్దుచేసి గవర్నర్ ద్వారా రాష్ట్ర పరిపాలనను హస్తగతం చేసుకోవచ్చు. ఈ విధంగా కేంద్ర రాష్ట్ర సంబంధాలు రాష్ట్రాలపై కేంద్రానికి సంపూర్ణ యాజమాన్యాన్ని కల్పించే విధంగా ఉన్నాయి.

కేంద్ర రాష్ట్ర సంబంధాలు రాజ్యాంగపరంగానేగాక రాజ్యాంగేతర కారణాలవల్ల కూడా కేంద్ర ప్రభుత్వానికి ప్రాబల్యాన్ని కల్పిస్తున్నాయి. వీటిలో ముఖ్యమైనవి జాతీయ రాజకీయ పార్టీలు 1947 నుంచి 1977 వరకు కేంద్రంలోనూ రాష్ట్రాలలోనూ ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన కాంగ్రెస్ పార్టీ హయాంలో రాష్ట్రాలకు తగినంత స్వయం ప్రతిపత్తి లభించలేదు. రాష్ట్రాల ముఖ్యమంత్రులకు ఈ విషయంపట్ల అసంతృప్తి ఉండేవి. ఈ పరిస్థితులవల్ల రాష్ట్రాల ఉనికి, ప్రాముఖ్యం పూర్తిగా తగ్గిపోయి భారత సమాఖ్య విధానంలో కొత్త పరిణామం ఏర్పడింది. అయితే 1977 సాధారణ ఎన్నికలతో కాంగ్రెస్ పరిపాలన స్థానంలో జనతా సి. పి. ఐ. (ఎమ్)), అన్నా డి. ఎమ్ కె, అకాలీదళ్, మొదలైన వివిధ రాజకీయ పక్షాలతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలేర్పడటంతో ఏకోన్ముఖంగా ఉన్న కేంద్రాధిపత్యం తగ్గి రాష్ట్రాలకు మళ్ళీ రాజకీయంగా ప్రాముఖ్యం ఏర్పడింది.

కేంద్ర-రాష్ట్ర సంబంధాలలో కేంద్రానికి రాష్ట్రాలకు మధ్య అధికారాల విషయంలో ఘర్షణకు, పరస్పర నిందారోపణలకు ఎటువంటి ప్రాముఖ్యమివ్వకుండా అవగాహన, సహాయ సహకారాలు అవసరము. రాష్ట్రాలు తమ ప్రజల, తమ ప్రాంతాల అభివృద్ధికి, సమగ్రతకు,

వనరులకోసం కేంద్ర ప్రభుత్వంపై ఆధారపడక తప్పదు. అదే విధంగా కేంద్రప్రభుత్వ విధానాలు, జాతీయ ప్రణాళికలు, కార్యకలాపాలు, పార్లమెంట్ రూపొందించిన చట్టాలఅమలు రాష్ట్ర ప్రభుత్వాల సహాయ సహకారాలు లేకపోతే తెల్ల కాగితం మీదనే ఉండిపోతాయి.

## ప్రశ్నలు

1. కేంద్ర రాష్ట్రాల మధ్య శాసన సంబంధాలు చర్చించండి.
2. ఉమ్మడి జాబితా ప్రయోజనాలను వివరించండి.
3. "కేంద్ర - రాష్ట్ర సంబంధాలలో కేంద్రానికి రాష్ట్రాలపై ప్రాబల్యముంది" - పరిశీలించండి.

# 10

# పంచాయతీరాజ్ సంస్థలు

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరవాత గ్రామీణ ప్రాంతాల అభివృద్ధి కోసం ప్రభుత్వం అనేక చర్యలు తీసికొంది. ఆర్థిక, సాంఘిక రంగాలలో అభివృద్ధి కోసం జరుగుతున్న మహత్తర కృషిలో ప్రజలు ప్రోత్సాహ భాగస్వామ్యం కలిగి ఉంచేనే రాజ్యాంగంలో సూచించిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక ఆశయాలను సఫలీకృతం చేయడం సాధ్యమవుతుంది. ఈ సందర్భంలోనే పంచాయతీరాజ్ సంస్థల ప్రాముఖ్యాన్ని మనం గుర్తించవచ్చు.

1947 లో స్వాతంత్ర్యం రావడంతో పల్లె ప్రాంతాలలో ఉన్న స్థానిక సంస్థల పట్ల ప్రభుత్వ దృక్పథం మారింది. దీనికి 4 కారణాలను మనం పేర్కొనవచ్చు: (1) గాంధీజీ సందేశాలు. భారతదేశంలో 90% ప్రజలు గ్రామాలలో నివసిస్తున్నారనీ, దేశ శ్రేయస్సు వారి అభ్యుదయంపైనే ప్రధానంగా ఆధారపడి ఉందనీ, అంతేకాక గ్రామీణ ప్రాంతాలు స్వయం సమృద్ధిని సాధించినప్పుడే సంపూర్ణ స్వరాజ్యం సాధ్యమవుతుందని గాంధీజీ పదే పదే చెప్పేవారు. వీటిని ఆధారంచేసుకొని గ్రామాలకు ప్రాధాన్యం కల్పించడానికి జవహర్‌లాల్‌నెహ్రూ, సర్దార్ పటేల్, రాజేంద్రప్రసాద్ మొదలైన నాయకులు ప్రయత్నాలు చేసినారు.

(2) పల్లె ప్రాంతాలలో స్థానిక సంస్థలకు ప్రాముఖ్యం ఉండటానికి గ్రామాలగురించి రాజ్యాంగ పరిషత్తులో జరిగిన చర్చలు, గ్రామాలకు ఎక్కువ పాలనా స్వాతంత్ర్యం ఉండవలె అనే అభిప్రాయాన్ని అనేకమంది సభ్యులు వ్యక్తం చేసినారు. దీని కనుగుణంగా రాజ్యాంగంలో 40 వ ఆదేశిక సూత్రం చేర్చినారు. పంచాయతీరాజ్ వ్యవస్థ నిర్మాణానికి సత్వర చర్యలు తీసుకోవలెననీ, స్థానిక పాలనా సంస్థలకు పాలనాస్వేచ్ఛ ఎక్కువగా ఉండవలెననీ ఈ సూత్రం చెబుతున్నది. రాష్ట్ర ప్రభుత్వాలు దీని కనుగుణంగా చట్టాలు చేయడంవల్ల నేడు అన్ని రాష్ట్రాలలోనూ పంచాయతీ సంస్థలు ఏర్పడినాయి.

(3) పంచాయతీరాజ్ సంస్థల ప్రాముఖ్యానికి మరొక కారణం ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి కార్యకలాపాలు. వ్యవసాయము, పశు సంరక్షణ, నీటి వనరులు, విద్యుచ్ఛక్తి ఉత్పాదన, విద్య, ఆరోగ్యము, సాంఘిక సంక్షేమం మొదలైన రంగాలలో అభివృద్ధి కార్య కాలాపాలను ప్రణాళికల ద్వారా నిర్వహిస్తున్నారు. వ్యవసాయ, పశురక్షణ, నీటి వనరులు మొదలైన రంగాలలో గ్రామీణ ప్రజల సహకారం లేనిదే ఎటువంటి అభివృద్ధి సాధ్యం కాదు. ఈ విషయాన్ని గ్రహించి స్థానిక సంస్థల పునర్నిర్మాణానికి పంచాయతీరాజ్ స్థాపనకు సత్వర చర్యలు తీసుకోవడం జరిగింది.

(4) పంచాయతీ సంస్థల ప్రాముఖ్యానికి 1952లో అమలులోకివచ్చిన సామాజికాభివృద్ధి విధానం (Community Development Programme) ఒక కారణంగా చెప్పుకోవచ్చు. పల్లె ప్రాంతాలలోని ప్రజలు తమ అవసరాలను తామే స్వయంగా నిర్ణయించుకొని వాటిని తీర్చుకోవడానికి సమష్టిగా కృషిచేయడం, తగిన సాధన సంపత్తిని తామే సమకూర్చుకోవడం

ఈ విధానంలోని ముఖ్యమైన అంశాలు. అభివృద్ధి కార్యకలాపాలలో ప్రభుత్వ జోక్యం తక్కువగా ఉండి ప్రజలు ఎక్కువ స్థాయిలో ఉత్సాహంతో పాల్గొన్నప్పుడే అన్ని రంగాలలోనూ పూర్తి వికాసాన్ని సాధించడం సాధ్యమవుతుంది. తత్ఫలితంగా కూడా స్థానిక సంస్థల పట్ల ఆసక్తిని కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు చూపించడం జరిగింది.

పంచాయతీరాజ్ అవతరణ

1957లో ఏర్పాటైన బల్వంతరాయ్ మెహతా కమిటీ సామాజాభివృద్ధి ప్రాజెక్ట్‌లు, జాతీయ విస్తరణ సేవా పథకాలు మొదలైన వాటి ద్వారా ఆశించిన ఫలితాలు లభించకపోవడానికి గల కారణాలేమిటి ? పాలనలో ప్రజలకు భాగస్వామ్యం కల్పించడానికి ఎటువంటి యంత్రాంగం ఉండవలె ? మొదలైన విషయాలను సమగ్రంగా పరిశీలించి ఒక సమగ్రమైన నివేదికను సమర్పించింది. ప్రతి జిల్లాలోనూ మూడు అంచెల ప్రజాస్వామిక వికేంద్రీకరణ పద్ధతి (Three tier system of Democratic Decentralization) ని ప్రవేశ పెట్టవలెనని సిఫార్సు చేసింది. ఈ సంస్థలు గ్రామీణ ప్రాంతాలలో అభివృద్ధి కార్యకలాపాలను నిర్వహించే బాధ్యతలను చేపట్టగల ప్రజాస్వామిక సంస్థలుగా రూపొందుతాయని మెహతా కమిటీ అభిప్రాయపడింది.

మెహతా కమిటీ సూచనలను 1958 లో జాతీయ అభివృద్ధిమండలి స్థూలంగా ఆమోదించిన తరవాత రాష్ట్రాలు పంచాయతీరాజ్ సంస్థల ఏర్పాటుకు తగిన చట్టాలు చేసినాయి. పంచాయతీరాజ్ సంస్థలను ప్రవేశపెట్టిన మొట్టమొదటి రాష్ట్రం రాజస్థాన్, రెండవ రాష్ట్రం ఆంధ్రప్రదేశ్.

## గ్రామ పంచాయతీలు

ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీల చట్టం (1959) ప్రకారం కమిషనర్ (జిల్లా కలెక్టర్) ఒక రెవిన్యూ గ్రామాన్నికాని, దాని భాగాన్నికాని లేదా రెవిన్యూ తాలూకాలోని ఒక భాగాన్నికాని గ్రామంగా ప్రకటించవచ్చు. గ్రామ ప్రజలు ఎన్నుకొన్న ప్రజా ప్రతినిధులు గ్రామ పంచాయతీ సభ్యులుగా ఏర్పడతారు. ఈ సభ్యుల సంఖ్య గ్రామ జనాభానుబట్టి 5 నుంచి 17 వరకు ఉంటుంది.

పంచాయతీతో పాటు ప్రతి గ్రామానికీ ఒక గ్రామ సభ ఉంటుంది. ఇందులో ఓటర్లుగా నమోదైన గ్రామస్థులంతా సభ్యులు. ఈ సభ సంవత్సరానికి కనీసం రెండుసార్లయినా సమావేశం కావలె. వార్షిక, ఆర్థిక, ఆడిట్, పరిపాలనా నివేదికలపై, నిర్మాణ కార్యకలాపాలపై పన్నుల విధింపుపై గ్రామసభ సూచించే సలహాలను పంచాయతీ పరిశీలించవలె. గ్రామసభ సమావేశాలకు సర్పంచ్, అతడు లేనప్పుడు ఉపసర్పంచ్ అధ్యక్షత వహిస్తారు. గ్రామ ప్రజలు సమష్టిగా తమ అవసరాలకు అనుగుణంగా విధాన నిర్ణయాలు చేయడానికి, గ్రామీణ వికాస కార్యకలాపాలలో ప్రోత్సాహంగా పాల్గొనడానికి సిద్ధాంతరీత్యా గ్రామసభ చక్కని సాధనము. అయితే అనేక సందర్భాలలో ఇది నామమాత్రంగానే ఉంటున్నది.

గ్రామ పంచాయతీ సభ్యులను ప్రజలు ప్రత్యక్షంగా ఎన్నుకొంటారు. ఎన్నిక కోసం గ్రామాన్ని అనేక వార్డులుగా విభజిస్తారు. ప్రతి వార్డ్ ఒక సభ్యుని ఎన్నుకొంటుంది. స్త్రీలకు

షెడ్యూల్డ్ కులాలకు, తెగలకు ప్రత్యేక స్థానాలుంటాయి. గ్రామ పంచాయతీ పదవీ కాలం 5 సంవత్సరాలు.

విధులు

గ్రామ పంచాయతీ నిర్వహించే విధులు, కార్యకలాపాలు తప్పనిసరిగా నిర్వహించవలసినవి, ఐచ్ఛికంగా నిర్వహించేవి అని రెండు రకాలుగా ఉంటాయి. తప్పనిసరిగా నిర్వహించవలసిన విధులలో ముఖ్యమైనవి : (1) గ్రామ పంచాయతీకి సంబంధించిన భవనాలను, వీధులను నిర్మించడం, నిర్వహించడం (2) వీధి దీపాలను వేయడం (3) మురుగు నీటి పారుదల సౌకర్యాలు కల్పించడం (4) వీధులను శుభ్రంగా ఉంచడం (5) మరుగుదొడ్లను కట్టించడం (6) నీటి సౌకర్యాలను కల్పించడం (7) శ్మశానవాటికలను ఏర్పాటుచేయడం (8) అంటువ్యాధుల వ్యాప్తి నిరోధానికి తగిన చర్యలు తీసుకోవడం మొదలైనవి. ఐచ్ఛికంగా నిర్వహించే విధులు ఈ విధంగా ఉంటాయి : (i) సత్రాలు ఏర్పాటుచేసి, నిర్వహించడం (ii) గ్రంథాలయాలు, పఠనాలయాలు నెలకొల్పడం (iii) మేలిరకపు సేద్యపు పద్ధతులు ప్రచారం చేయడం (iv) సహకార సేద్య సంఘాలను ఏర్పాటు చేయడం (v) సమాజ అభివృద్ధి కార్యకలాపాలను శ్రమదానాన్ని ప్రోత్సహించడం, ఏర్పాటుచేయడం (vi) విభిన్న సాంఘిక వర్గాలమధ్య సామరస్యాన్ని, సుహృద్భావాన్ని పెంపొందించడం.

ప్రతి గ్రామానికి ఒక సర్పంచ్ ఉంటాడు. ఇతని పదవీకాలం 5 సం॥లు. సర్పంచ్‌ను పంచాయతీ సభ్యులే ఎన్నుకొంటారు. ఇతడు ఎన్నికైన సభ్యులలో ఒకడు. పంచాయతీ సభ్యులను ఎన్నికైన రోజునే లేదా ఆ మరునాడు సర్పంచ్, ఉపసర్పంచ్ ఎన్నికలు జరుగుతాయి. వీరి ఎన్నికలలో అవినీతి, అక్రమం మొదలైన చర్యలకు తావులేకుండా ఉండటానికి ఈ విధంగా నిర్ణయించడం జరిగింది. ఉద్దేశపూర్వకంగా గ్రామపంచాయతీ చట్ట నిబంధనలను అమలుపరచకపోయినప్పుడు, లేదా అధికార దుర్వినియోగం చేసినప్పుడు సర్పంచ్‌ను పంచాయతీ రాజ్ కమిషనర్ పదవినుంచి తొలగించవచ్చు. సర్పంచ్‌ను పంచాయతీ సభ్యులుకూడా అవిశ్వాస తీర్మానం ద్వారా పదవినుంచి తొలగించవచ్చు. 2/3 వంతు మెజారిటీతో అవిశ్వాస తీర్మానం ద్వారా పదవినుంచి తొలగించబడిన సర్పంచ్ మళ్ళీ 3 సం॥ల వరకు సర్పంచ్ కావడానికి అనర్హుడు. సర్పంచ్‌ను ప్రజలు ప్రత్యక్షంగా ఎన్నుకోవలెనని నరసింహం కమిటీ సూచించింది.

కనీసం నెలకొకసారైనా పంచాయతీ సమావేశాన్ని సర్పంచ్ ఏర్పాటు చేయవలె. మొత్తం సభ్యులలో మూడవవంతు హాజరైతే సమావేశానికి 'కోరమ్' ఉన్నట్లే. సమావేశాల చర్చా సారాంశం ప్రతులను 3 రోజుల లోపల జిల్లా పంచాయతీ అధికారికి, పంచాయతీ సమితికి పంపించవలె.

పంచాయతీ బడ్జెట్‌ను నవంబర్ 15 వ తేదీ లోగా కార్యనిర్వహణాధికారి తయారుచేసి గ్రామపంచాయతీకి సమర్పిస్తాడు. దీనిని ఒక నెల లోపల పంచాయతీ పరిశీలించి అవసరమైన మార్పులతో ఆమోదిస్తుంది. తరవాత గ్రామపంచాయతీ బడ్జెట్‌ను పంచాయతీ సమితి ఆమోదానికి పంపిస్తారు. పంచాయతీ సమితి ఒక నెల లోపల దానిని ఆమోదిస్తుంది. సమితి చేసే మార్పులు గ్రామపంచాయతీకి ఆమోదయోగ్యం కాకపోతే పన్నుల విధింపు, ఆర్థిక వ్యవహారా

లను చూసే జిల్లా పరిషత్ స్థాయీ సంఘానికి నివేదిస్తారు. ఈ సంఘం నిర్ణయమే తుది నిర్ణయము.

గ్రామ పంచాయతీ చట్ట ప్రకారం ప్రతి గ్రామంలోనూ వ్యవసాయం ప్రజారోగ్యం పరిశుభ్రత, ప్రయాణ సౌకర్యాలకు విడివిడిగా స్థాయీ సంఘాలను ఏర్పాటు చేయవలె. వీటిలో పంచాయతీ సభ్యులతో బాటు సభ్యులుకాని అనుభవం ఉన్న వ్యక్తులను అదనపు సభ్యులుగా నియమించుకోవచ్చు.

పంచాయతీల ఆర్థిక వనరులు

పంచాయతీల వనరులు రెండు రకాలు : (i) పన్నులు (ii) పన్నులు కానివి. పన్నలలో కొన్ని తప్పనిసరిగా విధించేవి. మరికొన్ని ఐచ్ఛికంగా విధించేవి. వాహనాలు, వ్యవసాయ భూమి, నీటి సరఫరా, లోకల్ సెస్‌పై సర్‌ఛార్జ్ మొదలైన వాటిపై పన్నులను పంచాయతీ ఇష్టమైతే విధించవచ్చు. గృహపన్ను, వ్యాపారపన్ను, మొదలైనవి తప్పనిసరిగా విధించే పన్నులు. పన్నుల ద్వారానే కాక పై సంస్థలనుంచి కేటాయింపు ద్వారా, గ్రాంట్లద్వారా, గ్రామ పంచాయతీలకు ఆదాయం లభిస్తుంది. నిర్వహించవలసిన కార్యకాలాపాల దృష్ట్యా గ్రామ పంచాయతీల ఆదాయం బహు స్వల్పము.

## పంచాయతీ సమితి

పంచాయతీరాజ్ వ్యవస్థలో సమితిది కీలకస్థానము. ప్రతి బ్లాక్ ప్రాంతానికి ఒక సమితి ఉంటుంది. బ్లాక్‌లోని పంచాయతీ సర్పంచ్ లందరూ పదవీరీత్యా సమితిలో సభ్యులు. సమితికి సంబంధించిన M. L. A. లు, M. L. C. లు కూడా సమితిలో సభ్యులే. వీరందరూ కలిసి ఇద్దరు మహిళా ప్రతినిధులను, ఒక షెడ్యూల్డు తెగలకు చెందిన వ్యక్తిని, గ్రామీణాభివృద్ధిలో అనుభవం కల ఇద్దరు వ్యక్తులను సభ్యులుగా ఎన్నుకొంటారు. సమితి సభ్యులందరు కలసి అధ్యక్ష, ఉపాధ్యక్షులను ఎన్నుకొంటారు. సమితి పదవి కాలం 5 సం॥లు.

బ్లాక్ యొక్క సాధారణ పరిపాలనా బాధ్యతంతా సమితిదే. ప్రజలలో చైతన్యం కల్పించి వివిధ కార్యక్రమాల ద్వారా వారి జీవన ప్రమాణాలను మెరుగుపరచడం సమితి ప్రధాన లక్ష్యము పంచాయతీ సమితి ఈ కింది కార్యకలాపాలను, విధులను నిర్వహిస్తుంది. (1) వ్యవసాయోత్పత్తి (2) పశుపోషణ (3) మత్స్యపరిశ్రమాభివృద్ధి (4) చిన్న తరహా పశు వైద్యశాలల నిర్వహణ (5) ఆరోగ్యాభివృద్ధి (6) ప్రాథమిక పాఠశాలలు, వయోజన విద్యా కేంద్రాల ఏర్పాటు (7) గ్రంథాలయాలు, సమాచార కేంద్రాల నిర్వహణ (8) గ్రామాలమధ్య రోడ్ల నిర్మాణము, నిర్వహణ (9) సహకార సంఘాల అభివృద్ధి (10) కుటీర పరిశ్రమాభివృద్ధి (11) స్త్రీ సంక్షేమం (12) ధర్మ విధుల నిర్వాహణ (13) గణాంకాల సేకరణ.

సమితి ముఖ్య కార్యనిర్వాహణాధికారి బి డి ఓ. (Block Development Officer). సమితి నిర్ణయాలను, స్థాయీ సంఘాల తీర్మానాలను అమలుపరచే బాధ్యత ఇతనిదే. సమితిలోని ఉద్యోగులపై పాలనా నియంత్రణ, సమితికి, సమితి అధ్యక్షునికి, సమితిలోని వివిధ విస్తరణాధికారులకు, ప్రభుత్వానికి మధ్య సంధాన కర్తగా వ్యవహరించడం బి. డి. ఓ.

ముఖ్య విధులు. సమితి బడ్జెట్ బి. డి. ఓ. తయారు చేస్తాడు. దీనిని సమితి పరిశీలించి తగిన మార్పులుచేసి ఆమోదించి, జిల్లాపరిషత్ తుది నిర్ణయానికి పంపుతుంది.

పంచాయతీ సమితి కార్యకలాపాలు ప్రధానంగా స్థాయీ సంఘాలద్వారా నిర్వహిస్తారు. సమితి యొక్క వివిధ కార్యకలాపాల నిర్వహణకు ఈ కింది 7 స్థాయీ సంఘాలు వ్యవహరిస్తాయి :

1 వ స్థాయీ సంఘం— ప్రణాళిక, ఉత్పత్తి, వ్యవసాయం, పశుపోషణ, చిన్నతరహా సేద్యపు నీటి వనరులు, విద్యుచ్ఛక్తి, మత్స్య పరిశ్రమ భూసార సంరక్షణ.

2 వ స్థాయీ సంఘం— సహకారం, పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు, గ్రామీణ గృహ నిర్మాణం, గణాంకాలు, పొదుపు.

3 వ స్థాయీ సంఘం— విద్య, వైద్యము, ఆరోగ్యము, మురుగునీటి పారుదల.

4 వ స్థాయీ సంఘం— స్త్రీ, శిశు సంక్షేమం.

5 వ స్థాయీ సంఘం— షెడ్యూల్ కులాల, వర్గాల వెనకబడిన తరగతుల సంక్షేమం.

6 వ స్థాయీ సంఘం— రహదారులు, నిర్మాణాలు, భవనాలు.

7 వ స్థాయీ సంఘం— పన్నుల విధింపు, ఆర్థిక వ్యవహారాలు.

ప్రతి స్థాయీ సంఘంలోనూ ఏడుగురు సమితి సభ్యులుంటారు. సమితి అధ్యక్షుడు, అన్ని స్థాయీ సంఘాలకు అధికార రీత్యా అధ్యక్షుడు. మిగిలిన సభ్యులు నైష్పత్తిక ప్రాతినిధ్య విధానం ద్వారా ఎన్నికవుతారు. ఒక సభ్యుడు ఒక సంఘం కంటే ఎక్కువ సంఘాలలో సభ్యుడుగా ఉండరాదు. 4 వ స్థాయీ సంఘంలో స్త్రీలు, 5 వ స్థాయీ సంఘంలో షెడ్యూల్ కులాలు, వెనకబడిన వర్గాలవారు అధిక సంఖ్యలో ఉంటారు.

పంచాయతీ సమితికి పంచాయతీరాజ్ వ్యవస్థలో కీలక స్థానం ఉన్నప్పటికీ స్వయంగా పన్నులు విధించే అధికారం, ప్రత్యక్ష ఆదాయ మార్గాలు లేవు. సమితి నిర్వహించే అభివృద్ధి కార్యకలాపాలన్నింటికీ రాష్ట్ర ప్రభుత్వమే వనరులు సమకూరుస్తుంది. సమితికి ఈ కింది పద్ధతులద్వారా ఆదాయం లభిస్తుంది. (i) నిర్మాణ కార్యకలాపాల కోసం రాష్ట్ర ప్రభుత్వం, శాఖాధ్యక్షులు బదిలీచేసే ధనం (ii) సమాజాభివృద్ధికి సంబంధించిన నిధులు (iii) కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, ఇతర సంస్థలనుంచి వచ్చు సహాయం (iv) గ్రామపంచాయతీలు, ప్రజల నుంచి వచ్చే విరాళాలు (v) భూమిశిస్తు, పన్నులు, ఫీజులలో వాటా (vi) పన్నులు, ఫీజులపై సర్‌ఛార్జి ద్వారా వచ్చే ఆదాయం.

## జిల్లాపరిషత్

ప్రతి జిల్లాకు జిల్లా స్థాయిలో ఆ జిల్లా పేరుతో ఒక పరిషత్ ఉంటుంది. పంచాయతి సమితిలోవలె దీని సభ్యులు కూడా ప్రత్యక్షంగా ఎన్నికకారు. పంచాయతీ సమితుల అధ్యక్షులు, జిల్లానుంచి ఎన్నికైన M. L. A. లు M P.లు, ప్రభుత్వం సూచించే M.L.C.లు, జిల్లా కలెక్టర్, జిల్లా పరిషత్‌లో సభ్యులు పరిషత్ సభ్యులందరూ కలసి, తమలోని సభ్యుల నుంచి పరిషత్ ఛైర్మన్‌ను, వైస్ ఛైర్మన్‌ను ఎన్నుకొంటారు. వీరి పదవీ కాలం 5 సం॥లు.

పంచాయతీ సమితికి ఉన్నంత ప్రాధాన్యం జిల్లా పరిషత్‌కు లేదు జిల్లా పరిషత్ పంచాయతీ సమితివలె కార్యకలాపాల పర్యవేక్షణకు, ప్రభుత్వానికి సలహా లివ్వడానికి

మాత్రమే పరిమితమవుతుంది. సెకండరీ విద్య, సమితుల మధ్య రోడ్ల నిర్మాణం, కార్యకలాపాలను మాత్రమే పరిషత్ స్వయంగా నిర్వహిస్తుంది. జిల్లా పరిషత్ నిర్వహించే విధులలో ముఖ్యమైనవి : (1) పంచాయతీ సమితుల బడ్జెట్‌లను ఆమోదించడం (2) కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలిచ్చిన నిధులను సమితుల మధ్య పంపిణీ చేయడం (3) సమితి ప్రణాళికల సమన్వయం (4) ధర్మ నిధుల నిర్వహణ (5) ప్రణాళికా పథకాల అమలును సమీక్షించడం.

జిల్లా పరిషత్‌కు ఒక కార్యదర్శి ఉంటాడు. పరిషత్, స్థాయీ సంఘాల తీర్మానాలను అమలుపరచడం ఇతని ప్రధాన కర్తవ్యము. పరిషత్ సేవకు చెందిన ఉద్యోగులు, ప్రభుత్వం పరిషత్‌కు బదిలీచేసిన ఉద్యోగులు, కార్యదర్శి ఆధీనంలో పనిచేస్తారు. పరిషత్, సమితి కార్యకలాపాలను ఇతడు పర్యవేక్షిస్తాడు. జిల్లా పరిషత్ బడ్జెట్‌ను తయారుచేసేవి కార్యదర్శి అభివృద్ధి శాఖలకు సంబంధించిన జిల్లా అధికారులతో సంప్రదించి బడ్జెట్‌ను తయారుచేసి పరిషత్ ఆమోదానికి కార్యదర్శి సమర్పిస్తాడు. పరిషత్‌లోని ఏడో స్థాయీ సంఘం సిఫార్సులను దృష్టిలో ఉంచుకొని జిల్లా పరిషత్ బడ్జెట్‌ను ఆమోదిస్తుంది. ఆ తరవాత బడ్జెట్‌ను రాష్ట్ర ప్రభుత్వామోదానికి పంపడం జరుగుతుంది.

సమితిలో ఉన్నట్లే పరిషత్‌లోనూ 7 స్థాయీ సంఘాలుంటాయి. ప్రతి సంఘంలోనూ 9 మంది సభ్యులుంటారు. ఏడో సంఘంలో మాత్రం 10 మంది సభ్యులుంటారు. పరిషత్ ఛైర్మన్, జిల్లా కలెక్టర్ ప్రతి యీ సంఘంలోనూ అధికారరీత్యా సభ్యులు. మిగతా సభ్యులను నైష్పత్తిక ప్రాతినిధ్య ప[ద్ధ]తి ద్వారా ఎన్నుకొంటారు.

జిల్లా పరిషత్ పాలనా బాధ్యతలు, కార్యనిర్వహణ విధులను నిర్వహిస్తుంది. జిల్లా పరిషత్ విధుల నిర్వహణకుగాను తగిన నిధులను ఈ కింది మార్గాల ద్వారా సంపాదించుకొంటుంది. (i) పరిషత్ విధించే పన్నులు, ఫీజులు (ii) పై సంస్థలనుంచి వచ్చే గ్రాంట్లు, పన్నులలో వాటా, ప్రత్యేకంగా కేటాయించిన ధనము (iii) సమితులు, ప్రజలనుంచి వచ్చే విరాళాలు. పంచాయతీ సమితికివలె జిల్లా పరిషత్‌కు కూడా స్వంత ఆర్థిక వనరులు లేవు ఇతరులనుంచి లభించేదే ఆదాయము. ప్రత్యేకంగా కేటాయించిన ఆదాయంలో ముఖ్యమైనది భూమి సెస్, స్టాంప్ డ్యూటీపై విధించిన సర్‌ఛార్జ్‌లో భాగము, దీనితోబాటు జిల్లా జనాభా ఆధారంగా తలకు 10 పై. వంతున బ్లాక్ గ్రాంట్ సెకండరీ విద్య నిర్వహణకు లభిస్తాయి.

జిల్లా పరిషత్ ఛైర్మన్‌ను అవిశ్వాసతీర్మానం ద్వారా పదవినుంచి తొలగించవచ్చు. అతడు అవినీతికి పాల్పడినట్లుగా భావిస్తే మొత్తం సభ్యులతో 2/3 వంతు సభ్యులు దీనికి అనుకూలంగా జిల్లా కలెక్టర్‌కు ప్రతిపాదనను అందజేయవలె. ఈ ప్రతిపాదనను చర్చించడానికి 30 రోజుల లోగా సభ్యులందరినీ సమావేశ పరుస్తారు. దీనిలో 2/3 వంతు సభ్యులు ప్రతిపాదనకు అనుకూలంగా ఓటుచేస్తే ఛైర్మన్ పదవీచ్యుతుడవుతాడు. పంచాయతీ సమితి అధ్యక్షుని తొలిగింపు కూడా ఇదే పద్ధతి ద్వారా జరుగుతుంది.

## ఆంధ్రప్రదేశ్ పంచాయతీరాజ్ వ్యవస్థలో ఇటీవల చేసిన మార్పులు

ఆంధ్రప్రదేశ్ గ్రామపంచాయతీల చట్టం, పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్‌ల చట్టం (1978) పంచాయతీరాజ్ వ్యవస్థలో ఈ కింది సవరణలు చేసింది :

1. పంచాయతీ సభ్యుల కనిష్ఠ సంఖ్యను 5 నుంచి 7 కు గరిష్ఠ సంఖ్యను 17 నుంచి 19 కి పెంచినారు.

2. సర్పంచ్‌ను గ్రామపంచాయతీ ఓటర్ల జాబితాలో నమోదైన వారందరూ కలసి ప్రత్యక్షంగా ఎన్నుకోవలె.

3. పంచాయతీ సమితి అధ్యక్షుని సమితి ప్రాంతంలోని ఓటర్లందరూ ప్రత్యక్షంగా ఎన్నుకోవలె.

1978 లో ఆమోదించిన ఆంధ్రప్రదేశ్ గ్రామపంచాయతీల, సమితి, జిల్లా పరిషత్‌ల సవరణ చట్టాలు మరికొన్ని ముఖ్యమైన మార్పులు పంచాయతీరాజ్ వ్యవస్థలో సూచించినాయి. ఈ సవరణ చట్టాల ముఖ్యోద్దేశం సమాజంలోని బలహీనవర్గాలకు గ్రామ పాలనలో ఎక్కువ భాగస్వామ్యం కల్పించడం. అంతేగాక గ్రామపంచాయతీల పునర్వ్యవస్థీకరణ కూడా గ్రామ పంచాయతీల సవరణ చట్టం ముఖ్యోద్యేయము. దీనిలోని ముఖ్యాంశాలు :

1. ప్రత్యేక పరిస్థితులలో 300 జనాభా ఉన్న గ్రామానికి కూడా పంచాయతీని ఏర్పాటు చేయడం.

2. 25,000 జనాభాకు ఎక్కువగా ఉన్న మునిసిపాలిటీలను స్పెషల్ గ్రేడ్ గ్రామ మునిసిపాలిటీలుగా ఏర్పాటు చేయడం.

3. షెడ్యూల్డ్ కాని ప్రదేశాలలో రొటేషన్ పద్ధతిలో ప్రతి పంచాయతీ సమితిలో 14% సర్పంచ్ పదవులను హరిజనులకు, రాష్ట్రం మొత్తం సర్పంచ్ పదవులలో 5% గిరిజనులకు కేటాయించడం.

4. గ్రామపంచాయతీల ఎన్నికలకయ్యే వ్యయాన్ని రాష్ట్ర ప్రభుత్వమే భరించడం.

పంచాయతీ సమితి, జిల్లా పరిషత్‌ల సవరణ చట్టం (1978), సమితి, పరిషత్‌ల విషయంలో ఈ కింది మార్పులు సూచిస్తున్నది :

1. గిరిజనేతర సమితి అధ్యక్ష పదవులలో 14% హరిజనులకు రిజర్వ్ చేయవలె.

2. సాధ్యమైనంతవరకు మొత్తం రాష్ట్రంలో ఒక జిల్లాపరిషత్ అధ్యక్షపదవిని హరిజన జనాభా ఎక్కువగా ఉన్న జిల్లాలో రొటేషన్ పద్ధతిలో హరిజనులకు కేటాయించవలె.

3. ప్రత్యక్షంగా సమితికి సభ్యులను ప్రజలే ఎన్నుకొంటారు. ఈ ఎన్నికలకై సమితి ప్రాంతాన్ని జనాభా ఆధారంగా 20 లేదా 30 ఏకసభ్య నియోజక వర్గాలుగా విభజిస్తారు. ఆ నియోజక వర్గాలలో ఓటర్లు ప్రత్యక్షంగా సమితి సభ్యులను ఎన్నుకొంటారు. ఈ విధంగా నేరుగా ఎన్నుకొనే సమితి సభ్యుల పదవులలో కూడా రొటేషన్ పద్ధతిపై 14% స్థానాలు హరిజనులకు కేటాయించినారు.

4. సర్పంచ్‌లకు పంచాయతీ సమితిలో సభ్యత్వం లేదు.

5. సమితికి సభ్యులను ప్రభుత్వం నియమించే పద్ధతి అమలులో ఉంటుంది.

6. అధ్యక్షునితోపాటు కమిటీ సభ్యుల అధ్యక్ష పదవులకు ప్రత్యక్ష పద్ధతిని ఎన్నికలు జరుగుతాయి.

7. జిల్లా పరిషత్ అధ్యక్ష పదవికి ఎన్నికలు పరోక్షంగా జరుగుతాయి.

8. పంచాయతీ సమితి అధ్యక్షులు, M. L. A. లు M. L C. లు, M. P. లు పరిషత్ సభ్యులు. వీరందరు కలసి ఇద్దరు స్త్రీలను, అల్పసంఖ్యాక వర్గాలకు చెందిన ఒకరిని,

వెనకబడిన తరగతులకు చెందిన ముగ్గురిని ఎన్నుకొంటారు. ఈ సభ్యులందరూ కలిసి జిల్లా పరిషత్ అధ్యక్ష, ఉపాధ్యక్షులను ఎన్నుకొంటారు.

8. రాష్ట్ర సహకార వ్యవసాయాభివృద్ధి బాంక్ లలో ఆ జిల్లాకుచెందిన జిల్లా సహకార కేంద్ర బాంక్ అధ్యక్షుడు, జిల్లా మార్కెటింగ్ సహకార సంఘం అధ్యక్షుడు పదవిరీత్యా పరిషత్‌లో సభ్యులు. కాని అధ్యక్ష, ఉపాధ్యక్ష పదవులకు పోటీ చేయడానికి, ఓటు వేయ డానికి వీరికి అవకాశం లేదు.

## అశోక్ మెహతా కమిటీ నివేదిక

1977 లో పంచాయతీరాజ్ వ్యవస్థ దేశం మొత్తంలో పనిచేసే తీరుతెన్నుల విషయంపై ఒక సమగ్రమైన పరిశీలన చేయడానికి కేంద్ర ప్రభుత్వం శ్రీ అశోక్ మెహతా అధ్యక్షతన 13 మంది సభ్యులతో ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీ పంచాయతీరాజ్ వ్యవస్థలో ఈ క్రింద సిఫార్సులు చేసింది :

1. ప్రజాస్వామిక వికేంద్రీకరణ సంస్థలను గ్రామీణాభివృద్ధితో జతపరచవలె.

2. ప్రస్తుతం అమలులో ఉన్న మూడు అంచెల పద్ధతికి బదులు రెండు అంచెల పంచాయతీ వ్యవస్థను ఈ కమిటీ సూచించింది.

3. పంచాయతీరాజ్ సంస్థలలో ప్రత్యక్ష ఎన్నికలు ప్రవేశ పెట్టవలె జనాభా ప్రాతి పదికపై షెడ్యూల్డ్ కులాల, తెగల వారికి ప్రాతినిధ్యం ఉండవలె.

4. కొంద ప్రాంతాలలో మండల పంచాయతీలు చిన్నవిగా ఉండవలె. సాంప్రదాయిక సంస్థలైన తహసీల్. బ్లాక్ మొదలైనవి యథాతథంగా కొనసాగవలె.

5. జిల్లా పరిషత్ సభ్యులను 4 రకాలుగా ఏర్పాటు చేయవలె.

6 జిల్లా పరిషత్ అనేక కమిటీల ద్వారా పనిచేయవలె.

## పంచాయతీ వ్యవస్థ పనిచేసే తీరు తెన్నులు

పంచాయతీరాజ్ సంస్థలు పనిచేస్తున్న తీరు తెన్నులు దేశమంతా ఒకే తీరుగా లేవు. ఈ విషయంలో వివిధ రాష్ట్రాల మధ్యనే కాక ఒకే రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల మధ్య కూడా తేడా కనిపిస్తున్నది. గ్రామీణ ప్రాంతాభివృద్ధికి బృహత్తరమైన పథకాలు అమలు జరుగుతున్న ఈ తరుణంలో క్షేత్ర స్థాయిలో ఈ పంచాయతీ సంస్థలను పటిష్ఠంచేయవలసిన అవసరం అందరూ గుర్తించినదే.

అభివృద్ధికి సంబంధించిన కార్యకలాపాలతో 3 రకాలుగా పంచాయతీ వ్యవస్థ ముడి పడి ఉంది. సమాజాభివృద్ధి అనే లక్ష్యసాధనకు ప్రధానమైన ఉపకరణంగా భావించబడు తున్నది.

2. సమాజాభివృద్ధి పథకాల అమలులో రాష్ట్ర ప్రభుత్వ ఏజెంట్‌గా, రాష్ట్రప్రభుత్వం అప్పగించే ఇతర పథకాలను అమలుపరిచే వ్యవస్థగా పంచాయతీరాజ్‌ను పరిగణించడం జరుగు తున్నది.

3. గ్రామస్థాయిలో ఇది సిసలైన ప్రజాస్వామ్య వ్యవస్థగా పరిగణించబడుతున్నది ఐతే పంచాయతీరాజ్ వ్యవస్థను ప్రారంభించినంత మహోన్నతాశయాలకు కట్టుబడి పంచా

యతీ సంస్థలు పనిచేయడం లేదని అనేక అభిప్రాయాలు వెలువడినాయి. ప్రస్తుత కాలపు పాలనా విధానంలో ఈ వ్యవస్థవల్ల అంతగా ప్రయోజనంకాని దీనికి ప్రాధాన్యంకాని లేదని అందువల్ల ఈ సంస్థల అవసరం అంతగాలేదని కొందరు పేర్కొనడం జరిగింది.

పంచాయతీరాజ్ వ్యవస్థ సక్రమంగా పనిచేయలేక పోవడానికి ఈ కింది కారణాలను ప్రధానంగా చెప్పుకోవచ్చు :

1. నిర్మాణంలోనూ, నిర్వహణలోనూ, అధికారాలలోనూ వికేంద్రీకరణ, పాలనా స్వేచ్ఛ పూర్తిగా లేకపోవడం.

2. తగినంత ఆర్థిక వనరులు లేకపోవడం పంచాయతీరాజ్ కార్యకలాపాలకు తీవ్ర అవరోధంగా ఏర్పడింది. ఈ సంస్థలకు ప్రభుత్వం దయాదాక్షిణ్యాలతో నిమిత్తం లేకుండా స్వతస్సిద్ధమైన ఆర్థిక వనరులు కల్పించవలె.

3. పంచాయతీరాజ్ ఎన్నికలలో రాజకీయ పక్షాలు, పార్టీ ప్రాతిపదికపై పోటీ చేయరాదనే "పెద్దమనుషుల ఒప్పందాన్ని" తూ.చ. తప్పకుండా చిత్తశుద్ధితో పాటించవలె. అయితే పరోక్షంగా నయినా పంచాయతీరాజ్ ఎన్నికలలో రాజకీయ పక్షాలు ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి. నిర్మాణాత్మక, గ్రామీణ వికాసాభివృద్ధి కార్యకలాపాల ప్రత్యేకించబడిన పంచాయతీరాజ్ సంస్థలు రాజకీయాలకు పుట్టిల్లు అయినప్పుడు ఆశించిన ప్రయోజనాలు నెరవేరకపోవడమే గాక గ్రామీణ జీవితం స్పర్థలతో వైషమ్యాలతో కలుషితమయ్యే ప్రమాదం కూడా ఉంది.

4. పంచాయతీ సంస్థలకు నియమబద్ధంగా ఎన్నికలు జరిపించకపోవడం, పదే పదే ఎన్నికలను, ఏదో ఒక సాకుతో వాయిదా వేయడం లేదా స్థానిక సంస్థలను రద్దు చేయడం సర్వ సాధారణమయింది. ఈ ధోరణిని అరికట్టడం మంచిది.

ప్రజాస్వామ్యాన్ని పటిష్ఠం చేయటంతోపాటు అభివృద్ధిని సాధించడమనే బృహత్తర లక్ష్యం దృష్ట్యా పంచాయతీ సంస్థలకు ఇతోధికంగా, అధికారాలను కల్పించడం, వనరులను కల్పించడం మొదలైన విషయాలలో రాష్ట్ర ప్రభుత్వాలు కొంత ఉదారంగా వ్యవహరించవలె. పంచాయతీ సంస్థలు మన దేశంలో అతిపురాతన కాలం నుంచి అమలులో ఉన్న సంస్థలు. వీటిని నిర్లక్ష్యం చేయరాదు చారిత్రక ప్రాధాన్యం ఏమైనప్పటికీ, క్షేత్ర స్థాయిలో అభివృద్ధి కార్యకలాపాల అమలులో ఈ సంస్థలకు గల కీలకస్థానం దృష్ట్యా వీటిని బలపరచడం ఎంతైనా అవసరము. కింది స్థాయిలో ముఖ్యంగా పునాది స్థాయిలో చైతన్యవంతంగా ప్రజాస్వామ్యం పనిచేస్తేనే పై స్థాయిలో అది బాధ్యతాయుతంగా పనిచేయగలుగుతుంది.

## పురపాలక సంస్థలు

పురపాలక సంస్థలను 3 రకాలుగా విభజించవచ్చు : (1) నగర పాలక సంస్థలు (Corporations) (2) కంటోన్మెంట్ బోర్డులు (3) పురపాలక సంస్థలు (Municipality).

### నగరపాలక సంస్థలు

బొంబాయి, ఢిల్లీ, కలకత్తా, మద్రాస్, హైదరాబాద్ వంటి పెద్ద నగరాలలో స్థానికావ

సరాలు తీర్చడానికి ఏర్పడిన స్థానిక ప్రజా సంస్థలను కార్పొరేషన్‌లు లేదా నగరపాలక సంస్థలు అంటారు. నగరాన్ని వార్డులుగా విభజించి వయోజన ఓటింగ్ పద్ధతి ద్వారా సభ్యుల నెన్నుకొంటారు. కార్పొరేషన్ అధ్యక్షుడిని మేయర్ అంటారు.

నగరంలో రహదారులు, విద్యుద్దీపాలు, మంచినీటి సరఫరా, ప్రజారోగ్యం, నగర పారిశుద్ధ్యం, ప్రాథమిక, సెకండరీ విద్య మొదలైన పనులను కార్పొరేషన్ నిర్వహిస్తుంది. కార్పొరేషన్ కార్యనిర్వహణాధికారిని రాష్ట్ర ప్రభుత్వం నియమిస్తుంది. ఇతనిని కమీషనర్ అంటారు. ఇతడు కార్పొరేషన్ తీర్మానాలను, నగరాభివృద్ధికి నిర్దేశించిన పథకాలను అమలు పరుస్తాడు. కార్పొరేషన్ ఉద్యోగులపై అజమాయిషీ చేస్తాడు. కార్పొరేషన్‌పై అజమాయిషీ, నియంత్రణ చేయడానికి, రాష్ట్ర ప్రభుత్వానికి అధికారం ఉంది.

హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ 1955, హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ చట్టం ద్వారా ఏర్పడింది. 1960 లో మునిసిపల్ హైదరాబాద్ కార్పొరేషన్‌గా దీని పేరు మార్చినారు. 1972 లో ఈ కార్పొరేషన్ రద్దు అయి, అప్పటినుంచి ప్రస్తుతకాలం వరకు మునిసిపల్ స్పెషల్ ఆఫీసర్ ద్వారా మునిసిపల్ కార్పొరేషన్ కార్యకలాపాలను నిర్వహించడం జరుగుతున్నది. ఈ స్పెషల్ ఆఫీసర్‌ను మునిసిపల్ కమీషనర్ అంటారు.

## కంటోన్మెంట్ బోర్డులు

పెద్ద పెద్ద పట్టణాలలోని సైనిక స్థావర ప్రాంతాల స్థానికవసరాలు తీర్చడానికి కంటోన్మెంట్ బోర్డులుంటాయి. ఇవి స్వపరిపాలనా సంస్థలు కావు. ఇవి ఎన్నికల ద్వారా ఏర్పడవు. వీటిపై రాష్ట్ర ప్రభుత్వ అజమాయిషీ దాదాపు ఉండదు. కంటోన్మెంట్ బోర్డ్ తన ప్రాంతంలోని రహదారి మార్గాలు, పరిశుభ్రత, ఆరోగ్యము, వీధి దీపాలు, మంచినీటి సరఫరా మొదలైన స్థానికావసరాలు తీరుస్తుంది.

## పురపాలక సంఘాలు

పురపాలక సంఘాలు 1965 ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీ చట్ట ప్రకారం ఆదాయాన్ని బట్టి 5 రకాలుగా ఉన్నాయి. (1) 3 లక్షల ఆదాయంలోపు ఉన్న 3 వ గ్రేడ్ మునిసిపాలిటీలు (2) 3 లక్షలకు పైన 6 లక్షలకు లోపల ఉన్న 2 వ గ్రేడ్ మునిసిపాలిటీలు (3) 6 లక్షలపైన 10 లక్షల లోపు ఆదాయం ఉన్న మొదటి గ్రేడ్ మునిసిపాలిటీలు (4) 10 లక్షల పైన ఆదాయం ఉన్న స్పెషల్ గ్రేడ్ మునిసిపాలిటీలు (5) 10 లక్షల ఆదాయం మించి ప్రభుత్వం ప్రత్యేకంగా గుర్తించిన సెలక్షన్ గ్రేడ్ మునిసిపాలిటీలు.

25,000 జనాభా ఉన్న ప్రాంతాన్ని ప్రభుత్వం మునిసిపాలిటీగా ప్రకటించి, దానికి ఒక పురపాలక సంఘాన్ని ఏర్పరుస్తుంది. ఈ సంఘ సభ్యులను ఆ పురంలో నివసించే ప్రజలు ఎన్నుకొంటారు. వీరిని కౌన్సిలర్లంటారు. జనాభాను బట్టి కొన్ని సీట్లు, షెడ్యూల్డ్ కులాలకు, జాతులకు రిజర్వ్ చేస్తారు. అదే విధంగా కొందరు స్త్రీలకు ప్రత్యేక ప్రాతినిధ్యం ఉంటుంది. వీరే కాక మునిసిపాలిటీ ప్రాంతంలో రాష్ట్ర శాసన సభ్యులు ఈ సంఘ సభ్యులుగా ఉంటారు.

ప్రతి పురపాలక సంఘానికి కార్యనిర్వహణ సంఘం ఉంటుంది. దీనిలో 3 నుంచి 7 వరకు సభ్యులుంటారు. ఇది మునిసిపల్ కౌన్సిల్ తీర్మానాలను అమలుపరుస్తుంది.

కార్యదర్శి మునిసిపాలిటీకి కార్యనిర్వహణాధికారి. ఇతనిని రాష్ట్ర ప్రభుత్వం నియమిస్తుంది. పురపాలక సంఘ సిబ్బంది ఇతని అజమాయిషీలో పనిచేస్తుంది. రికార్డులు భద్రపరచడం, పన్నులు, ఫీజుల వసూలు, లైసెన్సుల మంజూరు మొదలైనవి కార్యదర్శి ప్రధాన కర్తవ్యాలు.

పురపాలక సంఘం ప్రధానంగా ఈ కింది విధులు నిర్వహిస్తుంది : (1) రహదారి మార్గాలు (2) బాటల కిరువైపుల కాలిబాట మార్గాలు (3) వంతెనల నిర్మాణం (4) మురుగు నీటి కాలువల నిర్మాణం, వాటిని శుభ్రపరచడం, బాగుచేయడం (5) వీధి దీపాల ఏర్పాటు (6) మంచినీటి సరఫరా (7) మరుగుదొడ్ల నిర్మాణం (8) అంటురోగాల నివారణ (9) ఉద్యానవనాల ఏర్పాటు (10) చెత్తకుండీల ఏర్పాటు (11) బండ్లు ఆగడానికి ప్రత్యేక స్థలాల ఏర్పాటు (12) గ్రంథాలయాలు, పఠనాలయాలు ఏర్పాటుచేయడం (13) జనన, మరణ లెక్కలు తయారుచేయడం.

పురపాలక సంఘాలకు ఆదాయ మార్గాలు బహు స్వల్పం. అవి నిర్వహించవలసిన కర్తవ్యాలకు సరిపోయే ఆదాయం వాటికి లేదు. పురపాలక సంఘానికి ఆదాయం పన్నుల రూపంలో లభిస్తుంది. (1) ఆస్తిపన్ను-నివాస గృహాలు, షాపులు, హోటళ్ళు, తదితర వ్యాపార భవనాలు, ఖాళీ స్థలాలు మొదలైన స్థిరాస్తులపై విధించే పన్ను (2) వృత్తిపన్ను-ఉద్యోగాలు, వ్యాపారాలు, తదితర వృత్తులపై విధించే పన్ను (3) బండ్లు, ఇతర వాహనాలపై వాటిని నడపడానికి వినియోగించే జంతువులపై విధించే పన్ను (4) అడ్వర్టైజ్‌మెంట్లపై విధించే పన్ను. ఇవికాక అంగళ్ళు, హోటళ్ళు, సినిమా హాళ్ళను నిర్వహించడానికి మంజూరు చేసే లైసెన్సులు, ప్రభుత్వం నుంచి లభించే ఋణసహాయం, యాత్రిక కేంద్రాలు, ధర్మాదాయ సంస్థలనుంచి లభించే విరాళాలు ఉన్నాయి.

స్థానిక సంస్థలు ముఖ్యంగా పురపాలక సంస్థలు ఒక ప్రాంతంలో నివసించే ప్రజల స్థానికావసరాలు తీర్చడానికి ఉద్దేశింపబడినాయి. వీటి నిర్వహణలో రాష్ట్ర ప్రభుత్వ జోక్యం ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ఎక్కువగా ఉంది. అంతేగాక పురపాలక సంస్థల విధులను నిర్వహించడానికి ప్రత్యేకత, సుశిక్షణ ఉన్న ఉద్యోగ బృందం కూడా అవసరము. అన్నిటి కంటె ముఖ్యమైనది ఈ సంస్థల నిర్మాణము, కార్యకలాపాలలో రాజకీయ పక్షాల జోక్యం చాలావరకు పరిమితంచేయడం తగిన ఆర్థిక వనరులను, పాలనా స్వేచ్ఛను కల్పించినప్పుడే పురపాలక సంస్థలు బాధ్యతాయుతంగా తమ కర్తవ్యాలను విజయవంతంగా నిర్వహించగలవు.

## ప్రశ్నలు

1. పంచాయతీరాజ్ సంస్థల ప్రాముఖ్యాన్ని వివరించండి.

2. గ్రామ పంచాయతీలు, సమితులు, జిల్లా పరిషత్‌లను గురించి వివరించి వాటి కార్యక్రమాలను, విధులను తెలపండి.

3. పురపాలక సంస్థలు ఎన్ని రకాలు ? వాటి విధులను వివరించండి.

11

# భారత రాజకీయ వ్యవస్థ-పౌరుని పాత్ర

ప్రజా స్వామ్యంలో ప్రభుత్వ యంత్రాంగాన్ని నడిపే పాలకులను ప్రజలు ఎన్నుకో వలె. ఇటువంటి ఎన్నికలు ఒక నిర్ణీత కాలానికి అంటే ప్రతి 5 సం॥లకు జరుగుతాయి. ఎన్నికలు కేవలం ప్రజా ప్రతినిధులను, ప్రభుత్వాలను ఏర్పాటు చేసుకోవడానికే పరిమితం కాక ప్రజలు ప్రభుత్వం నుంచి ఏమి ఆశిస్తారు? ప్రభుత్వం ప్రజలకు ఏమి చేయగలుగుతుంది? మొదలైన అంశాలు ప్రజాస్వామ్యంలో ప్రముఖ పాత్ర వహిస్తాయి. అందువల్ల ప్రజాస్వామ్యంలో పౌరుని పాత్ర అత్యంత కీలకమైనది. ఓటు హక్కు ఉన్న పౌరులందరూ తప్పనిసరిగా ఎన్నికలలో పాల్గొని సమర్థులైన, ప్రతిభావంతులైన, నిజాయితీపరులైన ప్రతినిధుల నెన్నుకొన్నప్పుడే ప్రజాస్వామ్య ప్రభుత్వం సమర్థవంతంగా పనిచేస్తుంది. అరిస్టాటిల్ అన్నట్లు "ప్రజాస్వామ్యంలో పౌరుని అజాగ్రత్త, నియంతృత్వ వ్యవస్థలో నియంత క్రూర పాలన కంటె ప్రమాదకరమైనది". అందువల్ల పౌరులు ప్రజా కార్యకలాపాల పట్ల సంకుచిత కుల, మత, ప్రాంతీయ విభేదాలను విస్మరించి సమాజ వికాసానికి, దేశ సమైక్యతకు తోడ్పడే పటిష్ఠమైన, సమర్థవంతమైన ప్రభుత్వాన్ని ఎన్నుకోవడంలో నిర్విరామ కృషి చేయవలె.

## ఓటు హక్కు

భారత రాజ్యాంగము 21 సం॥రాలు నిండిన ప్రతి భారతీయ పౌరునికి ఓటు హక్కును కల్పించింది. ఈ ఓటు హక్కును పౌరుడు హక్కుగా కాకుండా విద్యుక్త ధర్మంగా, చిత్తశుద్ధితో వినియోగించవలె. ప్రజాస్వామ్యానికి వయోజన ఓటు హక్కుకు అత్యంత సన్నిహిత సంబంధం ఉంది. విద్య, ఆస్తి తదితర అర్హతలతో నిమిత్తం లేకుండా భారత రాజ్యాంగం సార్వజనీన ఓటు హక్కును భారతీయ పౌరులందరికీ కల్పించింది. భారత ప్రజలు అధిక సంఖ్యలో నిరక్షరాస్యులైనా, పేదరికపు దశకంటె తక్కువ స్థాయిలో జీవిస్తున్నా, రాజకీయ చైతన్యం వారిలో ఏమాత్రం లోపించలేదని ఇటీవలి లోకసభ ఎన్నికలు రుజువు చేసినాయి.

ఎన్నికలలో వివిధ రాజకీయ పార్టీలు ఓటర్లను ఆకర్షించడానికి అనేక ఆచరణ సాధ్యంకాని వాగ్దానాలు చేస్తూ ఉంటాయి. అధిక ధనాన్ని, ప్రచారసాధనాలను అపరిమితంగా వినియోగించడం కూడా జరగవచ్చు. ఇటువంటి సందర్భాలలో ఓటర్లు తాత్కాలిక ప్రయోజనాలకు, ప్రలోభాలకు లోబడకుండా తమ ఓటును జాతీయ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని, వివిధ రాజకీయ పార్టీల ఎన్నికల ప్రణాళికలను పరిశీలించి తమ దృష్టిలో ఏ రాజకీయపార్టీ సమర్థమైన విధానాలను, ప్రతిభావంతులైన నాయకులను సూచిస్తుందో దానినే ఎన్నుకోవలె.

## ప్రజాభిప్రాయము

ఈ సందర్భంలో ప్రజాభిప్రాయం సక్రమంగా వ్యక్తంకావడం చాలా అవసరము. ఎన్నికల తరువాత ప్రభుత్వము, ప్రజా ప్రతినిధులు పనిచేసే తీరుతెన్నులను గమనించి, లోపాలను ప్రభుత్వ దృష్టికి తెచ్చి పరిపాలన ప్రజా సంక్షేమంపట్ల శ్రద్ధ వహించేటట్లు చేయవలె. ప్రజాస్వామ్యంలో ప్రభుత్వం ప్రజాభిప్రాయాన్ని గౌరవించి, ప్రజాహితమైన కార్యక్రమాలను అమలుపరచవలె. ప్రజాభిప్రాయాన్ని రూపొంది వ్యక్తం చేయడంలో పత్రికలు, రాజకీయ పార్టీలు, విద్యావేత్తలు, ఆసక్తివర్గాలు (Interest groups) ప్రముఖ పాత్ర వహిస్తాయి. ముఖ్యంగా విద్యావంతులు దేశ సమస్యలను, ప్రభుత్వ వ్యవహారాలను పరిశీలించి, పత్రికలద్వారా, సమావేశాలద్వారా, రేడియో గోష్ఠులద్వారా దేశ ప్రజలకు జాతీయ సమస్యలను గురించి వివరించవలె. అంతేకాక వాటిని పరిష్కరించడానికి సృజనాత్మకమైన సూచనలు ఇవ్వవలె. ఈ ప్రజాభిప్రాయ రూపకల్పనకు రాజకీయ పార్టీలు అవసరము. రాజకీయ పార్టీలు ప్రజా సమస్యలను గుర్తించి వాటిని పరిష్కరించడానికి తగిన విధానాలను రూపొందిస్తాయి. అంతేకాక వీటిని అమలుపరచడానికి సమర్థులైన వ్యక్తులనుకూడా ప్రజలకు సూచిస్తాయి.

## రాజకీయ పార్టీ

జాతీయ శ్రేయస్సును పెంపొందింపజేసేందుకు కొన్ని సిద్ధాంతాలను విశ్వసించి, ఒక సుసంఘటిత శక్తిగా రూపొంది, ప్రభుత్వాధికారాన్ని చేపట్టి, లేదా చేపట్టడానికి ప్రయత్నిస్తూ తమ సిద్ధాంతాలను, కార్యకలాపాలను సమష్టి కృషిద్వారా ఆచరణలో పెట్టడానికి సంకల్పించే ప్రజాసమూహమే రాజకీయపార్టీ అని లార్డ్‌బ్రైస్ చెప్పినాడు. "ఏదో ఒక సూత్రాన్ని (Principle) లేదా విధానాన్ని (Policy) సమర్థిస్తూ రాజ్యాంగబద్ధమైన మార్గాలద్వారా ప్రభుత్వాన్ని చేపట్టడానికి కృషిచేసే సుసంఘటిత సంస్థే రాజకీయపార్టీ" అని మెకైవర్ నిర్వచించినాడు.

ప్రజాస్వామ్య ప్రభుత్వం పనిచేయడానికి రాజకీయపార్టీలు తప్పనిసరిగా ఉండవలె. పరిపాలనా యంత్రాగాన్ని నడిపించే శక్తులవి. రాజకీయ పార్టీలు లేకుండా సమైక్య నియమ ప్రకటన (Unified Statement of principles) లేదా క్రమబద్ధ విధాన రూపకల్పన సాధ్యం కావు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో రాజకీయ పార్టీలు ప్రభుత్వ మనుగడకు శాసనసభా కార్యకలాపాలకు చాలా అవసరము. లోవెల్ అన్నట్లు "ఏదైనా ఒక పెద్ద దేశంలో ప్రజలందరివల్ల ప్రభుత్వం నడుస్తుందనే అభిప్రాయానికి అర్థం లేదు. ఎందుకంటే ఓటు హక్కు విస్తృతంగా ఉన్నచోట పార్టీలుండటం ఖాయము. నియంత్రణ (Control) నిజంగా అధిక సంఖ్యాకుల పార్టీల చేతులలోగాని లేదా అందుకు దగ్గరగా ఉన్న పార్టీల చేతులలోగాని ఉండవలె.

## ఎన్నికలు – ఎన్నికల యంత్రాంగము

ప్రజాస్వామ్యం విధానం నిష్పాక్షికమైన ఎన్నికలపై ఆధారపడి ఉంటుంది. అందువల్ల

మన రాజ్యాంగంలో ఎన్నికలను గురించి ఒక అధ్యాయంలో ప్రత్యేకంగా వివరించడం జరిగింది. ఎన్నికలు సాధారణంగా 5 సం॥రాల కొకసారి జరుగుతాయి. వీటిని సాధారణ ఎన్నికలు అంటారు. కొన్ని సందర్భాలలో కొన్ని ప్రత్యేక పరిస్థితులవల్ల శాసన సభ పదవీ కాలం పూర్తికాకుండానే దానికి ఎన్నికలు జరిపించవచ్చు. ఇటువంటి ఎన్నికలను మధ్యంతర ఎన్నికలంటారు. అదే విధంగా శాసన సభ్యుడు తన సభ్యత్వానికి రాజీనామా చేసినప్పుడు గాని, లేదా మరణించినప్పుడుగాని ఆ స్థానం ఖాళీ అవుతుంది. అప్పుడు ఆ ఒక్క నియోజక వర్గం నుంచే ప్రతినిధిని ఎన్నుకోవడానికి ఎన్నికలు జరుపుతారు. ఇటువంటి ఎన్నికలను 'బై ఎలక్షన్స్' అంటారు. ఈ ఎన్నికలన్నిటినీ నిర్వహించడానికి రాజ్యాంగం శాశ్వత ప్రాతిపదికపై ఒక ప్రత్యేక, స్వతంత్ర ప్రతిపత్తి గల సంస్థను ఏర్పాటుచేసింది. దీనిని "ఎన్నికల కమిషన్" అంటారు. దీనికి అధిపతి 'చీఫ్ ఎలక్షన్ కమీషనర్'. ఈయనను రాష్ట్రపతి నియమిస్తాడు.

ఎన్నికల కమిషన్ ఈ కింది విధులు నిర్వహిస్తుంది : (1) అధ్యక్ష, ఉపాధ్యక్షుల ఎన్నికలు (2) లోక సభ, రాష్ట్ర శాసన సభల ఎన్నికలు (3) రాజ్యసభ ఎన్నికలు.

ఎన్నికల కమిషన్ ఎన్నికలకు సంబంధించిన నియమ నిబంధనలన్నిటిని రూపొందిస్తుంది. శాసన సభ్యుల అర్హతలు, కాలపరిమితిని నిర్ణయించడం, షెడ్యూల్డ్ కులాలకు, తెగలకు ప్రత్యేక స్థానాలను కేటాయించడం, నియోజకవర్గాలలోని ఓటర్ల జాబితాలను తయారు చేయడం మొదలైనవి ఎన్నికల కమిషన్ నిర్వహించే కొన్ని ముఖ్యమైన కర్తవ్యాలు.

రాష్ట్రంలో జరిగే ఎన్నికల నిర్వహణకు ప్రాంతీయ ఎలక్షన్ కమిషనర్ ఉంటాడు. ఎన్నికలను నిర్వహించడానికి అనుభవజ్ఞులైన ఒక రాష్ట్ర ప్రభుత్వాధికారిని నియమించే సంప్రదాయం ఒకటి అమలులో ఉంది.

జిల్లా స్థాయిలో సాధారణంగా కలెక్టరే ఎన్నికల నిర్వహణాధికారిగా వ్యవహరిస్తాడు. ఈయన జిల్లాలోని ప్రతి నియోజకవర్గానికి ఒక ఎన్నికల అధికారిని (Returning officer) నియమిస్తాడు. ఎన్నికలను జరపడానికి తగిన ఏర్పాట్లన్నీ కలెక్టరే చేస్తాడు. ప్రతి పోలింగ్ బూత్‌కు ఒక ప్రిసైడింగ్ ఆఫీసర్, ఆయనకు సహాయకులుగా కొంతమంది పోలింగ్ ఆఫీసర్లను నియమిస్తారు.

## ఓటర్ల బాధ్యతలు

ప్రతి ఓటరు ఎన్నికల సమయంలో ఈ కింది బాధ్యతలను గుర్తించి నడుచుకోవలె. (1) సామర్థ్యాన్ని, నిజాయతీని, రాజకీయ పరిజ్ఞానాన్ని, సంఘ సేవాభిలాషను వ్యక్తంచేసే అభ్యర్థిని ఎన్నుకోవలె. (2) సంకుచిత ప్రాంతీయ, కుల, మత, వర్గ వైషమ్యాలను రెచ్చగొట్టేవారిని, స్వార్థ ప్రయోజనాలను ఎరచూపించే స్వార్థపరులను ఎన్నుకోరాదు. (3) తానొక్కడు ఓటు వేయకపోతే వచ్చే నష్టం ఏమిటి ? అనే ఉదాసీన భావాన్ని ఓటరు వదులుకోవలె. ముఖ్యంగా ఈ భావం గ్రామీణ ప్రాంతాలకంటె పట్టణ ప్రాంతాలలో ఎక్కువగా కనిపిస్తుంది. ఎందుకంటే అనేక ఎన్నికలలో పట్టణ ప్రాంతాలకంటె గ్రామీణ ప్రాంతాలలో పోలైన ఓట్ల శాతం ఎక్కువగా ఉంది. ప్రతి పౌరుడు ఓటు వేయడం తన ప్రాథమిక బాధ్య

తగా గుర్తించి ఎన్నికలలో పాల్గొన్నప్పుడే సమర్థులైన ప్రజా ప్రతినిధుల నెన్నుకోవడం సాధ్యమవుతుంది.

## ప్రశ్నలు

1. భారత రాజకీయ వ్యవస్థను వివరించండి.
2. ఓటు హక్కు అంటే ఏమిటి ?
3. ఎన్నికలను గురించి, ఎన్నికల యంత్రాంగం విధులను గురించి తెలపండి.

# 12

# సంక్షేమ రాజ్యము

భారత రాజ్యాంగము ప్రజాస్వామ్యాన్ని పటిష్ఠం చేసే రాజకీయ వ్యవస్థను సూచించడమే కాక భారత ప్రజల ఆశయాలను కూడా ప్రతిబింబించే నవసమాజ నిర్మాణానికి దారి చూపించింది. రాజ్యాంగ ప్రవేశికలో మన రాజ్యము సార్వభౌమాధికార, సామ్యవాద, మత ప్రమేయంలేని ప్రజాస్వామిక రిపబ్లిక్ అని చెప్పడం జరిగింది. అంతేకాక, రాజ్యాంగంలో ప్రస్తావించిన నిర్దేశక నియమాలు కూడా భారతీయుల ఆశయాలను, ఆకాంక్షలను సూచిస్తున్నాయి. రాజకీయ స్వాతంత్ర్యము, ఆర్థిక, సాంఘిక రంగాలలో తగినంత అభివృద్ధిని సాధించనిదే సుస్థిరం కాజాలదు. ఈ విషయాన్ని గ్రహించే మన రాజ్యాంగ వేత్తలు శ్రేయో రాజ్య నిర్మాణానికి అనువైన విధానాలను, ధ్యేయాలను సూచించినారు.

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వివిధ విధానాల ద్వారా, పథకాల ద్వారా ఆర్థిక సాంఘిక రంగాలలో సత్వరాభివృద్ధిని సాధించడాని నిర్విరామంగా కృషి చేస్తున్నాయి. నేడు దేశం ఎదుర్కొంటున్న పేదరికం, నిరుద్యోగం, ఆహార తదితర నిత్యావసర వస్తువుల కొరత, ద్రవ్యోల్బణం, మొదలైన జటిల సమస్యలను పరిష్కరించడానికి తగిన వనరులు, అవకాశము ఒక్క ప్రభుత్వానికే ఉన్నాయి. ప్రజాస్వామ్యంలో వ్యక్తి స్వేచ్ఛా వాదాన్ని ఆధారం చేసుకొని ఆర్థిక, సాంఘిక కార్యకలాపాలలో ఎటువంటి జోక్యం చేసుకోకుండా అధిక సంఖ్యాక ప్రజలు బీదరికంలో జీవిస్తున్నప్పుడు ప్రభుత్వం వారిని ఉపేక్షించలేదు. అంతేకాక కార్మిక సంక్షేమం, విద్య, వైద్య సదుపాయాలు, గృహవసతి, రవాణా సౌకర్యాలు, వికలాంగులకు ఉపాధి, వృద్ధులకు, అనాథలకు రక్షణ మొదలైన మహత్తర కార్యకలాపాలను చేపట్టవలసిన విధి ఆధునిక కాలంలో ప్రభుత్వానికి ఎంతైనా ఉంది. ఈ దృక్పథంలో ఆలోచించినప్పుడు ప్రస్తుత కాలంలో అన్ని రాజ్యాలు సంక్షేమ రాజ్యాలే.

ఆర్థిక సమానత్వం, సాంఘిక అసమానతలను తొలగించడం, అన్ని రంగాలలో ప్రజల అవసరాలను తీర్చడానికి ప్రభుత్వం చేసే కృషికి తగిన గమ్యాలే కాక కావలసిన సాధనాలు కూడా ఉండవలె. ముఖ్యంగా సువిశాలమైన మన దేశంలో నిరక్షరాస్యత, నిరుద్యోగం, పేదరికం మొదలైన తక్షణ సమస్యలను యుద్ధోత్సాహంతో పరిష్కరించడానికి, పరిమిత స్థాయిలో ఉన్న వనరులను వృథా చేయకుండా ముఖ్యమైన అవసరాలను ముందుగానే నిర్ణయించుకొని వాటిని ఒక నియమిత కాలంలో నిర్ణీతమైన పద్ధతిలో అమలుపరచడానికి ప్రణాళికా బద్ధమైన ఆర్థిక, సాంఘిక కార్యకలాపాలు అవసరము. ఈ విషయాన్ని గుర్తించి మన దేశంలో ఆర్థిక సాంఘిక కార్యకలాపాలను క్రమబద్ధంగా నిర్ణయించి నిర్ణీత కాలంలో అమలుపరచడానికి తగిన, నైపుణ్యమైన సిఫార్సు లివ్వడానికి కేంద్ర స్థాయిలో జాతీయ ప్రణాళికా సంఘాన్ని (Planning Commission) ఏర్పాటుచేయడం జరిగింది.

## జాతీయ ప్రణాళికా సంఘము

1950 లో ప్రకటించిన పారిశ్రామిక విధాన తీర్మానం ఆధారంగా జాతీయ స్థాయిలో ప్రణాళికా సంఘం ఏర్పాటు చేయడం జరిగింది. ప్రణాళికా సంఘం విధులు ప్రణాళికా రచనకు, ప్రణాళికా సంస్థకు సంబంధించి ఉంటాయి. ప్రణాళికా సంఘం విధులను ఈ కింది విధంగా పేర్కొనవచ్చు:

1. దేశంలోని వస్తు సంపదను, మానవ సంపదను, పెట్టుబడిని అంచనావేసి తరుగు ఉన్న వనరులను భర్తీ చేయడానికి ప్రతిపాదనలు రూపొందించడం.

2 దేశంలోని వనరులను అత్యంత స్థాయిలో ఉపయోగపడేటట్లు పథకాలు రూపొందించడం.

3. ప్రణాళికలు అమలు జరిగే దశలు నిర్ణయించడం.

4. ప్రణాళికల అమలుకు అవసరమైన యంత్రాంగ స్వభావాన్ని నిర్ణయించడం.

5. ప్రణాళికా కాలంలో ప్రతి దశ స్థాయిలోనూ జరిగిన అభివృద్ధిని సమీక్షించడం.

6. జాతీయాభివృద్ధిలో ప్రజల సహకారాన్ని పొందే అనువైన కార్యక్రమాలను సూచించడం.

7. దీర్ఘ కాలిక ప్రణాళికా రచన.

ప్రణాళికలను రూపొందించడం, ప్రణాళికల అమలును సమీక్షించడం-ఇవి ప్రణాళికా సంఘం ముఖ్య కర్తవ్యాలు. ప్రణాళికల అమలు వాటికి సంబంధించిన పాలనాంశాల బాధ్యత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలదే. అందువల్ల, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రణాళికా సంఘానికి అతి సన్నిహిత సంబంధం ఉంటుంది ప్రధానమంత్రి ప్రణాళికా సంఘానికి అధికార రీత్యా అధ్యక్షుడు. ప్రణాళికా సంఘం ముఖ్యమైన కార్యకలాపాలు నిర్వహించడానికి ఒక ఉపాధ్యక్షుడు ఉంటాడు. వీరే కాక ఆర్థిక, పరిశ్రమల, శ్రామిక తదితర కేంద్ర మంత్రులు కూడా ఈ సంఘంలో సభ్యులే. ప్రణాళికా సంఘం ఏర్పరిచే వివిధ ఉపసంఘాలు, అధ్యయన శాఖలలో మంత్రిత్వ శాఖలకు ప్రాతినిధ్యం ఇవ్వడంద్వారా కేంద్ర ప్రభుత్వానికి, ప్రణాళికా సంఘానికి ఎంతో సన్నిహిత సంబంధం ఉంటుంది. రాష్ట్ర ప్రభుత్వ ప్రణాళికా శాఖలు, జాతీయాభివృద్ధి మండలి ద్వారా ప్రణాళికా సంఘానికి రాష్ట్ర ప్రభుత్వాలతో దగ్గరి సంబంధం ఉంటుంది.

ప్రణాళికా సంఘం నిపుణులతో కూడిన ప్రత్యేక సలహా సంస్థగా కాక మంత్రులు, ప్రభుత్వోద్యోగులతో కూడిన ఒక కార్యనిర్వాహక సంస్థగా ఏర్పడిందని అనేకమంది విమర్శిస్తున్నారు.[1]

1. ఉదాహరణకు, "What had happened was that, on the one hand the shadow of Government on the Commission strengthened through the influx of Ministers into its membership and of bureaucrats into its secretariat, and on the other hand the Commission itself began to function as a wing of the Government"

*Economic and Political Weekly*, May, 8, 1971

## జాతీయ అభివృద్ధిమండలి

జాతీయ అభివృద్ధిమండలి ప్రణాళికా సంఘంలోని ఉన్నత స్థాయిలో ఏర్పాటైన సమన్వయ సంస్థ. దీనికి ప్రధానమంత్రి అధ్యక్షుడు కేంద్ర కాబినెట్ మంత్రులు, రాష్ట్ర ముఖ్యమంత్రులు, ప్రణాళికా సంఘ సభ్యులు ఇందులో ఉంటారు. ఈ మండలి ఈ కింది విధులను నిర్వహిస్తుంది :

1. వనరుల అంచనా జాతీయప్రణాళికల రూపకల్పనకు మార్గదర్శక సూత్రాలను నిర్ణయించడం.

2. ప్రణాళికా సంఘం రూపొందించే జాతీయ ప్రణాళికల పరిశీలన.

3. జాతీయభివృద్ధికి సంబంధించిన ప్రధాన సాంఘిక, ఆర్థిక విషయాల పరిశీలన.

4. ప్రణాళికల అమలును ఎప్పటికప్పుడు సమీక్షించి, అవసరమైన సందర్భాలలో తగిన మార్పులు సూచించడం.

## ఆర్థిక సంఘము

కేంద్ర, రాష్ట్రాల మధ్య ప్రణాళికా బద్ధంగా వనరులను పంపిణీ చేయడానికి ఏర్పాటైన సంస్థే ఆర్థిక సంఘము. వివిధ ఆర్థిక వనరుల నుంచి లభించే ధనాన్ని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య కేటాయించడం ఆర్థిక సంఘం యొక్క ప్రధాన ధ్యేయము.

రాజ్యాంగంలోని 280 నిబంధన ప్రకారం ప్రతి 5 సం॥రాల కొకసారి రాష్ట్రపతి ఒక ఆర్థిక సంఘాన్ని నియమిస్తాడు. దీనికొక అధ్యక్షుడు, నలుగురు సభ్యులు ఉంటారు. ఆర్థిక సంఘం ఈ కింది బాధ్యతలు నిర్వహిస్తుంది :

1. పన్నుల ద్వారా వచ్చే నికరాదాయం, కేంద్ర, రాష్ట్రాల మధ్య ఏ విధంగా విభజించవలెనో రాష్ట్రపతికి సిఫార్సు చేయడం.

2. సంఘటిత నిధి (Consolidated Fund) నుంచి రాష్ట్రాలకు చెల్లించిన గ్రాంట్లను, రాబడిలో రాష్ట్రాల వాటాను నిర్ణయించే సూత్రాలను రాష్ట్రపతికి సూచించడం.

3. పటిష్ఠమైన ఆర్థిక స్థితి సాధనకు రాష్ట్రపతి కోరిన అవసరమైన సమాచారాన్ని అందించడం.

ఆర్థిక సంఘం సిఫార్సులను, వాటిపై కేంద్ర ప్రభుత్వం తీసుకొనే చర్యలను రాష్ట్రపతి పార్లమెంట్‌కు తెలియజేయవలె.

## భూసంస్కరణలు

మన దేశంలో నూటికి 80 మంది ప్రజలు గ్రామాలలో నివసిస్తున్నారు. గ్రామీణ ప్రాంతాలు అభివృద్ధి సాధించనిదే దేశాభ్యుదయం సాధ్యం కాదని గాంధీజీ అనేక పర్యాయాలు అనేవారు. గ్రామ ప్రాంతాలలో ప్రధానమైన ఉపాధి వ్యవసాయము. నూటికి 90 మంది వ్యవసాయమే జీవన భృతిగా కలవారు. కాని ఎక్కువ భాగం వ్యవసాయ భూములు ఈనాడు ప్రభుత్వ లెక్కల ప్రకారం 20% ప్రజల ఆధిపత్యంలో ఉన్నాయి. దీనినిబట్టి గ్రామీణ ప్రాంతంలో జీవించే అధిక సంఖ్యాక ప్రజలకు వ్యావసాయిక భూములపై ఆధిపత్యం లేక

పోవడమే కాక వారు కేవలం భూస్వాముల కబంధహస్తాలలో ఇరుక్కుపోయి వెట్టి చాకిరీతో ఆజన్మాంతం కృశించిపోయే ప్రమాదం తీవ్రంగా ఉందని తెలుస్తున్నది ఇటువంటి పరిస్థితి మన రాజ్యాంగ లక్ష్యాలకు విరుద్ధంగా ఉండటమే కాక మన ప్రజాస్వామ్యానికే సిగ్గుచేటు. ఆర్థిక సాంఘిక రంగాలలో సత్వరాభివృద్ధి సాధించడానికి ప్రజలందరికీ ముఖ్యంగా బలహీన, దళితవర్గాల అభివృద్ధికి భూసంస్కరణల అమలు ఒక ముఖ్య సాధనమని ఈనాడు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలను నిర్వహించే అన్ని రాజకీయ పక్షాలు భావిస్తున్నాయి. భూసంస్కరణలను అమలుజరపడానికి గాను అనేక రాష్ట్ర ప్రభుత్వాలు భూమి యాజమాన్యంపై (వ్యవసాయిక) గరిష్ఠ పరిమితులు నిర్ణయిస్తూ సీలింగ్ చట్టాలను చేసినాయి.

భూసంస్కరణల ప్రయోజనాలను ఈ కింది విధంగా చెప్పుకోవచ్చు :

1. సక్రమంగా సాగుచేయని పెద్ద పెద్ద భూకమతాలను విభజించడం.

2. చిన్న చిన్న కమతాలను ఏర్పాటు చేయడంద్వారా వ్యావసాయిక ఉత్పత్తిని పెంచడం.

3. సాగుచేసే వ్యక్తులకు భూమిపై యాజమాన్యాన్ని కల్పించడం ద్వారా, కౌలు దార్లను, కమీషన్ దార్లను తొలగించడం.

4. సహకార క్షేత్రాలను స్థాపించి, చిన్న చిన్న వ్యవసాయదారుల సమష్టి కృషి ద్వారా ఆహార సంపదను పెంపొందించడానికి తగిన ప్రోత్సాహ వాతావరణాన్ని కల్పించడం.

5. పరిమితికి మించిన భూములను (Surplus lands) భూమి లేనివారికి ఇవ్వడం ద్వారా వారికి జీవనావకాశాలను కల్పించడం, తద్వారా సాంఘిక, ఆర్థిక రంగాలలో అస మానతలను తొలగించడం.

జమిందారీ పద్ధతిని రద్దు చేయడం ద్వారా మన దేశంలో భూసంస్కరణోద్యమం ప్రారంభమైందని చెప్పవచ్చు. దీనితోబాటు ఆచార్య వినోభా భావే ప్రారంభించిన 'భూదాన ఉద్యమం భూసంస్కరణలను కొంతవరకు ప్రాముఖ్యంలోకి తెచ్చిందని చెప్పవచ్చు. శ్రీ జయప్రకాశ్ నారాయణ్, ప్రభాకర్‌జీ, తదితర సర్వోదయ నాయకులు ఈ ఉద్యమానికి మహత్తరమైన సేవ చేసినారు.

అయితే భూసంస్కరణలు కేవలం చట్టాల ద్వారా లేదా ఉద్యమాల ద్వారా సాధ్యం కావు. భూసంస్కరణల ఆశయాలను మరిచిపోయి ఈనాడు కేవలం సీలింగ్ చట్టాలకే ప్రాముఖ్యం ఇస్తున్నారు. ఒక భూకామందుకు ఎంత గరిష్ఠ భూమి ఉండవలె అనేది నిర్ణ యించడంతోనే భూసంస్కరణల అమలు విజయవంతమైనదని భావించరాదు. అనేక సంద ర్భాలలో సాధారణ వనరులతో సాగుచేయడానికి సాధ్యంకాని బంజరు, పోరంబోకు భూము లను పేదలకు, బలహీనవర్గాలకు పంచిపెట్టడం జరుగుతున్నది. అదే విధంగా శాసన సభలలో అధిక సంఖ్యలో ఉన్న అగ్ర కులాలవారు, భూస్వాములు, సీలింగ్ చట్టాలు వస్తాయని ముందుగానే ఊహించి తమ భూములను అమ్ముకోవడమో, లేదా వ్యవసాయ క్షేత్రాలుగా మార్చుకోవడమో, లేదా దూరపు బంధువుల, జీతగాండ్ర పేర్లపై వ్రాసి ఉంచి పరోక్షంగా వాటి ఫలాన్ని అనుభవించడమో జరుగుతున్నప్పుడు భూసంస్కరణ చట్టాలు, ఉద్యమాలు పేదవారికి అందని ఫలాలుగా మిగిలిపోతాయి.

## జాతీయాకరణ
## (Nationalization)

ధనిక. పేదలమధ్య ఉన్న వ్యత్యాసాన్ని, క్రమక్రమంగా తొలిగిస్తూ, ప్రజలందరికీ తగిన ఆదాయవనరుల సంపాదనకు సమానావకాశం కల్పించడం ప్రభుత్వం యొక్క ముఖ్య లక్ష్యమని నిర్దేశక నియమాలు చెబుతాయి. ఆర్థిక రంగంలో స్వయం సమృద్ధిని సాధించ డానికి ధనిక పేదల మధ్య అసమానత్వాన్ని తొలగించడానికి, దేశ సంపదపై కొద్దిమంది వ్యక్తుల గుత్తాధిపత్యాన్ని తొలగించడానికి ప్రభుత్వం తీవ్రస్థాయిలో కృషిచేస్తున్నది. స్వయంగా కొన్ని వ్యాపార సంస్థలను నిర్వహించడమే కాకుండా (ప్రభుత్వ రంగం) ప్రైవేట్ రంగంలో పనిచేస్తున్న కొన్ని వ్యాపార సంస్థలను స్వాధీనం చేసుకొని వాటిని సాంఘిక ప్రయోజనం దృష్ట్యా లాభాపేక్ష కంటే సేవా దృక్పథంతో ప్రభుత్వం నిర్వహిస్తున్నది.

ప్రైవేట్ వ్యక్తుల యాజమాన్యంలో నిర్వహిస్తున్న వ్యాపార సంస్థలను వారికి కొంత పరిహారాన్ని చెల్లించి ప్రభుత్వం ఆ సంస్థను తన స్వాధీనం చేసుకొని వాటిని నిర్వహించే పద్ధతిని జాతీయాకరణ విధానం అంటారు. ఈ విధానం ద్వారా ధనిక. పేదల మధ్య తార తమ్యాలను తొలగించడం, సంపద యాజమాన్యంలో గుత్తాధిపత్యాన్ని తొలగించడం, సమా జంలో ఉత్పన్నమయ్యే సంపద ఉత్పత్తిలోనూ, పంపిణీలోనూ ప్రైవేట్ వ్యక్తుల ఆసక్తి, నిర్వహణ, ఆజమాయిషీల స్థానంలో సమాజ యాజమాన్యం, నిర్వహణలను నెలకొల్పడం జాతీయాకరణ ప్రధాన లక్ష్యాలు. అంతేకాక ఆర్థికాభివృద్ధికి అవసరమైన కీలక పరిశ్రమల నిర్వహణలో, విధానాల నిర్ణయంలో ప్రభుత్వానికి ప్రత్యక్ష యాజమాన్యం కల్పించడం జాతీ యాకరణ విధాన ధ్యేయము.

ప్రణాళికా బద్ధమైన ఆర్థిక కార్యకలాపాలతోపాటు ఆర్థిక రంగంలో సత్వరాభివృద్ధిని సాధించడానికి జాతీయాకరణ విధానాన్ని కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్నది. జీవిత, సాధా రణ భీమా, గనులు, బొగ్గు పరిశ్రమలు, బ్యాంక్‌లను జాతీయాకరణ ద్వారా కేంద్ర ప్రభుత్వం ఈనాడు నిర్వహిస్తున్నది. వీటితోబాటు రైలు, రోడ్డు, ఆకాశ ప్రయాణ మార్గాలను జాతీయా కరణ ద్వారా ప్రభుత్వం చేపట్టింది. జీవిత భీమాసంస్థ (L. I. C.), ఇండియన్ ఏర్ లైన్స్, ఎయిర్ ఇండియా, ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, 1969లో జాతీయం చేసిన 20 బ్యాంకుల నిర్వహణ జాతీయాకరణ విధానం ద్వారా ప్రభుత్వం నిర్వ హిస్తున్న సంస్థలలో కొన్ని ముఖ్యమైనవిగా పేర్కొనవచ్చు.

అభివృద్ధిచెందుతున్న రాజ్యాలలో సత్వరాభివృద్ధిని సాంధించడానికి, ప్రజల జీవన స్థాయిని పెంపొందించడానికి అన్ని రంగాలలో స్వయం సమృద్ధిని సాధించడానికి ఆర్థిక సాంఘిక రంగాలలో ప్రభుత్వం చొరవ యాజమాన్యం అవసరమనేది అందరూ అంగీకరించ వలసిందే. పరిమిత వనరులను ప్రత్యామ్నాయ ప్రయోజనాల కుపయోగించుకోవడానికి ఒక క్రమ పద్ధతిలో వాటిని వినియోగించుకోవడానికి బాధ్యతాయుతమైన ప్రభుత్వ యాజమాన్యం అవసరము. దీనికి జాతీయాకరణ విధానం కొంతవరకు తోడ్పడుతున్నది. అయితే జాతీయా కరణను పరిమితంగా అనుసరించవలె. ఆర్థికాభివృద్ధికి కీలకమైన పరిశ్రమలకు ఉదాహరణకు ఉక్కు, ఇంధనము విద్యుచ్ఛక్తి మొదలైన వాటికి, ప్రభుత్వ యాజమాన్యం పరిమితి అయితే

మంచిది. అట్లా కాకుండా బ్యాంకుల నిర్వహణ నుంచి ఉల్లిపాయల కొనుగోలు, విక్రయాల వరకు ప్రభుత్వమే అన్ని ఆర్థిక కార్యక్రమాలను నిర్వహిస్తే దేశ సంపదపై, వనరులపై ప్రైవేట్ వ్యక్తుల గుత్తాధిపత్యం స్థానంలో ప్రభుత్వాన్ని నిర్వహించే కొద్దిమంది వ్యక్తుల గుత్తాధిపత్యం నెలకొల్పడం జరుగుతుంది. దీనితోబాటు అధికార దుర్వినియోగం అధికం కావడానికి అవకాశాలు ఏర్పడతాయి. ప్రభుత్వోద్యోగులు తమ అధికారాన్ని విచ్చలవిడిగా వినియోగిస్తూ, తమ బాధ్యతలను మరచిపోయి, ప్రజలను అనేక ఇబ్బందులకు గురిచేయడం కూడా జరగవచ్చు. జీర్ణ శక్తి మించిన అధికాహారం అజీర్ణానికే కాక తీవ్ర అనారోగ్యానికి దారి తీస్తుంది. అందువల్ల జాతీయీకరణ విధానాన్ని జాగ్రత్తతో సమాజ ప్రయోజనాలకు, అవసరానికి ప్రమాదం కలగని విధంగా అనుసరించవలె.

సంక్షేమ రాజ్యం కేవలం ప్రభుత్వంద్వారా, రాజ్యాంగంద్వారా, చట్టాలద్వారా, పథకాలద్వారా అమలులోనికి రాదు. సంక్షేమ రాజ్యస్థాపనకు వీటితోబాటు వీటికంటే ముఖ్యమైనది ప్రజల తోడ్పాటు. పౌరులు చిత్తశుద్ధితో శ్రమించి, సమాజ ప్రయోజనానికి సమష్టిగా, నిస్వార్థంగా, నిర్విరామంగా కృషిచేసినప్పుడే గాంధీజీ కలలుగన్న రామరాజ్యంగానీ. నేడు మనం కోరుకొంటున్న సంక్షేమ రాజ్యంగానీ సాధ్యమవుతుంది.

## ప్రశ్నలు

1. సంక్షేమ రాజ్యమంటే ఏమిటి ?
2. ఈ క్రింది వాటిని గురించి క్లుప్తంగా వివరించండి.
   (1) జాతీయ ప్రణాళికా సంఘము.
   (2) జాతీయ అభివృద్ధి మండలి.
   (3) జాతీయీకరణ.
3. భూసంస్కరణలను గురించి వివరించండి

# 13
# జాతీయ సమైక్యత

జాతీయ సమైక్యత అనే భావం నూతనంగా ఒక జాతి రాజ్యంగా ఏర్పడిన ప్రజలలో సమైక్యతను తీసుకొని రావడాన్ని సూచిస్తుంది. భారతదేశ ప్రజలు బ్రిటిష్‌వారి పరిపాలనకు వ్యతిరేకంగా జాతీయోద్యమాన్ని విజయవంతంగా నిర్వహించి 1947 ఆగస్ట్ 15 నాడు రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించుకొన్నారు. భారతదేశం సార్వభౌమాధికార ప్రజాస్వామ్య రిపబ్లిక్‌గా 26, జనవరి 1950 న అవతరించింది. స్వాతంత్ర్యం వచ్చిన తరవాత భారతీయు లందరూ ఒకే జాతి పౌరులనే భావం క్రమక్రమంగా క్షీణించి జాతీయ సమైక్యతను విచ్ఛిన్నం చేసే ధోరణి స్వతంత్ర భారతదేశంలో విపరీతంగా పెరిగింది. జాతి సమైక్యతను నాశనం చేసే కులమత ద్వేషాలు, ప్రాంతీయవాదం, భాషా దురభిమానం విపరీతంగా వ్యాప్తి చెందు తున్నాయి. వీటిని తొలగించడానికి తీసుకోవలసిన చర్యలు ఏమిటి ? మత ప్రమేయంలేని లౌకిక, ప్రజాస్వామ్యాన్ని బలపరచడానికి ఏ యే అంశాలు తోడ్పడతాయి ? మొదలైన వాటిని చర్చించడానికి ముందు జాతీయ సమైక్యత అంటే ఏమిటో తెలుసుకొందాము.

జాతీయ సమైక్యతా భావం ఆధునిక యుగానికి చెందినది. జాతీయ భావమూ, జాతి రాజ్యాలూ 18, 19 వ శతాబ్దాలలో యూరప్‌లో అవతరించడంతో జాతీయ సమైక్యతకు ప్రాధాన్యం లభించింది. జాతీయవాదం ఫలితంగా ఆధునిక రాజ్యాలు అవతరించిన తరవాత వాటి పటిష్ఠతకు, ప్రగతికి జాతీయ సమైక్యత అవసరమని గుర్తించడం జరిగింది. అందువల్ల సువిశాలమైన బహుజాతి రాజ్యాల ద్వారా జాతీయ సమైక్యతకున్న అవరోధాలేమిటి ? వాటిని ఏ విధంగా తొలిగించుకోవచ్చు ? మొదలైన విషయాలను పరిశోధించి, వాటికి పరిష్కార మార్గాలను కనుక్కోవడం జరిగింది. అమెరికా, బ్రిటన్, సోవియట్ యూనియన్ మొదలైన బహుజాతి రాజ్యాలు వివిధ మార్గాలను అనుసరించి జాతీయ సమైక్యతను సాధించగలిగినాయి.

రెండో ప్రపంచ యుద్ధానంతరం ఆఫ్రికా, ఆసియాఖండాలలో కొత్తగా ఏర్పడిన రాజ్యాలలో జాతీయ సమైక్యతా భావం లోపించడంవల్ల అవి సుస్థిరమైన రాజకీయ సంస్థలను ఏర్పాటు చేసుకోవడంలో విఫలమై రాజకీయ అస్థిరతకు, అశాంతికి గురై త్వరిత ప్రగతిని రాజకీయ, ఆర్థిక, సాంఘిక రంగాలలో సాధించలేక పోతున్నాయి. జాతీయ సమైక్యతను ఏ విధంగా సుస్థిరం చేయడమనేది స్వతంత్ర భారతదేశ ప్రధాన సమస్యలలో ఒకటి.

## జాతీయ సమైక్యత నిర్వచనము

జాతీయ సమైక్యతను నిర్వచించడంలో భిన్నాభిప్రాయాలున్నాయి. "దేశానికి అత్యంత విధేయత చూపించడం జాతీయ సమైక్యత ప్రధాన లక్షణం" అని అశోక్ మెహతా అభి ప్రాయము. దీని భావం ఏమిటంటే ఏ పౌరుడూ దేశ ప్రాదేశిక సమగ్రతకు (Territorial Integrity) వ్యతిరేకంగా ప్రవర్తించరాదని, అతి ప్రాదేశిక విధేయత (Extra-territorial)

loyalty) చూపే రాజకీయ పక్షాలను జాతి సమగ్రతకు వ్యతిరేక శక్తులుగా భావించడం జరుగుతున్నది. ఇట్లా ఉండగా మతము, జాతి, కుల విభేదాలు ప్రాతిపదికలుగా ఉన్న సంఘాలు, సంస్థలు, రాజకీయ పక్షాలు జాతి సమగ్రతకు బద్ధ శత్రువులని కమ్యూనిస్ట్లు వాదిస్తారు. అయితే ఇక్కడ గమనించవలసిన దేమిటంటే జాతి, కుల, మత విభేదాలు అన్ని దేశాలలోనూ ఉన్నాయి. కాని వాటితో బాటు జాతీయ సమైక్యతా భావం కూడా ప్రబలంగా ఉండవచ్చు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వర్ణతత్వం (Racialism) ఎంత ప్రబలంగా ఉన్నప్పటికీ సమైక్యతాభావం అంతకంటె రెట్టింపు బలంగా ఉంది.

దేశభక్తి, ప్రజలు ఏ జాతికి, కులానికి, మతానికి చెందినా, అందరూ ఒక తల్లి బిడ్డలమనే భావాన్ని అలవరచుకోవడం జాతీయ సమైక్యత అని చెప్పవచ్చు. ఒక దేశానికి చెందిన ప్రజలు తామా దేశ ప్రజలమని, తమలో ఎటువంటి విభేదాలూ దేశ విచ్ఛిత్తికి దారి తీయరాదనే ప్రగాఢమైన భావాన్నే జాతీయ సమైక్యతా భావమని భావించవచ్చు. వివిధ మతస్తులు, వివిధ భాషలు మాట్లాడేవారు, లేదా వివిధ జాతులకు చెందిన ప్రజలు ఒకే రాజ్యంలో ఉండటం జాతీయ సమైక్యతా భావానికి విరుద్ధమని భావించడం పొరపాటు. భిన్నత్వంలో ఏకత్వ భావాన్ని కలిగి ఉండటం జాతీయ సమైక్యతావాదానికి ఒక ప్రధాన లక్షణము.

## ప్రాచీన భరతదేశంలో సమైక్యతా భావము

భారతదేశం ప్రాచీన కాలం నుంచి వివిధ మతాలకు, సంస్కృతులకు నిలయము. జాతీయతా భావం భారతదేశంలో అతి ప్రాచీనకాలం నుంచీ ఉందని రాధాకుముద్ ముఖర్జీ మొదలైన ప్రముఖ చరిత్రకారుల అభిప్రాయము. అంతేకాక భారతీయ సంస్కృతి వివిధ సంస్కృతుల సమైక్యతా ఫలితమని వీరు భావిస్తారు. ప్రజలందరినీ కూడగట్టగల జాతీయ శక్తిగా హిందూమతం ఉండేది. హిందూ సమాజానికి మూలాధారమైన కుల వ్యవస్థ ప్రారంభ దశలో సహనం, సమానత్వం అనే భావాలపై ఆధారపడి ఉండేది. వివిధ కులాల మధ్య అంతర్వివాహాలు, పంక్తి భోజనాలు జరుగుతుండేవి. హిందూ దేవాలయాలు దేశం నలుమూలలా వెలిసినాయి. ఉత్తర భారతదేశంలో బదరీనాథ్, కాశీ ఎంత పవిత్ర పుణ్యక్షేత్రాలో, దక్షిణ భారతదేశంలో మధుర, రామేశ్వరం, కంచి, తిరుపతి హిందూ మతస్థులకు అంత ముఖ్యమైనవే. ఆలయాలు, నదులు ప్రాచీన కాలంలో ప్రజలలో సమైక్యతా భావాన్ని నెలకొల్ప గలిగినాయి. ఇతిహాసాలు, పురాణాలు, వేదాలు తదితర ప్రామాణిక గ్రంథాలన్నీ సంస్కృత భాషలోనే ఉండటం వల్ల హిందువులందరికీ ఒకే భాష ఏర్పడింది. భౌగోళికంగా భారతదేశం ఉత్తరదిశన హిమాలయ పర్వతాలవల్ల, దక్షిణంలో మహాసముద్రాలవల్ల పరివేష్ఠితమైందని ప్రాచీన కాలంలోనే వర్ణించడం జరిగింది. అందువల్ల పురాణ కాలం నుంచీ భారతీయులలో సమైక్యతా భావం ఉందని చెప్పవచ్చు.

పరరాజుల పాలన ఎన్నో శతాబ్దాలుగా సాగడంవల్ల ముఖ్యంగా బ్రిటిష్ పరిపాలన ఫలితంగా జాతీయ సమైక్యతా భావం భారతదేశంలో ఆధునిక కాలంలో తిరిగి ఏర్పడింది. నిజానికి జాతీయత, జాతీయవాదం, భారతీయులందరూ ఒకే జాతి మొదలైన భావాలు బ్రిటిష్ పాలన కాలంలోనే ఉద్భవించినాయని ఆర్. సి. మజుందార్ మొదలైన చరిత్రకారులు అభిప్రాయపడినారు.

భారత దేశంలో జాతీయ సమైక్యత సుస్థిరమైనదిగా, శక్తిమంతమైనదిగా లేదని చరిత్ర విశదపరుస్తుంది. కొంతకాలం అనైక్యత, మరికొంతకాలం సమైక్యతను సాధించడానికి కృషి చేయడం భారతదేశ చరిత్రలో గమనించదగిన అంశాలు. సామరస్యం, ఐకమత్యం ప్రజలలో ప్రబలిననాడు శాంతి, అభివృద్ధి ఉండటం, వాటిని మరిచి మూర్ఖమైన మతావేశాలకు లోనైనప్పుడు భారతదేశం దెబ్బతిని పతనం కావడం చరిత్ర వివరిస్తుంది.

స్వాతంత్ర్యోద్యమ కాలంలో వివిధ వర్గాల మధ్య సమైక్యతా భావం ఏర్పడింది. పరదాస్య శృంఖలాల నుంచి విముక్తి పొందవలెననే ఏకైక లక్ష్యంతో అన్ని మతాలు, కులాలు ప్రాంతాలు, భాషలు, వర్గాలకు చెందిన భారతీయులు జాతీయోద్యమాన్ని విజయవంతంగా నిర్వహించి స్వతంత్ర భారత రాజ్యావతరణకు తోడ్పడినారు. స్వాతంత్ర్య సముపార్జనా నంతరం రాజకీయ, ఆర్థిక కారణాలవల్ల ప్రజలలో సమైక్యతాభావాన్ని క్షీణింపజేసే ప్రాంతీయ తత్వం, భాషోన్మాదం మొదలైన విచ్ఛిన్నకర శక్తులు తలెత్తినాయి.

## జాతీయ సమైక్యతను బలహీనపరిచే శక్తులు

జాతీయ సమైక్యతను బలహీనపరిచే అంశాలలో ముఖ్యమైనవి కులతత్వం, మతాభిమానం, భాషోన్మాదం, ప్రాంతీయవాదము.

### కుల, మత తత్వము

బ్రిటిష్‌వారి కాలంలోనే జాతీయోద్యమాన్ని బలహీనపరిచే కుల. మత ప్రాతినిధ్య విధానాన్ని (Communal electorates) ప్రవేశపెట్టడం జరిగింది. ఎన్నికలలో కొన్ని నియోజకవర్గాల నుంచి ప్రత్యేకంగా ముస్లింలు, సిక్కు మతస్థులు, వెనకబడిన తరగతులవారు, షెడ్యూల్డ్ కులాలవారికి చెందిన అభ్యర్థులే పోటీ చేయవలెనని 1909, 1919, 1935 భారత ప్రభుత్వ చట్టాలు నిర్ణయించినాయి. స్వాతంత్ర్యం వచ్చిన తరవాత కూడా ప్రత్యేక నియోజక వర్గాలు, షెడ్యూల్డ్ కులాలు, తరగతుల వారికి పరిమితమైనాయి. కాని ఇప్పటివరకు జరిగిన ఆరు సాధారణ ఎన్నికలలోనూ కులానికి, మతానికి ప్రాముఖ్యం ఎక్కువగానే ఉంది. కుల, మత భావాలను బహిరంగంగా విమర్శిస్తూనే ఎన్నికలలో అభ్యర్థులను నిర్ణయించడంలో కులానికి, మతానికి రాజకీయ పక్షాలు అధిక ప్రాముఖ్యాన్ని ఇస్తున్నాయి. ఉదాహరణకు, ఒక నియోజక వర్గంలో ముస్లిం ఓటర్లు అధిక సంఖ్యలో ఉన్నట్లయితే ఆ నియోజకవర్గం నుంచి పోటీ చేయడానికి ముస్లిం అభ్యర్థిని ఎంపిక చేయడం సర్వసాధారణమైనది.

మతకలహాలు ఈనాడు బాగా వ్యాప్తి చెందినాయి. అలీఘర్, జంషెడ్‌పూర్, విల్లుపురం మొదలైన చోట్ల మతకలహాలు జన నష్టాన్ని, ఆస్తి నష్టాన్ని విపరీతంగా కలిగించగా, బీహార్‌లో రిజర్వేషన్ విధానానికి వ్యతిరేకంగా అగ్ర కులస్థులు ఆందోళన చేయడం జరిగింది వీటిని సమగ్ర ఆలోచనతో దీర్ఘకాలిక ప్రయోజనాల ప్రాతిపదికపై పరిష్కరించడానికి బదులు కేవలం శాంతి భద్రతకు సంబంధించిన విషయంగా లేదా రాజకీయ కారణాలను చూపిస్తూ రాజకీయ పక్షాలు పరస్పరం నిందించుకోవడం జరుగుతున్నది.

మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి వయోజన ఓటు హక్కు ముఖ్యమైన ప్రాతిపదిక. ప్రజాస్వామ్యంలో రాజకీయాధికారాన్ని నిర్వహించే ప్రజా ప్రతినిధులను, రాజకీయ పక్షాలను

బాలెట్ బాక్సుల ద్వారా ప్రజలు నిర్ణయిస్తారు. రాజకీయాధికారాన్ని ఆధారం చేసికొని, సాంఘిక, ఆర్థిక రంగాలలో కొరతగా ఉన్న వనరులను ఉపయోగించుకోవడానికి కులం, మతం ముఖ్యమైన సాధనాలు. ముఖ్యంగా రాష్ట్ర రాజకీయాలలో కులాల ప్రభావం ఎక్కువగా కన్పిస్తుంది. ఒక రాష్ట్రంలో మంత్రిమండలి నిర్మాణంలో ముఖ్యమంత్రి ప్రధానంగా ఆలోచించేది అన్ని కులాలవారికి ప్రాతినిధ్యం కల్పించడం. అందువల్ల అర్హత అనుభవం, పరిపాలనా దక్షత, చిత్తశుద్ధి శక్తి సామర్థ్యాలకంటె కులతత్వానికి భారత రాజకీయాలలో ముఖ్యంగా రాష్ట్ర రాజకీయాలలో ఎక్కువ ప్రాబల్యం కన్పిస్తున్నది. కుల మత తత్వాలు బలపడిన దేశంలో జాతీయ సమైక్యత కేవలం నోటిమాటగానే ఉండిపోతుంది.

## భాషోన్మాదము

జాతీయ సమగ్రతను బలహీనపరిచే మరొక అంశం భాషా దురభిమానం. భాషోన్మాదం రెండు రకాలు : (1) జాతీయ భాష (2) ప్రాంతీయ భాషలు. జాతీయ భాష హిందీ అని రాజ్యాంగపరంగా నిర్ణయించినప్పటికీ ఈనాటికీ, హిందీపట్ల వ్యతిరేకతా భావం కొంత మంది ప్రజలలో ప్రబలంగానే ఉంది. హిందీ మాతృభాష కాని ప్రజలు రెండో తరగతి పౌరులవుతారనే భయం తీవ్రంగానే ఉంది. ముఖ్యంగా దక్షిణాది రాష్ట్రాలలో, తమిళనాడులో హిందీపట్ల వ్యతిరేకత ఎక్కువగా ఉండటంవల్ల, కేంద్ర ప్రభుత్వం అధికారిక భాష అయిన హిందీతోపాటు ఆంగ్ల భాషకు కూడా సమాన హోదా ఇవ్వవలసి వచ్చింది. అంతేకాక కేంద్ర ప్రభుత్వ నాయకత్వం ఉత్తర రాష్ట్రాలలోనే ప్రధానంగా ఉండటంవల్ల, కేంద్ర ప్రభుత్వం ఉత్తర భారత రాజకీయ పక్షమనే భావం బలపడింది.

భాష అనేది ప్రధానంగా పరస్పర సంభాషణకు, అభిప్రాయ వ్యక్తీకరణకు ఉపయోగపడే సాధనము దీనిని రాజకీయాలలో సంకుచిత ప్రయోజనాలకోసం వినియోగించడం చాలా దురదృష్టకరమైన పరిణామము. ఇదిట్లా ఉండగా భాషను ఆధారంగా చేసుకొని రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ జరిగింది. ఒకభాష మాట్లాడే ప్రజలు ఒక రాష్ట్రంగా ఏర్పడవలెనవే వాదంతో భాషా ప్రయుక్త రాష్ట్రాలు అవతరించినాయి. వీటితోబాటు ప్రాంతీయ భాషను అభివృద్ధిపరచవలెననే ఆకాంక్ష కూడా బలపడింది. ప్రాంతీయ భాషలను అభివృద్ధిచేయడం ఎంతైనా అవసరమే. దీనిని ఎవరూ కాదనలేరు. పరిపాలన ప్రజలకు అనుకూలంగా త్వరితంగా సమర్థవంతంగా ఉండవలెనంటే అధికారులు ప్రజలు ఒకే భాష మాట్లాడవలె. కాని ప్రాంతీయ భాషలకు కావలసిన దానికంటె ఎక్కువ ప్రాముఖ్యమివ్వడం కొన్ని అనర్థాలకు దారి తీస్తుంది.

## ప్రాంతీయవాదము

జాతి సమైక్యతను క్షీణింపజేసే మరొక భావం ప్రాంతీయవాదము. భాషోన్మాదం ప్రాంతీయ తత్వం రాహు, కేతువులవలె జాతీయ సమైక్యతను కబళించి వేస్తున్నాయి. ఒక రాష్ట్రంలో కొంత ప్రదేశాన్ని ఆ ప్రదేశానికి చెందిన ప్రజలు, వారి భాష, సాంఘికాచార, వ్యవహారాలలో ఇతర ప్రాంతాలకంటె కొంత వైవిధ్యం ఉండటంవల్ల అది ఒక ప్రాంతంగా భావించడం జరుగుతున్నది. దురదృష్టవశాత్తు ఈ భావం ఇక్కడితో ఆగిపోవడం లేదు. ఒక రాష్ట్రంలోని ప్రజలు ప్రాంతీయాభిమానాన్ని పెంచుకొని, అదే రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో

నివసించే ప్రజలతో ఎటువంటి సంబంధం లేనట్లు తామొక ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడవలెననే రాజకీయ ఆకాంక్షను వ్యక్తంచేయడంతో భారత రాజకీయాలలో ప్రాంతీయవాదం తలెత్తింది. ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్యేక తెలంగాణా, మహారాష్ట్రలో విదర్భ, గుజరాత్‌లో సౌరాష్ట్ర బీహార్‌లో బుందేల్‌ఖండ్ మొదలైన వేర్పాటు ధోరణులు ప్రాంతీయవాదాన్ని బలపరచి జాతి సమగ్రతకి, సమైక్యతకి వ్యతిరేక శక్తులుగా బలాన్ని పుంజుకొంటున్నాయి.

ఇటువంటి వేర్పాటు వాదానికి ఒక బలమైన కారణం రాష్ట్రంలో అన్ని ప్రాంతాల లోనూ ఇంచుమించుగా సమానమైన ఆర్థికాభివృద్ధి ఉద్యోగ, విద్యావకాశాలు లేకపోవడమే. దీనితోబాటు భూమి పుత్రుల సిద్ధాంతం (Sons of the soil) అంటే ఏ ప్రదేశంలో ఉండే ఉద్యోగావకాశాలు ఆ ప్రదేశంలో జీవించే ప్రజలకే పరిమితం కావలెననే ఆందోళన ఏర్పడింది. ప్రాంతీయ తత్వం ఎంత సంకుచిత, స్వార్థ ప్రయోజనాలకు దారి తీసిందంటే ఒక వ్యక్తి, తన జన్మ స్థలాన్ని చెప్పుకోవడానికి భయపడే పరిస్థితి ఏర్పడింది. అంతేగాక సంకుచిత, స్వార్థ ప్రయోజనాలకోసం రాజకీయ పక్షాలు, నాయకులు, స్థానిక నాయకులు ప్రాంతీయ భావాన్ని రెచ్చగొట్టటం సర్వసాధారణమైంది.

## జాతీయ సమైక్యతా సాధన మార్గాలు

పైన చర్చించిన కారణాలవల్ల భారత జాతి ఏకజాతి కాదనీ, అనేక జాతులతో కూడిన మిశ్రమ జాతి అనీ కొంతమంది భావిస్తారు. రాజకీయంగా ఒకే జాతికి చెందిన ప్రజలు స్వాతంత్ర్యం తెచ్చుకొన్నప్పటికీ స్వతంత్ర భారతదేశంలో సమైక్యతా భావం స్థిరపడటానికి రాజ్యాంగపరంగా కొన్ని సూచనలు రాజ్యాంగవేత్తలు చేయడం జరిగింది. అవి (1) ఫెడరల్ విధానం భిన్నత్వాన్ని తీవ్రం చేస్తుందేమో అనే భయంతో ఏకకేంద్ర లక్షణాలు ఎక్కువగా ఉన్న బలమైన కేంద్ర ప్రభుత్వ వ్యవస్థను రాజ్యాంగం ప్రవేశపెట్టింది.

(2) భారతీయులలో ఏకత్వాన్ని పెంపొందించే ఉద్దేశంతో ఏక పౌరత్వాన్ని (Single citizenship) ప్రవేశపెట్టినారు. భారతీయులకు యూనియన్ పౌరత్వమేగాని, ప్రత్యేక రాష్ట్ర పౌరత్వం లేదు.

(3) కేంద్ర రాష్ట్రాలకు ఒకే రాజకీయ సంవిధానాన్ని (శాసన సభ, కార్యనిర్వాహక వర్గం, న్యాయశాఖ), పార్లమెంటరీ వ్యవస్థను నెలకొల్పడం జరిగింది.

(4) భారత రాజ్యాంగం ఒకే ఏకీకృత, సమగ్ర న్యాయశాఖను ఏర్పాటుచేసింది.

(5) కేంద్ర, రాష్ట్రాలకు సాధారణ పాలనా సేవలను ఐ. ఏ. ఎస్., ఐ. పి. ఎస్. మొదలైన ఉద్యోగ బృందాలు నిర్వహిస్తాయి. వీటికి చెందిన ఉద్యోగులను కేంద్ర ప్రభుత్వమే యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ ద్వారా ఎంపికచేసి వివిధ రాష్ట్రాలకు కేటాయిస్తుంది.

జాతి సమగ్రత కాపాడటానికి రాజ్యాంగం కేంద్ర ప్రభుత్వానికి కొన్ని ప్రత్యేకాధికారాలను కల్పించింది. రాష్ట్రపతికి ఉన్న అత్యవసరాధికారాలేగాక రాష్ట్రాల పునర్నిర్మాణానికి సంబంధించిన చట్టాలను చేసే అధికారం కేంద్ర పార్లమెంట్‌కు మాత్రమే ఉంది. రాజ్యాంగ వేత్తలు రాజ్యాంగ రీత్యా జాతీయ సమగ్రతను కాపాడటానికి కల్పించిన అవకాశాలు, రాజకీయ పక్షాల దృక్పథం, ప్రజల ఆర్థిక, సాంఘిక స్థితిగతులపై ఆధారపడి ఉంటాయి. కేవలం శాంతి భద్రతలు పరిరక్షించడానికి పరిమితమైన విదేశీపాలన నుంచి మనం తెచ్చుకొన్న రాజ

కీయ స్వాతంత్ర్యం యొక్క ముఖ్య ఉద్దేశం అన్ని రంగాలలో స్వయం సమృద్ధి సాధించడం. ఆర్థిక, సాంఘిక, విద్యా, వైజ్ఞానిక రంగాలలో తగిన అభివృద్ధిని సాధించడానికి ఉన్న వనరులలో ఏర్పడే తీవ్ర పోటీ, అభిప్రాయభేదాలు జాతీయ సమైక్యతను బలహీన పరుస్తున్నాయి. వీటిని తొలగించి ఆర్థిక, విద్యా, రాజకీయ రంగాలలో అభివృద్ధి సాధించడం ద్వారా జాతీయ సమగ్రత కాపాడుకోవడం ఎంతైనా అవసరము.

## లౌకిక రాజ్యము

లౌకిక రాజ్యం అనే భావాన ఆంగ్ల భాషలో 'సెక్యులర్ స్టేట్' అనే పదం నుంచి ఏర్పడింది. సెక్యులర్ అంటే మతంతో సంబంధం లేని విషయం లేదా భావం అని అర్థము సెక్యులర్ సారస్వతం అంటే మతప్రమేయంలేని సారస్వతం అని అర్థము. యూరపియన్ దేశాలలో 'సెక్యులరిజం' అనే భావన రాజ్యాన్ని మత కార్యకలాపాల ప్రభావం నుంచి పూర్తిగా వేరుపరచి దానికొక ప్రత్యేక ప్రతిపత్తిని కల్పించవలెననే వాదంతో బలపడింది. ఒక విధంగా చెప్పవలెనంటే ప్రతివ్యక్తికి మతస్వేచ్ఛను కల్పిస్తూ రాజ్య కార్యకలాపాలలో మత ప్రమేయంతో నిమిత్తం లేకుండా యథేచ్ఛగా పాల్గొనడానికి అవకాశం కల్పిస్తూ, ప్రభుత్వం ఏ ఒక్క మతాన్ని ప్రత్యేకంగా ప్రోత్సహించకుండా ఉండే రాజ్యాంగాన్నే మత ప్రమేయంలేని రాజ్యం లేదా సెక్యులర్ రాజ్యం అని అంటారు. ఇది మత రహితం కాదు, మతాతీతమైనది. మత ప్రచారానికి సంపూర్ణ స్వేచ్ఛ కల్పిస్తుంది.

మన రాజ్యాంగంలో మతప్రమేయంలేని రాజ్య విధానాన్ని సూచించే అంశాలు రెండు సందర్భాలలో ప్రధానంగా కన్పిస్తాయి : (1) రాజ్యాంగ ప్రవేశికలో భారతదేశం సార్వ భౌమాధికార సామ్యవాద మతప్రమేయంలేని ప్రజాస్వామిక రిపబ్లిక్ అని పేర్కొనడం జరిగింది. (2) రాజ్యాంగంలోని మూడో భాగంలో ప్రస్తావించిన ప్రాథమిక హక్కులలో మత స్వేచ్ఛకు హక్కు ఒకటి. వీటి ప్రకారం ప్రతి పౌరునికీ తాను నమ్మిన మతాన్ని పాటించడానికీ, పూజా విధానాన్ని అవలంభించడానికి స్వేచ్ఛ ఉంది. (3) రాజ్యాంగంలోని 14 వ నిబంధన ప్రతి పౌరునికి మతంతోను, ప్రాంతంతోను, కులంతోను నిమిత్తంలేకుండా సమాన అవకాశాలు, సమాన హోదాను కల్పిస్తున్నది. (4) అదే విధంగా 15 వ నిబంధన అనుసరించరాదని చెబుతున్నది (5) 16 వ నిబంధన ప్రభుత్వము కుల, మత జాతి, వివక్షణ లేకుండా పౌరులకు ప్రభుత్వోద్యోగాలలో, విద్య నార్జించడానికి సమానావకాశాలు కల్పించ వలె అని చెబుతున్నది. (6) 17 వ నిబంధన అస్పృశ్యతను నేరంగా పరిగణిస్తున్నది. ఎవరైనా అస్పృశ్యతను పాటించినట్లయితే చట్ట రీత్యా వారు శిక్షార్హులు. (7) 25 వ నిబంధన ప్రతి పౌరునికీ తాను విశ్వసించే మతాన్ని అనుసరించడానికి, ప్రచారం చేసుకోవడానికి అవకాశం ఇస్తున్నది. (8) 26 వ నిబంధన ఒక మతానికి చెందిన వ్యక్తులు తమ మతానికి సంబంధించిన విద్యను వ్యాప్తి చేసుకోవడానికి, దేవాలయాల నిర్వహణకు, ధర్మాదాయ సంస్థలను (చట్ట ప్రకారం) ఏర్పాటుచేసుకొని నిర్వహించుకోవడానికి అవకాశం కల్పిస్తున్నది (9) 27 వ నిబంధన మతపరమైన సంస్థలను నిర్వహించడానికి కాని, మతవ్యాప్తికి వెచ్చించిన ఆదాయంపై ఏ వ్యక్తినుంచీ నిర్బంధంగా పన్నులు వసూలుచేయరాదని చెబుతున్నది.

(10) ప్రభుత్వం నిర్వహించే విద్యాసంస్థలలోకాని, ప్రభుత్వ సహాయంతో నిర్వహించబడే విద్యాసంస్థలలో కాని మతబోధ చేయరాదని 28 వ నిబంధన చెబుతున్నది. (11) ప్రభుత్వం ప్రజలపై వారు అనుసరిస్తూ ఆదరిస్తున్న సంస్కృతిని మినహాయించి మరే సంస్కృతిని వారిపై విధించరాదు; అదే విధంగా అల్ప సంఖ్యాకవర్గాలకు విద్యా సంస్థలను ఏర్పాటుచేసుకొని తమ సంస్కృతి వ్యాప్తికి కృషిచేసే హక్కు ఉంది; వీటికి సహాయం చేయడంలో ఇవి మతపరమైన సంస్థలనే కారణంతో ఎటువంటి విచక్షణ వారి పట్ల చూపరాదని 29, 30 నిబంధనలు చెబుతున్నాయి.

పైన వివరించిన నిబంధనలన్నిటి సారాంశం ఏమిటంటే మన రాజ్యాంగం భారత దేశం మత ప్రమేయంలేని లౌకిక రాజ్యమని చెప్పడమే. మత ప్రమేయంలేని లౌకిక రాజ్యాన్ని అనుసరించడానికి ప్రధాన కారణం మన దేశంలో అనేక మతాలను అనుసరించే ప్రజలు ఉండటమే. అంతేకాక మనలో అనేక భాషలు మాట్లాడే వారున్నారు. మన దేశంలో 179 భాషలు, 544 లిపులు ఉన్నాయి. కాని రాజ్యాంగం కేవలం 15 భాషలను మాత్రమే ప్రధానమైనవిగా గుర్తించింది. దీనినిబట్టి మతంలోనే కాదు భాషాపరంగా కూడా మన దేశంలో అనేక అల్పసంఖ్యాక వర్గాలవారు ఉన్నారని తెలుస్తున్నది. అందువల్ల కేవలం ఒకే మతాన్ని అధికారికమైన మతంగా ప్రకటించే మత ప్రమేయ రాజ్యంగా (Theocratic state) భారత రాజ్యాంగం మన దేశాన్ని ప్రకటిస్తే వివిధ మతాలను అనుసరించే అల్పసంఖ్యాక వర్గాలకు రాజ్యాంగంపట్ల ఆసక్తి తగ్గి ప్రభుత్వంపట్ల ముఖ్యంగా ప్రభుత్వ నిష్పాక్షికతపట్ల విశ్వాసం సన్నగిల్లిపోతుంది. పరస్పర అనుమానాలు, విద్వేషాలు, వివిధ మతస్తుల మధ్య ప్రబలి అవి అలజడులకు, అశాంతికి దారితీసి, జాతీయ సమైక్యతకు గొడ్డలిపెట్టుగా పరిణమిస్తాయి. ఇటీవలి కాలంలో జంషెడ్‌పూర్, అలీఘర్, హైదరాబాద్ మొ॥న నగరాలలో హిందూ – ముస్లింల మధ్య జరిగిన మత కలహాలు ఎంతో ప్రాణనష్టానికి, ఆస్తినష్టానికి దారి తీయడమేకాక, అల్ప సంఖ్యాక వర్గాలకు, వారి హక్కులను, ప్రయోజనాలను పరిరక్షించడంలో ప్రభుత్వంయొక్క శక్తి, సామర్థ్యాలను సందేహించేటట్లు చేసినాయి.

రాజ్యాంగం మత ప్రమేయంలేని రాజ్య వ్యవస్థను సూచిస్తూ, అల్పసంఖ్యాక వర్గాలకు అనేక స్వేచ్ఛలను, వారి ఆసక్తులకు పరిరక్షణలను కల్పించినప్పటికీ లౌకికవాదం చాలావరకు రాజ్యాంగంలోనే ఉండిపోయిందని, అది ప్రజలలో వ్యాప్తిచెందలేదని రాజ్యాంగం అమలులోకి వచ్చినప్పటినుంచీ గత 30 సం॥ల భారతదేశ చరిత్ర కొంతవరకు చెబుతున్నది. దీనికి అనేక కారణాలు ఉన్నాయి : (1) రాజకీయ పక్షాలు తమ సంకుచిత ప్రయోజనాలకోసం మత శక్తులను, ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ప్రోత్సహించడం జరుగుతున్నది. ఒక మతానికి చెందిన ప్రజలను ప్రత్యేకంగా ఒక పార్టీకి ఓటు వేయమని అభ్యర్థించడం లేదా ప్రచారం చేయడం సర్వసాధారణమైనది. ఉదా : 1977 మార్చి సాధారణ ఎన్నికలలో ఢిల్లీకి చెందిన షాహి-ఇమామ్ జనతా పార్టీకి ఓటువేయమని ముస్లిం మతస్థులను ఉద్దేశిస్తూ అనేక ప్రసంగాలు వివిధ ప్రాంతాలలో చేసినారు; అదే విధంగా లోక్ సభకు చెందిన 102 మంది హరిజన సభ్యులు (All India Schedule Caste Forum) శ్రీ జగజ్జీవణరామ్‌గారిని ప్రధాన మంత్రిగా నియమించాలని రాష్ట్రపతి, శ్రీ నీలం సంజీవరెడ్డిగారిని అభ్యర్థించినారు. దీనిని

బట్టి మత తత్వానికి, కులతత్వానికి మనదేశపు రాజకీయాలు ఎంత లోబడి ఉన్నాయో తెలుస్తున్నది.

లౌకిక రాజ్యం కేవలం రాజ్యాంగం ద్వారా లేదా రాజకీయ కార్యకలాపాల ద్వారా ఏర్పడదు. సామాజిక రంగంలో లౌకికీకరణ (Secularization) చాలా అవసరము. అంటే సాంఘిక ఆర్థిక సమస్యలను సాంప్రదాయకంగా, సంకుచితంగా, మతపరమైన భావాలతో కాకుండా, హేతుబద్ధమైన వైజ్ఞానిక ఆలోచన ద్వారా పరిష్కరించగలిగే శక్తి సామర్థ్యాలు ప్రజలకు ఏర్పడవలె. ఆటువంటి సామర్థ్యం సరైన విద్య ద్వారానే లభిస్తుంది. విద్యతోపాటు ఆర్జనావకాశాలు ప్రజలకు విరివిగా లభించినప్పుడు వారు మతం కులం, ప్రాంతం, భాష అనే సంకుచిత భావాలను అధిగమించి శాంతియుత సహజీవనం చేయగలుగుతారు. అప్పుడే మన దేశంలో జాతీయ సమైక్యత ఏర్పడగలుగుతుంది.

## ప్రశ్నలు

1. జాతీయ సమైక్యతను గురించి వివరించండి.
2. లౌకిక రాజ్య భావనను వివరించండి.